# బాలప్రౌఢ
# వ్యాకరణ సర్వస్వము
## ద్వితీయ సంపుటి

"స్ఫూర్తిశ్రీ"
టి. భాస్కరరావు, బి. ఏ. (ఆనర్సు)
లెక్చరర్, ఏ. సి. కాలేజి - గుంటూరు

# శీతాంశో రమృతార్పణమ్

బాలవ్యాకరణము రచించిన
శ్రీ పరవస్తు చిన్నయ సూరిగారికి
ప్రౌఢవ్యాకరణము రచించిన
శ్రీ బహుజనపల్లి సీతారామాచార్యులు గారికి
స భ క్తి క ముగా
స మ ర్పి త ము

పరమోదారులు మద్గురూత్తములు యద్భాషా పయోరాశి యా
విరిగావించి యనుగ్రహించి రదియే విద్యార్థి సద్యః పయో
ధరమై చల్లని గాలి సోకి యను మోద స్ఫూర్తి వర్షించె సు
స్థిరమై లక్షణసత్ఫలోత్కరము వాసిం గాంచ నాంధ్రోర్వరన్.

# వి ష య సూ చి క

---

ఇది

బాలవ్యాకరణము నందలి

కారక సమాస తద్ధిత క్రియా కృదంత

ప్రకీర్ణక పరిచ్ఛేదములకు

ప్రౌఢవ్యాకరణము నందలి

కారక సమాస తద్ధిత క్రియా కృదంత వాక్య

ముక్తలక్షణ వివేచనములకు

వ్యాఖ్యానము

# అ కా రా ది సూ త్ర క్ర మ ణి క

సూత్రసంఖ్య | సూత్రము | పుట

## కారక పరిచ్ఛేదము

## సమాస పరిచ్ఛేదము

## తద్ధిత పరిచ్ఛేదము

# క్రియా పరిచ్ఛేదము

## కృదంత పరిచ్ఛేదము

## ప్రకీర్ణక పరిచ్ఛేదము

# కారక పరిచ్ఛేదము

**1. కారకంబు లనం గర్మాదులు.** (ప్రౌ - ౧)

**అవి యాఱు - కర్మకారకము, కర్తృకారకము, కరణకారకము, సంప్రదాన కారకము, అపాదానకారకము, అధికరణకారకము. క్రియాన్వయమును గలిగించునది; అనఁగాఁ గ్రియాన్వయము కలది యని కారక శబ్దార్థము.**

వ్యాఖ్య : కారక పరిచ్ఛేద ప్రారంభమున ప్రౌఢవ్యాకర్త కారకములన నేమియో వివరించుటకు పూనుకొనెను. అట్లు చేసినయెడల పరిచ్ఛేదమునందు ప్రసక్తమగు విషయము పాఠకునికి సూచనము చేసినట్లుగా నగును.

కర్మము, కర్త, కరణము, సంప్రదానము, అపాదానము, అధికరణము - అను నాఱింటిని 'కర్మాదులు' అను శబ్దముచేత గ్రహించెను. ఈ ఆఱు విధములయిన సంబంధమును కలిగి యుండు వానిని కారకములని యందురు. వాక్యమునందలి యొక శబ్దమునకు క్రియాశబ్దముతో నన్వయమును గలిగించునది యనికాని, క్రియతో నన్వయమును గలది యనికాని కారకము' అను శబ్దమునకు అర్థము.

**[ఈ పరిచ్ఛేదమునందు, వాక్యమునందలి వేర్వేఱు పదములు క్రియాన్వయమును సాధించుకొను సందర్భమున ఏయే విభక్తులను బొందునో నిరూపింపబడును.]**

**౨. ప్రాతిపదికసంబోధనోక్తార్థంబులం బ్రథమ యగు.** (బా-౧)

ప్రాతిపదికార్థమునందు॥ రాముఁడు - రావణుఁడు. నియతోపస్థితికము ప్రాతిపదికార్థము. సంబోధనమునందు॥ ఓరాముఁడ - ఓ రావణుఁడ. ఉక్తార్థమందు॥ రాముఁడు రావణుని సంహరించెను. ఉక్తముగాఁ జెప్పఁబడినది. ఈవాక్యమందు నాఖ్యాతము కర్తను జెప్పినది గావునఁ దద్వాచక మగు రామశబ్దమునకుఁ బ్రథమ యయ్యె. రామునిచే రావణుఁడు సంహరింపఁబడియె. ఈవాక్యమం దాఖ్యాతము కర్మమును జెప్పినది గావునఁ దద్వాచకంబగు రావణశబ్దంబునకుం బ్రథమ మయ్యెనని యెఱుఁగునది.

వ్యాఖ్య : ప్రాతిపదికార్థమునందును, సంబోధనార్థమునందును, ఉక్తార్థమునందును ప్రథమావిభక్తి యగునని సూత్రార్థము. నియతమైన ఉనికిని గలిగినటువంటిది ప్రాతిపదికార్థము. కేవల ప్రాతిపదికమునుగాని, కేవలప్రత్యయమునుగాని ప్రయోగింపరాదు. ప్రకృతిప్రత్యయముల కలయికవలన శబ్దమేర్పడును. కావున, ఇతరపదములతో నేవిధమైన సంబంధమును లేకుండునట్లుగా, ప్రాతిపదికయొక్క అర్థమును మాత్రమే బోధించునప్పుడు ప్రథమావిభక్తి యగునని యర్థము. 'రాముఁడు' అని వాడినప్పుడు దశరథుని కుమారుడు మనకు స్ఫురించును. ఇది యొక వాక్యములోని పదముగా కాక, విడిగా వాడబడినది. కావున, దీనివ్యాప్తి యింతవరకు మాత్రమేయుండి, నియతమైన యునికిని మాత్రమే స్ఫురింపజేయును. అట్లే 'రావణుఁడు' అనునప్పుడు లంకాధిపతి స్ఫురణకు వచ్చును. ఇట్లు ఇతరపదముల యపేక్షలేకుండ వాడునప్పుడు ప్రాతిపదికార్థమునందు ప్రకృతికి ప్రథమావిభక్తి చేరును.

సంబోధన మనగా ఇతరుల నభిముఖము గావించు కొనుటకు పిలుచుట. ఇట్టియెడల సంబోధ్యవాచకము ప్రథమా విభక్తి నొందును. 'ఓ రాముఁడ' - ఇచ్చట సంబోధ్యవాచకము 'రాముఁడు' ప్రథమావిభక్త్యంతము. "సంబోధనంబునం దేకార్థం బయిన పదంబు తుది యుకారంబున కకారం బగు" (తత్సమ-32) అను సూత్రముచేత అకారము కలిగి 'రాముఁడ' అని యైనది. ఇంకను సంబోధ్యవాచకమునకు పెక్కు మార్పులు తత్సమ పరిచ్ఛేదమున తెలుపబడినవి.

ఉక్తమనగా చెప్పబడినది యని యర్థము. ఆఖ్యాతము క్రియాపదము. వాక్యమునందలి క్రియాపదముచే ఏది చెప్ప బడినదో దానికి ప్రథమావిభక్తి యగునని యర్థము. 'రాముఁడు రావణుని సంహరించెను' అను నీవాక్యమునందు 'సంహరించెను' అనునది క్రియ. ఈ క్రియాపదమువలన జనించిన ఆకాంక్షనుబట్టి 'ఎవరు' అని ప్రశ్నింపగా 'రాముఁడు' అని సమాధానము కలుగును. కావున నీ వాక్యమున ఆఖ్యాతము 'రాముఁడు' అను కర్తను చెప్పినది. అందువలన నిది ప్రథమాంతమై యుండవలయును. 'రావణుఁడు రామునిచే సంహరింపఁబడియె' ఈవాక్యమునందు 'సంహరింపఁబడియె' అను ఆఖ్యాతము 'రావణుఁడు' అను కర్మమును చెప్పినది, కావున ఆఖ్యాతముచేత ఉక్తమగు రావణశబ్దమునకు ప్రథమావిభక్తి కలిగి 'రావణుఁడు' అని యైనది.

ఉక్తార్థమనగా కర్త యనికాని, కర్మమని కాని యర్థము చేసికొనరాదు, కర్త్రర్థక ప్రయోగమునందు కర్తను, కర్మార్థక

ప్రయోగమునందు కర్మమును క్రియాపద మాకాంక్షించు చుండును. కావున, దానినట్లే చెప్పికొనవలయును.

[ప్రథమావిభక్త్యేక వచనమున డు, ము, వు- అను ప్రత్యయములు గలవు. ఏయే ప్రత్యయ మెప్పుడు వచ్చునో తత్సమాచ్ఛిక పరిచ్ఛేదములందు విశదముగా వివరింపబడినది.]

**3. కర్మంబున ద్వితీయ యగు.** (బా - ౨)

ధాత్వర్థ ఫలాశ్రయంబు కర్మంబు నాఁబడు. దేవదత్తుఁడు వంటకమును వండెను. ఇట వండె ననుమాటకు వంట చేసెనని యర్థము. వంట ఫలము. చేయుట వ్యాపారము. వంట యనఁగాఁ బాకము. పాకమున కాశ్రయము కావుటం జేసి వంటకము కర్మం బయ్యెనని యెఱుంగునది.

వ్యాఖ్య : కర్మార్థమునందు ద్వితీయావిభక్తి యగునని సూత్రార్థము. కర్మమనగా ధాతువుయొక్క అర్థమైన ఫలమునకు ఆశ్రయమైనది.

దేవదత్తుఁడు వంటకమును వండెను - అనుచోట 'వండెను' అనునది క్రియ. దీనికి వంట చేసె నని యర్థము. చేయుట యనునది వ్యాపారము. దానియొక్క ఫలము వంట. వంటయను ఫలమున కాశ్రయమైనది వంటకము. కావున 'వంటకము' అను శబ్దమునకు ద్వితీయావిభక్తి యగును. 'వండెను' అనుక్రియ 'దేనిని' అను ప్రశ్నను గలిగింపగా 'వంటకము'ను అను సమాధాన మీయవలసి వచ్చును. కావున 'వంటకము' కర్మమై ద్వితీయావిభక్తిని పొందును.

నువర్ణంబు ద్వితీయ'' (తత్సమ - 2) అను సూత్రమును బట్టి కర్మార్థక శబ్దమునకు ద్వితీయావిభక్తి ప్రత్యయమగు 'ను' చేరును. ఇదియే ఇకారముపిద నైనచో ని వర్ణముగ మారును. హల్పరకమైనప్పుడు స్వరమును గోల్పోయి పొల్లునకారముగా కూడ నుండవచ్చును.

4. ఉద్దేశార్థమునందు ద్వితీయకు గుఱించియు ననుప్రయుక్తం బగు. (ప్రౌ - ౨)

మము గుఱించి నామగోత్రక్రమమున మీ రర్చ సేయఁగా॥ హరి. పూ ౨ ౮॥ సముచ్చయగ్రహణము కూర్చి జ్ఞాపనార్థము.

వ్యాఖ్య : ఉద్దేశ + అర్థము = ఉద్దేశమును సూచించు నర్థము. పూర్వసూత్రమునుబట్టి కర్మకు ద్వితీయ ప్రాప్తించును. ఆ కర్మకు ఉద్దేశమే యర్థమైనప్పుడు 'గుఱించి' యను శబ్దమను ప్రయుక్తమగును. అనుసరించి ప్రయోగించుటకు అనుప్రయోగము అని వాడుదురు.

ఉదాహరణము 'మముగుఱించి' యనునది. 'మము' ద్వితీయాంతము. 'మము' నుద్దేశించియే అర్చ జరిగినది కావున 'మము' అనుకర్మము ఉద్దేశార్థమున వాడబడినది. అందువలన 'గుఱించి' అను శబ్దము అనుప్రయుక్తమైనది. 'గుఱించి' యనునది ప్రౌఢవ్యాకర్త శబ్దమో ప్రత్యయమో స్పష్టముచేయుట లేదు. ప్రత్యయమే యగుచో, పూర్వమున్న ప్రత్యయము తొలగిపోయి, తత్స్థానమున నిది రావలయును. అట్లుకాక పూర్వ ప్రత్యయమున కనుప్రయుక్త మగుననియనుటచేత, దీనిని ప్రత్యయేతరముగనే ప్రౌఢవ్యాకర్త భావించె ననవలయును. ఇట్టి

వానిని 'కర్మప్రవచనీయము'లని యనుట కలదు. కాని సంస్కృతమువందలి వాడుకకు తెలుగువాడుక మిగుల భిన్నముగా నున్నది. కావున 'గుఱిచి' యనుదానిని ఉద్దేశార్థమున ద్వితీయాంతమునకు అనుప్రయుక్తమగు శబ్దముగా గ్రహించుట యుచితము. 'గుఱిచి' వంటిదే 'కూర్చి' యనునది కూడ. 'గుఱిచియు' అని సూత్రమునందు సముచ్చయార్థకమును వాడుటచేత 'కూర్చి' అనునది కూడ గ్రహింపబడవలయునని సూత్రకర్త యుద్దేశము. 'గుఱిచి' యను దానికి రూపాంతరమగు 'గుఱించి' అనుపూర్ణ బిందువుతోడి రూపమును కూడ గ్రహించుట యవసరము.

తత్త్వబోధినీ వ్యాఖ్యాత 'కూర్చి' అనురూపమే 'కుఱిచి' అని మారెనని, పరుషాదిగనే యుండవలయునని యభిప్రాయపడిరి. అది ప్రయోగవిరుద్ధము. 'గుఱి + ఉంచి' అనియుండి క్రమక్రమముగా ఉత్వమును గోల్పోయి ఏకపదముగా మారి, 'గుఱించి' యను రూపమేర్పడి యుండునని పేటికాకారుని యభిప్రాయము. ఇట్లు మారుట లోకమున సహజమే. కాని తెలుగున పరరూపసంధికే ప్రాబల్యము. కావున 'గుఱించి' అను దానిని రెండుపదముల కలయికగా కాక ఏకపదముగానే గ్రహించుట, ప్రయోగించుట జరుగుచున్నది. 'గుఱియించి' అనునదియే దీని కాకరమని యనుకొన్నప్పుడు 'ఉద్దేశించి' అను నర్థముకూడ సరిపడును. కావున 'గుఱించి' అనునది సరళాదియనియు, బిందువుపోయి 'గుఱిచి' యను రూపాంతరముకూడ నేర్పడెననియు ననుకొనుట సమంజసముగా నుండును.

శ్రీనాథుని ప్రయోగమునుబట్టి 'గుఱియించు' అను క్రియారూపమునే దీని కాకరముగా తలంపవలసి వచ్చుచున్నది. 'గుఱి' అనగా లక్ష్యము. 'గుఱిచేయు' అను నర్థమున ఇంచుక్కు చేరి 'గుఱియించు' అని యగును. దీనికి 'ఉద్దేశించు' అనియే యర్థము. "సంస్కృతంబున కంగలాదుల కించుక్కగు" నను (బా. క్రియ - 63) సూత్రమునుబట్టి 'గుఱి'యను తెనుగు పదమున కించుక్కు చేరి క్రియాత్వమును సమకూర్చినది. దీనికి క్త్వార్థక రూపమే 'గుఱియించి' యనునది.

"నిరవద్యస్థిర భక్తితోడ ననుఁగానీ శంభుఁగానీ రమేశ్వరుగానీ గుఱియించి యెవ్వరఁట యీ సార స్తవంబున్ జపింతురు" అని కాశీఖండమున రెండవయాశ్వాసమునందలి ప్రయోగము. దీనిని బట్టి 'గ'కారమే యాదినున్నదనుట నిశ్చయము. ఇయుడాగమము (ఇయ్-అను ఆగమము) కలుగనియెడల రూపము 'గుఱించి' అనియే యుండును నిర్బంధుకముగా కూడ శ్రీనాథుని ప్రయోగము లున్నవి. "ఏకక్రియఫలయుగ్మము। నాకర్షింపఁగఁజాలు నది లోపాము। ద్రాకాంతు గుఱిచి పోవఁగ। శ్రీకాశీదర్శనంబుచే సిద్ధించున్" (కాశీ - ద్వితీయాశ్వాసము) "క్షితిదేవోత్తమ! బ్రాహ్మణుండు వెలిగా జిహ్మోభిక్రియా। క్రతుతంత్రంబున శాస్త్రవున్ గుఱిచి యీ గాయత్రి వర్ణావళిన్" (కాశీ - తృతీయము)

'కూర్చు' అను ధాతువుయొక్క క్త్వార్థకరూపమే 'కూర్చి' యనునది. ఇది పర్యుపాది యనుటకు సందేహములేదు. "చిరతపం

బాచరించెఁ నచ్యుతునిఁగూర్చి యంతఁ గృపార్ద్రుఁ డగుచు"నని మనుచరిత్ర షష్ఠాశ్వాసమున ప్రయుక్తము.

**5. అయ్యది వ్యవహితంబు నగు.** (ప్రౌ - ౩)

**అజ్ఞానసుఁడు** తన్ను నర్థితో గుఱిచి యజించుట గోరి సృజించె సురలఁ॥ హ॰ పూ. ౨౮ ॥

వ్యాఖ్య : వ్యవహితము అని యనగా వ్యవధానమును బొందియుండునది యని యర్థము. పూర్వసూత్రమున ద్వితీయాంతమున కనుప్రయుక్తముగా 'గుఱిచి' విధింపబడినది. అనుప్రయుక్తమని యనుటవలన వెంటనంటి యుండవలయునని యర్థము. 'మముగుఱిచి' మున్నగుచోట్ల వెంటనంటి యుండుట స్పష్టముగా కనిపించుచున్నది. ప్రస్తుతసూత్రమువలన ద్వితీయాంతమునకును 'గుఱిచి'కిని నడుమ యెడముండిననుండవచ్చునని చెప్పబడుచున్నది. ఉదాహరణమునందు "తన్నునర్థితో గుఱిచి" అనియున్నది. 'తన్ను' అను ద్వితీయాంతమునకును 'గుఱిచి' కిని నడుమ 'అర్థితో' అను పదము అడ్డుగా నిల్చినది. ఇట్లు వ్యవహితముగా సైతము 'గుఱిచి' ప్రయుక్తము కాదగునని ప్రస్తుతసూత్రము నిర్ణయించుచున్నది. 'గుఱించి, కూర్చి' అను వానికి కూడ ఇదే నిర్ణయము అన్వయించును.

"నిరవద్యస్థిరభక్తితోడ"అని మొదలైన పూర్వోదాహృత శ్రీనాథపద్యమునుబట్టి 'పెక్కుచోట్ల కొక్కటియ చాలెడి' నని తెలియుచున్నది. 'నను గుఱియించి, శంభుగుఱియించి, రమేశ్వరు గుఱియించి' అని మూడుచోట్ల నుండవలసి యుండగా అన్నింటికిని చివర ఒక్కమారు మాత్రమే 'గుఱియించి' అని వాడబడినది. కావున ప్రౌఢవ్యాకర్త 'చేసి' విషయమున చెప్పినట్లు

"అయ్యాది యొక్కచోఁ బెక్కుచోట్ల కొక్కటియ చాలెడి"
నని చెప్పుట యవసరము.

**6. చేత వర్ణకంబు కర్తకగు.** (బా - ౩)

ధాత్వర్థ వ్యాపారాశ్రయంబు కర్తనాఁబడు॥ దేవదత్తునిచేత వంటకము వండఁబడియె॥ వండఁబడియె ననఁగా వంట చేయఁబడియె నని యర్థము. చేయుట కాశ్రయుం డగుటం జేసి దేవదత్తుండు కర్త యయ్యె.

వ్యాఖ్య : వాక్యమున కర్తయగు శబ్దమునకు 'చేత' అను తృతీయావిభక్తి ప్రత్యయము వచ్చునని సూత్రార్థము.

ధాతువుయొక్క అర్థమైన వ్యాపారమునకు ఆశ్రయమయిన శబ్దము కర్తయని నిర్వచనము. దేవదత్తునిచేత వంటకము వండఁబడియె - అనునది యుదాహరణము. 'వండఁబడియెను' అని యనగా 'వంటచేయుట' అను వ్యాపారము జరిగెనని యర్థము. ఈపని కాశ్రయ మైనవాడు దేవదత్తుఁడు. కావున 'దేవదత్తుఁడు' అను శబ్దమునకు తృతీయావిభక్తి ప్రత్యయమగు 'చేత' అనునది వచ్చినది.

తత్సమ పరిచ్ఛేదమునందలి "డుమంతంబునకు ద్వితీయాద్యేకవచనంబు పరంబగునపుడు నిగాగమంబు సర్వత్ర విభాషనగు" నను (బా. తత్సమ - 23) సూత్రముచే 'దేవదత్తునిచేత' అను రూపము సిద్ధించును.

ఉదాహృతవాక్యమున నుక్తార్థము వంటకము. 'వండఁబడియె' అనునది క్రియ. 'వండఁబడిన దేమి?' అని ప్రశ్న వేయగా

'వంటకము' అని సమాధానము లభించును. కావున క్రియచేత చెప్పబడునది వంటకము. అందువలన ప్రథమ యైనది.

**7. చేత వర్ణకంబు హేతుకరణంబులకుఁ గ్రహ్యాదియోగజంబగు పంచమికిని బహుళంబుగా నగు. (బా - ౪)**

ఫలసాధనయోగ్యం బగు పదార్థంబు హేతువు. క్రియాసిద్ధిం బ్రకృష్టోపకారకంబు కరణంబు. హేతువునకు- ధనముచేత సౌఖ్యంబు గలుగు; విద్యచేత యశంబు గలుగు॥ పక్షంబున వలన వర్ణకంబగు॥ కరణంబునకు- ఖడ్గంబుచేత ఖండించె; కోలచేతఁ గూలనేసె॥ పక్షంబునం దోడ వర్ణకం బగు॥ గ్రహ్యాదియోగంబునందు- జరాసంధుండు రాజుల చేతఁ గప్పంబుగొనియె; మైత్రుండు చైత్రునిచేత ఋణంబుగొనియె; ఈయర్థంబును నీచేత నెఱింగితి; ఈవృత్తాంతంబు వానిచేత వింటి॥ పక్షంబున వలన వర్ణకంబగు॥ ఇత్యాదికంబు లెఱుంగునది.

వా. చేత అను తృతీయావిభక్తి ప్రత్యయము హేతువు నందును, కరణార్థమునందును, గ్రహ్యాదియోగమునం దగు పంచమీ విభక్తి స్థానమునందును బహుళముగా నగు నని సూత్రార్థము.

ఫలసాధనయోగ్యంబగు పదార్థంబు హేతువు - అని నిర్వచనము. ఫలమును సాధించుకొనుటయందు ఉపయోగింప దగిన వస్తువును హేతు వని యందు రని యర్థము. ఉ॥ ధనము చేత సౌఖ్యంబు గలుగు॥ సౌఖ్యము ఫలము. దీనిని సాధించు కొనుటయందు ఉపయోగింపదగిన వస్తువు ధనము. కావున దీనికి 'చేత' అను ప్రత్యయము కలిగి 'ధనముచేత' అను రూపమేర్పడి నది. ఇట్లే 'విద్యచేత యశంబు గలుగు' మనునుగుచోట్ల హేత్వ

ర్థమునందు 'చేత' వర్ణకము వచ్చుట కననగును. సూత్రమున దీనిని బహుళవిధిగా పేర్కొనుటవలన, ఇట్టియెడల 'వలన' అను పంచమీ విభక్తి వచ్చుటయు చూపట్టును - ధనము వలన సౌఖ్యము కలుగును.

క్రియాసిద్ధిం బ్రకృష్టోపకారకంబు కరణంబు - అని నిర్వచనము. క్రియను సిద్ధింపజేయుటయందు మిక్కిలి యుపకరించు నట్టువంటి సాధనమునకు కరణమని పేరు. ఉ॥ ఖడ్గంబుచేత ఖండించె॥ ఖండించుట యను క్రియను సిద్ధింపజేయుటకు సాధనమైనది ఖడ్గము. కావున కరణమైన ఖడ్గమునకు చేత వర్ణకము వచ్చి 'ఖడ్గముచేత' అని యగును. ఇది బహుళవిధియగుటచేత కరణార్థమునందు 'తోడ' అను తృతీయావిభక్తి ప్రత్యయము కూడ రావచ్చును. ఖడ్గముతోడ ఖండించె, కోలతోడఁగూల నేసె - మున్నగునవి యుదాహరణములు.

గ్రహి + ఆది + యోగము = గ్రహ్యాది యోగము = గ్రహించుట మున్నగు అర్థముల కలయిక. స్వీకరించు, గ్రహించు, ఎఱుగు, కొను, విను-మున్నగునవి గ్రహ్యాదులు. ఈ యర్థములతో కలిసినపుడు వచ్చు పంచమికి బదులుగా 'చేత' వర్ణకము బహుళముగా వచ్చును. రాబోవు (బా-9) సూత్రమునుబట్టి పంచమీవిభక్తిప్రత్యయమగు 'వలన' అన్నది రావలసియున్నది. అట్టిచోట 'తోడ' కు అవకాశము ప్రస్తుత సూత్రమువలన కలుగుచున్నది. ఉ॥ జరాసంధుండు రాజులచేతఁ గప్పంబు గొనియె॥ ఈవాక్యమునందు క్రియాపదము 'కొనియె' అనునది. ఇది గ్రహ్యాదులలోనిది..కావున దీని కాశ్రయమగు 'రాజులు' అను

శబ్దమునకు 'చేత' వర్ణకమగును. అప్పుడు 'రాజులచేత' అను రూప మేర్పడును. ఇట్టివే 'మైత్రుండు చైత్రునిచేత ఋణంబు గొనియె' మున్నగు నుదాహరణములు. సూత్రవిధి బహుళ మగుటచేత, చేతవర్ణకము రానిపక్షమున 'రాజులవలన' 'చైత్రుని వలన' మున్నగు విధముగా పంచమీవిభక్తితోడి రూపము లేర్పడును.

**8. కొన్నియెడలఁ జేత విభక్త్యర్థక వర్ణకంబులకును వలన వర్ణకంబునకును దఱచుగఁ జేసి యనుప్రయుక్తంబగు.**

(ప్రౌ - ౭)

ఏకవిప్రవ సంబోధనఁ జేసి॥ భా. ఆది ౧అ॥ అభీష్టవరంబు లిచ్చుటం జేసి॥ ఆరణ్య. ౨అ॥ అసహ్యవిషోగ్ర ధూమకేతనహతిఁ జేసి॥ ఆది. ౧అ॥ బహువేదఘోషములఁ జేసి॥ అర. ౧అ॥ సంప్రయోగమునఁ జేసి॥ సభా. ౧అ॥ దీనను జేసి॥ సభా. ౧అ॥ ఇందఱును నిన్నిభంగుల నిడుమ కుడవవలసె ధర్మతనూభవువలనఁ జేసి॥ విరాట. ౨అ॥ తఱచుగ ననుటచే నొకానొకచో నేకవచనంబున నుకారంబుమీఁది ద్వితీయయుఁ దృతీయావిభక్త్యర్థక మయ్యెడునని తెలియవలయు. ఈయర్థమునకు "ఇతరత్రచ ద్వితీయా" అను స్థానినియమ శూన్యవిధియు నవకాశ మిచ్చుచున్నది. ఉ॥ తండ్రి పనువుఁ జేసి ముదిమిగొని జవ్వనం బిచ్చెఁ గూరుఁడను సుతుండు భూరియశుఁడు॥ ఆది. ౩అ॥ వెలిఁబెట్టిరే వాడ కులు ప్రాకారుఁబట్టి దానకన్యాకేళి తప్పుఁజేసి॥ స్వా. ౨అ॥ మొ దలనుటచే నిన్విధము నానవముల్ గలవారు॥ నిర్వ. ౪అ॥ అను నిట్టి ప్రయోగములును నిర్దోషములు లగుచున్నవి.

వ్యాఖ్య : 'చేత' అను తృతీయావిభక్తియొక్క యర్థమును బోధించు ప్రత్యయములకును, పంచమీవిభక్తి యైన'వలన' అను ప్రత్యయమునకును కొన్ని యెడల 'చేసి' యను శబ్దము తరుచుగా అనుప్రయుక్త మగుచుండునని సూత్రార్థము.

తృతీయావిభక్తి యగు 'చేత' ఇంతవరకు కొన్ని యర్థములం దుపయుక్త మైనట్లు చూచితిమి. కొన్ని యెడల 'చేతకు' బదులుగా ద్వితీయ వచ్చును. కొన్ని యెడల 'అ' వర్ణము వచ్చును. వీనిని సైతము కలియగలుపుకొను నిమిత్తము 'చేత విభక్త్యర్థక వర్ణకంబు'లని సూత్రమున వాడబడినది.

'ఏకవిప్రసంబోధనఁ జేసి'- ఇచ్చట 'సంబోధనచేత' అను నర్థమున జడవాచకముయొక్క తృతీయకు ద్వితీయ వచ్చినది. (బా-22) 'సంబోధనన్' అని యనగా 'సంబోధనచేత' అనియే యర్థము. కావున 'సంబోధనన్' అను ద్వితీయాంతరూపమునకు 'చేసి' యను శబ్దము అనుప్రయుక్తమై 'సంబోధనఁ జేసి' అని యైనది. 'ఇచ్చుటచేత' అను నర్థమున 'ఇచ్చుటన్' అని ద్వితీయాంతము కాగా, దానికి 'చేసి'శబ్ద మనుప్రయుక్తమై 'ఇచ్చుటం జేసి' అనియైనది. ఇట్టివే తక్కటి ప్రయోగములు.

ధర్మతనూభవువలనఁ జేసి - ఇచ్చట వలన వర్ణకమునకు 'చేసి' శబ్ద మనుప్రయుక్తమైనది. అపాయాదులయందు వలన వర్ణకము (బాల-9) విధింపబడుచున్నది. అట్లు విధింపబడిన 'వలన'కు 'చేసి' యనుశబ్దము ప్రస్తుత సూత్రముచే ననుప్రయుక్త మగుచున్నది.

ఉదంతజడముయొక్క తృతీయాసప్తములకు ఏకవచ ద్వితీయవచ్చుటకు బాలవ్యాకరణమునుబట్టి యవకాశము

లేదు. కాబట్టి ప్రౌఢవ్యాకర్త 'ఇతరత్రచ ద్వితీయా' అను చింతామణి సూత్రము నవకాశముగా తీసికొని ద్వితీయాంతములయిన కొన్ని ప్రయోగములకు తృతీయార్థమును చెప్పవచ్చునని భావించుచున్నాడు. ఉదంతజడమున కేకవచనమున ద్వితీయ యున్న యెడల, అది తృతీయార్థమునకు బోధకమగునని నిర్ణయించుచున్నాడు. 'స్థాననియమ శూన్యవిధి' యని యనుటచేత చింతామణి సూత్రమునుబట్టి స్థానముకాని, నియమముకాని యక్కరలేదని ప్రౌఢవ్యాకర్త యభిప్రాయమై నట్లనిపించును. సూరి కూడ "ఒకానొకచో నొకవిభక్తికి మఱియొక విభక్తియు నగు" (బాల - 21) అని తెలిపెను. దీనినిబట్టి కూడ అట్లు చెప్పుట కవకాశము కలుగవచ్చును. అయినను ప్రయోగములను బట్టి నిర్ణయము సాగించుట సముచితవిధానము.

తండ్రి పనుపుఁజేసి - అనుచోట 'పనుపును' అనునది ద్వితీయాంతము. 'చేసి' అనునది క్త్వార్థకము. హేత్వర్థమునందు వచ్చినది. 'పనుపును జేయుటచేత' అని యర్థము. ఇట్లు గ్రహించి నప్పుడు ద్వితీయకు తృతీయార్థము సరిపడదు. 'తప్పుఁజేసి' అని యన్నప్పుడు 'తప్పుగన్' అని యన్నప్పుడు 'గ' కు వైకల్పిక ముగా లోపము కలిగినది. 'తప్పుగా భావించి' అని యర్థము. కావున నిట్టిది ద్వితీయాంతరూపమే. ద్వితీయాంతము (ఉదంతము) నకు తృతీయార్థము చెప్పుకొనుటకు వీలున్నదను నిశ్చయముతో మరొక ప్రయోగము చూపబడుచున్నది.

ఇవ్విధము నాననముల్ - ఇచ్చట 'ఆననములు' అను శబ్దమునకు 'ఇవ్విధము' అను శబ్దమును విశేషనముగా స్వీకరించి నుగాగమము కలుగుట కవకాశము లేదు కావున దీనిని దుష్టమని

నిర్ణయించుట కలదు. విశేషణవిశేష్యములు సమసించునప్పుడు కర్మధారయసమాస మగును. "కర్మధారయంబుల మువర్ణకంబు నకుఁ బుంపులగు" నను నియమము ప్రకారము "ఇవ్విధపు + అననముల్" కావలసియుండును. పుంపులకు అచ్చుపరమగునెడల టుగాగమము కల్గునను విధిచేత 'ఇవ్విధపుటాననముల్' అని కావలసియుండును. అంతేకాని నుగాగమము కల్గునవకాశములేదు. ఉదంతతద్ధర్మార్థక విశేషణమునకు అచ్చుపరమగునపుడు నుగాగమము కలుగును. ఇచ్చట పరమం దచ్చు కలదు కాని, పూర్వమందున్నది తద్ధర్మార్థకవిశేషణము కాదు. కావున ఈవిధియు నిచ్చట వర్తింపదు. అందువలన ప్రౌఢవ్యాకర్త "ఇవ్విధమునన్" అన్న తృతీయావిభక్త్యర్థమున ద్వితీయ కల్గెనని సరిపెట్టుకొను మార్గమును సూచించుచున్నాడు. కాని ఇచ్చట తృతీయార్థము పమాత్రమును సంగతముకాదు. తృతీయార్థము సంగతమైనపుడు గదా! ద్వితీయవచ్చునో లేదో యాలోచించుట. ఇచ్చట తృతీయ కవకాశము లేదు.

'ఇవ్విధము యొక్క యాననముల్' అను నర్థమున సంబంధమును దెల్పుచున్నది ప్రస్తుతసమాసము. సమాసమున 'యొక్క'కు లోపము రాగా 'ఇవ్విధము + అననముల్' అని యగును. "షష్ఠీసమాసంబున నుకారఋకారంబుల కచ్చుపరంబగునపుడు నుగాగమం బగు" అను (బా. వ్యా) విధినిబట్టి 'ఇవ్విధము నాననముల్' అని యగును. మువర్ణకంబునకుఁబంపులగునని బాలవ్యాకరణము తెల్పినది కాని ప్రవృత్తి సార్వత్రికము కాదు. భారతమునందే కర్మధారయ తత్పురుషముల రెండింటను పుంపులు రాని ప్రయోగములు పెక్కులు గలవు. కావున

ప్రస్తుత ప్రయోగమును షష్ఠీతత్పురుషముగా గ్రహించినయెడల నుగాగమ ప్రాప్తికి అవకాశము గల్గును. అర్థమునందును క్లిష్టత కలుగదు.

'చేత' అను విభక్తి వచ్చినప్పుడు 'చేసి' యనునది అనుప్రయుక్తము కాదు; ఆ యర్థమున నితరవిభక్తి యున్నపుడు మాత్రమే యనుప్రయుక్తమగునని గుర్తుంచుకొనవలయును.

'చేసి' శబ్దవిధిని సూరి నిరూపింపలేదు. కాని, తానును పెక్కుచోట్ల బాలవ్యాకరణమునందు 'చేసి' యనుశబ్దమును వాడుకచేసెను. 'నుగాగమ ప్రాప్తిలేమిం జేసి' (బా. సంధి 38) 'సంస్కృత నామంబనుటం జేసి' (బా. తత్సమ 34) 'మధ్యమ పురుషయోగంబు లేమిం జేసి' (బా. తత్సమ 37) 'అతిదేశించుటం జేసి' (బా. తత్సమ 39) 'ఉపోత్తమేత్వంబున కనుటం జేసి' (బా. తత్సమ 46) 'ఋత్విగాది యగుటం జేసి' (బా. తత్సమ 75) 'బహుళగ్రహణంబునం జేసి' (బా. తత్సమ 80) మున్నగు విధముగా పెక్కుచోట్ల ప్రయోగములు గలవు. కావున హేత్వర్థమున 'చేసి' యను శబ్దమును సూరి నిరాక్షేపముగా వాడి యున్నాడనుట యథార్థము. ఐనను "వ్యాకరణ విధిని కల్పింపకుండుటకు కారణమేమి?" యని ప్రశ్నింపవచ్చును. ప్రత్యయముల విధానమునే ప్రధానముగా నిర్వహించుట సూరియాశయము. ప్రౌఢవ్యాకర్త కారకముల క్రమములో వచ్చుచు, కరణ కారకమునందగు 'చేత'తో పాటు 'చేసి' శబ్దమునుగూడ విధించుచున్నాడు. అనుసరించు ప్రణాళికనుబట్టి సూరి 'చేసి' శబ్దమును చెప్పకుండుట సముచితము. కరణకారకమునందు వచ్చునదగు 'చే 'చేసి' శబ్దమును చెప్పుట ప్రౌఢవ్యాకరణకారుని ప్రణాళిక కనుకూలము.

**9. అయ్యది యొక్కచోఁ బెక్కుచోట్ల కొక్కటియ [illegible]**

**([illegible])**

**వలరాజు సచివుల వడువున బెడఁగగు కర్క[illegible] గరమువాఁడి। చూడ్కుల నతిరాగ సురుచిరాధరముల మ[illegible]లస మందగతుల। వ్రక్రాలకంబుల వలుఁదపిఱుఁదుల దర్పగద్గద భాషిత ములఁ జేసి॥ భా. ఆది. ౮ అ.॥ (ఇటఁ జేత విభక్త్యర్థక లవర్ణకముపై నెల్లెడల నుండవలసిన 'చేసి' యొక్కచోటనే యున్నది.)**

వ్యాఖ్య : 'చేసి' యను శబ్దము పెక్కుచోట్ల ననుప్రయుక్తము కావలసి యున్నను, ఒక్కచోట వాడినను సరిపడు నని యర్థము. ఇచ్చట స్థానమును నిర్దేశించుట యావశ్యకము. తొలుతటి ద్వితీయాంతముపై ననుప్రయుక్తముచేసి, ఆ పిమ్మట విడిచిపెట్టినయెడల కలుగవలసిన స్ఫూర్తి కలుగదు. కావున స్పష్టముగా 'పెక్కుచోట్లకు బదులు తుదినొక్కటి చాలెడి' నను నర్థము వచ్చునట్లు చెప్పియుండిన బాగుండెడిది.

స్తనములఁ జేసి, చూడ్కులఁ జేసి, సురుచిరాధరములఁ జేసి, మందగతులఁ జేసి, వ్రక్రాలకంబులఁ జేసి, పలుఁదపిఱుఁదులఁ జేసి, భాషితములఁ జేసి — అని పెక్కుచోట్ల వాడవలసియుండగా, అన్నిచోట్లను మాని కడపటమాత్రమే 'చేసి' శబ్దమును ప్రయోగము చేసెను.

కుండలీకృత వాక్యమున 'చేత విభక్త్యర్థక లవర్ణకము' అని ప్రౌఢవ్యాకర్త వ్రాసెను. సూరి 'ల' వర్ణమును ప్రత్యయముగా అంగీకరింపఁడు. కావున లవర్ణకమని యనవలదు. 'భాషితములు' అనునది ప్రథమాబహువచన రూపము. 'చేత' యను

విభక్తి పరమగునప్పుడు ముగాగమమై 'భాషిత+ము+చేత' అని యగును. "బహుత్వంబున ద్వితీయాది విభక్తులకు లడాగమంబగు" అను నియమమునుబట్టి 'భాషితము+ల+చేత' అని యగును. "డంబు తృతీయాసప్తములకు ద్వితీయ బహుళము గానగు"నను నియమమునుబట్టి "భాషితములను" అని యగును. కావున నిచ్చట చేత విభక్త్యర్థమును దెల్పునది 'ను' వర్ణకమేకాని లవర్ణము కాదు. ప్రౌఢవ్యాకర్త ఆగమ లకారమును 'ల'వర్ణకమని పేర్కొనుట యొక పొరపాటు. దానిని చేత విభక్త్యర్థకమనుట మరొక పొరపాటు.

10. కరణ సహార్థ తుల్యార్థయోగంబులం దృతీయకుం దోడ వర్ణకం బగు. (బా - ౨)

కరణంబునందు - కోలతోడఁ గూలనేసె॥ సహార్థంబునందు - రాజు సేనలతోడ వచ్చె॥ సేనాసహితుండయి వచ్చె నని యర్థము॥ తుల్యార్థయోగంబునందు - చైత్రునితోడ మైత్రుండు తుల్యుండు॥ తృతీయ కనుటం జేసి చైత్రునకు మైత్రుండు తుల్యుండని తుల్యార్థయోగంబున షష్ఠియు నగు.

వ్యాఖ్య : కరణమునందును, సహితత్వము (కూడియుండుట) ను బోధించునప్పుడును, సామ్యమును చెప్పునప్పుడును తృతీయా విభక్తి యగును. తృతీయావిభక్తియందు రెండు ప్రత్యయములు గలవు. వాని రెంటింట 'తోడ' అనునది యిట్టియెడల వచ్చునని సూత్రవిధి.

కోలతోడఁ గూలనేసె - అను వాక్యమునందు 'కూలనేసె' అనునది క్రియ కూలనేయుట అను క్రియ సిద్ధించుటకు

ఉపయోగపడిన ప్రకృష్టమైన సాధనము 'కోల' కావున కరణార్థమునందలి యీ 'కోల' యను శబ్దమునకు 'తోడ' అను ప్రత్యయము గలిగి 'కోలతోడ' అని యగును.

రాజు సేనలతోడ వచ్చెను - ఇచట 'వచ్చె' అనునది క్రియ. కర్త రాజు. రాజు సేనలను కలుపుకొని వచ్చెను. కావున 'సేనలు' అను శబ్దమునకు తృతీయావిభక్తి ప్రత్యయ మగు 'తోడ' అనునది వచ్చును. ఇచ్చట 'తోడ' సహార్థమున వచ్చును.

చైత్రునితోడ మైత్రుండు తుల్యుండు – ఇచ్చట చైత్రునకును మైత్రునకును తుల్యత్వమును చెప్పుట యుద్దిష్టము. కావున 'తోడ' అనునది వచ్చును.

ఇట్టియెడ తృతీయకు బదులుగా షష్ఠియు కావచ్చును. కావునసే సూత్రమునందు "తృతీయకుం దోడ వర్ణకం బగు" అని చెప్పవలసి వచ్చినది. తృతీయావిభక్తిని విధించునప్పుడు మాత్రమే 'తోడ' అనునది వచ్చుననియు, షష్ఠీవిభక్తిని విధించునెడల 'కు' వర్ణకము వచ్చుట కాక్షేపము లేదనియు దాని భావము. చైత్రునకు మైత్రుండు తుల్యుండు - అనునది యుదాహరణము.

11. జడపదంబులమీఁది తోడకు మెయిమైలు వికల్పంబుగ నగు. (ప్రౌ - శబ్ద ౧౮)

అందఱుఁగూడి మోసలకు నర్థిమెయిం జనుదెంచి॥ నిర్వ. ౨౫॥

ముక్తి కున్ముఖత వహింపఁగావలయు మోహముఁ బాయఁగఁ ద్రోచి భక్తిమైన్॥ లక్ష్మి. ౧౫॥

వ్యాఖ్య : జడవాచకములమీద వచ్చు తృతీయావిభక్తి ప్రత్యయమైన తోడకు బదులుగా 'మెయి' యనునది కాని 'మై' యనునది కాని వికల్పముగా నాదేశ మగునని సూత్రార్థము.

అర్థి యనునది జడవాచకము; కోరిక యని యర్థము. కావున దానిమీది 'తోడ' అను విభక్తికి బదులుగా 'మెయి' అని రాగా 'అర్థిమెయి' అని కావచ్చును. 'తోడ' అనునది ద్రుతాంతము కావున దానిపైని గూడ ద్రుతము చేరగా 'అర్థిమెయిన్' అని యగును. 'భక్తితోడన్' అనుచోట సైతము తోడకు బదులుగా మెయి కాని మైకాని వచ్చినయెడల 'భక్తిమెయిన్' అనియు 'భక్తిమైన్' అనియు కావచ్చును. ఈవిధి వైకల్పిక మగుటచేత మెయిమైలు రానియెడల 'తోడ' అనునదియే యుండిపోవును.

బాలవ్యాకరణమునందలి సూత్రమునుబట్టి 'తోడ' అనునది కరణ సహార్థ తుల్యార్థములలో నగునని తెలిసికొంటిమి. అన్నియెడల నున్న 'తోడ'కు నీమార్పు వచ్చునా ? అను ప్రశ్న వేసికొనుట యవసరము. పై రెండు ప్రయోగములందును 'తోడ' ప్రత్యయము సహార్థమున వచ్చినది. అట్టి తోడకు బదులుగా మెయి మైలు ప్రయోగములం దున్నమాట వాస్తవమే. కోలతోడఁ గూలవేసె; సైన్యముతోడ వచ్చె; పువ్వుతోడ సమానము — ఇట్టి పెక్కుచోట్ల నీ యాదేశము కలుగదు. కావున సూత్రమునందు 'కొన్నియెడల' అని ముందు కాని, 'మెయిమైలు కనంబడియెడి' అని చివరగాని చేర్చియుండిన సమంజసముగా నుండెడిది.

**12.** వచ్యర్థాముఖ్యకర్మంబునకుఁ దోడ కు వర్ణకంబులు ప్రాయికంబుగా నగు. (బా - ౬)

మైత్రుండు చైత్రునితోడ నిట్లనియె - మైత్రుండు చైత్రునకిట్లనియె॥ ప్రాయికంబనుటచే నొకానొకచో ద్వితీయయు నగు.

వ్యాఖ్య : వచి + అర్థము = వచ్యర్థము = అను, పలుకు, చెప్పు మున్నగునవి. అముఖ్యకర్మము అనగా ద్వికర్మకంబైన క్రియతో అన్వయముకల్గి అప్రధానమైయుండు కర్మము. అను, పలుకు, చెప్పు మొదలగు క్రియలతో నన్వయించునట్టి అప్రధానమైన కర్మమునకు 'తోడ' యని కాని 'కు' యనికాని యగునని సూత్రార్థము.

మైత్రుండు చైత్రునితోడ నిట్లనియె- ఇచ్చట 'అనియె' అనునది వచ్యర్థకము. ఇట్లనియెనని యనగా ఈప్రకారముగా ననియెనని యర్థము. కావున 'ఈప్రకారము' అను నర్థముగల 'ఇట్లు' ప్రధానకర్మము. అనగా, ఈతరువాతి వాక్యమంతయు ఈక్రియకు కర్మభూతమై యుండునన్నమాట.

'అనియె' అనుక్రియకు 'చైత్రుఁడు' కూడ కర్మమే. ఇది అప్రధానకర్మ మగుటవలన 'తోడ' ప్రత్యయము కల్గి 'చైత్రునితోడ' అని యగును. ఇట్టియెడల 'కు' ప్రత్యయమును రావచ్చును. వచ్చినచో 'చైత్రునకిట్లనియె' అని యగును,

సూత్రమునందు ప్రాయికంబుగా'నని వాడియుండుట చేత తరుచుగా నిట్లగునని యర్థము. కాని సందర్భములును కొలదిగా నుండవచ్చును. అట్టియెడల 'కర్మంబున ద్వితీయ

యగు' అను నియమమునుబట్టి 'ను' వర్ణకము కలుగును. మైత్రుండు చైత్రు నిట్లని యె- అనువిధముగా రూపముండును.

**13. ఉపయోగంబునం దాఖ్యాతకుం దోడ వర్ణకం బగు.**

(బా - ౭)

నియమపూర్వక విద్యాస్వీకారం బుపయోగం బనంబడు॥ రామకృష్ణులు సాందీపనితోడ వేదంబులం జదివిరి- సాందీపనివలన నని యర్థము.

వ్యాఖ్య : ఉపయోగమనగా నియమపూర్వకముగా విద్యను స్వీకరించుట యని యర్థము. ఆఖ్యాత యనగా విద్యను బోధించువాడని యర్థము. నియమపూర్వకమైన విద్యాభ్యాసమును గూర్చి చెప్పునప్పుడు బోధకునకు 'తోడ' వర్ణకమగునని సూత్రార్థము.

రామకృష్ణులు సాందీపనితోడ వేదంబులం జదివిరి - వేదములను చదువుట ఉపయోగము. సాందీపని ఆఖ్యాత. కావున ఆఖ్యాతకు 'తోడ' వర్ణకము వచ్చి 'సాందీపనితోడ' అని యగును.

ఇట్లు కాని పక్షమున, ఇకముందు రాబోవు (బాల - 9) సూత్రమునుబట్టి గ్రహ్యాది యోగజమైన పంచమికి 'వలన' అను ప్రత్యయము వచ్చి 'సాందీపని వలన' అనియు రూపము కలుగ వచ్చును.

[ బాల - ౫వ సూత్రముచేత సహార్థమునందు సైతము 'తోడ' అను ప్రత్యయము కలుగవచ్చును కృష్ణుఁడు కుచేలునితోడఁ జదివెను - అని యుండిన నుండవచ్చును. ఇచ్చట 'కుచేలునితోఁగూడి' అని యర్థము వచ్చును. అనగా 'కృష్ణుడును గుచేలుడును సహాధ్యాయులు' అనియే భావము. సందర్భమునుబట్టి

తోడవర్థకము ఉపయోగము నం దయ్యేనో సహార్థమునం దయ్యేనో గు ర్తించుకొవ దగును ]

**14.** ఒకానొకచోఁ దోడకుఁ బ్రత్యేకప్రయోగంబునుం జూపట్టెడి. (ప్రౌ - ౬)

స్తంభగత రత్నపుత్రిక తనదుబోఁటి, యని విలోకించి తోడ మాటాడకునికి, నలుగడలు చూచి తెలిసి యచ్చెలువ బెదరి, వెడల నుంకిపఁ జేదమ్మి యొడిసిపట్టె (తోడన్ = తనతోడ). రామా. ౪ ఆ.

వ్యాఖ్య : 'తోడ' అను తృతీయావిభక్తి ప్రత్యయమును ప్రాతిపదికకు నంగనుండు చేర్పకుండ, వేరుగా కూడ ప్రయోగించిన లక్ష్యములు గల వని సూత్రార్థము. 'కొన్ని యెడల' అని యనుట వైరళ్యసూచనార్థము.

ప్రత్యయము లెప్పుడును ప్రకృతులపై విధింపబడి ప్రయోగింపబడుచుండును. కావున వానికి ప్రత్యేక ప్రయోగార్హత యుండరాదు. ఇచ్చట 'తోడ' అను ప్రత్యయమునకు వ్యస్తప్రయోగము కన్పించుచుండెనని యెంచి ప్రౌఢవ్యాకర్త దానిని వేరుగా గుర్తించుచున్నాడు.

ఇచ్చట దీనిని ప్రత్యయముగా భావించుటకంటె శబ్దముగా నెంచుట యోగ్యతరముగా నుండును. 'తోడు' అనుశబ్దము యొక్క సప్తమ్యంతరూపముగా గాని, తృతీయాంతరూపముగా గాని 'తోడన్' అనునది యేర్పడినది. ప్రత్యయమైన 'తోడన్' అనునది కూడ అట్లేర్పడినదే. వాక్యనిర్మాణమునుబట్టి ఒక రూపము ప్రత్యయమో, పదమో నిర్ణయము కావలసియుండును. తెలుగుభాషయందు 'తోడన్' అను విభక్తిప్రత్యయముతోపాటు,

శబ్దముకూడ వాడుకయందున్నది. కావున స్థానమునుబట్టియే దానిని నిర్ణయించుట యుచితము. "లోపల" "అందు" మున్నగునవి యింకను గలవు. ప్రత్యయములైనప్పుడు ప్రాతిపదికకు చివర చేరియు, పదములైనప్పుడు వేరుగను ప్రయోగింపబడుట వీని లక్షణము.

'తోడ మాటాడకునికి' అని యనునప్పుడు 'తోడుగా' అనికాని 'తోడయి' అనికాని యర్థము కలిగి, పరిణామరూపముగా విభక్త్యర్థమునే స్ఫురింపజేయును. కావుననే దీనిని విభక్తి ప్రత్యయముగా పొరపడు నవకాశము కలుగుచున్నది.

**15.** కొన్నియెడల ను శబ్దప్రయోగమునం దోడకు లోపంబును, వ్యవహితత్వంబును బహుత్వంబునం గానంబడియెడి. (ప్రౌ - ౭)

**అతనికిఁ బరలోక విధుల శాస్త్రదృష్టి వెలయఁజేసె నావగా తనూజుఁ డఖిలబాంధవులయు బ్రాహ్మణులయుఁదోడ ఖానునిభుఁడు** ॥భార. ఆది. ౬౮॥ నెమ్మిని ధర్మజు నలువురు దమ్ములుఁ దమ వస్త్రములయుఁ దమ శస్త్రవరూథమ్ములతోడను సకలహితమ్ముగఁ **బాయంగ** వలయు దాస్యమువలనన్॥ భార. సభా. ౨౫॥

వ్యాఖ్య : సముచ్చయార్థమునందు సాధారణముగా 'ఉ' వర్ణము చేరుచుండును. ఉదంతశబ్దముపై నది 'ను'వర్ణముగను, అనుదంతముపై 'యు' వర్ణముగను కనుపట్టును. అట్లు సముచ్చయార్థమునందు వచ్చెడి ఉ వర్ణమునకు పూర్వమందున్న బహువచనముమీది తోడవర్ణకమునకు కొన్నియెడల లోపమును.

కొన్ని యెడల శబ్దముతోడి యెడబాటు (వ్యవహితత్వము)ను ప్రయోగములందు కనిపించుచున్నవని సూత్రార్థము.

**[ప్రౌఢవ్యాకరణకారుడు 'ను' వర్ణమునుమాత్రమే సముచ్చయార్థకముగా గ్రహించెను. అది యట్లేయైనచో రాదోవు 'బాంధవులయు' మున్నగు ప్రయోగముల కవకాశములేదు. ఈవిషయము సర్వస్వమునందు అచ్చిక పరిచ్ఛేదము 125వ సూత్రముకద వివరింపబడినది]**

ఈసూత్రసు ప్రయోగస్థితిని యథాతథముగా నిరూపించునదే కాని, యిట్లు చేయవలయునని విధించినది కాదు. 'తోడ' అనుప్రత్యయము చేరుటకు యోగ్యములయిన శబ్దములు ఒకటికంటె నెక్కుడుగా నున్నపుడు మాత్రమే యీసూత్రము ప్రసక్తము కావలయును. అట్టి శబ్దములు బహువచనాంతములై యుండుటకూడ అవసరము. అప్పుడు తృతీయాంతములందలి పూర్వశబ్దము మీదకాని, అన్నింటి మీదకాని సముచ్చయార్థకమైన ఉవర్ణము రావచ్చును. అట్లు ఉవర్ణము వచ్చిన పిమ్మట పూర్వపూర్వ శబ్దములయందలి 'తోడ'కు లోపము వికల్పముగా రావచ్చును. చిట్టచివరిశబ్దము మీది 'తోడ'కు మాత్రమెన్నడును లోపమురాదు. ఎన్నడును రాదని అనుటవలన ఉవర్ణవ్యవహితమైనను, కాకున్నను లోపమురాదని తాత్పర్యము.

"అఖిలబాంధవులయు బ్రాహ్మణులయుఁ దోడ" అను ప్రయోగమునందు 'అఖిల బాంధవులతోడ' అనియు 'బ్రాహ్మణులతోడ' అనియు సహార్థమున కావలసి యున్నది. ఇందు ఈ రెండింటిని కలుపుటకుగాను సముచ్చయార్థకమైన ఉవర్ణము వచ్చినది. అప్పుడు 'అఖిలబాంధవులయుఁదోడ' అనియు 'బ్రాహ్మణులయుఁదోడ' అనియు కావలయును. ప్రస్తుతసూత్రమున్నుబట్టి

ఉవర్ణము వచ్చినప్పుడు పూర్వశబ్దముమీది 'తోడ'కు లోపము రాగా 'అఖిలబాంధవులయు' అని యగును. సూత్రమునందు 'కొన్నియెడల' అని యనుటచేత నిట్లు లోపము రానిచోట్లును, ఉవర్ణమే రానిచోట్లును గూడ నుండవచ్చునని యెఱుగనగును.

చివరిశబ్దముమీది 'తోడ'కు లోపము చేయరాదు. అందువలన ఉవర్ణముచే వ్యవహితమైనప్పుడు 'బ్రాహ్మణులయుఁదోడ' అనియు, వ్యవహితము కానప్పుడు 'బ్రాహ్మణులతోడ' అనియు నగును.

'తమవస్త్రములతోడ' అని 'తమ శస్త్ర వరూథమ్ములతోడ' అనియు నుండగా పూర్వశబ్దము పైని మాత్రమే ఉవర్ణము కలిగి 'తమ వస్త్రములయుఁదోడ'అనియై 'తోడ'కు లోపము వచ్చి 'తమ వస్త్రములయు' అని నిల్చినది. చివరి శబ్దమునకు ఉ వర్ణము కలుగక పోవుటచే యథాతథముగా 'తమ శస్త్ర వరూథమ్ములతోడ' అని యుండిపోయినది.

[ సూత్రమునందు పరశబ్దముమీది 'తోడ'కు లోపము రా దను విషయము విస్మరింపబడినది. 'కొన్నియెడల' అనునది వైకల్పికముగా విధించునేకాని వారింపదు. అందువలన దీనిని సూత్రకర్తయొక్క పొరపాటనియే యనవలెను కావున పూర్వశబ్దముమీది తోడ వర్జకమునకు మాత్రమే లోపమును పరిమితమొనర్చుటో, కాక అన్నిచోట్లను లోపింపజేసి చివరిశబ్దముపై తిరిగి విధించుటో అవశ్యకర్తవ్యము. అట్లు కాని యెడల చివరి శబ్దముమీది 'తోడ'కును లోపము చేయు నవకాశమును ప్రయోక్త కిచ్చినట్లే యగును. అట్టి ప్రయోగము అసాధువు. ]

ప్రస్తుతము వచ్చినట్లు శబ్దమునకును ప్రత్యయమునకును నడుమరాకుండ. ప్రత్యయమునకు పిమ్మట ఉ వర్ణము రావచ్చునను విషయముకూడ జ్ఞప్తియందుంచుకొన వలయును. 'అఖిల బాంధవులతోడను, బ్రాహ్మణులతోడను' అని ప్రయోగింప

వచ్చును. అట్లే 'తమవస్త్రములతోడను, తమశస్త్రవరూథమ్ములతోడను' అనియు వాడవచ్చును. అంతేకాక ఉశబ్దప్రయోగము లేకున్నను పూర్వశబ్దముమీఁది 'తోడ'కు లోపము కొన్ని యెడల కనిపించుచున్నది. 'అధికుల హీనుల తోడనైనఁ జెలఁగాదధిపా' అని కుమారదేవపండితీయము చూపిన లక్ష్యము పరిశీలనార్హము.

**16.** ఒకానొకచోఁ దోడకుఁ దోడుత నని రూపాంతరంబును గలదు. అయినను దానికివలె దీనికితరకార్యంబు గలుగదు. (ప్రౌ - ౮)

పగతురచేతిలోఁబడక ప్రాణముతోడుత నున్నవాఁడవే॥ భాగ. ౧౦ స్కం.॥

వ్యాఖ్య : కొన్నికొన్నిచోట్ల తృతీయావిభక్తి ప్రత్యయమైన 'తోడ'కు బదులుగా 'తోడుత' అని వాడబడుట కలదనియు దీనికి ప్రత్యేక ప్రయోగముకాని, ఉశబ్ద వ్యవహితత్వముకాని కలుగదనియు సూత్రార్థము. దీనినిబట్టి 'తోడుత' అను రూపము శబ్దమునంటియే ప్రయోగింపబడవలయునని గ్రహింపవలయును.

పై ప్రయోగమునందు 'ప్రాణముతోడ' అను రూపమునకు బదులుగా 'ప్రాణముతోడుత' అను రూపము వాడబడినది. ఇచ్చటి 'తోడుత' అనునది 'తోడ' అను ప్రత్యయమువలెనే శబ్దమునను సరించి ప్రయోగింపబడినది. కావున దీనిని 'తోడ' అను ప్రత్యయమునకు రూపాంతరముగా గ్రహించుట యుచితము. కాని, దీనినెంత మాత్రమును 'తోడన్' అనియున్న అవ్యంతశబ్దమునకు రూపాంతరముగా గ్రహింప వీలుకాదు. శబ్దము వ్యస్తప్రయోగార్హతయు, ఉవర్ణవ్యవహితత్వమును గలిగియుండును;

ప్రత్యయమున కట్టి యవకాశములేదు. కావున 'తోడుత' అను దానిని విభక్తిప్రత్యయమునకు రూపాంతరమని యనుట సమంజసమే.

కాని సూత్రమున "దానికి వలె" అని మొదలుగా వ్రాసిన వ్రాతవలన వ్యస్తప్రయోగార్హతయు, ఉవర్ణవ్యవహితత్వమును గల 'తోడ' శబ్దమునకే 'తోడుత' అను దానిని రూపాంతరముగా గ్రహించినట్లు కనిపించుచున్నది. బహుజనపల్లివారు కారకమునే ప్రధానముగా గ్రహించిరి కాని విభక్తి ప్రత్యయములను ప్రధానముగా గ్రహింపలేదు. కావున ఆయా కారకములందగు ప్రత్యయములను శబ్దములను కలిపియే చెప్పిరి. కావుననే యిట్టిచోట్ల ప్రత్యయమునకును, శబ్దమునకును మధ్యగల భేదమును విస్మరించుటవలన కలిగిన తడబాటు స్పష్టముగా కనుపట్టును.

**17.** సంప్రదానంబునకుం జతుర్థి యగు. [బా - ౮]

త్యాగోద్దేశ్యంబు సంప్రదానంబునాఁబడు ॥ జనకుండు రాముని కొఱకుఁ గన్యనిచ్చెను. కొన్ని యెడల నుద్దేశ్యమాత్రంబున కగు ॥ పురుషార్థంబుకొఱకు యత్నింపవలయు. చతుర్థికి మాఱుగా షష్ఠియె తఱచుగాఁ బ్రయోగంబులం గానంబడియెడి ॥ జనకుండు రామునకుం గన్య నిచ్చెను-పురుషార్థంబునకు యత్నింపవలయు.

వ్యాఖ్య : త్యాగ+ఉద్దేశ్యము - త్యాగోద్దేశ్యము = త్యాగమునకు నుద్దేశింపబడినవ్యక్తి. ఏదైనవస్తువును దానముగానిచ్చుటకేవ్యక్తి యుద్దేశింపబడునో ఆవ్యక్తి సంప్రదానము. జనకుండు

రామునికొఱకుఁ గన్యనిచ్చెను - ఈయుదాహరణమందు కన్య నిచ్చుటకు లక్షింపబడినవాడు రాముడు. కావున రాముడు సంప్రదానము. సంప్రదానమునకు చతుర్థీవిభక్తి యగునను ప్రస్తుత సూత్రమువలన 'రాముడు' అను శబ్దమునకు పిమ్మట చతుర్థీవిభక్తి యగును. కొఱకు, కయి-అనునవి చతుర్థీవిభక్తి ప్రత్యయములు, కాబట్టిరామునికొఱకు, రామునికయి-అనురూపములుకలుగును.

కొన్నిచోట్ల త్యాగముయొక్క ప్రసక్తి లేకపోయినప్పటి కిని లక్షింపబడిన వ్యక్తికి చతుర్థి యగును. పురుషార్థంబు కొఱకు యత్నింపవలయు - ఈ యుదాహరణమునందు త్యాగముయొక్క ప్రసక్తి లేదు. యత్నమునకు లక్ష్యమైనది పురుషార్థము. కావున చతుర్థీవిభక్తి ప్రత్యయము కలిగి 'పురుషార్థము కొఱకు' అని యైనది.

ప్రయోగములం దెక్కువగా చతుర్థీవిభక్తితోడి రూపములు కాక షష్ఠీవిభక్తి తోడి రూపములే కనిపించుచుండుటచేత సూరి ఆ విషయమును గూడ చెప్పుచున్నాడు. సంస్కృతమునందైనచో చతుర్థీ విభక్తి వాడినప్పటికంటె షష్ఠీ విభక్తి వాడినప్పుడు ఉద్దేశమునందు భేదము కనుపట్టును. తెలుగున అట్టి భేద మేమాత్రమును లేదు. పైగా షష్ఠిని వాడుటయే యెక్కువ. జనకుండు రామునకుఁ గన్య నిచ్చెను - ఇచ్చట సంప్రదానమగు 'రాముడు' అను శబ్దమునకు షష్ఠీ ప్రత్యయమైన 'కు' వర్ణకము కలిగి 'రామునకు' అని యైనది. అట్లే ఉద్దేశ్యమాత్రమయినది 'పురుషార్థము'. దానికిని 'కు' ప్రత్యయము కలిగి, పురుషార్థంబునకు యత్నింపవలయు - అని యయ్యెను.

18. చతుర్థికిం బొంటెవర్ణకంబు నగు. (ప్రౌ - శా)

అనఘుల శాస్త్రవిధిజ్ఞుల, ననరక్తులఁ బితృపితామహ క్రమమున వచ్చిన విప్రుల మంత్రులఁగా, నొనరించితె కార్యసంప్రయోగము పొంటెన్॥ భార. సభా ౧ ఆ॥ పక్షమునఁ గార్యసంప్రయోగము కొఱకు మొ॥.

వ్యాఖ్య : చతుర్థీవిభక్తియందు బాలవ్యాకరణమునందు చెప్పబడిన కొఱకు, కయి అను ప్రత్యయములతోపాటుగా 'పొంటె' అను ప్రత్యయముకూడ కలదని సూత్రార్థము. దీనిని బట్టి కొఱకు, కయి అను ప్రత్యయములను ప్రయోగించుటకు వీలైన తావులందెల్ల పొంటె అను ప్రత్యయమును సైతము ప్రయోగింపనగునని తాత్పర్యము.

కార్యసంప్రయోగము పొంటెన్ - ఇచ్చట ఉద్దేశ్యము కార్యసంప్రయోగము. కావున ఉద్దేశ్యమునకు బాలవ్యాకరణ విధినిబట్టి చతుర్థి రావలయును. ప్రస్తుతలక్ష్యమున 'పొంటెన్' అని వచ్చినది. కావున దీని చతుర్థీవిభక్తి ప్రత్యయముగా గ్రహింప వచ్చును. దీనికి శబ్దముగా నెన్నుటను ప్రయోగము కానరాదు. అందువలన దీనిని చతుర్థీ విభక్తియం దగు ప్రత్యయముగా నెంచుట సముచితమే యనిపించును. ఇది బాలవ్యాకరణమునకు పూరక సూత్రము.

'పొంటె' అను ప్రత్యయము రానియెడల 'కొఱకు' అని వచ్చి 'కార్యసంప్రయోగము కొఱకు' అని కాని 'కయి' అను ప్రత్యయము వచ్చి 'కార్యసంప్రయోగమునకయి' యని కాని కావచ్చును.

**19.** అపాయ భయ జుగుప్సా పరాజయ ప్రమాద గ్రహణ భవన త్రాణ విరామాంతర్ధి వారణంబు లెద్దాన నగు దానికి వలన వర్ణకం బగు. (బా - కా)

అపాయము - విశ్లేషము; భయము - వెఱపు; జుగుప్స - ఏవ; పరాజయము - డయ్యుట; ప్రమాదము - పరాకు; గ్రహణము - కొనుట, ఎఱుంగుట, వినుట, ఇత్యాది; భవనము - పుట్టుట; త్రాణము - కాచుట; విరామము - విరమించుట; అంతర్ధి - మఱుగుట; వార ణము - వారించుట॥ అపాయంబునకు - మైత్రుండు రాజ్యంబువలన భ్రష్టుండయ్యె॥ భయంబునకు - చోరునివలన భయపడియె॥ జుగు ప్సకు - పాపంబువలన నేవగించె॥ పరాజయమునకు - అధ్యయనము వలన డస్సె॥ ప్రమాదంబునకు - పాడివలనం బరాకు పడియె॥ గ్రహ ణంబునకు - మైత్రునివలన ధనంబు గొనియె॥ భవనంబునకు - మనువు వలనం బ్రజలు పుట్టిరి॥ త్రాణంబునకు - చోరునివలనం గాచె॥ విరా మంబునకు - భోగంబుల వలన విరమించె॥ అంతర్ధికి - కృష్ణుండు తల్లి వలన డాఁగె॥ వారణంబునకు - శోకంబువలన వారించె॥ ఈ పంచమికి షష్ఠియుం గొండొకయెడల నగు॥ చోరునకు వెఱచె - పాపంబున నేవ గించె - అధ్యయనంబునకు డస్సె - పాడికిం బరాకు పడియె - మనువు నకు నిక్ష్వాకుండు పుట్టె॥ ఇత్యాదు లూహించునది.

వ్యాఖ్య: అపాయము, భయము, జుగుప్స, పరాజయము, ప్రమాదము, గ్రహణము, భవనము, త్రాణము, విరామము, అంతర్ధి, వారణము - అనునవి దేనివలనకలుగునో దానికి 'వలన' అను ప్రత్యయము వచ్చునని సూత్రార్థము.

అపాయమనగా విశ్లేషమని యర్థము; అనగా వేఱుపడి యుండుట, యెడబాటునొందుట యని వివరణము. మైత్రుండు రాజ్యంబువలన భ్రష్టుండయ్యె' అనియనగా మైత్రునకును రాజ్యమునకును విశ్లేషము సంభవించెనని యర్థము. దేనివలన విశ్లేషము సంభవించెనో దానికి 'వలన' వర్ణకము కావలయును. కాబట్టి 'రాజ్యంబువలన' అనురూపము కలిగెను.

భయమనగా వెఱపని యర్థము. దేనివలన భయము కలుగునో దానికి 'వలన' అనుప్రత్యయము కలుగును. "చోరునివలన భయపడియె" ఇచ్చట భయపడుటకు హేతువుచోరుడు. కావున చోరశబ్దముపై వలన వర్ణకమువచ్చి 'చోరునివలన' అనురూపము కల్గును. "ఈపంచమికి షష్ఠియుం గొండొకయెడల నగు"నను వివరణముచేత వలనకు బదులుగా షష్ఠీప్రత్యయమైన 'కు' వర్ణకము వచ్చి 'చోరునికి' అనికాని, 'చోరునకు' అనికాని రూపమేర్పడును.

["డుమంతంబునకు ద్వితీయాద్యేకవచనంబు పరంబగునపుడు నిగాగమంబు సర్వత్ర విభాష నగు" నను సూత్రమునుబట్టి 'చోర' అను డుమంతమునకు 'కు' అను షష్ఠీవిభక్తి ప్రత్యయము పరముకాగా 'ని' యను వర్ణము ఆగమముగా నగును అట్లయినప్పుడు 'చోర + ని + కు' అని యగును, ఆపిమ్మట "ఇకారంబు మీఁది కునువు క్రియావిభక్తులం యుత్వంబున కిత్వంబగు"నను నియమమునుబట్టి చోర + ని + కి = చోరునికి అని యగును, ఇది 'విభాషనగు' ననుటచేత నిగాగమము రానిచోట్ల "కువర్ణకంబు పరంబగునపు డుకార ఋకారంబులకు నగాగమంబగు"నను సూత్రమునుబట్టి చోరు + న + కు = చోరునకు అనురూపము కలుగును.]

జుగుప్స యనగా ఏవ యనియు రోత యనియు నర్థములు. "పాపంబువలన నేవగించె". ఇచ్చట ఏవగింపునకు లక్ష్యము పాపము. కావున దానికి 'వలన' వర్ణకము వచ్చిన 'పాపమువలన' అని యైనది. ఇట్టియెడల 'కు' వర్ణకముకూడ కలుగవచ్చును. కలిగినచో 'పాపమునకు' అను రూపమేర్పడును.

పరాజయమనగా డయ్యుట యని యర్థము. అనగా అలసిపోవుట, బడలికచెందుట యని యర్థములు. "అధ్యయనమువలన డస్సె" అని యనునప్పుడు డయ్యుటకు కారణమైనది అధ్యయనము. కావున దానిపై 'వలన' వచ్చి 'అధ్యయనమువలన' అని యగుచున్నది. దీనికిని వలనకు బదులుగా కు వర్ణకము కలిగినయెడల 'అధ్యయనమునకు డస్సె' నను రూప మేర్పడును.

ప్రమాదమనగా పరాకునొందుట యని యర్థము; అనగా ఏమఱుపాటునొందుట యని యర్థము. "పాడివలనం బరాకు వడియె"నని యన్నప్పుడు పరాకునకు లక్ష్యము పాడి. కావున దానికి వలన వర్ణకము వచ్చి 'పాడివలన' అని యగుచున్నది. ఇచ్చటను షష్ఠీ ప్రత్యయమగు 'కు' వర్ణకము రావచ్చును. 'పాడి + కు' ఇకారంబు మీదిది గాన కు వర్ణకమునందలి యుత్వమున కిత్వము కలిగి 'పాడికి' అని యగును.

గ్రహణము అను పదమునకు గ్రహించుట యని యర్థము; అనగా తీసికొనుట, వినుట, యెఱుంగుట మున్నగు విధముగా అర్థములు గ్రహింపవచ్చును. "మైత్రునివలన ధనంబు గొనియె". కొనియె ననగా గ్రహించెనని యర్థము. ఇచ్చట

గ్రహించుటకు లక్ష్యమైనవాడు మైత్రుడు. కావున 'వలన' వర్ణకమువచ్చి 'మైత్రునివలన' అను రూపము కలిగెను. రాబోవు సూత్రములనుబట్టి 'మైత్రునినుండి' అను రూపము కూడ సిద్ధించును.

భవనమనగా పుట్టుట యని యర్థము. "మనువువలనం బ్రజలు పుట్టిరి." ప్రజలు పుట్టుటకు లక్ష్యము మనువు కావున 'వలన' వర్ణకము వచ్చి 'మనువువలన' అని యయ్యెను. ఇక్కడ షష్ఠి ప్రత్యయమగు 'కు' వర్ణకముకూడ కలుగవచ్చును. అప్పుడు 'మనువునకు' అను రూపమేర్పడును.

త్రాణము అని యనగా రక్షణ మని యర్థము. "చోరుని వలనం గాచె" అనుచోట కాచుటకు లక్ష్యము చోరుడు. కావున 'వలన' అను ప్రత్యయము వచ్చి 'చోరునివలన' అని యైనది. ఇచ్చట 'చోరునినుండి' అను రూపముకూడ రావచ్చును.

విరామమనగా విరమించుట; అనగా విడిచిపెట్టుట యని యర్థము. "భోగంబులవలన విరమించె" ఇచ్చట విరమించుటకు లక్ష్యము భోగంబులు. కావున వలన వర్ణకము వచ్చి 'భోగంబుల వలన' అని యయ్యెను. ఇచ్చటను ఉండి శబ్ద మనుప్రయుక్తమై 'భోగంబులనుండి' అను రూపముకూడ రావచ్చును.

అంతర్ధి యనగా మఱుగుట యని యర్థము; అనగా దాగుకొనుట, చాటగుట యని యర్థములు. "కృష్ణుండు తల్లివలన దాగె." ఇచ్చట దాగుటకు లక్ష్యము తల్లి. కావున వలన వర్ణకమువచ్చి 'తల్లివలన' అని యయ్యెను. 'తల్లినుండి' యనియు ననవచ్చును.

వారణమనగా వారించుట యని యర్థము. "శోకంబు వలన వారించె." ఇచ్చట వారించుటకు లక్ష్యము శోకము. కావున 'వలన' అను ప్రత్యయము కలిగి 'శోకమువలన' అని యయ్యెను. ఉండి శబ్ద మనుప్రయుక్తమై 'శోకమునుండి' అనియు రూపము కావచ్చును.

**20.** ఉండిపదం బొకానొకచో వలన వర్ణకంబున కనుప్రయుక్తంబగు. (బాల - ౧౦)

**హిమగిరివలన నుండి గంగ వొడమె. నాకంబువలన నుండి నారదుండు వచ్చె.**

వ్యాఖ్య - ఒకానొకచో అని యన్నప్పుడు ఒక్క చోటనే అని కాని, యేదో యొకచోట ననికాని యర్థము కాదు. ప్రయోగములనుబట్టి యేయే తావులందు 'ఉండి' యను పదము వచ్చునో ఆయా తావులనే గ్రహింపవలయునని భావము. అందువలన 'ఒకానొకచో' అను మాటకు కొన్ని నిర్దిష్ట ప్రదేశములందని యర్థము చెప్పుకొనవలయును. అనుప్రయుక్తమనగా అనుసరించి ప్రయోగింపబడినది యని యర్థము. పూర్వ సూత్రముచేత వచ్చిన 'వలన' అను ప్రత్యయమును వ్యవధానము లేకుండ వెంటనంటి కొన్ని నిర్దిష్ట ప్రదేశములందు 'ఉండి' యను పదము ప్రయోగింపబడునని సూత్రార్థము.

పూర్వ సూత్రముచేత గంగ పొడముట కాశ్రయమైన హిమగిరికి 'వలన' వర్ణకముకలిగి 'హిమగిరివలన'నని యయ్యెను. ప్రస్తుత సూత్రముచేత 'ఉండి' యను పద మనుప్రయుక్తమై 'హిమగిరి వలనన్ + ఉండి = హిమగిరివలన నుండి' అను రూప

మేర్పడెను. అట్లే విశ్లేషమునకు లక్ష్యమైన 'నాకంబు' పైని 'వలన' అను ప్రత్యయము కలిగి 'నాకంబు వలన' అనియై 'ఉండి' పదానుప్రయోగముచే 'నాకంబు వలన నుండి' అని యయ్యెను.

**21. ఉండి శబ్దంబు పరంబగునపుడు వలనకు ద్వితీయా సప్తములు ప్రాయికంబుగ నగు. (బా - ౧౧)**

వనమునుండి వచ్చె - వనమందుండి వచ్చె ॥ ఊరినుండి వచ్చె. ఊరనుండి వచ్చె. వనమునుంచి, ధనమునుంచి యని యుంచి శబ్దాను ప్రయోగంబుతోఁ గొందఱు వ్యవహరించెదరు గాని యది సాధుకవి ప్రయోగారూఢంబు గా దని యెఱుంగునది.

వ్యాఖ్య - 'ఉండి' యను శబ్దము అనుప్రయుక్తమగు నప్పుడు తత్పూర్వమున్న 'వలన' వర్ణకమునకు బదులుగా ద్వితీయా విభక్తి యగు 'ను' వర్ణకము గాని సప్తమీ విభక్తి యగు అందు, న అను ప్రత్యయములలో నొక్కటిగాని తరచుగా నగునని సూత్రార్థము.

'వనము వలనన్ + ఉండి' అని యుండగా 'వలన' కు ద్వితీయకలిగి 'వనమును + ఉండి' అని యగును. సప్తమి కలుగునప్పుడు 'వనమందున్ + ఉండి' అని యగును. అట్లే 'ఊరి వలనన్ + ఉండి' అని యుండగా ద్వితీయ కలిగి 'ఊరి + ను + ఉండి' అని యగును. 'వలన' కు సప్తమి రాగా 'ఊరి యందున్ + ఉండి = ఊరియందుండి' అని యగును. ఊరు శబ్దము ఔపవిభక్తిక మగుటచేత "ఔప విభక్తికముల తృతీయా సప్తముల కత్వం బాదేశంబు బహుళంబుగా నగు" నను సూత్రమును

బట్టి 'అందు' అను ప్రత్యయమునకు బదులుగా 'అ' వర్ణము కలిగి 'ఊరి + అన్ + ఉండి = ఊరనుండి' అని యగును.

'ఉండి' యని యనుటకు బదులుగా వాడుకయందు 'ఉంచి' యని వాడుట కలదు. కాని ప్రామాణికులైన కవుల ప్రయోగములందు ఇట్టి రూపము లేకుండుటవలన దానిని గ్రహింపరాదని సూరి నిర్ణయము. కావున వనమునుండి, ధనమునుండి యనునట్లుగానే వాడవలయును.

**22.** ఉండి పదంబు పరంబగుచో వలన కందు వర్ణకమట్లు నవర్ణకంబు నగు. (ప్రౌ - ౧౦)

సనత్కుమారుఁడు మహికిం జనుదెంచె బ్రహ్మలోకంబుననుండి ॥భార. అది.౪ ఆ॥

వ్యాఖ్య : పూర్వసూత్రమున బాల వ్యాకర్త ద్వితీయా సప్తము లగునని తెల్పియు నుదాహరణమునందు సప్తమికి 'అందు' అను ప్రత్యయముతోఁడి రూపమును మాత్రమే చూపెను. దానివలన సప్తమీస్థానమున అందు వర్ణకముమాత్రమే వచ్చుననియు, న వర్ణకము వచ్చుటకు వీలులేదనియు ఎవ్వరయిన భ్రమ పడుదురేమో యను నభిప్రాయముతో ప్రౌఢ వ్యాకర్త యీ సూత్రమును రచించెను. కాబట్టి యిది బాలవ్యాకరణమునకు సవరణము కాని పూరణము కాని కాదు; ఇది కేవలము వివరణము మాత్రమే. బాలవ్యాకరణసూత్రమే యిచ్చటను వర్తించును. కాని బాలవ్యాకరణమునందున 'న' వర్ణకముతోఁడి రూపము లక్ష్యములలో చూపబడలేదు కావున, దానిని చూపుటయే లక్ష్యముగా ప్రౌఢ వ్యాకర్త యిచ్చట వ్యవహరించెను.

ఉండి యనుపదము అనుప్రయుక్తమగునప్పుడు తత్పూర్వమున్న 'వలన' అను ప్రత్యయముయొక్క స్థానమున 'అందు' వర్ణకమువలెనే 'న' వర్ణకనుకూడ సప్తమీ విభక్తి స్థానమున ప్రాయికముగా కావచ్చునని యర్థము.

బాలవ్యాకరణమును బట్టి 'అందు' అనునది ప్రాయికముగా విధింపబడినది. ప్రౌఢవ్యాకరణము 'అందు వర్ణకమట్లు' మున్నగు విధముగా ననుటచే 'న' వర్ణకముకూడ ప్రాయికముగానే విహితము కావలయునని గ్రహింపవలయును.

'బ్రహ్మలోకము' అను దానికి విశ్లేషమునందు 'వలన' వర్ణకమువచ్చి 'బ్రహ్మలోకము వలన' అని యగును. దీనికి 'ఉండి' పద మనుప్రయుక్తమై 'బ్రహ్మలోకము వలన నుండి' అని యగును. బాలవ్యాకరణమునందలి పదునొకండవ సూత్రమునుబట్టి 'వలన'కు ద్వితీయ వచ్చుచో 'బ్రహ్మలోకము నుండి' అనియగును. సప్తమి వచ్చుచో 'బ్రహ్మలోకమందుండి' అని యగును. సప్తమీ విభక్తియందలి 'అందు' అను ప్రత్యయము పై లక్ష్యమునందు కలదు. 'న' అను ప్రత్యయముకూడ నిట్టియెడల రావచ్చును. అప్పుడు 'బ్రహ్మలోకమున నుండి' అను రూపము వచ్చును. ఈ రూపము బాలవ్యాకరణము వలననే సిద్ధించుచున్నను, స్పష్టతకొఱకై ప్రౌఢవ్యాకర్త మరల దీనిని గ్రహించెను.

**23.** వలన కాదేశంబగు ద్వితీయా సప్తములమీఁది యుండితి లోపంబు బహుళంబుగా నగు. (ప్రౌ - ౧౧)

ద్వితీయ మీఁది యుండికి - విచ్చేయు మదితి గర్భముఁ జెచ్చెఱ వెలువడి మహాత్మ॥ భాగ. స్క॥ సప్తమిమీఁది యుండికి - రక్తంబు

వదన గహ్వరమున వెలువడు॥ భాగ. స్క. ౧౦॥ ఉడుపథంబున జాఱు నుడుప్రతతి భాతి మెడహారముల పెన పుడమిఁ దాఁక॥ పాండు. ౫ ఆ॥ నూతిలో వెలువడఁ గోమలిం దిగిచె॥ భార. ఆది ౩ ఆ॥ నలుఁ దొల్లి యాక్రమించిన కలి కర్కోటక విషంబు గ్రక్కుచు నొడలన్ వెలువడి॥ భార. అర. ౫ ఆ॥ హెచ్చిన సంభ్రమంబున ననేకులు బ్రద్దలవార లెక్కడన్ వచ్చిరొయో మోఁదిరా కొలువువారి॥ కళా. ౫ ఆ॥ (గర్భమున్ = గర్భమునుండి; ఎక్కడన్ = ఎక్కడనుండి. ఇట్లం తట నూహ్యములు.) బహుళ గ్రహణముచే నందు మీఁది యుండికి లోపంబు కలుగదని యెఱుంగునది ఈ సూత్రము నిట్లు చెప్పుటకు నంద్వితర సప్తమ్యర్థక వర్ణకంబులమీఁది యుండికి లోపంబు వచ్చుట ప్రయోజనంబు.

వ్యాఖ్య : 'వలన' అను పంచమీవిభక్తికి 'ఉండి' అను శబ్ద మనుప్రయుక్త మగుననియు, అట్టియెడల 'వలన'కు బదులుగా ద్వితీయావిభక్తి ప్రత్యయము కాని, సప్తమీవిభక్తి ప్రత్యయముకాని రావచ్చుననియు బాలవ్యాకరణము తెల్పినది. అట్లు ద్వితీయ కాని, సప్తమికాని 'వలన'కు బదులుగా వచ్చి నప్పుడు అనుప్రయుక్తమైన 'ఉండి'కి లోపము బహుళముగా కలుగ వచ్చునని ప్రస్తుతసూత్రము విధించుచున్నది.

ప్రౌఢవ్యాకర్త సూత్రముక్రింద నిచ్చిన వృత్తినిబట్టి 'అందు'అను సప్తమీవిభక్తి మీదనున్న 'ఉండి' శబ్దమునకు లోప మెన్నడును రాదనియు, తక్కిన యెడల లోపము నిత్యముగా వచ్చుననియు భావించినట్లు తోచుచున్నది. 'అందు' మీది ఉండికి లోపము రాదనుట సమంజసమే. అట్టి ప్రయోగములు కనుపట్ట నందున 'లోపముర్వా'దని యంగీకరింపక తప్పదు కదా! 'లోపము

వచ్చు'నను విధినికల్పించినది ప్రౌఢవ్యాకర్తయే. ప్రవృత్తిలేకయే నిషేధ ముండుటకు శాస్త్రము సమ్మతింపదు కావున, తానే 'ద్వితీయాసప్తముల'కని యుమ్మడిగా చెప్పి, అపిమ్మట అందు వర్ణకము మీది 'యుండి' కి లోపమును వారించుచున్నాడు. ఇది యింతవరకు, సక్రమముగా నున్నదనుటకు సందేహము లేదు. తరువాతి భాగమున "అంద్వితర సప్తమ్యర్థక వర్ణకంబులు" అని యుపయోగించెను. అందు + ఇతర = అంద్వితర = అందు అను నదికాక మిగిలిన సప్తమ్యర్థక ప్రత్యయములని యర్థము. సప్తమి యందు "అందు, న" అని రెండు మాత్రమే ప్రత్యయములు గలవు. ఇక 'అందు' అనునదికాక మిగిలిన ప్రత్యయము 'న' అను నది యొక్కటియే. కావున "నవర్ణకంబు మీది యుండికి" అని చెప్పిన చాలు ననిపించును, కాని ప్రౌఢవ్యాకర్త 'లోపల' అను శబ్దమును కూడ సప్తమ్యర్థక వర్ణకముగానే గ్రహించెను. చిన్నయసూరి రాబోవు సూత్రమునందు 'లోపల' అను షష్ఠి ప్రత్యయము నిర్ధారణమునం దగునని తెల్పెను. కాని ప్రౌఢ వ్యాకర్త 'లోపల' అను శబ్దమును గ్రహించి, సప్తమ్యర్థక ప్రత్యయమని పేర్కొనుచున్నాడు. సూరి 'లోపల' అను శబ్ద మును కూడ భావించియుండుటచేతనే దానిని కారకపరిచ్ఛేదము నందు పేర్కొనలేదు. తన ప్రణాళికను బట్టి ప్రత్యయముల ప్రయోగమునే యాతడు చూపెను లోపల అనగా అంతర్భా గము అని యర్థము. వెలుపల, డాపల, వలపల మున్నగు శబ్ద ముల వంటిదే లోపల అను శబ్దముకూడ, కావున సప్తమ్యర్థము నందు వచ్చుదానిని 'లోపల' అను శబ్దముగా గ్రహించుట సమంజస మనిపించును. దీనిని వ్యాకరణ ప్రక్రియయందు నిర్ధా

రణయందగు సప్తమీవిభక్తి ప్రత్యయమని పొరపడరాదు. ప్రౌఢ వ్యాకర్త వర్ణకమని పేర్కొనుట యట్టి పొరపాటును సూచించుచున్న దనవలయును.

24. కంటె వర్ణకం బన్యార్థాదియోగజంబగు పంచమి కగు. (బా - ౧౨)

రామునికంటె నన్యుండు ధానుష్కుండు లేఁడు - లోభంబు కంటె నితరంబు దోషంబులేదు. ఇచట షష్ఠియు నగు॥ రాముని కన్యుండు ధానుష్కుండు లేఁడు. అన్యము - ఇతరము - పూర్వము- పరము - ఉత్తరము। ఇత్యాదు లన్యాదులు.

వ్యాఖ్య : అన్యము, ఇతరము మున్నగుపదముల యర్థములతో కూడియుండునప్పుడు వచ్చు పంచమీ విభక్తికి 'కంటె' అను ప్రత్యయము వచ్చునని సూత్రార్థము.

రాముని కంటె నన్యుండు ధానుష్కుండు లేఁడు - రామునియొక్క ధనుర్విద్యాపాండిత్యము ప్రస్తుత విషయము. దీని సర్వోత్తమత్వము తెలియుటకు అన్యులయొక్క ప్రసక్తియు, తిరస్కృతియు నవసరములు. అట్టియెడల ప్రస్తుతమునకు పైని 'కంటె' అను ప్రత్యయము వచ్చును. కావుననే 'రాముని కంటె' అని యైనది. అట్లే దోషములలో గొప్పది లోభము; ఇతరము లంతటివి కావు - అని చెప్పవలసి వచ్చినపుడు ప్రస్తుతమగు 'లోభము' పైని కంటె వర్ణకము కలిగి 'లోభము కంటె' అని యయ్యెను.

ఇట్టియెడల 'రామునికంటె' అని యనుటకు బదులుగా 'రామునకు' అని 'కు' వర్ణకముతోడి ప్రయోగములును గలవు.

**25.** కంటె వర్ణకంబు నిర్ధారణపంచమి కగు. (బా - ౧౩)

ఎచ్చట నిర్ధార్యమాణంబు జాత్యాదులచే భేదంబు కలిగియుండు నచటఁ బంచమి యగు. ఆపంచమికిం గంటె వర్ణకం బగునని యర్థము॥ జానపదులకంటె నాగరులు వివేకులు - మానహానికంటె మరణము మేలు

వ్యాఖ్య : నిర్ధారణ మనగా వేరుపఱిచి నిశ్చయించుట యని యర్థము. భిన్నజాతులలో ఒకజాతినిగాని, భిన్నగుణము లలో ఒక గుణమునుగాని, భిన్నక్రియలలో ఒక క్రియనుగాని వేరుచేసి నిశ్చయింపవలసి వచ్చినపుడు 'కంటె' అను ప్రత్యయము కలుగునని సూత్రార్థము.

నిర్ధార్యమాణము అని యనగా నిశ్చయింపబడున దని యర్థము. ఏది యితరులకంటె భిన్నముగా నిశ్చయింపబడునో అది నిర్ధార్యమాణము. దేనినుండి భిన్నముగా నిశ్చయింపబడునో అది నిర్ధారణావధి. నిర్ధారణావధిభూతమైన దానికి 'కంటె' వచ్చును. జానపదులకంటె నాగరులు వివేకులు - అనుచోట నిర్ధార్యమాణులు నాగరులు. జానపదులనుండి వేరుగా నిర్ణ యింపబడుచున్నారు. కావున జానపదులు నిర్ధారణావధి భూతులు. కావున జానపదుల పైని 'కంటె' వర్ణకము కలిగినది. మానహానికంటె మరణము మేలు - అనుచోట మానహానినుండి మరణమును వేరుచేసి నిర్ధారించుట జరుగుచున్నది. కావున 'మానహాని'పైని 'కంటె' ప్రత్యయము కలిగినది.

[జాతిగుణ క్రియలలో భేద మున్నప్పుడు కంటె వర్ణకమును, సామ్య మున్నప్పుడు రాబోవు (బాల) పదునాఱవ సూత్రమునుబట్టి లోపల వర్ణకమును నిర్ధారణమునందు వచ్చునని గమనింపవలయును.]

**26. పట్టి వర్ణకంబు హేతువులగు గుణక్రియల కగు.**

(బా - ౧౪)

జ్ఞానముఁబట్టి ముక్తుఁడగు - నీవు వచ్చుటంబట్టి ధన్యుఁడనయితి॥
ఇచట వలన వర్ణకంబు నగు॥ జ్ఞానమువలన ముక్తుండగు,

వ్యాఖ్య : హేతు వనగా కారణము. ఒక కార్యము సిద్ధించుటకు కారణములుగా వ్యవహరించిన గుణవాచకములకును, క్రియావాచకములకును పైని'పట్టి' యను ప్రత్యయము కలుగునని సూత్రార్థము.

జ్ఞానముఁబట్టి ముక్తుఁడగు - ఇచ్చట ముక్తుడగుట యన్నది కార్యము. దీనికి కారణము జ్ఞానము. ఇది గుణవాచకము. కావున దీనికి పిమ్మట 'పట్టి'యను పంచమివిభక్తి ప్రత్యయము కలిగినది.

నీవు వచ్చుటంబట్టి ధన్యుండనైతి - ఇచ్చట ధన్యుడనగుట యన్నది కార్యము. దీనికి కారణము వచ్చుట. ఇది క్రియావాచకము. కావున దీనికిని 'పట్టి' వర్ణకము కలిగినది.

ఈ రెండుచోట్లను 'పట్టి' వర్ణకమునకు ముందు నుగాగమము కలుగుచున్నది. సూరి బాల వ్యాకరణమునందెచ్చటను దానిని సూత్రముచే విధింపలేదు. తాను వ్రాసిన సంస్కృత సూత్రాంధ్ర వ్యాకరణమునందు 'నుక్పట్టి విభక్తౌ' అని యొక సూత్రమును వ్రాసెను. పట్టి పరమగుచుండగా నుగాగమ మగునని దాని యర్థము. తెలుగున వ్రాసిన శబ్ద లక్షణ సంగ్రహము నందును నుగాగమమునుగూర్చి తెల్పుచు 'పట్టి విభక్తి రానగు'

నని తెల్పియున్నాడు. బాలవ్యాకరణమునందు సూత్రవిధి లేకున్నను లక్ష్యములయందు నుగాగమము పొందుపడియేయున్నది. కావున దానిని గ్రహించుట యావశ్యకము.

జ్ఞానము + పట్టి - అని యుండగా నడుమ ను వర్ణము వచ్చి జ్ఞానము + ను + పట్టి - అనియై ద్రుతకార్యము జరిగి జ్ఞానముఁ బట్టి; జ్ఞానముంబట్టి; జ్ఞానమున్బట్టి; జ్ఞానమునుబట్టి అను రూపములేర్పడును. అట్లే వచ్చుట + పట్టి యనునదికూడ నుగాగను ప్రాప్తిచేత వచ్చుటఁబట్టి; వచ్చుటంబట్టి; వచ్చుటన్బట్టి; వచ్చుటనుబట్టి యని యగును.

పట్టి వర్ణకము రానియెడల 'వలన' వర్ణకము రావచ్చును. అప్పుడు జ్ఞానమువలన ముక్తుడగు; వచ్చుటవలన ధన్యుడనయితి- మున్నగు విధముగా రూపము లుండును.

[నిజమునకు 'పట్టి' యనునదికూడ కూర్చి, గుఱించి మున్నగువాని శ్రేణిలో చేరవలసినదే. వానికి వాలెనే, దీనికిని ప్రాతిపదికపై చేరెడి లక్షణము లేదు. పైగా 'పట్టు' అను ధాతువుయొక్క క్త్వార్థకరూపముగా స్పష్టముగా తెలియుచునేయున్నది. ఎప్పుడును ద్వితీయాంతమైన రూపముపైనే చేరుచుండుట కూడ దీని క్రియారూపమునే స్థిరీకరించుచున్నది. జ్ఞానమునుబట్టి - అని యన్నప్పుడు జ్ఞానము కర్మమగుచున్నది. కావుననే ద్వితీయా ప్రత్యయమైన ను వర్ణకము కలుగుచున్నది. 'పట్టి' యనగా 'ఆధారము చేసికొని' యని యర్థము. కావున, ఇక్కడి 'ను' వర్ణము ద్వితీయావిభక్తి ప్రత్యయమే కాని, ఆగమము కాదు. అందుచేత సూరి కూర్చి, గుఱించి మున్నగువానిని ప్రత్యయముల పరిగణనము నుండి విడిచిపెట్టినట్లే 'పట్టి' ని గూడ విడిచిపెట్టియుండిన సమంజసముగా నుండెడిది. అప్పు డాయన ప్రణాళికకు మఱింత బలము చేకూరెడిది.]

**27.** కొన్నియెడల హేతువునం దన్నంతక్రియలమీఁదను బట్టి వర్ణకంబు విభాష నగు. (ప్రౌ - ౧౨)

బ్రహ్మ పుట్టించు మనుచు నారాయణుండు। హరుఁడు హరి యించు భువనంబు లవసరమున। నెట్లు సమకూరు వీరికి నీ ప్రభావ మీవు గలుంగఁగబట్టిగా కిందువదన॥ 3 కాశీ. ఆ॥ పక్షంబునఁ గలు గుటంబట్టి మొ.

వ్యాఖ్య : కొన్నిచోట్ల హేత్వర్థమునందు అన్నంతము లయిన క్రియా పదములమీద నైతము పట్టి యను ప్రత్యయము విభాషగా నగునని సూత్రార్థము.

బాలవ్యాకరణమున 'నుజ్యంతము' అని వాడినదానినే ప్రౌఢవ్యాకరణము 'అన్నంతము' అని వాడుచున్నది. బాల వ్యాకరణము క్రియాపరిచ్ఛేదము (40వ సూత్రము)నందు తుమర్థమునందును, భావలక్షణమునందును క్రియకు నుజి విధించు చున్నది. చివరి 'జి' యనునది ఇత్సంజ్ఞ. కావున నిజముగా 'ను' అనునది మాత్రమే విధింపబడుచున్న వర్ణము. 'వందు' అను ధాతువుపై 'నుజి' చేరగా 'వందు+నుజి' అని యగును. జి ఇత్సంజ్ఞ యగుట వలన వెనుకటి ఉత్వమునకు అత్వము కలు గును. అప్పుడు 'వందను' అనురూప మేర్పడును. వందన్(వందను) అనగా వందుటకొఱకు అని యర్థము. ఇచ్చట సిద్ధరూపమును బట్టి చూడగా 'వందు' అనుధాతువుపై 'అన్' అనునది చేరినట్లే కనిపించును. కావుననే ప్రౌఢవ్యాకరణకారు డిట్టి వానిని అన్నంతము లని పేర్కొనుచున్నాడు.

పట్టి యనునది అన్నంతక్రియలమీద చేరుట విశేషము. క్రియార్థకమైన నామముపైనే సూరి విధించుట చూచితిమి. క్రియా పదముపైని గూడ పట్టి చేరుచున్నది. కలుగంగన్ + పట్టి = కలుగంగఁబట్టి. కలుగుట వలన నని యర్థము. ఇట్లే రాఁబట్టి, కాఁబట్టి, ఉండఁబట్టి, చేయఁబట్టి - మున్నగు పెక్కు ప్రయోగములు ప్రచురముగా నున్నవి. కావున దీనిని చెప్పుట యావశ్యకమే. ఇది బాలవ్యాకరణమునకు పూరకసూత్రము.

సూత్రమునందు 'కొన్ని యెడల' నను దళము అర్థవంతముగా కనిపింపదు. ప్రయోగ వైరళ్యమును సూచింపవలసి వచ్చినప్పుడుగాని, విశేషప్రయోగమును సూచింపవలవచ్చినప్పుడు గాని 'కొన్ని యెడల' నని యనుట పరిపాటి. 'పట్టి' విషయమున నిట్టి నిగ్రహ మావశ్యకము కాదు. అన్నంతము లన్నిటిమీదను చేరుట కవకాశము కలదు సూత్రాంతమునందలి 'విభాష' యను పదము 'వలన' మున్నగువాని కవకాశము కల్పించుటకు సమర్థమై యుండును. కావున 'కొన్ని యెడల' నునది నిరుపయోగము.

[ఇంక, ఈ సూత్రమునుబట్టి కూడ పట్టియనునది విభక్తిప్రత్యయము కాదని తెలుచున్నది. విభక్తిప్రత్యయములు నామములపైని మాత్రమే చేరునుగాని క్రియారూపములపై చేరవు. మునుపటి సూత్రమునందు ద్వితీయాంతముపైని చేరుట, ఇప్పుడు క్రియాపదముపై చేరుట 'పట్టి' విభక్తి ప్రత్యయము కాదని, నిరూపించుచున్నవి. కాని ప్రౌఢవ్యాకరణకారుడు 'పట్టి వర్ణకము' అనియే ప్రయోగించుచున్నాడు.]

ఈవిధి విభాష కావున అన్నంతక్రియమీద రానియెడల, కృదంతమైన రూపముపై నే పట్టి రానచ్చును. కలుగుటంబట్టి, వచ్చుటఁబట్టి - మున్నగునవి యుదాహరణములు.

**28. శేష షష్ఠికి యొక్కయు నగు.** (బా - ౧౫)

ఇచట శేషంబనఁగా సంబంధంబు॥ రామునియొక్క గుణములు - నాయొక్క మిత్రుఁడు - వానియొక్కతమ్ముఁడు కువర్ణకంబును గొన్నియెడల సంబంధంబునందగు॥ నాకుం దమ్ముఁడు - మీకు నెచ్చెలి.

వ్యాఖ్య : సంబంధమును తెలియజేయునప్పుడు షష్ఠీవిభక్తియైన 'యొక్క' యను ప్రత్యయము కలుగునని సూత్రార్థము. 'యొక్కయు' అని సూత్రమునందు సముచ్చయార్థకమును గూడ వాడియుండుటచేత పూర్వలక్ష్యములనుబట్టి పరిచితమయిన కువర్ణకము కూడ పెక్కుచోట్ల కలుగునని సూచన చేయుట కలదు.

రామునియొక్క గుణములు - అని యన్నప్పుడు రామునికి సంబంధించిన గుణములని యర్థము. రామునికిని గుణములకును గల సంబంధమును తెలియజేయుటయే విషయము. కావున 'యొక్క' యను ప్రత్యయము కలిగినది. నాయొక్క మిత్రుఁడు - మున్నగుచోట్ల సైతము సంబంధమే ప్రధానాంశము. కావున సంబంధివాచకముమీద షష్ఠీప్రత్యయమైన 'యొక్క' వచ్చెను. ఇట్టిచోట్ల కువర్ణకముకూడ కలుగవచ్చును. కావుననాకు మిత్రుఁడు' మున్నగువిధము గాకూడ ప్రయోగింపవచ్చును.

**29. షష్ఠీస్థానికం బగు కువర్ణకం బొక్కొక్కచో ద్వితీయాది విభక్తులకు మాఱుగాఁ దత్తదర్థంబులం జూపట్టెడి.**

(ప్రౌ - ౧౩)

ద్వితీయకు - వేఁటకుఁ బోయిరి; పొలమున కేఁగెను॥ పక్షంబున - వేఁటఁబోయిరి॥ భార అర౬॥ అవ్విభుండు పొలమేఁగెను॥ వి. పు. ౭౫॥ మొ. ఇట నొకానొకచోఁ గొఱకు కయి వర్ణకంబులు నయ్యెడి. అతఁడొకనాఁడు వేఁటకొఱకై తను నేలినవారు వేఁక్కతోఁ, బొతముగఁ బైనమౌటఁగని॥ భల్లా. ౩౫॥ అడవికి వేఁటకై యరిగి॥ పాండు. ౫౫॥ చిరముగ బ్రహ్మకుం దపముచేసి॥ భార. ఆది. ౨౫॥ పక్షంబున - బ్రహ్మనుగూర్చి తపముచేసి. మొ.

తృతీయకు - లోకోత్తరచరితుండగు । నాకావ్యుతనూజ నీకు నారాధ్యను॥ భార. ఆది ౩౫॥ అసురులకును బూజనీయులు॥ హరి. పూ. ౨౫॥ మొ. పక్షమున - నీచేనారాధ్యను॥ మొ. అరిమదభేద నీకు విషమాజిముఖంబుల మార్కొనంగనోపరు పరులెవ్వరున్ హరికిభంబులు మార్కొనునయ్య॥ భార. అర. ౮౫॥ అంగపతి కెదిరించెన్॥ కళా. ౮౫॥ మొ పక్షమున - నీతోమార్కొనఁనోపరు; హరితో మార్కొను నయ్య; అంగపతితో నెదిరించెన్. (ఇట అర్థభేదను విశేషము)

పంచమి - విలువిద్య నీకు నొరుల। గ్గలముగ లేకుండ॥ భార ఆది. ౫ ౫॥ పక్షమున - నీ కంటె నగ్గలముగ (అగ్గలము - ఇది అన్యార్థాదిగణ గణ్యం బని యెఱుంగవలయును.)

సప్తమికి - కోమలి నీ కనురక్త॥ భార. అర. ౨ ౫॥ పక్షమున - నీయందనరక్త, ఈ పాండిత్యము నీకుఁ దక్క మఱి యెందేఁ గంటిమే॥ స్వా. ౨ ౫॥ పక్షమున - నీయందుఁ దక్క. అహి విషంబు

చేత ననయంబు దగ్గుండ । నైతి నింక నాకు ననఘుపై పు॥ కార. ఆర. ౨ ఆ॥ మొ· పతమున - నా విషయమున సై పు.

చతుర్థికి నుదాహరణంబులు పూర్వ వ్యాకరణంబులం దూచునది.

వ్యాఖ్య : షష్ఠీ విభక్తియైన కు ప్రత్యయము కొన్ని యెడల ద్వితీయాది విభక్తులకు బదులుగా వచ్చి, ఆయా విభక్తుల యర్థములనే బోధించునని సూత్రార్థము.

ద్వితీయావిభక్తి స్థానమున వచ్చిన 'కు' వర్ణమునకు నుదాహరణము 'వేటకుఁబోయిరి' అనునది. ఇచ్చట వ్యాకర్త 'వేఁటను' అని ద్వితీయ యుండవలసియుండగా 'వేఁటకు' అని షష్ఠీవిభక్తి వచ్చినట్లు పై యుదాహరణము చూపుచున్నాడు. భారతమునందు 'వేఁటఁబోయిరి' యను పాఠముకాక ప్రథమ తోడి 'వేఁటవోయిరి' యను పాఠమే కనిపించుచున్నది. అదియే సరియైన రూపము. 'వేటను' అని ద్వితీయాంతముగా నుండు నవకాశము కనిపింపదు. పోవుట అను క్రియకు 'వేట' యనునది కర్మము కాదు. కావున కర్మమునకు రావలసిన నువర్ణము 'వేఁట' శబ్దముపై వచ్చుటకు వీలులేదు. కావున వ్యాకర్త దీనిని ద్వితీయకు కాక ప్రథమకే యుదాహరణముగా చూపుట యోగ్యతరముగా నుండెడిది. 'వేఁటను' అను ద్వితీయాంతమునే యుపయోగింప వలయునన్న 'కూర్చి' యని కాని 'గుఱించి' యని కాని యనుప్రయుక్తము గావలయును. అప్పుడు 'వేఁటను' అనునది అనుప్రయుక్తమైన క్రియారూపమునకు కర్మముగా వ్యవహరించును. 'వేటనుగూర్చి' అని యన్నప్పుడు

'వేట నుద్దేశించి' యని యర్థమగును. ఇట్టియెడల 'కు' వర్ణకమున కవకాశము లేదు. కావున పైయుదాహరణమును ద్వితీయా విభక్తికి లక్ష్యముగా చూపుట సమంజసముగా లేదు. కాని బహు జనపల్లి వారి యభిప్రాయమున కూర్చి, గుఱించి యనునవి ద్వితీయావిభక్తి ప్రత్యయములే. అందువలననే దీని నిక్కడ లక్ష్యముగా చూపుట జరిగినది. పొలమునకేఁగెను - అను రెండవలక్ష్యమునందు కూడ 'కు' వర్ణము ప్రథమావిభక్తికి బదులుగనే వచ్చుచున్నది. 'పొలమేఁగెను' అని వ్యాకర్త చూపిన లక్ష్యము దానినే నిరూపించుచున్నది. కావున నిదియు ద్వితీయావిభక్తికి కువర్ణము వచ్చుచున్న తావు కాదని తేలుచున్నది.

పైతావులందు కొఱకు, కయి అను చతుర్థీవిభక్తి ప్రత్యయములు కూడ రావచ్చును. వేఁటవోయిరి - అని యనుటకు బదులుగా 'వేఁటకొఱకుఁబోయిరి' అని కాని 'వేఁటకై పోయిరి' అని కాని వాడవచ్చును. కొన్ని యెడల నుద్దేశ్య మాత్రమునకే చతుర్థి యగునని బాలవ్యాకరణము విధించుచున్నది. పై వాక్యమున నుద్దేశ్యము 'వేఁట' కావున చతుర్థి వచ్చి పై రూపములు సిద్ధించుచున్నవి.

'బ్రహ్మకుం దపముచేసె' యనుచోట చతుర్థీస్థానమున 'కు' వచ్చెను. 'బ్రహ్మనుగూర్చి' యనుదానికి బదులుగా, పై రూపములు వచ్చెనని వ్యాకర్త యభిప్రాయము.

'నీచే నారాధ్యను' అని యనుటకు బదులుగా 'నీకు నారాధ్యను' అని తృతీయకు బదులుగా షష్ఠీప్రత్యయమైన కువర్ణకమును వాడవచ్చును. 'అసురులచేఁ బూజనీయులు' అని యను

టకు బదులుగా 'అసురులకును బూజనీయులు' అని యనవచ్చును. 'నీతో మార్కొనంగ నోపరు' అనియనుటకు బదులుగా "నీకు... మార్కొనంగనోపరు" అని 'కు' వర్ణకము వాడవచ్చును. 'అంగపతితో నెదిరించె' నని యనుటకు బదులుగా 'అంగపతి కెదిరించె' నని వాడవచ్చును.

[మార్కొను, ఎదురించు - అను క్రియలను వాడునప్పుడు ద్వితీయను వాడుట ప్రయోగరూఢము - నిన్ను మార్కొనంగ నోపరు; అంగపతి నెదిరించెను. ఇప్పుడు ద్వితీయకు బదులుగా కు వచ్చి నీకు. అంగపతికి - అని యయ్యెనను కొనుట బాగుగా నుండును.]

'ఇట అర్థభేదము విశేషము' అని వ్యాకర్త కుండలీకరించి చెప్పిన వాక్యమునుబట్టి కు వర్ణకము తృతీయార్థమును చెప్పుట లేదని స్పష్టమగుచున్నది. తృతీయావిభక్తిని వాడి 'అంగపతితో నెదిరించెను' అని యన్నప్పుడు అంగపతితో కలిసివచ్చి మరెవ్వరినో యెదిరించెనన్న స్ఫూర్తియే కలుగుచున్నది. ఉద్దిష్టమునకు విరుద్ధమగు నర్థము వచ్చుచున్నదన్న మాట! అందుచేత ఇచ్చటి కు వర్ణమును తృతీయాస్థానమున వచ్చినట్లు తలచుట సమంజసము కాదు.

'విలువిద్య నీకు నొరు లగ్గలముగ లేకుండ' అనునది పంచమికి బదులుగా షష్ఠి వచ్చుటకు లక్ష్యము. అగ్గలముగ నని యనగా అతిశయముగా నని యర్థము. 'కంటె వర్ణకం బన్యార్థాదియోగజంబగు పంచమి కగు' అను (బా - 12) నియమము ప్రకారము 'నీకంటె నొరులు' అని రావలయును. సూరియే యిచట షష్ఠియునగు' నని తెల్పి 'నీకు నొరులు' అని యనుటకు నైతమవకాశము కల్పించెను. కావున పంచమి రాని సమయమున షష్ఠినుపయోగించుకొనవచ్చును.

[అగ్గలము - ఇది అన్యార్థాది గణగణ్యంబని ప్రయోగింప వలయును. అని ప్రౌఢవ్యాకరణకారుడు కుండలీకృత వాక్యమున తెలిపెను. బాలవ్యాకరణకారుడు 'అన్యము - ఇతరము - పూర్వము - పరము - ఉత్తరము - ఇత్యాదు లన్యాదులు' అని అన్యాదిగణమును తెలిపియే యున్నాడు. పైవాక్యమున అన్యాది గణములో పఠింపదగినది 'ఒరులు' అనునది. అంతేకాని 'అగ్గలము' అనునదికాదు. 'ఒరులు' అను నన్యార్థముతోడి యోగమువలన ప్రస్తుతమైన రామశబ్దమునకు కంచె వర్ణకము కలుగుచున్నది ఇచ్చట అగ్గలము నన్యార్థాది గణగణ్యమనుట సమంజసము కాదు.]

నీయం దనురక్త - అని యనుటకు బదులుగా 'నీకు నను రక్త' యనియు, 'ఈపాండిత్యము నీయందు దక్క' అని యనుటకు బదులుగా 'నీకుఁదక్క' అనియు సప్తమికి బదులుగా షష్ఠి రావచ్చును. 'నాయందు సైపుము' అని యనుటకు బదులుగా 'నాకుసైపుము' అనియు కావచ్చును.

చతుర్థికి ప్రౌఢవ్యాకరణకారుడు తాను లక్ష్యములను చూపక పూర్వ వ్యాకరణములను చూడవలసినదిగా సూచించుచున్నాడు. బాలవ్యాకరణమునందు 'రామునికొఱకుఁ గన్య నిచ్చెను' అని తెల్పి 'రామునకుఁ గన్య నిచ్చెను' అని షష్ఠితోడి రూపముకూడ చూపబడెను.

[విజమున కీ సూత్రమునందు ప్రౌఢవ్యాకరణకారుడు క్రొత్తగా చెప్పిన యంశము కానరాదు. తృతీయకుషష్ఠి - చైత్రునకు మైత్రుఁడు తుల్యుఁడు; మైత్రుఁడు చైత్రున కిట్లనియె. చతుర్థికి షష్ఠి - రామునకుం గన్య నిచ్చెను: పురుషార్థమునకు యత్నింపవలయు. పంచమికి షష్ఠి - చోరునకు వెఱచె; పాపంబున కేవగించె; మనువునకు నిక్ష్వాకుండు పుట్టె॥ అని బాలవ్యాకరణమునందు చూపిన లక్ష్యములు.]

ప్రస్తుతసూత్రమును బాలవ్యాకరణమునకు వివరణముగా మాత్రమే గ్రహింపవలసి యున్నది.

**30.** వీప్సయందును గాలపరిమితియందును నామంబునకుఁ గువర్ణకం బగు. (ప్రౌ - ౧౪)

వీప్సయందు - ప్రాని ప్రానికి నరిగి యరిగి యడుగు॥ శార. ౫ర. ౨౭॥ ఇండ్లిండ్లకు॥ కళా. ౭౭॥ మొ. కాలపరిమితియందు - కొండొక సేపునకుఁ దెలిసి॥ హరి. ఉ. ౧౭॥ నెట్టన వర్షావధికిం। బెట్టంగల యప్పనములు పెట్టియు॥ వి. పు. ౭౭॥ అలిగి పార్థునిశిర మాఱునెలల కుర్విఁ। ద్రెళ్ళ శపియించి దేవి యదృశ్యయయ్యె॥ జై. ౪౭॥ మొ.

వ్యాఖ్య - ఒకదాని తరువాత నొకదానికి వ్యాపింప వలయునను కోరికను వీప్సయని యందురు. కాలముయొక్క యవధిని గాలపరిమితి యని చెప్పవచ్చును. వీప్సయందును, కాలపరిమితిని సూచింపవలసి వచ్చినప్పుడును నామమునకు మీద 'కు'వర్ణకము చేరునని సూత్రార్థము.

ప్రానిప్రానికి నరిగియరిగి - అనుచోట 'ప్రానిప్రానికి' అనునది వీప్సయందు వచ్చిన పునరుక్తి (ప్రౌ. శబ్ద. 114) ప్రాను + ప్రాను అని యుండగా ప్రస్తుతసూత్రముచేత ప్రానికి + ప్రానికి అని యగును. ఇప్పుడు "ఆమ్రేడితంబు పరంబగునపుడు విభక్తిలోపంబు బహుళంబుగానగు" అను (బా. సంధి. 41) విధినిబట్టి పూర్వమున్న విభక్తికి లోపమురాగా 'ప్రానిప్రానికిన్' అని యగును. అట్లే 'ఇండ్లకు + ఇండ్లకు' అనుచోట పూర్వమున్న విభక్తికి లోపము వచ్చి, సంధికాగా 'ఇండ్లిండ్లకు' అను రూపము వచ్చెను.

కొండొకసేపునకు - అనుచోట కాలపరిమితి సూచింప బడుచున్నది. కావున కు వర్ణక మగుచున్నది. వర్షావధికి, ఆఱు

నెలలకు - అనుచోట్ల సైతము కాలపరిమితియే యున్నది కావున 'కు' వర్ణకము కలుగుచున్నది.

నిజమునకు వీప్సయందు కువర్ణక మగుట యన్నది సరి యైన విధానము కాదు. వీప్సయందు పునరుక్తి మాత్రమే కలుగు చున్నది. తరువాతి క్రియతోడి అన్వయము వలన 'కు' వర్ణకము కలుగుచున్నది. 'అరిగి' యనునది క్రియ. దేని నుద్దేశించి యరి గెనో దానికి కువర్ణకము రావలయును. ఇక్కడ నుద్దేశ్యము 'మ్రాను' కావున కు వర్ణకము కలిగి 'మ్రానికి' అని యయ్యెను. వీప్సయందు పునరుక్తి కలుగగా 'మ్రానిమ్రానికి' అని యయ్యెను. అట్లే 'ఇండ్లిండ్లకు' అనునదికూడ. 'గోకులమిల్లిలు దప్పకుండ లక్ష్మీపతి గ్రుమ్మరన్' అనుచోట 'కు' వర్ణకము రానిరూపము కనిపించుచున్నది. కావున వీప్సకును కువర్ణక ప్రాప్తికిని సంబంధ మేమాత్రము లేదు. కావున సూత్రమున తొలిభాగ మావశ్యకము కాదు

కాలపరిమితియందు కువర్ణక ప్రాప్తిని సూచించుట యవ సరమే. సూరి కాలాధ్వములకు ప్రథమను మాత్రమే సూచించెను(బా. కార. 25).అవధిని సూచింపవలసివచ్చినప్పుడు 'కు'వర్ణకము వాడుట ప్రచురముగా కలదు. పైగా దాని వలన స్పష్టత కూడ నేర్పడును. 'కొంతసేపు తెలిసి' యని యన్నచో 'కొంతసేపు మాత్రమే స్పృహ కలిగియుండి' అను విరుద్ధార్థముకూడ రావచ్చును. కావున 'కొంతసేపునకుఁ దెలిసి' మున్నగు విధముగా కువర్ణకము వచ్చుట యవసరమే ఇది కాలవ్యాకరణమునకు పూరకముగా వర్తించుచున్నది.

**31. ధాతుజ విశేషణ భావార్థక పూర్వ వ్యవహితావ్యవహిత కర్తృపద ప్రథమకుఁ దఱచుగ యొక్క షష్ఠి యగు.**
**(ప్రౌ - ౧౫)**

ధాతుజ విశేషణ పూర్వవ్యవహిత కర్తృపద ప్రథమకు - బాహులకు రథంబు గడపు నేర్పున కచ్చెరువడి। భార. అర. ౨ఆ॥ తన మునుపడ్డ బన్నములు॥ ఉద్యో. ౩ఆ॥ కని తన మున్నుగన్నటులుఁగామికి విస్మయవారిరాశిలో। మునుఁగుచు॥ హరి. ఉ. ౯ఆ॥ నా యొనర్పం బూనిన కళాపూర్ణోదయంబు॥ కళా. ౧ఆ॥

ధాతుజ విశేషణ పూర్వావ్యవహిత కర్తృపద ప్రథమకు - అన్నల భూపాలకు పోయిన వలను॥ భార. ఆశ్ర. ౨ఆ॥ వానిపన్నిన వృషభ గోమయభక్షణంబు చేసి॥ భార. ఆది. ౧ఆ॥ ఎఱుకగలఁడేని మఱి శక్తుఁడేని నన్యు లన్యులకు హింస గావించునపుడు దానిఁ। బూని వారింపకున్న నప్పురుషుఁడేఁగు। హింసచేసిన వారల యేఁగుగతికి॥ భార. ఆది. ౬ఆ॥ అపార పారావార పర్యంత మహీతలంబునందు నాచూడనిరాజు లెవ్వరును లేరు॥ భార. అర. ౨ఆ॥ ఆ జరత్కారుఁ గని చెప్పుమయ్యవాని। నెఱుఁగుదేని మావడియెడు నీయవస్థ॥ భార. ఆది. ౨ఆ॥ నీచేయు వేదన నన్నుం దాఁక నోపదు॥ భార. ఆది. ౨ఆ॥ హంసచేఁ దన వినినంతకంటెను రూపవిభవాతిశయముల వెలుఁగుదాని॥ భార. అర. ౨ఆ॥

భావార్థక పూర్వ వ్యవహిత కర్తృపద ప్రథమకు - మనవుట్టి బుద్ధి యెఱుఁగుట మొదలు॥ హరి. పూ. ౫ ఆ॥

భావార్థక పూర్వావ్యవహిత కర్తృపద ప్రథమకు - పరీక్షిజ్జన ప్రాలు చనుటఁ గృశుఁడనై మునివలన నెఱిఁగి॥ భార. ఆది. ౨ఆ॥ మొ.

తఱచుగ ననుటచే 'బాహుకుండు రథంబు గడపు నేర్పునకు' ఇత్యాదు లెఱుంగునది. మేము పఠింపని శాస్త్రములె మా పఠింపని శ్రుతులే॥ అము. ఉ॥ మొ.

వ్యాఖ్య - ధాతుజ విశేషణ పూర్వవ్యవహిత కర్తృపద ప్రథమకును, ధాతుజ విశేషణ పూర్వావ్యవహిత కర్తృపద ప్రథమకును, భావార్థకపూర్వ వ్యవహిత కర్తృపద ప్రథమకును, భావార్థక పూర్వావ్యవహిత కర్తృపద ప్రథమకును తఱచుగా యొక్క యను షష్ఠీవిభక్తి ప్రత్యయము వచ్చునని సూత్రార్థము.

ధాతుజ విశేషణములని యనగా క్రియాధాతువుల వలన నేర్పడిన విశేషణములని యర్థము. చదువు, చదివెడి, చదివెడు, చదువుచున్న, చదువగల, చదివిన, చదువని - మున్నగునవి యుదాహరణములు. ఈ విశేషణములకు పూర్వమందున్న కర్తృపదముయొక్క ప్రథమావిభక్తికి బదులుగా షష్ఠీవిభక్తి యగు 'యొక్క'యను ప్రత్యయము కలుగునని యర్థము. కర్తృ పదమునకును, ధాతుజ విశేషణమునకును వ్యవధానము లేనప్పుడును మార్పు రావచ్చును; వ్యవధానమున్నప్పుడును మార్పు రావచ్చును.

బాహుకు రథంబుగడపునేర్పు - ఇచ్చట 'గడపు' అనునది ధాతుజవిశేషణము. కర్తృపదము బాహుకుఁడు. నడుమగా 'రథంబు అను పదము'వచ్చి వ్యవధానమును గలిగించుచున్నది. ఇట్టియెడల ప్రస్తుతసూత్రమునుబట్టి 'బాహుకుఁడు' అను కర్తృ

పదము షష్ఠీవిభక్తి యగు 'యొక్క'ను పొందగా 'బాహుకు యొక్క' అని యగును. రాబోవు సూత్రముచే 'యొక్క'కు లోపము కలుగగా 'బాహుకు రథంబు గడపు నేర్పు' అని యగును. తరువాతి యుదాహరణమునందు 'తాను' అను కర్తృ పదము 'పడ్డ' అను ధాతుజవిశేషణమునకు పూర్వమందుండుట చేత షష్ఠీవిభక్త్యంతమై 'తన' యని యగును. 'తాను...గన్న టులు' అన్నది 'తన...గన్నటులు' అని యగును. 'నేనొనర్పం బూనిన'అన్నది 'నాయొనర్పంబూనిన' అని యగును. ఇవన్నియు ధాతుజవిశేషణ పూర్వావ్యవహిత కర్తృపదప్రథమకు 'యొక్క' వచ్చుట కుదాహరణములు.

'అన్నలభూపాలకు పోయినవలను' అనుచోట 'పోయిన' అన్నది ధాతుజవిశేషణము. నలభూపాలకుఁడు కర్తృపదము. ఈరెండింటికిని నడుమ వ్యవధానము లేదు. కర్తపదము మీఁది ప్రథమకు బదులుగా 'యొక్క' కలుగగా 'నలభూపాలకుయొక్క' అని యేర్పడును. తరువాతి సూత్రమువలన 'యొక్క'కు లోపము కలుగగా 'నలభూపాలకు' అను విధముగా రూప మేర్పడును. 'వాఁడు పన్నిన' అనుచోట షష్ఠీవచ్చి 'వాని యొక్క' అనినై, యొక్కకు లోపమురాగా 'వానిపన్నిన' అని యగును. 'వారలేఁగు గతికి' అనుచోట 'ఏగు' అను ధాతుజ విశేషణమునకు పూర్వమందు 'వారలు' అను కర్తృపదము బహు వచనాంతమై యున్నది. ప్రస్తుతసూత్రముచేత దీనికి 'యొక్క' యను ప్రత్యయము పరమందుండి లడాగమము కలుగగా 'వారల యొక్క' అని యగును. 'యొక్క'కు రాబోవుసూత్రముచేత లోపమురాగా 'వారల యేఁగుగతికి' అని యేర్పడును. 'నేను

చూడని' యనునదియు నిట్లే 'నాచూడని' అని యగును. 'మేము పడియెడు' అనుచోటి కర్తృపదము షష్ఠ్యంతము కాగా 'మాపడియెడు' అని యగును. 'నీవు చేయు' అని యనుటకు 'నీచేయు' అనునదియు 'తాను వినినంతకంటె' అని యనుటకు 'తన వినినంతకంటె' అనునదియు నిట్లు వచ్చిన రూపములే. ఈపైని చూపినవన్నియు ధాతుజవిశేషణ పూర్వావ్యవహిత కర్తృపదప్రథమకు 'యొక్క' యను ప్రత్యయము వచ్చిన రూపములే.

భావార్థకమని యనగా చదువు, చదువుట, చదువమి, మున్నగు కృదంత మనియర్థము. ఈవిధమగు భావార్థకమునకు పూర్వమందున్న కర్తృపదముయొక్క ప్రథమకు, వ్యవధాన మున్నను లేకున్నను, యొక్క యను ప్రత్యయము వచ్చును. 'ఎఱుగుట' యన్నది భావార్థకము. 'మనము'అన్నది కర్తృపదము. నడుమ 'పుట్టి, బుద్ధి' యను రెండుపదములు వ్యవధానము కలిగించుచున్నవి. అయినను 'యొక్క' యను ప్రత్యయము కలిగి 'మనయొక్క' అని యగును. రాబోవుసూత్రముచే 'యొక్క' కు లోపమురాగా' మన పుట్టిబుద్ధియెఱుఁగుట' అని యగును. ఇది భావార్థకపూర్వ వ్యవహిత కర్తృపదప్రథమనకు 'యొక్క' యను షష్ఠీవిభక్తి వచ్చుట కుదాహరణము.

'చనుట' యను భావార్థకమునకు పూర్వమందు కర్తృ పదమై యుండుటచేత 'పరీక్షిజ్జనపాలుడు' అనునది 'పరీక్షిజ్జను పాలుయొక్క' అనియై యొక్కకు లోపమురాగా 'పరీక్షిజ్జన

పాలు చనుట' అని యగును. ఇది భావార్థకపూర్వావ్యవహిత కర్తృపద ప్రథమకు 'యొక్క' వచ్చుట కుదాహరణము.

సూత్రమునందు "తఱచుగ" నని యనుటచేత, పైని చెప్పిన మార్పురాని రూపములు కూడ కొలదిగా నుండవచ్చును. అట్టివానినిగూడ వ్యాకర్త చూపుచున్నాడు. 'బాహుకు రథంబు గడపునేర్పు' అనికాక 'బాహుకుండు రథంబు గడపు నేర్పు' అనియన్నట్లు కర్తృపదము ప్రథమాంతముగనే యుండవచ్చును. 'మేముపఠింపని' అని యన్నప్పుడును షష్ఠికలుగలేదు. అదే వాక్యమున 'మాపఠింపని' అనుచోట షష్ఠి వచ్చినది.

[ప్రౌఢవ్యాకరణకారుడు పైవన్నియు వ్యస్తరూపములుగా భావించియుండుట చేత ఆవిధముగా సూత్రింపవలసివచ్చెను. కాని నిజమునకు 'బాహుకు రథంబు గడపు నేర్పు' అన్నదంతయు నొకటే సమాసము. కావున 'బాహుకు యొక్క + రథంబు గడపునేర్పు' అనియైనపుడు సమాసవిభక్తికి లోపముకలిగి పైరూపమేర్పడును. 'తన మునుపడ్డ బన్నములు' అనుచోట 'తనయొక్క బన్నములు' అనియే విగ్రహము 'మునుపడ్డ' అను వ్యవధానమున్నను, ఏకార్థీభావసామర్థ్యముచేత దీని నంతటిని సమాసముగనే గ్రహింపవలయును. ఇతరపద వ్యవధానములేని చోట సమాసమగుట కేయాటంకమును లేదు. కావున ప్రథమాంతమైన కర్తయున్నప్పుడు వ్యస్తరూపముగను, షష్ఠ్యంతమైన కర్తయున్నప్పుడు సమస్తరూపముగను గ్రహింపవలయును.]

## 32. యొక్కకు లోపంబు బహుళంబు. (ప్రౌ - ౧౬)

ఇమ్ముగ స్వరలోకజను లెవ్వని యేని మహామృతాంశుబిం। బమ్మున నుద్భవంబయిన భారత వాగమృతంబు కర్ణరంధ్రమ్మను నంజలిం దవిలి త్రావుదురు॥ భార. అది. ౧౮॥ ధర్మజు నలువురు నమ్మలు॥ భార. సభా. ౨౮॥ ఇరులు గెలిపిన యంతఃపురేందు ముఖులు। కురులు మీరఁడను వేఁటకాఁడురులు వేసి। మరులు గొలి

పంగకేఁడయ్యె మనుజవిభుని॥ సరులు లేని ద్విక్షంజనశాలకములశ నై. 3అ॥ వారివ ధమ్మిల్లభారావకలిత దివ్యామోద నవపుష్పదామము లయు॥ భార. ఆది. 3అ॥ (వారివ = వారివేయైన. ఇక్కడ నిది షష్ఠ్యంతమునకు విశేషణము గనుక ప్రథమ.) అపుడు సమ్మెటకోలల యంకుశముల॥ చేఱుకోలల వ్రేటుల (సమ్మెటకోలల యొక్కయు, అంకుశముల యొక్కయు, చేఱుకోలలయొక్కయు వ్రేటులచేతనని యర్థము. ఇట అంకుశములవ్రేటుల ననఁగా లకుణచేఁ బోటులని యెఱుం గునది)॥ద్రోణ. 3అ॥ నరగోమృగ సింహంబుల॥ కరుణములగు రోగవేగ కలితాక్రోశ॥ స్వరములు పెక్కయ్యె॥ హరి. పూ. ఒఅ॥ తాతలతం డ్రుల తరమున॥ నేతెంచిన వృత్తిదక్క॥ విజ్ఞా. వ్య.॥ బహుళ గ్రహ ణముచే ధాతుజవిశేషణ భావార్థకముల ముందటి కర్తృపదంబుల యొక్కకు నిత్యంబుగ లోపం బగునని యెఱుంగవలయును.

వ్యాఖ్య - యొక్క అను షష్ఠీవిభక్తి ప్రత్యయము బహు ళముగా లోపము నొందునని సూత్రార్థము.

"సమాసవిభక్తికి లోపంబగు" నను బాలవ్యాకరణ నియ మముచేతనే యొక్కకు కూడ సమాసమునందు లోపము కలుగు చున్నది. ప్రౌఢవ్యాకరణకారుడు అసమాసమునందును యొక్కకు లోపము కలుగుచున్న దన్న విషయమును నిరూపించుటకై యీ సూత్రము నారంభించెను.

ఎవ్వనియొక్క + పని - అని యున్నప్పుడు 'పని' అన్నది అవ్యయము. అవ్యయ ముత్తరపదముగా నుండగా సమాసము కాదన్న యభిప్రాయముతో ఈప్రయోగము చూపబడుచున్నది.

అసమాసమందు సైతము యొక్కకు లోపము రాగా 'ఎవ్వని యేని' అని యగును.

ధర్మజుయొక్క+నలువురు దమ్ములు - అని యున్నప్పుడు 'నలువురు' అన్నది బహువచనాంతరూపమై స్వస్వామి సంబంధము గల పదములకు వ్యవధానమును గలిగించుచున్నది. కావున నిదియు సమాసము కాదు. అయినప్పటికిని యొక్కకు లోపము వచ్చి 'ధర్మజు నలువురుదమ్ములు' అను విధముగా నగుచున్నది.

అట్లే 'మనుజవిభునియొక్క' అనుచోటి యొక్కకు లోపము కలుగుచున్నది. 'దామములయొక్కయు' అనుచోటి యొక్కకు లోపమువచ్చి 'దామములయు' అని యగుచున్నది. [ఈయుదాహరణము దగ్గర వ్యాకరణకారుడు 'వారివ' అను దానికి 'వారివేయైన' అను నర్థము వ్రాసి వివరించెను. రాబోవు (ప్రౌఢ - 21) సూత్రమునుబట్టి సమాసాంతర్గత విశేష్యముల కగు విశేషణముల షష్ఠికి ప్రథమ కలుగవచ్చును. దానినే యిచ్చట ముందుగా సూచించుచున్నాడు. ఇది పద్యగ్రహణమునకు సహకరించును. ఈవివరణము ప్రస్తుతలక్షణమున కేమాత్రమును దోహదకారి కాదు.]

సమ్మెట కోలలయొక్క+అంకుశములయొక్క+చేఱుకోలలయొక్క+వ్రేటుల - అనియుండగా యొక్కకు లోపము వచ్చి 'సమ్మెటకోలల యంకుశముల చేఱుకోలల వ్రేటుల' అని యయ్యెను. ఇచ్చట 'వ్రేటుల' అన్నది మూడుచోట్ల కన్వయించు చున్నది. అందువలన పూర్వ పూర్వములైన షష్ఠ్యంతములకు దూరస్థమైయున్నది. అయినను యొక్కకులోపమువచ్చినది.

[ప్రేయుట యనగా కొట్టుట యని యర్థము. సమ్మెటకోలల తోను, చేలుకోలలతోను కొట్టుట జరుగును. అంకుశములతో కొట్టుట జరుగదు; పొడుచుట జరుగును. కావున నిచ్చట వాచ్యార్థమునుగాక 'పోటులు' అను లక్ష్యార్థమును గ్రహించి తాత్పర్యమును భావింపవలయునని వ్యాకర్త వివరణసారము.] తక్కిన యుదాహరణములుకూడ నిట్టివే.

బహుళమని యనగా ప్రవృత్తి, అప్రవృత్తి, వికల్పము, అన్యత్వము - అను నాలుగు విధములగు కార్యములు సాధారణముగా జరుగుచుండును. సూత్రమునందు "బహుళంబు"అని యనుటచేత పూర్వసూత్రమునందు చెప్పిన ధాతుజ విశేషణముల భావార్థకములముందటి కర్తృపదముమీది యొక్కకు నిత్యముగా లోపము కలుగవలయు నని వ్యాకర్తయే సూచించుచున్నాడు. దానినిబట్టి తక్కినయెడల వైకల్పికముగా యొక్కకు లోపము కలుగవచ్చునని తెలియుచున్నది. అనగా ఎవ్వనియొక్కయేని; ధర్మజుయొక్క నలువురు తమ్ములు - మున్నగు విధముగా నుండ వచ్చునని భావము.

[తెనుగు గ్రంథములలో 'యొక్క' యన్న దెక్కడను గనిపింపదు. వ్యాకరణములందు 'యొక్క'ను ప్రత్యయముగా చెప్పిరే కాని ప్రయోగమును చూపలేదు. ఆంధ్రభాషాభూషణము యొక్క షష్ఠికి నుదాహరణములుగా సుతుని ధనము, సుతుధనము, సుతుంధనము - అని చూపెను. దీనినిబట్టి 'యొక్క' యనునది ప్రయోగమునందు పృగ్యమనియే యెంచవచ్చును. చిన్నయసూరియే మొదటిమారుగా యొక్కకు ప్రయోగము నిచ్చిన ప్రామాణిక లాక్షణికుడు. కాని. తన యభిప్రాయమునుబట్టి వ్యస్తముగా నున్నప్పుడు యొక్క యుండి, సమాసమైనప్పుడు లోపించును. విగ్రహవాక్యము చెప్పుకొనునప్పుడును, వ్యాఖ్యానాదుల

యందును స్పష్టతకొఱకు 'యొక్క'ను వాడుట జరుగుచున్నది. ప్రౌఢవ్యాకరణకారుడు పైప్రయోగములన్నియు అసమాసమున యొక్కకు లోపము వచ్చుట కుదాహరణములుగా చూపెను. కాని వానిని సమాసములుగా గ్రహింపకుండుటకు తగినంత కారణము లేదు. 'ధర్మజుతమ్ములు' అనునది సమాసమనుట కాక్షేపము లేదుగదా! ఇక 'తమ్ములు' అను పదముతో యోగ్యత గల 'నలువురు' అన్నది వ్యవధానము కలిగించుచున్నది గావున సమాసము కాదనిపింపవచ్చును. కాని సమాసమునందు ఏకార్థీభావసామర్థ్యము ప్రధానలక్షణము. దాని కనుకూలముగా నెన్ని పదములు చేరినను సమాసలక్షణమును భంగింపజాలవు. చిన్నయసూరి సమాసపరిచ్ఛేదము చివర 'రాముఁడు రక్షించిన భృత్యుఁడు; రాముఁడు వాలి వేసిన బాణము' మున్నగువానిని సమాసములుగానే పరిగణించెను. ఇంకొక విషయము కూడ నున్నది. చూచితిని వానిని; చెప్పించితిని వానిచే; వచ్చితిని వానికొఱకు; వింటిని వానివలన; ఇచ్చితిని వానికి; ఉంటి నాయింటియందు - మున్నగువిధముగా విభక్త్యంతములు తమతో అన్వయించువానికి పర మందు కూడ రావచ్చును; క్రమనిరపేక్షములై ప్రయోగింపబడుట కాక్షేపములేదు. 'యొక్క' విభక్తి యెప్పుడును పరమందు ప్రయుక్తము కారాదు. నాయొక్క + తమ్ముడు అని యుండవలయునేకాని 'తమ్ముడు + నాయొక్క' అను విధముగా నెన్నడు నుండుటకు వీలుకాదు. దీనినిబట్టియు 'యొక్క' యనునది విలక్షణమైనదనియు, దానితోడిరూపములు సమాసములై తీరుననియు, అందువలననే 'యొక్క'కు లోపము కలుగుచున్న దనియు నిర్ణయింపనగును.

ఇంకొక విషయము. ప్రౌఢవ్యాకరణకారుడే 'వారివ' అను విషయమును వివరించుచు 'నిది షష్ఠ్యంతమునకు విశేషణము గనుక ప్రథమ' యని చెప్పెను. ఇచ్చట వ్యాకర్త యనుకొనకుండగనే యొక నిశ్చయమును బయటపెట్టుచున్నాడు. 'ఒక్కచో సమాసాంతర్గత విశేష్యంబుల కగు విశేషణంబుల షష్ఠికిని ప్రథమచూపట్టెడి" నను సూత్రమునుగూర్చి ప్రసంగించుటచేత 'వారివ' మున్నగు చోటిది సమాసమని తానంగీకరించుచున్నట్లే. సమాసమైనప్పుడు యొక్కకు లోపమును వేరుగా విధింపవలసిన యావశ్యకమే లేదు.]

**33. నిర్ధారణషష్ఠికి లోపల వర్ణకంబగు. (బా - ౧౬)**

జాతి గుణ క్రియా సంజ్ఞలచేత సముదాయంబునుండి యేకదేశం బునకుం బృథక్కరణంబు నిర్ధారణం బనంబడు. ఎద్దానివలన నిర్ధారణం బగు నచ్చటిషష్ఠికి లోపల వర్ణకంబగునని యర్థము॥ మనుష్యుల లోపల క్షత్త్రియుండు శూరుండు - గోవులలోపలం గపిల బహుక్షీర - అధ్వగులలోపలం బాఱువాండు శీఘ్రగామి - ఛాత్రులలోపల మైత్రుండు సమర్థుండు॥ ఇట సప్తమియుం గలదు॥ మనుష్యులయందు క్షత్త్రియుండు శూరుండు॥ ఇత్యాదు లెఱుంగునది.

వ్యాఖ్య - జాతినిబట్టికాని, గుణమునుబట్టికాని, చేష్టను బట్టికాని, సంజ్ఞనుబట్టికాని ఒకసమూహామునుండి యొకదానిని వేరుచేసి పరిగణించునప్పు డగు షష్ఠీవిభక్తికి 'లోపల' అను ప్రత్యయము వచ్చునని సూత్రార్థము.

సముదాయము అనియనగా సమూహామని యర్థము. ఏక దేశము అని యనగా ఒక్కటి యని యర్థము. పృథక్కరణము అని యనగా వేరుపరుచుట యని యర్థము. ఒకేసముదాయము నకు చెందిన యనేకమునుండి ఒక్కదానిని వేరుచేసి నిరూపించు నపుడు సముదాయ వాచకమునకు 'లోపల' అను ప్రత్యయము చేరును.

మనుష్యులలోపల క్షత్త్రియుండు శూరుండు - ఇందు నిర్ధార్యమాణుడు క్షత్త్రియుడు. మనుష్యులు సమూహావాచకము. క్షత్త్రియుడు మనుష్యులలో ఒకడు. కావున సమూహా వాచకమునకు లోపల వర్ణకముచేరి 'మనుష్యులలోపల' అని యైనది. ఈనిర్ధారణము జాతినిబట్టి జరిగినది.

గోవులలోపలఁ గపిల బహుక్షీర - ఇందు కపిల పృథక్కరింపబడినది. ఇది గుణమునుబట్టి జరిగినది. కపిలకూడ గోవే యైనను గోసమూహమునుండి వేరుగా నిర్ధారింప బడుచున్నది. కావున సమూహవాచకమునకు 'లోపల' అను ప్రత్యయము చేరినది.

వాఱువాడు = పరుగెత్తువాడు. క్రియచేత మార్గగాముల నుండి నిర్ధారింప బడినప్పుడు 'అధ్వగులలోపలం బాఱువాఁడు శీఘ్రగామి' అని యయ్యెను. మైత్రు డనునది సంజ్ఞ. ఛాత్రులు అనగా శిష్యులు. శిష్యసముదాయమునుండి మైత్రుఁడు నిర్ధారింప బడినపుడు సముదాయవాచకమునకు 'లోపల' అను ప్రత్యయముచేరి 'ఛాత్రులలోపల మైత్రుండు సమర్థుండు' అని యయ్యెను.

ఇట్టియెడల 'లోపల' అను ప్రత్యయమునకు బదులుగా సప్తమీవిభక్తియందలి 'అందు' అను ప్రత్యయము కూడ రావచ్చును. అప్పుడు మనుష్యులయందు క్షత్రియుండు శూరుండు - గోవులయందుఁగపిల బహుక్షీర - అధ్వగులయందుఁ బాఱువాఁడు శీఘ్రగామి - ఛాత్రులయందు మైత్రుండు సమర్థుండు ॥ అను విధముగానుండును.

[ఇట్టి యెడల తృతీయాసప్తములకుఁ బదులుగా నగు ద్వితీయయు రావచ్చును - మానవులను బ్రాహ్మణుండు వరిష్ఠుండు; యజ్ఞవిధానముల హుతంబు పెద్ద; గృహస్థత్వమాశ్రమముల నెక్కుడు. చిన్నయసూరి సమూహవాచకమును బహువచనాంతముగానే నిల్పి దానికి లోపల వర్ణకమును జేర్చెను. సమూహవాచక మేకవచనాంతముకూడ కావచ్చును - దేవతాసమితిం బ్రజాపతి ఘనుఁడు; అనిలచయమ్మునఁ బ్రాణమగ్ర్యము: ధాతువర్గములోన నుత్తమము పసిఁడి ॥ మున్నగునవి లక్ష్యములు.]

**34. అధికరణంబునకు సప్తమి యగు. (బా - ౧౩)**

అధికరణంబు నా నాధారంబు. ఔపశ్లేషికంబు వైషయికం బభి వ్యాపకం బని యాధారంబు త్రివిధంబు ॥ ఘటమందు జలమున్నది - మోక్షమం దిచ్ఛ గలదు - ఉన్నింటియం దీశ్వరుండు గలఁడు.

వ్యాఖ్య - అధికరణము అని యనగా ఆధార మని యర్థము. ఆధారము మూడు విధములుగా నుండును. 1. ఔపశ్లేషికము = కూడియుండునది. ఘటమందు జలమున్నది - ఇచ్చట ఘటము ఆధారము. ఇది జలమునకు అత్యంత సన్నిహితముగా కూడి యున్నది. అందువలన నౌపశ్లేషికాధారము. కాబట్టి ఆధారవాచ కమునకు సప్తమీవిభక్తియగు 'అందు' వర్ణకముచేరి 'ఘటమందు' అనియైనది. 2. వైషయికము = విషయసంబంధము గలది. మోక్షమం దిచ్ఛ గలదు - ఇచ్చట ఇచ్ఛ విషయము. దీనితో సంబంధముగల యాధారము మోక్షము. కావున నది వైషయి కాధారము. దానికి సప్తమి కలుగగా 'మోక్షమందు' అని యయ్యెను. 3. అభివ్యాపకము = అంతటను వ్యాపించి యుండుట. అన్నింటియం దీశ్వరుండు గలఁడు - ఇచ్చట ఈశ్వరుడు సర్వవ్యాపకుడు. అట్టి సర్వవ్యాపకునికి ఆధారము 'అన్ని'. కావుననే సప్తమికలిగి 'అన్నింటియందు'అని యయ్యెను.

[సూత్రమునందు "సప్తమి యగు" అని మాత్రమే కలదు. అందు, న- అను రెండునుఁ సప్తమీవిభక్తి ప్రత్యయములైఉదాహరణములందు ఒక్క 'అందు' అను ప్రత్యయము తోడి రూపములు మాత్రమే చూపబడినవి. కాని 'న' వర్ణకముతోడి రూపములను చూపలేదు. అందు వర్ణకము వాడినచోట్ల నెల్ల న వర్ణకమునుగూడ వాడవచ్చునా ? ఈప్రశ్నకు సమాధానముగ తరు వాతి సూత్రము వ్యవహరించును.]

**35. ఉకారాంత జడంబునకు న వర్ణకం బగు. (బా - ౧౭)**

ఘటంబున జలం బున్నది - దేవదత్తునకు మోక్షమున నిచ్ఛ గలదు.

వ్యాఖ్య - జడవాచకము అని యనగా అప్రాణివాచక మని యర్థము. ఆధారము జడవాచకమై, ఉకారాంతమైనప్పుడు 'న' వర్ణకము కూడ కలుగవచ్చును. ఘటంబున జలం బున్నది - ఇచ్చట జలమునకు ఆధారము ఘటము. ఇది ఉకారాంత జడ వాచకము. కావున సప్తమీవిభక్తియందు నప్రత్యయము వచ్చి 'ఘటంబున' అని యయ్యెను. మోక్షమున నిచ్ఛ గలదు - ఇచ్చట ఇచ్ఛకు ఆధారము మోక్షము. ఇది ఉకారాంత జడ వాచకము. కావున న వర్ణకముచేరి 'మోక్షమున'అని యయ్యెను. పూర్వసూత్రముచేత ఘటమందు, మోక్షమందు - అను విధముగా సైతము నుండవచ్చును.

[పూర్వసూత్రమందు ప్రసక్తమైన చివరి లక్ష్యమునందు మాత్రము నవర్ణకము కలుగదు. ఎందువలన ననగా, ఈశ్వరున కాధారము 'అన్ని' యనునది. ఇది ఉకారాంతము కాదు. కావున నవర్ణకము చేరు నవకాశము లేదు. అందుచేత 'అందు'అను ప్రత్యయము మాత్రమే చేరి 'అన్నింటియందు' అని మాత్రమే యగును.]

**36. విశేష్యంబునకుం బోలె విశేషణంబునకు లింగవిభక్తి వచనంబు లగు. (బా - ౧౮)**

నందతనయుండు కృష్ణుండు నాకు దిక్కు - దేవకీపుత్త్రిహరిని నుతింతు నెప్డు - శుభవిధాయుల రామకృష్ణుల భజింతు - భువన వంద్యను రుక్మిణిం బొగడుచుందు.

వ్యాఖ్య - విశేష్య మనగా నామవాచకము. నామవాచకము ఏలింగము, ఏవిభక్తి, ఏవచనము కలిగియుండునో విశేషణముకూడ అదే లింగమును, అదే విభక్తిని, అదే వచనమును గలిగియుండవలయు నని సూత్రార్థము.

నందతనయుండు కృష్ణుండు నాకు దిక్కు - ఇచ్చట కృష్ణుడు విశేష్యము; పుంలింగము; ప్రథమావిభక్తి; ఏకవచనము. కావున విశేషణమైన నందతనయుడు కూడ పుంలింగ ప్రథమా విభక్త్యేక వచనములను గలిగియున్నది. రెండవ యుదాహరణ మందు 'హరిని' అను విశేష్యము పుంలింగము; ద్వితీయావిభక్తి; ఏకవచనము. కావున 'దేవకీపుత్త్రున్' అను విశేషణము పుంలింగ ద్వితీయావిభక్త్యేక వచనములను గలిగియున్నది. శుభవిధాయుల రామకృష్ణుల భజింతు - అనుచోట విశేషణ విశేష్యములు రెండును పుంలింగ ద్వితీయావిభక్తి బహువచనములను గలిగి యున్నవి. భువనవంద్యను రుక్మిణిఁ బొగడుచుందు - ఇచ్చట విశేష్యము స్త్రీలింగము ; ద్వితీయావిభక్తి; ఏకవచనము. కాబట్టి స్త్రీలింగము, ద్వితీయావిభక్తి, యేకవచనము నయిన 'భువన వంద్యను' అన్నది విశేషణమైనది.

[ ఇట్లు నిత్యముగా విశేష్యమున కనుగుణముగా విశేషణము లింగ విభక్తి వచనముల నొకేమాదిరిగా కలిగియుండవలయునా? మొదట నన్నింటి కట్లే యుండునని విధించుట సంప్రదాయము. కాబట్టి ఆమార్గమును బట్టి సూరి యిచ్చట విధించెను. ఇట్లు కానివానిని తరువాతి సూత్రము లందు వరుసగా చెప్పుచున్నాడు. తెలుగునందు సాధారణముగా రాబోవు (బాల-28) సూత్రమునుబట్టి 'అగు' శబ్దమును వాడుట యభీష్టము.]

**37. స్త్రీసమంబులగు విశేషణంబులయు ము వర్ణకాంత విశే షణంబులయు బహువచనంబున కేకవచనంబు బహు ళంబుగా నగు. (బా - ౨౦)**

**మాటలు పెక్కేల - మాటలు పెక్కులేల; కులిశధార ల్కుంఠితంబయ్యె - కులిశధారల్కుంఠితంబులయ్యె; ఇష్టమగు పదార్థములు - ఇష్టములగు పదార్థములు.**

వ్యాఖ్య - ప్రథమైక వచనలోపము నందిన యాచ్ఛిక శబ్దములు స్త్రీసమములు. ప్రథమావిభక్తియందు ఏకవచనమున డు ము వు అను ప్రత్యయములలో నేదియు నంతమందులేని రూపమును స్త్రీసమమందు రని తాత్పర్యము. "అమహన్నపుంసకముల కదంతములకు ము వర్ణకంబగు" అను సూత్ర విధిచేత 'ము' ప్రత్యయము కలుగును. ము వర్ణకేతర ప్రత్య యములు పరమగునపుడు ముగాగమము కలుగును. ప్రస్తుత సూత్రమున బహువచనము ప్రసక్తము కావున ముగాగమ మునే గ్రహింపవలయును.

విశేష్యములు బహువచనములో నున్నను, విశేషణములు స్త్రీసమములు కాని మువర్ణకాంతములు కాని యైనప్పుడు బహుళముగా ఏకవచనమును బొందునని సూత్రార్థము. అనగా బహుత్వమునందగు ప్రత్యయము లోపము నొందు నని తాత్ప ర్యము.

'మాటలు' అనునది విశేష్యము; 'పెక్కులు' విశేష ణము. ఇది స్త్రీసమమగుటచేత బహుళముగా ఏకవచనమును బొందవచ్చును. అట్లయినచో 'మాటలు పెక్కేల' అని యగును. ఏకవచనము నొందనియెడల 'మాటలు పెక్కులేల' అనియే

యుండును. 'కులిశధారలు' అను విశేష్యంబునకు 'కుంఠితం బులు' అనునది విశేషణము. కావున ఏకవచనము వచ్చి 'కులిశ ధారల్కుంఠితంబయ్యె' అని కావచ్చును. లేదా బాహుళకము చేత నున్నదియున్నట్లుగా 'కులిశధారల్కుంఠితంబులయ్యె' అనియు నుండవచ్చును.

[ ము వర్ణకంబునకు మూముడి యౌనిం బూర్ణబిందుపూర్వక బువర్ణంబేని విభాషనగు - అను (బా-తత్సమ-42) సూత్రముచేత 'కుంఠితములు' అను రూపము కుంఠితమ్ములు, కుంఠితంబులు అని మరి రెండు విధములుగా మారవచ్చును. కావున పైనిచ్చిన యుదాహరణమునందలి 'కుంఠితంబులు' అనునది మువర్ణకాంత విశేషణమునకు లక్ష్యముగనే గ్రహింపవలయును. ]

'పదార్థములు' విశేష్యము: 'ఇష్టములు' విశేషణము. 'అగు' అను భవత్యర్థకముచేత రెండును గలుపబడుచున్నవి. ఇచ్చటి విశేషణము మువర్ణకాంతము కావున నేకవచనము వచ్చి 'ఇష్టమగు పదార్థములు' అని కాని. బహువచనములోనే యుండి 'ఇష్టములగు పదార్థములు' అని కానియగును.

**38.** **సంఖ్యాప్రయుక్త విశేషణ మేకాంతంబయి యమహద్వి శేష్యకమయ్యు, తదంశాంతంబయి మహదమహద్వి శేష్యకమయ్యు సమస్తంబు వ్యస్తంబు నగుచో విశే ష్యంబు క్రమంబుగ నుత్తరపదంబు నేకవచనాంతం బును, పూర్వపదంబు బహువచనాంతంబు నగు.**

**(ప్రౌ- శబ్ద - ౪)**

తదంశము = ఆ యొకటి యొక్క భాగము. అనఁగాఁ బాలిక ఖ్యోనగునది ॥ డెబ్బదియొక్క రథము - రథములు డెబ్బదియొక్కటి:

రెండున్నర మానిసి-మానుసులు రెండున్నర; రెండున్నర రూపాయ - రూపాయలు రెండున్నర మొ॥

వ్యాఖ్య - ఈసూత్రమును స్పష్టతకొఱకై నాలుగు సూత్రములుగా విడదీసికొనుట యవసరము. 1. సంఖ్యాప్రయుక్త విశేషణ మేకాంతంబయి యమహద్విశేష్యకమయ్యు సమస్తం బగుచో విశేష్యం బుత్తరపదంబు నేకవచనాంతంబు నగు. 2. సంఖ్యాప్రయుక్త విశేషణ మేకాంతంబయి యమహద్విశేష్యకమయ్యు వ్యస్తంబగుచో విశేష్యంబు పూర్వపదంబును బహువచనాంతంబు నగు. 3. సంఖ్యాప్రయుక్త విశేషణము తదంశాంతంబయి మహదమహద్విశేష్యకమయ్యు సమస్తం బగుచో విశేష్యం బుత్తరపదంబు నేకవచనాంతంబు నగు. 4. సంఖ్యాప్రయుక్త విశేషణము తదంశాంతంబయి మహదమహద్విశేష్యకమయ్యు వ్యస్తంబగుచో విశేష్యంబు పూర్వపదంబు బహువచనాంతంబు నగు.

సంఖ్యాప్రయుక్త విశేషణ మని యనగా సంఖ్యను దెలుపు విశేషణమని యర్థము - ఒకటి, రెండు మున్నగునవి యుదాహరణములు. ఏకాంతము = ఏక + అంతము; ఒకటి యను సంఖ్యావాచకము నంతమునందు గలది యని యర్థము - డెబ్బదియొకటి మున్నగునవి యుదాహరణములు. తదంశాంతము = తత్ + అంశ + అంతము; ఒకటియొక్క అంశము నంతమందు గలది యని యర్థము ,- రెండున్నర, మూడుంబాతిక మున్నగునవి యుదాహరణములు. సమస్తము అని యనగా సమాసరూపమున నున్నది యని యర్థము. వ్యస్తము అని యనగా విడిపదముగా వేఱుపడియున్నది యని యర్థము.,

డెబ్బదియొక్క రథము - ఇచ్చట 'డెబ్బదియొక్క' యనునది సంఖ్యాప్రయుక్త విశేషణము; ఏకాంతము; అమహద్విశేష్యకము; సమస్తము. కావున 'రథము' అను విశేష్య ముత్తర పదముగా నేకవచనాంతముగా ప్రయుక్తమయ్యెను.

రథములు డెబ్బదియొక్కటి - ఇచ్చట 'డెబ్బదియొక్కటి' అను సంఖ్యాప్రయుక్త విశేషణము ఏకాంతమై, అమహద్విశేష్యకమై వ్యస్తముగా ప్రయోగింపబడినది. కావున 'రథములు' అను విశేష్యము బహువచనాంతముగా, విశేషణమునకు పూర్వమందే యుపయోగింపబడినది.

రెండున్నర మానిసి - ఇచ్చట 'రెండున్నర' అన్నది సంఖ్యాప్రయుక్త విశేషణము; అంశాంతము; మహద్విశేష్యకము; సమస్తము. కావున 'మానిసి' యను విశేష్య ముత్తరపదముగా నేకవచనాంతముగా ప్రయుక్తమయ్యెను. 'రెండున్నర రూపాయ' అనుచోట 'రూపాయ' అన్నది అమహద్వాచకము అయినప్పటికిని ఉత్తరపదముగా నేకవచనాంతముగా ప్రయుక్తమైనది.

మానుసులు రెండున్నర - ఇచ్చట 'రెండున్నర' అను సంఖ్యా ప్రయుక్త విశేషణము తదంశాంతమై మహద్విశేష్యకమై వ్యస్తముగా ప్రయోగింపబడినది. కావున 'మానుసులు' అన్న విశేష్యము బహువచనాంతముగా విశేషణమునకు పూర్వమం దుపయుక్తమైనది. 'రూపాయలు' అను అమహద్వాచకము విశేష్యమైనపుడు సైతము పూర్వమందే బహువచనాంతముగనే ప్రయుక్త మగును. అపుడు 'రూపాయలు రెండున్నర' అన్నది ప్రయోగరూపము.

ఇది బాలవ్యాకరణమునందలి "విశేష్యంబునకుం బోలె విశేషణంబునకు లింగవిభక్తి వచనంబులగు" అను నియమమునకు సవరణముగా విశేషనియమమును చూపు నుద్దేశముతో ప్రసక్తమైనది. చిన్నయసూరి 'అగు' అని ప్రయోగించుట వలననే విశేషవిధుల కవకాశమను గల్పించియున్నాడు. తానే 'మాటలు పెక్కేల' మున్నగు లక్ష్యములను సాధించుటకై విశేషవిధిని చెప్పియున్నాడు. ఆయన చెప్పని విశేషణమును జెప్పుట ప్రస్తుత సూత్ర ప్రయోజనము.

[ప్రస్తుతసూత్రమున 'అగు' అను క్రియాపదముండుట సమంజసము కాదు. ఇట్లుండుటవలన డెబ్బదియొక్కరథములు, రెండున్నర మానిసులు, రెండున్నర రూపాయలు - మున్నగు లోకప్రసిద్ధ వ్యవహారము వారింపబడుచున్నది. కావున "వికల్పంబుగ నగు" అని చెప్పియుండిన సూత్రవిధి సమంజసమై యుండెడిది.]

**39.** **అయ్యది యేకాంతంబు మహద్విశేష్యకంబు సమస్తంబు కాదు; వ్యస్తంబగుచో బహువచనాంతంబ యగు.**

**(ప్రౌ - శబ్ద - ౫)**

పదునొక్కండ్రు రుదులు మొ॥ (చూ. సమాస. ౨౬సూ.)

వ్యాఖ్య - అయ్యది యనగా పూర్వసూత్రమునందు చెప్పికొనిన సంఖ్యాప్రయుక్త విశేషణము. ఏకాంతమైనపుడు, దానికి మహద్వాచకము విశేష్యమైనపుడు సమాసరూపము నొందదు; అనగా విశేషణ విశేష్యములు వ్యస్తములుగానే యుండవలయును. అట్టియెడల సంఖ్యాప్రయుక్త విశేషణము బహువచనాంతముగనే యుండవలయును.

[పూర్వసూత్రమున సూత్రకర్త సంఖ్యాప్రయుక్తవిశేషణ మేకాంత మై, అమహద్వాచకము విశేష్యముగా నున్నప్పుడు సమసించుననియు, అప్పుడు విశేష్య ముత్తరపదముగా నుం. యేకవచనాంతముగా నుండు ననియు దెలిపెను. ఎవరైనను భ్రాంతివలన మహద్వాచకము విశేష్యముగా నున్నప్పుడు కూడ సమాసము గావించుటకు, విశేష్యము నేకవచనాంతము గావించుటకు యత్నింతు రేమోయను శంకకలిగి సూత్రకర్త స్పష్టతకొరకై యీసూత్రమును చెప్పుచున్నాడు. నిజమున కీసూత్రము స్వయముగా సాధించునది యేమియు లేదు. అనావశ్యకము.]

'పదునొక్కండ్రు' అన్నది సంఖ్యాప్రయుక్త విశేషణము; ఏకాంతము. 'రుద్రులు' మహద్వాచకము; విశేష్యము. ప్రస్తుత సూత్రమునుబట్టి యివి సమసింపకుండ 'పదునొక్కండ్రు రుద్రులు' అని బహువచనాంతముగనే యుండవలయును. వ్యస్తముగా నున్నపుడు విశేషణమునకు ఏకత్వము కలుగ రాదని బహువచనాంతముగనే యుండవలయునని వ్యాకర్త జ్ఞాపనము చేయుచున్నాడు.

[బాలవ్యాకరణమునందు "అన్ని మొదలగు శబ్దంబు లాఱును, ద్విప్రభృతి సంఖ్యావాచకములును మహదర్థంబులు బహువచనాంతంబు లగు" అని కలదు. ప్రస్తుతసూత్రమునందలి యుత్తరాంశము దానికి పున రుక్తియే కాని మరొకటి కాదు.]

పదునొక్కండ్రు అను సమాసము 'పదియు నొక్కండ్రు' అను విధముగా 'యు'వర్ణ వ్యవహితముగా కనిపింపవచ్చును. రాబోవు సమాసపరిచ్ఛేదమునందలి విషయము నిచ్చటనే వ్యాకర్త సూచించుచున్నాడు.

**10. మహత్సమూహార్థకశబ్దం బమహత్కార్యయు క్తంబయ్యుఁ దద్విశేషణ క్రియలు మహత్కార్యయోగ్యంబులు విభాష నగు. (ప్రౌ - శబ్ద - ౧౭)**

ముని నికాయమెల్ల వివిధపుణ్యకథలు వినువేడ్క నతనిఁ బూజించిరి ॥భార. ఆది. ౧అ॥ గీర్వాణప్రభుఁడాదిగ। గీర్వాణగణాంబు కాలకేయులతోడన్। గర్వించి రణముచేసిర। ఖర్వపరాక్రములు కడిమిఁ గడు నుద్ధతులై ॥భార. అర. ౩అ॥ అయ్యిరువురు దెగలు పగఱుగారే తమలోన్॥ నిర్వ. ౩అ॥ పడనడుతురు గన్నని న్నుఁ బ్రమథగణంబుల్॥ నిర్వ. ౪అ॥ మొ.

విభాష ననుటచే - విషధరకుఱ ననంఖ్యము। నిషాద గణముండి ధారుణీప్రజకుఁ గడున్। విషమమును జేయు వారి నిమిషమున భక్షించి చను మమిత్రవిఘాతీ॥ భార. ఆది. ౨ అ॥ నెత్తమ్ము లేకొండ నెత్తమ్ములం దాడు విద్యాధరీకోటి విటులతోడ॥ స్వా. ౪ అ॥ ఇత్యాదు లూహ్యంబులు.

వ్యాఖ్య - మహత్తులయొక్క సమూహమును సూచించు శబ్దము అమహాద్వాచకమై ము వర్ణకాదులను గలిగి యున్నప్పటికిని, దానియొక్క విశేషణమును, క్రియయు విభాషగా మహత్కార్య యోగ్యము కావచ్చునని సూత్రార్థము.

మునినికాయము అనియనగా మునులయొక్క సమూహమని యర్థము. మునులు మహాద్వాచకము; నికాయము అమహాద్వాచకము. దీని విశేషణము కాని, క్రియ కాని అమహాద్వాచకమున నుండుట పూర్వ సిద్ధము. అప్పుడు 'ముని

నికాయము పూజించెను' అని రూపము సిద్ధించును. ప్రస్తుత సూత్రమువలన మహద్వాచకమగు 'మునులు' అను శబ్దమున కనుకూలముగా 'పూజించిరి' అను క్రియయుండుట కవకాశము కలుగుచున్నది. గీర్వాణగణంబు ... రణంబు చేసిరి- ఇక్కడకూడ గణము అమహద్వాచకము నేకవచనాంతము నైనప్పటికి 'గీర్వాణ' శబ్దమునుబట్టి మహద్వాచక బహువచనమునకు ననుకూలముగా 'చేసిరి' యను క్రియ వాడబడుచున్నది. తెగ యనగా పక్షము అని యర్థము. ఇది అమహత్తు. కాని పక్షమునందలి మనుష్యులనే యుద్దేశించి తదనుకూలముగా బహువచనాంతమై మహద్వాచకమైన 'పగఱు' అను విశేషణమే వాడబడుచున్నది; దాని కనుగుణముగానే 'కారు' అను క్రియాపదము నుపయుక్తమైనది. నడుతురు ... ప్రమథగణంబుల్ - ఇచ్చట గణంబులతో కాక ప్రమథులతో నన్వయించు మహద్వాచక బహుత్వ బోధక క్రియాపద ముపయుక్తమయ్యెను.

సూత్రమున నీకార్యమును విభాషగా విధించుటచేత మహత్కార్యము జరుగక, అమహత్కార్యము జరిగిన రూపములు నుండుట కవకాశము కలదు. నిషాదగణము... విషమమును జేయు - ఇచ్చట 'చేయును' అను క్రియాపదము ఏకవచనాంతమై యమహత్తగు 'గణము'తో నన్వయించుచున్నది. కాని యదే వాక్యమున 'నిషాదగణము'న కంతటికి బదులుగా సర్వనామము మహద్బోధకమై బహువచనాంతమై 'వారిన్' అని యుపయోగింపబడినది. ఆడు ... విద్యాధరీకోటి - అనుచోట 'కోటి'

యను సమూహార్థకముతో నన్వయించుచు 'ఆడు'నను క్రియా పదము ఏకవచనాంతమై యున్నది.

[చివరనున్న యుదాహరణము మహత్సమూహమునుగాక మహతీ సమూహమును తెలియజేయుచున్నది. ఈ ప్రయోగమును జూపుటనుబట్టి వ్యాకర్త యభిప్రాయమును మరొకవిధముగా తలపవలసి వచ్చుచున్నది. ఇచ్చట 'మహత్' అని యన్నప్పుడు కేవల మహద్వాచకములనే కాక మహతీవాచకములను గూడ భావించియుండునేమో! 'నరులు' అని యన్నప్పుడు నరులయొక్క నారులయొక్క సమూహమును గ్రహించినట్లే మహత్తులు అని యన్నప్పుడు మహద్వాచకములయొక్క, మహతీవాచకములయొక్క సమాహారమును గుర్తింపవలయును. కావున ప్రస్తుత సూత్రమునందు 'మహత్సమూహ...' 'మహత్కార్యయోగ్యంబులు' అను రెండుచోట్ల కూడ ఏకశేషమునే గ్రహింపవలయును. క్రియయు, విశేషణమును మహతీసమూహముతో నన్వయించునప్పుడు మహతీవాచకముతోను, మహత్సమూహముతో నన్వయించునప్పుడు మహద్వాచకముతోను అన్వయము నొందునని తాత్పర్యము.]

**41. మహద్విశేషణ సంఖ్యావాచకములకుం గొన్నియెడల నమహత్కార్యంబు చూపట్టెడి. (ప్రౌ - శబ్ద - ౧౦౪)**

ఇందుఁ బౌలోమ కాలకేయులను నసురు లఱువది వేలుందురు॥ భార. అర. ౪౫॥ జనవంద్యుఁడగు ధర్మతనయునిబంతి నిత్యంబు పసిఁడి పళ్ళెరంబులఁ గుడ్చు బ్రాహ్మణు లతిపుణ్యు లెనిమిదివేలు సమిద్ధమతులు, యతులు పదివేలు వారలకన దినంబు, నన్నపానంబులందు సహాయ నగుదు॥ భార. అర. ౫౫॥ కనకభూషణాలంకృతు లయిన పరిచారకులు నూఱువేలు॥ భార. అర. ౫౫॥ వారాకరంబులో వటపత్రశయనులౌ నబ్జనాభులు నూఱునైదుపదుల॥ కాశీ. ౬౫॥ మూఁడ ర్బుదములు సముద్యద్భుజాటోప విజయధౌరేయులు వీరభటులు ॥ జై.

ఆ॥ వేఁడివెలుంగులో లిఁ బదివేల సహస్రము లున్న భంగి నెవ్వాఁడు వెలుంగు నట్టి బుధవత్సలుఁ డేఁగె నదృశ్యమూ ర్తియై॥ భో॥ జ ఆఅ॥ (కొన్ని యెడల ననుటచే నూఱు నేఁబండ్రు లేక నూట యేఁబండ్రు అని యిట్లు మహత్త్వయుక్త రూపంబులుం గలవని యెఱుంగవలయును. కడపటి యుదాహరణముల యందలి సంఖ్యావాచకములు తత్సమములు గాన వాని కట్టిరూపములు మూఁడర్బుదముల సంఖ్యలవారు, పదివేల సహస్రముల సంఖ్యలవారు అని యేర్పడుచున్నవి.)

వ్యాఖ్య - మహద్వాచకములకు విశేషణములయిన సంఖ్యావాచకములకు అమహత్కార్యములును గొన్ని యెడల కలుగుచున్నవని సూత్రార్థము.

విశేష్యములకు వలెనే విశేషణములును లింగవిభక్తి వచనములను గలిగియుండవలయును. ఆనియమమునకు భిన్నముగా నుండు విశేషనియమముల వరుసలో ప్రస్తుతసూత్రముకూడ చేరును.

అసురు లఱువదివేలు - అనుచోట అసురు లను మహద్వాచకమునకు 'అఱువదివేలు' అన్నది విశేషణము: ఇది సంఖ్యావాచకము. ఇదియు మహత్తునే బోధించుచున్నది. కావున 'అఱువదివేగురు' అనికాని 'అఱువదివేవురు' అనికాని (ప్రౌ-శబ్ద-86, 91 సూత్రములు) కావలయును. అట్లుకాక 'అఱువదివేలు' అని అమహత్తుగానే యుండిపోయినది. ప్రస్తుతసూత్ర మాయవకాశమును గల్పించుచున్నది.

బ్రాహ్మణు లతిపుణ్యులెనిమిదివేలు సమిద్ధమతులు - ఎనిమిదివేలు అను సంఖ్యాప్రయుక్త విశేషణము మాత్రమే అమహ

ద్వాచకమై యున్నది. తక్కిన విశేషణములు మహద్వాచక ములే. ఇట్టివే పరిచారకులు నూఱువేలు; అబ్జనాభులు నూఱు నైదుపదులు మున్నగునవి.

తెలుగునందలి సంఖ్యావాచకములే కాక తత్సమములు కూడ పైరీతిగా అమహత్కార్యమును బొందవచ్చును. మూఁ డర్బుదములు...వీరభటులు - అనుచోట 'వీరభటులు' మహ ద్వాచకము. దీని విశేషణము 'మూడర్బుదములు' అమహద్వా చకముగనే యున్నది. వేఁడివెలుంగులు...పదివేలు సహస్ర ములు - ఇచ్చట వేఁడివెలుంగులు అని యనగా 'సూర్యులు' అని యర్థము. కావున మహద్వాచకము. దీని విశేషణమైన 'పదివేల సహస్రములు' అను సంఖ్యావాచకము అమహత్తుగనే యున్నది.

సూత్రమునందు ''కొన్ని యెడల'' నని యనుటచేత సంఖ్యాప్రయుక్త విశేషణములు మహద్విశేష్యకములైనప్పుడు మహత్కార్యము నొందియు నుండవచ్చును. అట్టియెడల అసురు లరువదివేవురు; బ్రాహ్మణు లెనిమిది వేవురు; పరిచారకులు నూఱువేగురు; అబ్జనాభులు నూఱునేఁబండ్రు మున్నగు విధ ముగా రూపసిద్ధి యుండును. సంఖ్యావాచకములు తత్సమము లైనపుడు మహదర్థబోధకై 'సంఖ్యలవారు' అని చేర్చి మూడ ర్బుదముల సంఖ్యలవారు; పదివేల సహస్రముల సంఖ్యలవారు - అను విధముగా నుపయోగింపవచ్చునని వ్యాకర్త కుండలీకృత వాక్యములందు సూచించెను.

[ తత్సమ సంఖ్యా వాచకములపై 'సంఖ్యలవారు' అని చేర్చుట నిత్యమైనట్లే ప్రౌఢవ్యాకర్త పద్ధతి కనిపించుచున్నది. పదివేల సహస్రే

ములవారు మున్నగు విధముగా కేవలము తచ్ఛబ్దము చేర్చియు మహ దర్థకముగా వాడుకొనుట కాక్షేపము లేదు.]

## 42. ఒకానొకచో నొకవిభక్తికి మఱియొక విభక్తియు నగు. (బా - ౨౧)

మైత్రుండు గృహమును వెడలెను - గృహమునుండి యని యర్థము. వాఁడు వాహనమును దిగెను - వాహనమునుండి యని యర్థము. వారు సుఖమున్నారు - సుఖముతో నని యర్థము॥ ఇత్యాదు లెఱుంగునది

వ్యాఖ్య : నిర్దిష్టములయిన కొన్నిచోట్ల ఒక విభక్తి కలుగవలసియుండగా, దానితోపాటు మఱియొక విభక్తియు కలుగుట కలదని సూత్రార్థము.

[ ఈవఱకే యొకే యర్థమున నొకటికంటె నెక్కువ విభక్తులు వచ్చిన తావులు చూచితిమి. చేతకు బదులుగా వలన వచ్చుట; తుల్యార్థమున తోడకు బదులుగా కు వర్ణకము వచ్చుట; ఉపయోగమున నాఖ్యాతకు తోడతో పాటు వలన వచ్చుట; సంప్రదానమున కొఱకు వర్ణకముతో పాటు కు వర్ణకము వచ్చుట; కంటె రావలసినచోట కు వర్ణకము వచ్చుట; షష్ఠి రావలసినచోట వలన వచ్చుట; యొక్కకు బదులుగా కు వర్ణకము వచ్చుట; లోపల వర్ణకమునకు బదులుగా అందు వచ్చుట ఇత్యాదులు॥ ఇవి కాక ప్రౌఢవ్యాకరణకారుడు చూపుచున్న విభక్తి వైలక్షణ్యములను కొన్నింటిని గమనించితిమి. సూరి యింకను గొన్నింటిని ప్రస్తుత సూత్రమున ప్రదర్శించుచున్నాడు. ]

మైత్రుండు గృహమును వెడలెను - ఇట విశ్లేషము గలదు. కావున 'వలన' అను ప్రత్యయముకలిగి, దానిపై 'ఉండి' శబ్ద మనుప్రయుక్తము కావలయును. అప్పుడు 'వలన'కు బదులుగా ద్వితీయ కలిగి 'గృహమునుండి' యని కాని, సప్తమి

కలుగగా 'గృహమున నుండి' యని కాని 'గృహము నందుండి' యని కాని యగును. అటుకాక 'గృహము'పై 'ను'వర్ణకము మాత్రమే చేరి 'గృహమును' అనియే యిచ్చట నున్నది. ఇది విశేషము. ఇట్టిదే 'వాహనము నుండి' అని యనుటకు బదులుగా నేర్పడిన 'వాహనమును' అను రూపముకూడ. ఇచ్చట ఈ రెండును వాక్యమునందు కర్మములుగా వ్యవహరించుటచేత "కర్మంబున ద్వితీయ యగు" అను విధిని బట్టి ద్వితీయా విభక్తి ప్రత్యయమగు నువర్ణకము చేరుచున్నది.

వారు సుఖ మున్నారు - ఇట సహార్థమున తోడ వర్ణకము రావలయును. అప్పుడు 'వారు సుఖముతోడ నున్నారు' అను రూపమేర్పడును. ప్రథమ వర్ణము శేషించినప్పుడు 'వారు సుఖముతో నున్నారు' అని యగును. కాని యిచ్చట తృతీయకు బదులుగా ప్రథమ వచ్చి 'సుఖమున్నారు' అని యగుట విశేషము.

**43.** జడంబు తృతీయా సప్తములకు ద్వితీయ బహుళంబుగా నగు. (బా - ౨౨)

రాముఁడు వాలినొక్క కోలం గూలనేసె - కోలతో నని యర్థము; లంకం గలకలంబు పుట్టె - లంక యందని యర్థము. బాహుళకంబుచే నిక్కార్యం బుదంతంబునకు బహుత్వమందె యగు. అర్జునుఁడు శత్రుసేనలను బాణంబులను రూపుమాపె - బాణంబులచే నని యర్థము; మీనంబు జలంబుల నుండు - జలంబులం దని యర్థము

వ్యాఖ్య - జడవాచకముమీది తృతీయావిభక్తికిని, సప్తమీ విభక్తికిని బదులుగా ద్వితీయావిభక్తి బహుళముగా నగునని సూత్రార్థము.

కోలతోఁ గూలనేసె - ఇచ్చట కరణము 'కోల'. కావున తృతీయావిభక్తియందలి 'తోడ' ప్రత్యయము వచ్చి 'కోలతోడ' అని యగును. ప్రస్తుత సూత్రము చేత తృతీయకు ద్వితీయా ప్రత్యయమగు 'ను' కలుగును. కలుగగా 'కోలను' అని యగును. అప్పుడు కోలను గూలనేసె - కోలఁ గూలనేసె - కోలం గూల నేసె ॥ అను విధముగా రూపము లగును.

లంక యందుఁ గలకలంబు పుట్టె - ఇచ్చటి సప్తమికి బదులుగా ద్వితీయ వచ్చి 'లంకను' అని యగును. తరువాత ద్రుత కార్యము జరిగి 'లంకం గలకలంబు పుట్టె' అని యగును.

సూత్రమున "బహుళము" అని యనుటచేత కొన్ని యెడల నప్రవృత్తియు నుండును. ఉదంత జడవాచకము యొక్క తృతీయాసప్తములకు బహువచనమునందు మాత్రమే ద్వితీయ యగును; ఏకవచనమునందు కాదు. 'సేనలను బాణంబులచే రూపుమాపె' నని యన్నప్పుడు కరణమగు 'బాణంబులు' తృతీయా విభక్తిని గలిగి యున్నది. జడవాచకము, ఉదంతము, బహువచనము - కావున ద్వితీయ వచ్చి 'బాణంబులను' అని యగును. ఇచ్చట 'బాణంబులు' అను బహువచనము కాక 'బాణంబు' అని యేకవచనము మాత్రమే యున్న యెడల 'బాణంబుచే' అని తృతీయాంతరూపమొక్కటియే యుండును. బహువచనమునందు కలిగినట్లు ద్వితీయాంతరూపము కలుగరాదు.

అట్లే 'జలంబులందు' అనుచోటి సప్తమికి ద్వితీయ కలిగి 'జలంబులను' అని యగును. జడవాచకము, ఉదంతము, బహువచనాంతము - అగుట వలన ద్వితీయ కలుగ వచ్చును. అప్పుడు 'జలంబులను' అని యగును.

**44. కొన్నియెడల నజడంబు తృతీయాసప్తములకును బహుత్వంబున ద్వితీయ చూపట్టెడి. (ప్రౌ - ౧౭)**

తృతీయకు - అతని దోర్మధ్యసరసి నోలాడుచున్న। ఘనతరస్తన చక్రవాకముల నలరు। నంబ నసురేంద్రుకూఁతు రింపారఁ గనియె॥ హరి. ఉ. ౭౫॥ సప్తమికి - బలిమిఁగొనిన ధనము పదివేల యొంటెలఁ, బెరిగి రాఁగ వైరికీకరుండు। వచ్చె నకులుఁడు ॥ భార. సభా. ౧౫॥ మనుజుల విప్రుండు (చూ. శబ్ద-౬౨ సూ. ఉ.)॥ భార. శాంతి. ౧౫॥ మొ.

వ్యాఖ్య - జడములు కానివానియొక్క తృతీయకును, సప్తమికిని బదులుగా ద్వితీయ కొన్నియెడల బహుత్వమునందు కలుగ వచ్చునని సూత్రార్థము.

బాలవ్యాకరణము జడముల యొక్క తృతీయాసప్తములకే ద్వితీయ యగుచున్నదని చెప్పి, అవియు ఉదంతములైనప్పుడు బహుత్వమునందే యగునని చెప్పెను. బాలవ్యాకరణమునుబట్టి వైకల్పికకార్యమును, అప్రవృత్తియు నగుచున్నవి. ప్రవృత్తికిని, అన్యత్వమునకు నుదాహరణము లందు లేవు. ప్రస్తుతసూత్రము అన్యత్వమున కుదాహరణములను చూపుచున్నది. అనగా ఇది బాలవ్యాకరణమునకు వివరణమని యర్థము.

ఘనతరస్తన చక్రవాకములను - అని యనగా 'స్తనచక్రవాకములతో'నని యర్థము. తృతీయకు బదులుగా 'స్తనచక్రవాకములను' అని ద్వితీయ వచ్చుట కిది యుదాహరణము.

[స్తనచక్రవాకములు - అని యన్నప్పుడు స్తనములు జడములుగాను చక్రవాకములు అజడములుగాను పరిగణింపబడును. దీనిని కర్మధార

యము గా గ్రహించినపుడు 'స్తనము లనునటువంటి చక్రవాకములు' అని విగ్రహవాక్యము. అప్పుడు చక్రవాకములతోనే 'అలరు' అను క్రియకు అన్వయము కలుగును. అటుకాక ఉపమిత సమాసముగా గ్రహించినయెడల 'చక్రవాకములవంటి స్తనములు' అనియే విగ్రహవాక్యము. అప్పుడు 'స్తనములు' అను జడవాచకముతోనే క్రియాపద మన్వయము నొందును. ఈయర్థము ను చెప్పికొనినయెడల జడము తృతీయకు వచ్చిన ద్వితీయగానే దీనిని గ్రహింప వచ్చును. అప్పుడు ప్రస్తుత సూత్రమున కిది యుదాహరణము కాదు.]

ఒంటెలన్ బెరిగి - అని యనగా 'ఒంటెలయందు పెరిగి' యని యర్థము. ఇచ్చట ఒంటె జంతువాచకము; కావున అజడము. దీనికి బహుత్వమునందు సప్తమికి బదులుగా ద్వితీయ కలుగుటచేత 'ఒంటెలను' అను రూప మేర్పడినది. 'ఒంటెలపైని' అనియే యర్థము.

మనుజుల విప్రుండు - అనగా 'మనుజులయందు విప్రుండు' అనియే యర్థము. ఇది నిర్ధారణమునందయిన సప్తమి. మనుజులు అనునది అజడము; బహుత్వమునందున్నది. కావున ప్రస్తుతసూత్రవిధిని బట్టి సప్తమికి ద్వితీయ కలుగగా 'మనుజులను'. అని యేర్పడెను. ఈయుదాహరణముగల పూర్తిపద్య మింతకు ముందు శబ్దపరిచ్ఛేదము 62వ సూత్రముకడ నుదాహరింపబడిన దన్న విషయమును సూచనచేయుచున్నాడు. పూర్తిపద్యమును గ్రహించినయెడల అన్వయము సుబోధమగునని వ్యాకర్త యభిప్రాయము.

బాలవ్యాకరణము బహుళశబ్దముచే వీని కవకాశము గల్గించినప్పటికిని, ఉదాహరింపకుండుటచేత, ప్రౌఢవ్యాకరణము

ప్రయోగముల నుదాహరించి ప్రౌఢిని ప్రదర్శించుట సముచిత ముగా నున్నది.

**45. ఉదంతజడంబు తృతీయకు నవర్ణకం బగు. (బా - ౨౬)**

రాముఁ డొక్క బాణంబున వాలిం గూలనేసె॥ బాణముచే నని యర్థము.

వ్యాఖ్య - ఉదంతజడము అని యనగా హ్రస్వమైన ఉకారము అంతమందు గల జడవాచక మని యర్థము. ఉదంతజడము యొక్క తృతీయావిభక్తికి బదులుగా సప్తమీ ప్రత్యయమైన నవర్ణకము వచ్చునని యర్థము. తత్సమ పరిచ్ఛేదము పదునొకండవ సూత్రమున "డు ము వు న లేక వచనంబులు" అని యనుటచేత, ప్రస్తుతసూత్రమును బట్టి వచ్చెడి నవర్ణకము కూడ ఏకత్వమునందే వచ్చునని గ్రహించుట యవసరను.

బాణంబుచే వాలిం గూలనేసె - ఇచ్చట బాణంబు కరణము; ఉదంతము; ఏకవచనము. కావున నవర్ణకము కలిగి 'బాణంబున', అనియు కావచ్చును. బహువచనమున నైనచో పూర్వ సూత్రముచే 'బాణంబులను' అను విధముగా ద్వితీయాంతత్వము కలుగవచ్చును.

**46. ఒక్కచో నుదంతం బగు నజడంబు తృతీయకును నవర్ణకంబు గానంబడియెడి. • (ప్రౌ - ౧౬)**

ఏపునఁ గిట్టి యేనుఁగున నేనుఁగు వైచుచు వాజి వాజిచేఁ రూపడఁగంగ మోదుచును॥ రా. యు. కాం॥ (దీనికిఁ బ్రయోగాంతరంబు మృగ్యంబు.)

వ్యాఖ్య - ఇది బాలవ్యాకరణ సూత్రమునకు సవరణ ముగా ప్రతిపాదింపబడినది. ఉదంతజడము తృతీయకు నవర్ణకము బాలవ్యాకరణమునుబట్టి వచ్చుచుండగా ఉదంతమైన అజడము నకును నవర్ణకము తృతీయాస్థానమున నగుచున్నదని ప్రౌఢవ్యా కరణము ప్రయోగమును చూపుచున్నది.

ఏనుఁగున నేనుఁగు వైచుచు - అని యనగా 'ఏనుగు చేత నేనుగును పడగొట్టుచు' నని యర్థము. 'ఏనుగునన్' అని యనగా 'ఏనుగునందు' అని సప్తమ్యర్థక స్ఫురణ రావచ్చును. కాని తరువాత'వాజి వాజిచే' నన్నదానిని బట్టి యిక్కడ సైతము తృతీయయే యుండెనని నిర్ధారించుకొనక తప్పదు. కావున 'ఏనుఁగుచేత' అని యనుటకు బదులుగా 'ఏనుగునన్' అని యయ్యెననియే తలప వలయును.

'ఏనుఁగు' అమహద్వాచకమే రైనను, జడము కాదు. జడమునకు మాత్రమే వచ్చునని చెప్పిన కార్యము అజడమునకును వచ్చుచుండుటచేత దీనిని ప్రౌఢవ్యాకరణము వేరుగా పేర్కొ నుట యవసరమయ్యెను.

[దీనికి మరొక ప్రయోగము వ్యాకర్తకు లభింపలేదు. కేవల మొకే యొక ప్రయోగమునుబట్టి యొకనిర్ణయమును జేయుట సమంజసముగా కని పింపదు. అది యాకవికి సమ్మతమైనపుడు తాను వ్రాసిన కావ్యములలో మరెక్కడను ప్రవేశింపకుండ నుండదు. కావున, కవి ప్రమాదముననో, లేఖక ప్రమాదముననో అట్టి ప్రయోగము చొరబడి యుండుననుట యభ్యంతరము కారాదు.]

**47. జడంబు ద్వితీయకుం బ్రథమ బహుళంబుగా నగు.**

**(బా - ౨౪)**

వాఁడు పూవులు దెచ్చె - వాఁడు పూవులను దెచ్చె; ఆకె సొమ్ములు దాల్చె - ఆకె సొమ్ములను దాల్చె; వాఁడిల్లు వెడలె - వాఁడింటిని వెడలె॥ బాహుళకముచేఁ దృతీయాసప్తములకు విధించిన ద్వితీయకుం బ్రథమ రాదు.

వ్యాఖ్య - జడము యొక్క ద్వితీయావిభక్తికి బదులుగా ప్రథమావిభక్తి బహుళముగా నగునని సూత్రార్థము.

వాఁడు పూవులను దెచ్చె - ఈ వాక్యమునందు కర్మము 'పూవులు' కావున ద్వితీయావిభక్తి యగు ను వర్ణకము వచ్చి 'పూవులను' అని యయ్యెను. ప్రస్తుతసూత్రమువలన ద్వితీయకు ప్రథమ కలుగవచ్చును. కావున 'వాఁడు పూవులు దెచ్చె' అనియు నుండవచ్చును.

'సొమ్ములు' అనునది వాక్యమున కర్మమైనపుడు 'సొమ్ములను' అని యగును. కాని కర్మము జడవాచకమగుట వలన ద్వితీయకు ప్రథమయై 'సొమ్ములు దాల్చె' అనువిధముగను నుండవచ్చును.

'ఇల్లు' అను కర్మమునకు ద్వితీయావిభక్తి కలిగి 'ఇంటిని' అని యగును. 'ఇల్లు' జడవాచక మగుటవలన, ప్రస్తుతసూత్రము చేత ద్వితీయకు ప్రథమయై 'వాఁడిల్లు వెడలెను' అనియు కావచ్చును.

సూత్రమున 'బహుళము' అని నిబంధించుటచేత, ఈ మార్పు సహజమైన ద్వితీయావిభక్తికి, అనగా కర్మార్థమున వచ్చిన ద్వితీయావిభక్తికి మాత్రమే కలుగును. అంతేకాని తృతీయాసప్తములకు బదులుగా వచ్చిన ద్వితీయకు (బా-22) రాదు. కావున అట్టియెడల ప్రథమావిభక్తి కలుగు నవకాశము లేదని సూరి జ్ఞాపనము చేయుచున్నాడు.

**48. కొన్నియెడల నజడంబు ద్వితీయకును ప్రథమ కానం బడియెడి. (ప్రౌ - ౧౯)**

అనిలజవంబునం బఱచు నమ్మదనాగ మెదిర్చి క్రమ్మఱిం చిన పరిశాఁడువోలెఁ గురుసింహ వరూథము నిట్లు క్రమ్మఱించునె ॥భార. ఆది. ౪౫॥ తన వారణేంద్ర మక్కురుకుల వీరు మీఁద నెసకొల్పిన॥ భార. ఆర. ౬౫॥ తత్క్రతుహయోత్తమ మొక్కెడఁ గట్టఁబంపుచున్॥ శై. ౫౫॥ మొ.

వ్యా - ఇది బాలవ్యాకరణసూత్రమునకు సవరణము గా ప్రౌఢవ్యాకరణముచేత ప్రతిపాదింపబడుచున్నది. బాల వ్యాకరణము జడము ద్వితీయకు మాత్రమే ప్రథమ కావచ్చు నని తెల్పగా, ప్రౌఢవ్యాకరణము అజడముయొక్క ద్వితీయ కును ప్రథమ యగుచున్నదని నిర్ణయించి, తదనుకూలముగా ప్రయోగములను చూపుచున్నది.

మదనాగము నెదిర్చి - అనుచోట 'మదనాగము' అను నది కర్మము; అమహద్వాచకము; అజడము. కావున నువర్ణకము కలిగి 'మదనాగమును' అనియే యుండవలయును. కాని, దీనికి భిన్నముగా 'ను' వర్ణకము లోపించుచున్నది. 'మదనాగ మెదిర్చి'

యను విధముగా ప్రయోగింపబడినది. 'వారణేంద్రమును' అనుటకు 'వారణేంద్రము' అనియు 'హయోత్తమమును' అనుటకు 'హయోత్తమము' అనియు నుండుట యిట్టివే.

[ప్రస్తుతగ్రంథమునందున్న సూత్రక్రమము ననుసరించి 43వ సూత్రము నుండి 48వ సూత్రమువరకు బాలవ్యాకరణము 'జడము' అనితెల్పు యొక కార్యము విధించుటయు, ప్రౌఢవ్యాకరణము 'అజడమునకును' ఆకార్య మగునని నవరించుటయు జరుగుచున్నది. 'అమహత్తునకు' అని యన్నచో సర్వమును సంగతమై యుండెడిది. 'మనుజుల విప్రుండు' మున్నగు విధముగా నిర్ధారణ సప్తమికి ద్వితీయ కలుగు విషయమును మాత్రమే వేరుగా చెప్పి కొనుట యవసర మయ్యెడిది.]

## 49. ఒక్కొకచో జడంబు సప్తమికిం బ్రథమయు నగు. (ప్రౌ - ౨౦)

వాహీకఖునాఁగఁ బరఁగు తీర్థమాడి మేధా సమన్వితు లగుదురు॥ భార. అర. ౨ఆ॥ వ్రతములు లేనివారు నుపవాసపరాఙ్ముఖులైనవారు దుర్మతులు విహీనశౌచులుఁ గ్రమంబునఁ దీర్థము లాడ నోపరు॥ భార. అర. ౨ఆ॥ ఉర్విఁగల్గు తీర్థంబులెల్లను నేనాడుచు॥ హరి. పూ. ౪ఆ॥ ఎలుకునన్ను నులక రేసిన శరములు౹ నెలఁకులాడి॥ భార. అర. ౧ఆ॥ పొరిఁబొరి మోము బాష్పజలపూరము గ్రమ్మఁగ నూర్ధ్వబాహుఁడై॥ భార. శల్య. ౧ఆ॥ ఆవమిడినఁ బగిలిపోవుటయు॥ భార. స్త్రీ. ౧ఆ॥ ముట్టి కందముల్ వడిఁ గత్తి పెట్టి పెట్టి॥ హరి. పూ. ౬ఆ॥ ఖావంబుల్ భయముజ్జగించి చొరుఁడీ శవ్యాద్రిచాటందఱున్॥ హరి॥ పూ. ౫ఆ॥ శనుగొంటిం బరమేష్ఠిఁదొట్టి సురసంఘం బేకతంబుండఁగన్॥ హరి. పూ. ౪ఆ॥ లీలఁ బేరోలగం బున్నవిలవర్గు॥ ఉ, హరి. ౮ఆ॥ శార్ఙ్గ గుణాగాఢరతంబు పెఠంఘుబిండఁగాన్॥ విశ్వ. ౩ఆ॥ అదియున్ మేఘుచ్చి॥

రా. ఆర. ౯౦॥ జనయిత్రి చిచ్చులికిన, జై. ౮ఆ॥ పంకము గొరిజ దిగఁబడఁ బఱవలేవు। మన్నులివ్వేళ రేఁగటిమన్నులందు॥ స్వా. ౪ఆ॥ మొ.

పఠాంతరమునఁ దీర్థమందాడి ॥ మొ. ఇట్టి ప్రయోగములచేత 'అన్యస్యాః క్వచిద్భవేచ్ఛాన్యా' అను శబ్దశాసనుల సూత్రము సార్థక మగుచున్నది

వ్యాఖ్య - జడవాచకముమీది సప్తమీవిభక్తికి బదులుగా కొన్నియెడల ప్రథమావిభక్తి వచ్చుచున్నదని సూత్రార్థము.

తీర్థమునందు + ఆడి - అని యనుటకు బదులుగా తీర్థము + ఆడి - తీర్థమాడి యని ప్రయోగములందు కనబడు చున్నది. కావున 'తీర్థము' అను శబ్దముమీది 'అందు' అను సప్తమీ విభక్తిని తొలగించి ప్రథమావిభక్తియయ్యెను. బహువచనము నందును ఇట్టికార్యము కలదని యనుటకు నిదర్శనముగా తీర్థము లందు + ఆడనోపరు - అని యనుటకు బదులుగా వచ్చిన తీర్థ ములు + ఆడనోపరు = తీర్థములాడనోపరు అను ప్రయోగమును వ్యాకర్త చూపుచున్నాడు. ఈరెండింటికి నడుమ సంబంధి పదము చేరి వ్యవధానమును గలిగించునప్పుడు సైతము పైవిధముగు మార్పు కలుగవచ్చుననుటకు నిదర్శనముగా తీర్థములందు + ఎల్లన్ + నేను + ఆడుచు' అనురీతిని నుండవలసినది ప్రథమా విభక్తినొంది తీర్థములు + ఎల్లను + నేను + ఆడుచు = తీర్థము లెల్లను నేనాడుచు - అను విధముగా నయ్యెను. ఇచ్చట ఎల్లను, నేను - అనురెండు పదములు వ్యవధానమును గలిగించుచున్నవి.

[చిన్నయసూరి క్రియాపరిచ్ఛేదమునందు శబ్దపల్లవములను గూర్చి చెప్పియున్నాడు, అచ్చట ధాతువుపైని ధాతువుచేరి విలక్షణార్థాభిదాయు

ళయ్యెడివానినే సూరిచెప్పెను. ధాతువుపైని ధాతువు చేరినట్లే విశేష్యము పైని కూడ ధాతువు చేరి విలక్షణార్థము నీయవచ్చును. వానిని గూడ శబ్ద పల్లవములని యందురు. 'తీర్థమాడు' మున్నగువానిని శబ్దపల్లవము లని యనుట కవకాశము కలదు, కాని 'తీర్థములాడు' మున్నగు బహువచన రూపములవలనను, అన్యపదవ్యవధానముకల ప్రయోగముల వలనను, వానిని శబ్దపల్లవముల శ్రేణిలో చేర్చుటకువీలులేక పోవుచున్నది. ప్రౌఢ వ్యాకరణకారుడు ప్రదర్శించిన ప్రయోగవైవిధ్యము ప్రయోజనరమ ణీయము.]

నెఱకులయందాడి - నెఱకులాడి; మోమునందు... గ్రమ్మఁగ - మోము...గ్రమ్మఁగ; అవమునందిడిన - అవమిడిన; కందములందు వడి - కందముల్ వడి; భావంబులందు భయము - భావంబుల్ భయము; ఏకతంబందుండఁగా - ఏకతం బుండఁగా; పేరోలగంబందున్న - పేరోలగంబున్న; నభంబందు నిండఁగాన్ - నభంబు నిండఁగాన్; మేనునం దుచ్చి - మేనుచ్చి; చిచ్చునం దుఱికిన - చిచ్చుఱికిన; పంకమునందు... దిగఁబడ - పంకము... దిగఁబడ॥ అనునవి తరువాతి ప్రయోగములందు కలిగినమార్పులు.

ప్రయోగముల నన్నింటిని బరిశీలింపగా ఉదంతములైన వానిమీది సప్తమికి మాత్రమే ప్రథమ యగుచున్నట్లు తోచు చున్నది. ఏకవచన బహువచనములు రెండింటియందు నీకార్యము జరుగుట కవకాశము కలదు.

'ఒకొక్కచో' 'అని సూత్రమునందు నిబద్ధమై యుండుట వలన ప్రయోగవైరళ్యము సూచింపబడుచున్నది. కావున ప్రథమ రాని పక్షమున 'తీర్థమందాడి' మున్నగు విధముగా సప్తమితోడి రూపములే యగును.

అంధ్రశబ్ద చింతామణి 'అన్యస్యాః క్వచిద్భవేచ్చాన్యా' అనిసూత్రించినది. ఒక విభక్తికి బదులుగా ఒకొ్కకచోట మరొక విభక్తియగునని యర్థము. ప్రస్తుతప్రయోగములచేత, ఆసూత్ర మునకు సార్థకత్వము కలుగుచున్నదని సీతారామాచార్యులు వివరించెను. ఇట్టి ప్రయోగము లుండుట వలననే శబ్దశాసనులు అట్లు సూత్రింపవలసి వచ్చెనన్నది ఆయన తాత్పర్యము.

[పై సంస్కృత సూత్రమునకు అనువాదమే యనదగినట్లు "ఒకా నొకచో నొక విభక్తికి మఱియొకవిభక్తియు నగు" అనిసూరి (బా - 21) సూత్రించెను. కావున ప్రస్తుతప్రయోగము లన్నియు బాలవ్యాకరణ సూత్రముచేతనే గతార్థము లగుచున్నవి. కావున నిది క్రొత్తవిషయము కాదు. దీనిని సవరణమని కాని, పూరణమని కాని యనుటకు వీలుకాదు. కాని, ఆసూత్రముకడ సూరి పంచమికిని, తృతీయకును ప్రథమవచ్చిన రూపములనుచూపి, 'యిత్యాదు లెఱుంగునది' అని తెల్పెను. కావున ప్రస్తుత ప్రయోగములు 'ఇత్యాదులు' అను ఆదిశబ్దముచే గ్రహింపదగినవిగా నున్నవి. కావున బాలవ్యాకరణమున కనుకూలముగానే ప్రౌఢవ్యాకరణము మరికొన్ని ప్రయోగముల నదనముగాచూపి స్పష్టతకు సహకరించుచున్న దనుట సమంజసము.]

**50.** కాలాధ్వములకుం బ్రాయికంబుగాఁ బ్రథమ యగు.

(బా - ౧౩)

వాఁడు నిన్నవచ్చె - వీఁడు నేఁడువోయె - మాపు నిలువుము- రేపు పొమ్ము - వారు క్రోశము నడచిరి - సీతాముడ వోయిరి.

వ్యాఖ్య - కాల + అధ్వములు = కాలాధ్వములు. కాలమనగా సమయమని యర్థము. అధ్వమనగా మార్గమని యర్థము. ఇచ్చట అధ్వమును దూరమున కుపలక్షకముగా

గ్రహింపవలయును. ప్రాయికముగా అని యనగా తఱుచుగా నని యర్థము.

కాలమును దూరమును చెప్పవలసి వచ్చినప్పుడు ఆయా వాచకములకు తరుచుగా ప్రథమావిభక్తి యగునని సూత్రార్థము.

వాఁడు నిన్నవచ్చె - ఇచ్చట 'నిన్న' యన్నది కాలవాచకము. కావున ప్రథమావిభక్తి యందుండును.

[డు, ము, వు - అను ప్రత్యయములు కనిపింపకపోయినను, మఱియే ప్రత్యయముగాని లేనప్పుడు ప్రథమావిభక్తిలో నున్నట్లే పరిగణింప వలయును. పెక్కు తెలుగు శబ్దములు స్త్రీసమములు. కావున ప్రథమావిభక్తి యందగు ఏకవచన ప్రత్యయములు చేరి లోపించినట్లు భావించుట వ్యాకరణ సంప్రదాయము.]

అట్లే నేఁడు, మాపు, ఱేపు - అనునవి కాలవాచకములు. కావున ప్రథమా విభక్త్యంతములుగానే ప్రయోగింపబడును.

క్రోశము, ఆమడ - యనునవి అధ్వవాచకములు; ఇవి దూరమును దెలుపును. కావున వీనినిగూడ ప్రథమావిభక్త్యంతములుగానే వాడుదురు.

సూత్రమునందు 'ప్రాయికముగా' నని యనుటచేత నిన్నను, మొన్నను; ఊరికి, పొలమునకు; మాపటికి, ఱేపటికి - మున్నగు రూపములుగూడ నుండుట కాక్షేపము లేదు. కాని యిట్టి వాడుక చాల కొలదిగా నుండునన్న సూచన గమనార్హము.

ఆంధ్రశబ్ద చింతామణి 'అన్యస్యాః క్వచిద్భవేచ్చాన్యా' అనిసూత్రించినది. ఒక విభక్తికి బదులుగా ఒక్కొకచోట మరొక విభక్తియగునని యర్థము. ప్రస్తుతప్రయోగములచేత, ఆసూత్రమునకు సార్థకత్వము కలుగుచున్నదని సీతారామాచార్యులు వివరించెను. ఇట్టి ప్రయోగము లుండుట వలననే శబ్దశాసనులు అట్లు సూత్రింపవలసి వచ్చెనన్నది ఆయన తాత్పర్యము.

[పై సంస్కృత సూత్రమునకు అనువాదమే యనదగినట్లు "ఒకానొకచో నొక విభక్తికి మఱియొకవిభక్తియు నగు" అనిసూరి (బా - 21) సూత్రించెను. కావున ప్రస్తుతప్రయోగము లన్నియు బాలవ్యాకరణ సూత్రముచేతనే గతార్థము లగుచున్నవి. కావున నిది క్రొత్తవిషయము కాదు. దీనిని సవరణమని కాని, పూరణమని కాని యనుటకు వీలుకాదు. కాని, ఆసూత్రముకడ సూరి పంచమికిని, తృతీయకును ప్రథమవచ్చిన రూపములనుచూపి, 'యిత్యాదు లెఱుంగునది' అని తెల్పెను. కావున ప్రస్తుత ప్రయోగములు 'ఇత్యాదులు' అను ఆదిశబ్దముచే గ్రహింపదగినవిగా నున్నవి. కావున బాలవ్యాకరణమున కనుకూలముగానే ప్రౌఢవ్యాకరణము మరికొన్ని ప్రయోగముల నదనముగాచూపి స్పష్టతకు సహకరించుచున్నదనుట సమంజసము.]

**50.** కాలాధ్వములకుం బ్రాయికంబుగా బ్రథమ యగు.

(బా - ౧౫)

వాఁడు నిన్నవచ్చె - వీఁడు నేఁడుపోయె - మాపు నిలువుము - రేపు పొమ్ము - వారు క్రోశము నడచిరి - వీరామడ వోయిరి.

వ్యాఖ్య - కాల + అధ్వములు = కాలాధ్వములు. కాలమనగా సమయమని యర్థము. అధ్వమనగా మార్గమని యర్థము. ఇచ్చట అధ్వమును దూరమున ' కుపలక్షకముగా

గ్రహింపవలయును. ప్రాయికముగా అని యనగా తఱుచుగా నని యర్థము.

కాలమును దూరమును చెప్పవలసి వచ్చినప్పుడు ఆయా వాచకములకు తరుచుగా ప్రథమావిభక్తి యగునని సూత్రార్థము.

వాఁడు నిన్నవచ్చె - ఇచ్చట 'నిన్న' యన్నది కాలవాచకము. కావున ప్రథమావిభక్తి యందుండును.

[డు, ము, వు - అను ప్రత్యయములు కనిపింపకపోయినను, మఱియే ప్రత్యయముగాని లేనప్పుడు ప్రథమావిభక్తిలో నున్నట్లే పరిగణింప వలయును. పెక్కు తెలుగు శబ్దములు స్త్రీసమములు. కావున ప్రథమావిభక్తి యందగు ఏకవచన ప్రత్యయములు చేరి లోపించినట్లు భావించుట వ్యాకరణ సంప్రదాయము.]

అట్లే నేఁడు, మాపు, ఱేపు - అనునవి కాలవాచకములు. కావున ప్రథమా విభక్త్యంతములుగానే ప్రయోగింపబడును.

క్రోశము, ఆమడ - యనునవి అధ్వవాచకములు; ఇవి దూరమును దెలుపును. కావున వీనినిగూడ ప్రథమావిభక్త్యంతములుగానే వాడుదురు.

సూత్రమునందు 'ప్రాయికముగా' నని యనుటచేత నిన్నను, మొన్నను; ఊరికి, పొలమునకు; మాపటికి, ఱేపటికి - మున్నగు రూపములుగూడ నుండుట కాక్షేపము లేదు. కాని యిట్టి వాడుక చాల కొలదిగా నుండునన్న సూచన గమనార్హము.

**51. సర్వనామ సంఖ్యాభిధాన తద్విశేష్యంబులయం దెయ్యది ముందు ప్రయోగింపంబడు దాని ద్వితీయాదులకుం బ్రథమ బహుళంబుగా నగు. (బా - ౨౬)**

అన్ని గుఱ్ఱములకు - అన్నింటికి గుఱ్ఱములకు; గుఱ్ఱము లన్నింటికి - గుఱ్ఱముల కన్నింటికి సాహిణులు ముప్వురు॥ రెండు గుఱ్ఱములకు - రెండింటికి గుఱ్ఱములకు; గుఱ్ఱములు రెండింటికి - గుఱ్ఱములకు రెండింటికి సాహిణులు నలుగురు ॥ లతగుఱ్ఱములకు - లతకు గుఱ్ఱములకు, గుఱ్ఱములు లతకు - గుఱ్ఱములకు లతకు రవుతులు లత॥ ఇత్యాదు లెఱుంగునది

వ్యాఖ్య - సర్వనామముకాని, సంఖ్యావాచకముకాని విశేషణముగా నున్నప్పుడు విశేషణ విశేష్యములలో ఏదిముందు ప్రయోగింపబడునో దాని ద్వితీయాది విభక్తులకు బదులుగా ప్రథమావిభక్తి బహుళముగా నగు నని సూత్రార్థము. ఈవిధి విశేషణ విశేష్యములు వ్యస్తములై నప్పుడు మాత్రమే వ్యవహరించును; సమాసమైనప్పుడు వ్యవహరింపదు.

అన్నింటికి గుఱ్ఱములకు - ఇచ్చట గుఱ్ఱములకు అనునది విశేష్యము; బహువచనము; షష్ఠీవిభక్త్యంతము. కావున గడచిన (బా - 19) సూత్రమునుబట్టి "విశేష్యంబునకుం బోలె విశేషణంబునకు లింగ విభక్తి వచనంబులగు". అన్ని యనునది విశేషణము. షష్ఠీప్రత్యయమును పొంది 'అన్నింటికి' అని యైనది. ప్రస్తుత సూత్రమునుబట్టి పూర్వము ప్రయుక్తమైన సర్వనామవిశేషణమునకు ప్రథమ కలుగ వచ్చును. కావున 'అన్ని గుఱ్ఱములకు' అను రూపముకూడ నుండవచ్చును. 'గుఱ్ఱములకు' అను విశేష్యమే

ముందు ప్రయుక్తమైనపుడు విశేష్యమునకే ప్రథమావిభక్తి యగును. అప్పుడు 'గుఱ్ఱములన్నింటికి' అను రూపమగును. ఈవిధి బహుళమగుటచేత ప్రథమరాని చోట్ల 'గుఱ్ఱముల కన్నింటికి' అనియే రూపము కలుగును.

అట్లే 'రెండింటికి' అను సంఖ్యావాచక విశేషణము ముందుగా ప్రయుక్తమైన యెడల 'రెండుగుఱ్ఱములకు' అని కావచ్చును. అట్లుకాక 'గుఱ్ఱములకు' అను విశేష్యమే ముందు ప్రయోగింపబడిన యెడల దానికే ప్రథమ యగును. విశేషణము షష్ఠ్యంతముగనే యుండును. అప్పుడు 'గుఱ్ఱములు రెండింటికి' అను రూపము వచ్చును. బహుళవిధి యగుటచేత 'గుఱ్ఱములకు రెండింటికి' అనియు నుండవచ్చును. తరువాతి యుదాహరణము నందు కూడ విశేషణము సంఖ్యావాచక మగుటవలన, పూర్వము ప్రయుక్తమైన యెడల బహుళముగా ప్రథమను పొందును; అనంతరమందు ప్రయుక్తమైన యెడల, తత్పూర్వమందున్న విశేష్యము బహుళముగా ప్రథమావిభక్తిని పొందును. ఇక్కడి సంఖ్యావాచకము తత్సమమనుట గమనార్హము. వ్యాకర్త ఆచ్ఛికములకును, తత్సమములకును గూడ ఈపరిణామము వచ్చునని సూచించుటకై సంఖ్యాభిధానమునకు రెండు లక్ష్యములను చూపెను. సర్వనామము కేవల మాచ్ఛికమునకే సంబంధించునదగుటచేత ఒకే లక్ష్యమును చూపెను.

[సర్వనామములలోనే సంఖ్యావాచకములుకూడ అంతర్భవించును. అట్టి యెడల వేరుగా చెప్పుటె యనవసర మనిపించును. కాని సర్వనామములలో ఒకటి, రెండు మున్నగు నాచ్ఛికములే చేరును. కాని లక్ష, కోటి మున్నగు తత్సమములు చేరవు. వానిని గూడ చేర్చుకొనుటకై పృథక్పరిగణన మావశ్యకమయ్యెను.]

'ద్వితీయాదులకు' అని సూత్రమునందు ప్రయోగించినను సూరి షష్ఠీప్రత్యయముతోడి రూపములనే యుదాహరించెను. తక్కినవాని నిట్లు గుర్తింపవచ్చును. రెండింటిని గుఱ్ఱములను - రెండు గుఱ్ఱములను; గుఱ్ఱములను రెండింటిని - గుఱ్ఱములు రెండింటిని॥ రెండింటితో గుఱ్ఱములతో - రెండు గుఱ్ఱములతో: గుఱ్ఱములతో రెండింటితో - గుఱ్ఱములు రెండింటితో॥ మున్నగునవి.

గ్రంథమునందు అమహత్తులు మాత్రమే లక్ష్యములుగా చూపబడినవి. ఇతరముల కీవిధి వర్తింపదను నిషేధములేదు. కావున మహద్వాచకములు లక్ష్యములైనపుడు పురుషుల కందఱకు - పురుషులందఱకు; అందఱకుఁ బురుషులకు - అందఱు పురుషులకు; స్త్రీల కందఱకు - స్త్రీలందఱకు; అందఱకుస్త్రీలకు - అందఱుస్త్రీలకు॥ అను విధముగా ప్రయోగము లుండును.

[ఇక్కడ సంజీవనీ వ్యాఖ్యాత "సూరి యిట్లు సూత్రించెనే కాని కొన్ని యెడల నీవిధి వర్తిల్లనేరదు. 'మాయిద్దఱలో = మాలో నిద్దఱలో' అనుచో 'మేమిద్దఱలో' అనురీతి ప్రయోగములు గన్పట్టలేదు. ఇట్లె 'మనయందఱలో' అనుచో 'మనమందఱలో' అని సిద్ధింపనేరదు" అని వ్రాసిరి. సూత్రమునందు సర్వనామములును, సంఖ్యాభిధానములును విశేషణములుగా నుండగా, పై కార్యము జరుగునన్నది ముఖ్యవిషయము. తక్కిన సర్వనామములు విశేషణములును, విశేష్యములును గూడ కావచ్చును. కాని 'నీ, నా, మన, తా' యనునవి విశేష్యములుగానే కాని, విశేషణములుగా నెచ్చటను వర్తింపనేరవు. కావున వానిని ప్రస్తుతసూత్రమునకు లక్ష్యముగా గ్రహించు నవకాశములేదు. అట్టియెడల పై కల్పనమునకు నైత మవకాశము లేదని చెప్పవలసిన యవసరము లేదు.]

**52. ఒకానొకచో విశేషణంబుల షష్ఠికిం బ్రథమ విభాష నగు.**
**(బా - ౨౬)**

సుగుణాభిరాముఁడు రామునకు జోహారు వొనర్చెద - సుగుణాభిరామునకు రామునకు జోహారు వొనర్చెద.

వ్యాఖ్య - విశేష్యము షష్ఠీవిభక్త్యంతమై యున్నపుడు, దానివిశేషణము కొన్ని నిర్దిష్టప్రదేశములందు విభాషగా ప్రథమాంతముగా నుండవచ్చునని సూత్రార్థము.

'రామునకు' అనునది విశేష్యము; ఏకవచనము; షష్ఠీ ప్రత్యయాంతము. కావున వెనుకటి (బా - 19) సూత్రమునుబట్టి దీని విశేషణము కూడ ఏకవచనమును షష్ఠీప్రత్యయాంతమునై యుండవలయును. అప్పుడు 'సుగుణాభిరామునకు రామునకు' అను విధముగా ప్రయోగముండును. ప్రస్తుత సూత్రమును బట్టి విశేషణము యొక్క షష్ఠికి బదులు ప్రథమ రాగా 'సుగుణాభిరాముఁడు రామునకు' అని యగును. సూత్రమున 'విభాషనగు' నని యనుటచేత ప్రథమరాని పక్షమున షష్ఠియే యుండును.

**53. ఒక్కచో సమాసాంతర్గత విశేష్యంబుల కగు విశేషణంబుల షష్ఠికిని బ్రథమ చూపట్టెడి. (ప్రౌ - ౨౧)**

పార్థివప్రాగ్రసరుండు ధర్మసుతువన్నిది నీకు నలంఘ్యము॥ భార. ఆర. ౫ఆ॥ లసదగణ్యగుణౌఘ విచిత్రుఁ డమ్మహాత్ము చరితంబులు॥ హరి. ఉ. ౫ఆ॥ ఉత్ఫుల్లలోచనుఁ డావిష్ణునిమూర్తితో॥ హరి. ఉ. ౫ఆ॥ విస్ఫురన్మహా విక్రముఁడైన దేవుఁడు త్రివిక్రముసొమ్ములు॥ హరి. ఉ. ౬ఆ॥

వ్యాఖ్య - కొన్ని యెడల సమాసమునందున్న విశేష్యము యొక్క వ్యస్తవిశేషణము మీఁది షష్ఠికిని ప్రథమావిభక్తి వచ్చు చున్నదని సూత్రార్థము.

బాలవ్యాకరణము విశేషణంబుల షష్ఠి యని యన్నదే కాని వివరింపలేదు. సాధారణముగా సమాసమని యన్నప్పుడు ఏకార్థీభావసామర్థ్యమువలన అది సామూహికమైన యర్థమునే బోధించును. 'రాజపురుషుడు' అని యన్నప్పుడు 'రాజుయొక్క పురుషుడు' అని యర్థముచెప్పి 'పురుషుడు' అను నుత్తర పదమునకే ప్రాధాన్యము నిచ్చుట జరుగును. 'మంచివాఁడగు రాజపురుషుఁడు' అని యన్నచో 'మంచివాఁడు' అను విశే షణము 'రాజపురుషుఁడు' అను విశేషణమున కంతటికి నన్వ యించును గాని, కేవల రాజ శబ్దముతో నన్వయింపదు. కావున సమాసగత పూర్వపదము వ్యస్తముగా నున్న విశేషణముతో నన్వయించుట విశేషమే. దానిని సూచించు నభిప్రాయముతోనే ప్రౌఢవ్యాకరణకారుఁ డీసూత్రము నారంభించెను.

[బాలవ్యాకరణమునందలి 'విభాష' యను దశముచేతనే యీవిధ మగు ప్రయోగమునకును అవకాశమున్నట్లు సూచితమగుచున్నది. దానిని స్పష్టము చేయుటకై ప్రస్తుతసూత్రము ప్రవర్తించుచున్నది.]

పార్థివప్రాగ్రసరుండు ధర్మసుతుపన్ను - ఇచ్చట 'ధర్మ సుతుపన్ను' అనునది సమాసము. ఇందు పూర్వపదము 'ధర్మ సుతుయొక్క' అనునది. 'పార్థివప్రాగ్రసరుండు' అనునది 'ధర్మ సుతుయొక్క' అను విశేష్యమునకు విశేషణము గావున షష్ఠ్యంతమై 'పార్థివ ప్రాగ్రసరుయొక్క' అని యుండవలయును.

కాని, అట్లుకాక ప్రథమావిభక్తిని పొంది 'పార్థివప్రాగ్రసరుండు' అని మాత్రమే యుండెను. వ్యస్తముగానున్న యావిశేషణము సమాసగతమైన విశేష్యముతో అన్వయము కలిగి యుండుటయు, ప్రథమావిభక్తి నొందుటయు విశేషకార్యములు. ప్రస్తుత సూత్రము వాని కవకాశమును కల్పించుచున్నది.

తరువాతి లక్ష్యమునందు 'అమహోత్సవచరితంబులు' అను సమాసమునందు పూర్వభాగమయిన 'అమహోత్మ' అనుదానికి 'లసదగణ్యాగుణౌఘవిచిత్రుఁడు' అన్నది విశేషణమై ప్రథమా విభక్తిని గలిగియున్నది. 'ఆవిష్ణుని మూర్తితో' అనుచోటి సమాసాంతర్గత విశేష్యముతో 'ఉత్ఫుల్లలోచనుఁడు' అన్నది విశేషణమై, ప్రథమాంతమై, అన్వయమును గలిగి యున్నది. 'త్రివిక్రము సొమ్ములు' అను సమాసమునందలి షష్ఠ్యంత పూర్వభాగముతో 'విస్ఫురన్మహో విక్రముఁడైన దేవుఁడు' అనునది విశేషణ రూపమున నన్వయించుచున్నది.

పై ప్రయోగము లన్నింటియందును సమాసములన్నియు సాధ్యములే; సిద్ధసమాస మొక్కటియు లేదు. అంతేకాక, ఆసమాసముల యందలి పూర్వభాగములు 'యొక్క' ప్రత్యయాంతములే కావున సూత్రమునందు స్పష్టము చేయకపోయినను, సాధ్యమగు షష్ఠీతత్పురుషమునందలి పూర్వపదముతోనే ప్రస్తుతము చెప్పికొన్నట్లు వ్యస్తముగానున్న విశేషణము అన్వయము నొందుననియు, అప్పుడు ప్రథమావిభక్తి నొందుననియు స్పష్టమగుచున్నది.

['పార్థివ ప్రాగ్రసరుండు ధర్మజపరాక్రమశక్తికి మేరయున్న దే' మున్నగువిధముగా నున్న దనుకొందము. ఇట్టి యెడల 'ధర్మజ...శక్తికి' అన్నది సిద్ధసమాసము. ఇప్పుడు 'పార్థివప్రాగ్రసరుండు' అను విశేషణము

'ధర్మజ' అను విశేష్యముతో నన్వయించుటకు వీలుకాదన్న సంగతిని గుర్తించుట యవసరము, కాని యిట్టి దానిని వారించుటకు లక్ష్యములే శరణ్యము లగుచున్నవి. సూత్రమునందు దానిని నిర్వహించు దశ మేమియు లేదు.]

**54 కొన్ని యెడల విశేషణంబుల ద్వితీయాదులకును ప్రథమ చూపట్టెడి. (ప్రౌ - ౨౨)**

అహీనబాహుబలసారఘనుల్ మధుకైటభాదిదై। త్యపతుల నెల్లఁ ద్రుళ్ళడఁచె॥ నిర్వ. ౫౩.॥ తండ్రీ! ఘటోత్కచుఁడు మీ। తండ్రి గలుగఁగాదే తల్లి ద్రౌపదితోడన్ । చంద్రుల హారిదీళ్వరు తెన । మంద్రు వొగడఁదెచ్చె గంధమాదనమునకున్॥ జై. ౧౩॥ మొ. 'షష్ఠీవిశేషణానామ్' అను బహువచనసారస్య మిట్టి ప్రయోగముల కుత్పాదకముగా నున్నయది. మఱియు నేతద్విశేషంబు లనేకవిధంబులు గలవు గాని ప్రామాణికప్రయోగంబులు దొరకమింజేసి యవి యనాదృతంబు లయ్యె.

వ్యాఖ్య - బాలవ్యాకరణము "ఒకానొకచో విశేషణంబుల షష్ఠికిం బ్రథమ విభాష నగు" నని సూత్రించిన సంగతిని జూచితిమి. దానికి సవరణముగా ప్రౌఢ వ్యాకరణకారు డీసూత్రము నారంభించెను. విశేషణముల షష్ఠికి ప్రథమయైనట్లే ద్వితీయాది విభక్తులకును ప్రథమ ప్రయోగములందు కానవచ్చుచున్నదని సూత్రార్థము.

'దైత్యపతులను' మున్నగువిధముగా నున్న విశేష్యము ద్వితీయాంతము; కావున దీని విశేషణముకూడ ద్వితీయాంతము గనే యుండుట నియమము. కాని ప్రస్తుతప్రయోగమునందు

విశేషణమైన 'అహీన బాహుబలసారఘనుల్' అన్నది ప్రథమాంతమై యున్నది; ఇది విశేషము.

'ద్రౌపదితోడన్' అను తృతీయావిభక్త్యంతమయిన విశేష్యమునకు విశేషణము 'తల్లి' యనునది కావున 'తల్లితోడన్' అనునట్లు ఌదికూడ తృతీయాంతముగనే యుండుట నియమము. కాని 'తల్లి' యని ప్రథమాంతముగనే యుండుటచే ప్రస్తుత సూత్రవిధికి లక్ష్యముగా వ్యాకర్త దీనిని ప్రదర్శించుచున్నాడు.

చింతామణియందు 'షష్ఠీవిశేషణానామ్' అని యుండుట చేత ద్వితీయాదులకును అవకాశము కలుగుచున్నదని వ్యాకర్త తన వివరణములో తెలియజేసెను. చింతామణికారుడు ఒక్క షష్ఠినే యుద్దేశించినయెడల 'షష్ఠీవిశేషణస్య' అని యన్నట్లు ఏకవచనమునే వాడియుండుననియు, అటుకాక 'షష్ఠీవిశేషణానామ్' అని బహువచనమును వాడియుండుటచేత షష్ఠికి చెప్పినకార్యము ద్వితీయాదులకును జరుగుట యాయనకు సమ్మతమే యనియు ప్రౌఢవ్యాకరణకారుని వివరణతాత్పర్యము.

[తరువాత రాబోవు బాలవ్యాకరణసూత్రము (బా-28) భవత్యర్థక వ్యవధానముచేత అన్నింటికిని ప్రథమను అంగీకరించుచున్నది. 'అగు' అని సూత్రమున నుండుటచేత సూత్రమున చెప్పినట్లుకాక అన్యరీతి నుండుటకు కొన్నియెడల అవకాశము మిగిలియే యున్నది. వానినే యిచ్చట చూపి స్పష్టతను సాధించుట జరిగినది.]

**55. క్రియాన్వయంబున రెండు పదంబులకు స్వస్వామి సంబంధము గలచో సంబంధిపదంబు షష్ఠికి ద్వితీయ యగు. (ప్రౌ - ౨౩)**

కొన్ని వెడమాటలాడుచు। నన్ను నతఁడు చెట్టవట్టినన్। భార. విరా. ౨ఆ॥ కట్టియపై చె నెన్నుదురు గాఁడ భవత్తనయుండు మాద్రిలేఁబట్టి ॥భార. శల్య. ౧ఆ॥ రాముతమ్ముఁన్ లవుం।డిరుమూఁడమ్ములఁ జాపముం దునుమ ॥జై. ౬ఆ॥ నరసూను నపుడు కర్ణుఁ।డిరుమూఁడు శిలీముఖంబు లెద సించిన ॥జై. ౭ఆ॥ మొ.

వ్యాఖ్య - క్రియతో అన్వయమును గలిగియున్న రెండు పదములు స్వస్వామి సంబంధమును గలవైనయెడల సంబంధి పదముయొక్క షష్ఠికి బదులుగా ద్వితీయ వచ్చునని సూత్రార్థము.

స్వము అని యనగా 'సొత్తు' అని యర్థము; స్వామి అని యనగా ఆ సొత్తును గలవాడని యర్థము. సంబంధిపదము అని యనగా సంబంధముగల పదమని యర్థము. రెండు పదములకును సంబంధముండుటచే రెండును సంబంధిపదములే యైనప్పటికిని ప్రస్తుత లక్ష్యములనుబట్టి చూడగా 'స్వామిత్వముగల పదము' అనియే యర్థము చెప్పుకొనుట యవసరము.

నన్ను నతఁడు చెట్టవట్టినన్ - ఇచ్చట 'పట్టినన్' అనునది క్రియ. దానితో 'నన్ను' అనుదానికి 'చెట్ట' అను దానికినిగూడ నన్వయము గలదు. నిజమునకు 'నాయొక్కచెట్ట' అనునది తాత్పర్యము. కావున 'నాయొక్క' అనుచోటి షష్ఠికి ద్వితీయ వచ్చి 'నన్ను' అని యైనది.

[ఈలక్ష్యమునందలి 'చెట్టవట్టిన' అనుదానిని శబ్దపల్లవముగా గ్రహింపవచ్చునని యనిపించును. అప్పు డర్థమునందు భేదము గోచరించును. శబ్దపల్లవమైనపుడు సాంగత్యముచేయుట, పెండ్లియాడుట మున్నగు విధ

మైన యర్థములు కలుగును. కాని పై ప్రయోగమునం దాయర్థములకు ప్రసక్తి లేదు. చెట్టయనగా చేయి యనియే యిచ్చటియర్థము.]

నెన్నుదురుగాఁడ...మాౘదిలేఁబట్టిని - ఇచ్చట 'వై చె' అను క్రియతో స్వామియైన 'మాౘదిలేఁబట్టి' యు తత్సంబంధము గల 'నెన్నుదురు' ను అన్వయము నొందుచున్నవి. కావున స్వామిత్వముగల పదమునకు ద్వితీయవచ్చి 'మాౘదిలేఁబట్టిని' అని యైనది.

రాముతమ్మున్...చాపముం దునుమ - ఇచ్చట తునుమ బడినది చాపమేకాని రాముతమ్ముఁడు కాదు. కాని ఆచాపము రాము తమ్మునిది. అనగా ఆ రెండును స్వస్వామి సంబంధము గలిగి యున్నవి. కావున స్వామిత్వముగల 'రాముతమ్మునియొక్క' అను పదముయొక్క షష్ఠికి ద్వితీయ వచ్చి 'రాముతమ్మున్' అని యైనది.

నరసూనునపుడు...ఎద సించిన - ఇచ్చట 'నరసూనుని యొక్క యెద' యని స్వస్వామి సంబంధము గలదు. కావున స్వామిత్వముగల పదమునకు ద్వితీయ వచ్చి 'నరసూనున్' అని యైనది.

పై లక్ష్యము లన్నింటియందును స్వవాచకములే క్రియతో సన్నిహిత సంబంధమును గలిగి యున్నవి; వాక్యమున కర్మము లుగా గ్రహింపదగి యున్నవి. కాని, వానితో సంబంధము గలు గుటచేత స్వామివాచకములు కర్మములై వ్యవహరించుచున్నవి. ఇది విశేషము. కావున నీసూత్ర మావశ్యకమే.

సూత్రమున 'అగు'నని యున్నది. అయినప్పటికిని దీనిని నిత్యవిధిగా గ్రహింపవలసిన యావశ్యకము గానరాదు. నాచెట్ట పట్టినన్, మాద్రిలేఁబట్టి నెన్నుదురు, రాముతమ్ముని చాపము, నరసూనునెద - మున్నగు విధముగా నుండవచ్చును.

**56 ఒక్కచో ద్వితీయాంత విధేయ విశేషణంబునకుం బ్రథమయు నగు. (ప్రౌ - ౨౧)**

ఎవ్వనిం। బ్రాకట ధర్మతత్త్వవిదు। బ్రాహ్మణముఖ్యుఁ బురోహితుఁడుగాఁ। జేకొను వారము॥ భార. ఆది. ౭౮॥ రయమున మ్రింగుడు గాలము। క్రియ నెవ్వఁడు కంఠబిలము। క్రిందికిఁ జన కగ్నియుఁ బోలె దహించును। భయరహితా! వాని నెఱుఁగు। బ్రాహ్మణకులుఁ గాన్॥ భార. ఆది. ౨౮॥

వ్యాఖ్య - విధేయ విశేషణముయొక్క ద్వితీయావిభక్తికి మారుగా కొన్నియెడల ప్రథమ వచ్చునని సూత్రార్థము. విధేయమును దెల్పు విశేషణము విధేయవిశేషణము. ఉద్దేశ్యమును దెల్పు విశేషణము ఉద్దేశ్యవిశేషణము.

మొదటి యుదాహరణమునందు 'ఎవ్వఁడు' అనునది ప్రశ్నవాచకము; కర్మమైయుండుటచే ద్వితీయాంతమై యున్నది. దాని కనుగుణముగానే ప్రాకటధర్మవిదున్, బ్రాహ్మణముఖ్యున్ - అను రెండువిశేషణములును ద్వితీయాంతములుగానే యున్నవి. 'పురోహితుండు' అనునది విధేయవిశేషణము. ఇదియు తక్కినవానితోపాటుగా ద్వితీయాంతము కాక ప్రథమాంతముగా ప్రయుక్తమైనది. అప్పుడు 'పురోహితుండు

గాన్' అన్నది రూపము. 'ఒక్కచో' నని యనుటచేత కొన్ని యెడల నీకార్యము కలుగక 'పురోహితుంగాన్' అను విధముగా ద్వితీయాంతముగా నుండవచ్చును.

రెండవ యుదాహరణమునందు 'వానిని' అను నుద్దేశ్య విశేషణమున కనుకూలముగా విధేయవిశేషణము కూడ ద్వితీయాంతమై 'బ్రాహ్మణకులుఁగాన్' అని యయ్యెను.

[ఈసూత్రమునందు మొదట 'ఒక్కచో' అని తెల్పి 'ప్రథమయు' అని సముచ్చయార్థకమును వాడుట కనిపించును. 'ఒక్కచో' అని యనుట చేతనే ప్రథమ రానియెడల ద్వితీయ వచ్చునన్న విషయము సూచితమగు చుండగా, సముచ్చయమును జేర్చి పలుకుట యనావశ్యకము. అట్లే 'ద్వితీయాంత విధేయవిశేషణంబునకు ప్రథమ యగు' ననుటకంటె 'విధేయవిశేషణంబు ద్వితీయకుం బ్రథమ యగు'నని యన్న యోగ్యతరముగా నుండెడిది.]

**57. కొన్నియెడల విధేయవిశేషణ మొండ బహువచనాంతం బయి విశేష్యంబులు పెక్కింటి కన్వయ యోగ్యంబగు. (ప్రౌ - ౨౫)**

ఇది దక్షిణాపథంబున । కిదియు విదర్భాపురమున కిదికోసలకిం। దిది యుజ్జయినికిఁ దెరువులు । మది నిన్నిటిలోన నరుగ మన కెద్దియగున్ ॥భార. అర. ౨౮॥ బహువచనాంతము కాక యేకవచనాంతమైనచోఁ దెరువు లై దుండవలెను.

వ్యాఖ్య - ఏకవచనాంతములయిన విశేష్యములు పెక్కు లున్నప్పటికిని, విధేయవిశేషణము బహువచనాంతమై యొక్క చోటనే యుండి అన్నింటితోడ నన్వయించును. 'కొన్నియెడల'

నని యనుటచేత, ఇట్టి ప్రయోగములు విరళముగా నుండునని సూత్రకర్త యే సూచించుచున్నాడు.

పై లక్ష్యమునందు 'ఇది' అను విశేష్యము నాలుగుచోట్ల వచ్చినది. దాని కనుగుణముగా విశేష్యమును నాలుగుచోట్ల వచ్చుట సాధారణముగా జరుగవలయును. ఇది దక్షిణాపథంబునకుఁ దెరువు - ఇది విదర్భాపురమునకుఁ దెరువు - ఇది కోసలకుఁ దెరువు - ఇది యుజ్జయినికిఁ దెరువు॥ అను విధముగా నాలుగు చోట్ల 'తెరువు' అను విశేషణముకూడ ప్రయుక్తము కావలయును. అట్లుకాక విధేయవిశేషణము, చివరనొక్కచోట నేయుపయుక్తమైనది. ఇన్నింటికి బదులుగా వచ్చినది కావున బహుత్వమును తెలియజేయుట యవసరమే; కావుననే బహువచనాంతమై యున్నది. ప్రస్తుత సూత్ర మీవిధమగు ప్రయోగమున కవకాశము కలిగించుచున్నది.

[బహువచనాంతము కాక యేకవచనాంతమైనచోఁ దెరువు లైదుండవలెను- అని ప్రౌఢవ్యాకరణ కారుడు వివరించెను. 'తెరువు' అన్నది చివరి విశేషణముకడ మాత్రమే తెలుపబడినప్పుడు బహువచనాంతమగుటయు ఒక్కటియే యుండుటయు సరిపడును. "ఇది దక్షిణాపథంబునకుఁ దెరువు; ఇది విదర్భా పురమునకు; ఇది కోసలకు; ఇది యుజ్జయినికి; ఇన్నిటిలోన మనకేది తగును" అని యున్న నాక్షేపము గానిపింపదు. మొదటనున్న విశేషణ మొక్కటియె తక్కిన యన్నియెడలను దగినస్ఫూర్తిని గలిగించును. కావున మొదటనున్నచో, మిగిలినయెడల నధ్యాహృతమైనను గావచ్చును. ఇంకొక యాక్షేపము గలదు. ప్రశ్నమునకు పూర్వము నిర్దేశము గలదు. ఆనాలుగుచోట్ల నాలుగు మారులు 'తెరువు' అన్న విధేయవిశేషణము వచ్చిన చాలును. 'ఇన్నిటిలోన' అన్నచోట 'తెరువు' అని యేకవచనాంత రూపము వచ్చుటకే వీలులేదు. 'ఏద్ది యగున్' అనుచోట 'ఏ తెరువగున్'

అని కావలయునని వ్యాకర్త యభిప్రాయము. కాని, అది అవశ్యముగా కావలసినది కాదు. ఉన్నది యున్నట్లుగా 'ఎద్దియగున్' అనియు నన వచ్చును. కావున 'తెరువు లై దుండవలెను' అని లెక్కయిడి చెప్పుట లేని పోని చిక్కులకు తెరువు చూపుచున్నది.]

## 58. కొన్నియెడల విభక్తి పరిణామంబు గ్రాహ్యంబు.

(ప్రౌ - ౨౬)

ఈతనితో సాటియనంగ మేలన॥ నిర్వ. ౩౫॥ (మేలన= ఈతని కంటె మేలన; ఇక్కడఁ దృతీయకుఁ బంచమిగా మార్పు కలిగెనని తెలియవలయు.)

వ్యాఖ్య - కొన్ని యెడల ఒకేవిభక్తి తరువాత వచ్చు పెక్కుపదములతో నన్వయమును గలిగియుండును. ప్రయుక్తమైన విభక్తి యొకే యర్థమునందు తరువాతి పదముతో నన్వయము కలిగి యుండును. ఆపై నివచ్చు పదముల కనుకూలమైన విభక్తి లేక పోయినను, పూర్వమున్న విభక్తియే యవసరమగు విభక్త్యర్థముల నొసగుచున్నట్లు గ్రహింపవలయునని సూత్ర తాత్పర్యము. విభక్తిపరిణామము అని యనగా ఒకేవిభక్తి మరొక విభక్తిగా పరిణమించి, తత్కార్యమును నిర్వహించుట యని యర్థము.

ఈతనితో సాటియనంగ - అనుచోట సహార్థమునందు 'తోడ' వర్ణకముయొక్క రూపాంతరమైన 'తో' వచ్చెను. 'మేలు' అనునది గుణమును సూచించును. కావున జాతి గుణ క్రియా సంజ్ఞ లనుబట్టి నిర్ధారణము చేయవలసివచ్చినపుడు నిర్ధార్యమాణుడైన 'ఈతడు' పైని, 'కంటె' అను పంచమీప్రత్యయము

రావలయును. అప్పుడు 'ఈతనికంటె మేలు' అని కావలయును. కాని యీ యుభయవాక్యముల నేకవాక్యముగా కలుపగా 'ఈతనితో సాటి యనంగ మేలన' నని యగుచున్నది. అనగా 'తో' అనునది సాటితో నన్వయించుచు తరువాతిదైన 'మేలు' తో నన్వయించునపుడు 'కంటె' అను నర్థమునే యొసగుచున్న దని యర్థము. అట్లు గ్రహింపవచ్చుననియు, ప్రత్యేకముగా 'మేలు' అను పదమునకు పూర్వమందు 'కంటె' వర్ణకము వచ్చునట్లు ప్రయోగింపవలసిన యక్కరలేదనియు వ్యాకర్తయుద్దేశము' అట్లు ప్రయోగింప వలయుననిన 'ఈతనితో సాటియనంగ, నీతనికంటె మేలన' అన్నట్లుగా ప్రయోగింపవచ్చును. 'కొన్ని యెడల' నని యనుటచేత ఇట్టి రూపములకును అవకాశముగలదు.

**59. భవత్యర్థవ్యవహితంబులగు విశేషణంబులకుం బ్రథమ యగు. (బా - ౩౮)**

అగు మొదలగునవి భవత్యర్థములు ॥ విద్యాశాలియగు పురుషుని సకలజనులు సన్మానింతురు - భూతదయాళురగు మహాత్ములకు శ్రేయంబు గలుగును - అతిమానుష మత్యద్భుత మతిదుష్కరమయిన కేళ వార్జునకృతిన్.

వ్యాఖ్య - భవతి + అర్థము = భవత్యర్థము = అగు, అయిన మున్నగు నర్థములనుగలది. వ్యవహితమని యనగా వేఱు పఱుపబడిన దని యర్థము.

భవత్యర్థములగు అగు, అయిన మున్నగుపదములచే విశేష్యమునుండి వేరుపరుపబడిన విశేషణములకు ప్రథమావిభక్తి యగునని సూత్రార్థము. 'పురుషుని'అనునది వాక్యమున కర్మము;

కావున ద్వితీయావిభక్తిని గలిగియున్నది. వెనుకటి (బా - 19) సూత్రమునుబట్టి దీని విశేషణము కూడ ద్వితీయావిభక్తిని గలిగి యున్నచో "విద్యాశాలిని బురుషుని" అనువిధముగా నుండవల యును. ప్రస్తుతోదాహరణమునందు 'పురుషుని' అను విశేష్యము నకును 'విద్యాశాలిని' అను విశేషణమునకును నడుమ 'అగు' అను భవత్యర్థకము ప్రవేశించి వ్యవధానమును కలుగజేయు చున్నది. కావున విశేషణమునకు ప్రథమయై "విద్యాశాలియగు పురుషుని" అనియే ప్రయోగము నందినది.

'మహాత్ములకు' అను షష్ఠీవిభక్త్యంతము విశేష్యమైన ప్పుడు సైతము భవత్యర్థకముచే వేరుపరుపబడి యుండుటవలన, దాని విశేషణము ప్రథమావిభక్తిని పొంది "భూతదయాళురగు మహాత్ములకు" అను విధముగా ప్రయోగింప బడినది. 'కేశవార్జున కృతిన్' అనునది ద్వితీయాంత విశేష్యము. దీనికి పూర్వమందు అతిమానుషము, అత్యద్భుతము, అతిదుష్కరము - అని మూడు విశేషణములు గలవు. అన్నింటికి చివరనున్న విశేషణమునకును విశేష్యమునకును నడుమ 'అయిన' అను భవత్యర్థకము వచ్చినది. కావుననే ఆ విశేషణములన్నియు ప్రథమాంతములుగా ప్రయు క్తములయినవి.

**60. భవత్యర్థకంబు సన్నిహితవిశేషణంబునకును దానిముందు విశేషణంబుల కయి పదంబును బహుళంబుగా నను ప్రయుక్తం బగు. (బా - ౭౯)**

**అతులుఁడయి యప్రమేయుఁడౌ హరినిఁ గొలుతు.**

వ్యాఖ్య - విశేషణము లనేకముగా నున్నప్పుడు, విశేష్యమునకు సన్నిహితముగా నున్న విశేషణమునకు మీద 'అగు' అనియు, పూర్వ పూర్వ విశేషణములకు మీద 'అయి' అనియు బహుళముగా ననుప్రయుక్తమగునని సూత్రార్థము.

'హరిని' అను విశేష్యము ద్వితీయాంతము. దీనికి పూర్వమందు అతులుఁడు, అప్రమేయుఁడు - అను రెండు విశేషణములు గలవు. వెనుకటి (బా - 19) సూత్రమునుబట్టి వీనిని సైతము ద్వితీయాంతములనుగా వాడినచో "అతులుని నప్రమేయుని హరిని గొలుతు" అను విధముగానగును. కాని భవత్యర్థ వ్యవధానముచేత, ఇచ్చటి విశేషణములకు ప్రథమావిభక్తియైనది. ప్రస్తుతసూత్రముచేత విశేష్యమునకు పూర్వమందు సన్నిహితముగా నున్న విశేషణముపై 'అగు' అను భవత్యర్థకమును, అంతకంటె పూర్వమున్న విశేషణముపై 'అయి' అను భవత్యర్థకమును చేర్చబడినవి. అప్పుడు "అతులుఁడయి యప్రమేయుఁడగు హరిని గొలుతు" అని యగును.

'అగు' అనునది "అపదాద్యంబయి యసంయుక్తంబయిన గకారంబునకు వకారంబు విభాష నగు" అను నాచ్ఛికపరిచ్ఛేదమునందలి (బా-27) సూత్రమునుబట్టి 'అవు' అనియు కావచ్చును. అట్లయినప్పుడు "ఆచ్ఛికంబులందయి యవులకు వక్రతమంబులు బహుళంబుగా నగు" అను క్రియాపరిచ్ఛేదమునందలి (బా-103) సూత్రమునుబట్టి 'ఔ' అనియు కావచ్చును. అట్లే 'అయి' అనునది 'ఐ' అను రూపమునుగూడ పొందవచ్చును. అందువలననే "అతులుఁడయి యప్రమేయుఁడౌ హరినిగొలుతు" అని ఔత్వముతోడి యుదాహరణమును వ్యాకర్త ప్రదర్శించెను.

[బహుళమని యనుటచేత, ఇకముందు చెప్పబోవు కార్యముల కన్నింటికి నవకాశము లభించుచున్నది. బాహుళకమువలననే ప్రౌఢ వ్యాకరణ మందలి యిరువదిరెండవ సూత్రము వలన నేర్పడు అగుశబ్ద విరహిత రూపములకు సైత మవకాశము లభ్యమగుచున్నది.]

**61. అయి పదానుప్రయోగంబు లేనిచోఁ దుదివిశేషణంబున కేని విశేషణంబు లన్నింటికేని మీఁద సముచ్చయార్థంబు విభాషం బ్రయోగింపంబడు. (బా - ౩౦)**

ఆద్యుఁ డప్రమేయుఁడు నగు హరిని గొలుతు - ఆద్యుఁడు నమేయగుఁడు నౌ హరిని గొలుతు - ఆద్యుఁ డప్రమేయుం డగు హరిని గొలుతు.

వ్యాఖ్య - పూర్వసూత్రమునందు చెప్పినట్లు 'అయి' యను పదమును ప్రయోగించుట జరుగనియెడల, తుది విశేషణము మీద కాని, అన్ని విశేషణములమీద కాని సముచ్చయార్థకము విభాషగా వాడబడునని సూత్రతాత్పర్యము.

ఆద్యుఁ డప్రమేయుఁడు నగు హరిని గొలుతు - ఇచ్చట 'హరిని' అనునది విశేష్యము; ద్వితీయాంతము. ఆద్యుఁడు, అప్రమేయుడు అనునవి రెండును విశేషణములు. విశేష్యమునకు పూర్వమందున్న విశేషణముపైని 'అగు' శబ్దము ప్రయుక్తమగుటచేత విశేషణములు రెండును ప్రథమాంతములుగా ప్రయుక్తము లయ్యెను. పూర్వవిశేషణమునకు 'అయి' శబ్దము అనుప్రయుక్తము కాలేదు. కావున, ఇట్టియెడల విశేషణముల కన్నింటికి గాని, తుదివిశేషణ మొక్కదానికి గాని సముచ్చయార్థకమగు 'ఉను' అనునది విభాషగా నగును. ఈ యుదా

హరణమందు తుది విశేషణమునకు మాత్రమే 'ఉను' శబ్దము కలిగెను. "ఆద్యుఁడు నమేయగుణుఁడు నౌ హరిని గొలుతు" అని యన్నప్పుడు ఆద్యుఁడును, అమేయగుణుఁడును - అని రెండు విశేషణముల మీదను సముచ్చయార్థకము కలిగెను.

సూత్రమునందలి 'విభాష' యను దళముచేత ఈసముచ్చయార్థకము ఒక్కచోటయినను రాని ప్రయోగములు కూడ నుండవచ్చును. "ఆద్యుఁ డప్రమేయుం డగు హరిని గొలుతు" అను వాక్యమునందు సముచ్చయార్థకమైన 'ఉను' అను శబ్దమును వాడలేదు.

**62. ధాతుజవిశేషణ వ్యవధానంబున విశేషణంబు లన్నింటికయి పదం బనుప్రయుక్తం బగు. (బా - ౩౧)**

అద్యుఁడయి యప్రమేయుఁడై యఖిల సేవ్యుఁడై యొసంగెడు దేవుని నభినుతింతు॥ ఇచట మఱియుం బ్రయోగ వైచిత్ర్యంబు గల దది ప్రయోగంబుల నెఱుంగునది.

వ్యాఖ్య - వాక్యమున నున్న విశేషణములను విశేష్యములను వేఱుచేయుచు ధాతుజవిశేషణము ప్రయోగింపబడిన యెడల, పూర్వమున్న విశేషణము లన్నింటిమీద 'అయి' అను పదము అనుప్రయుక్త మగునని సూత్రార్థము.

క్రియాధాతువులనుండి పుట్టిన విశేషణములను క్రియాజన్య విశేషణములని, ధాతుజ విశేషణములని యందురు. వచ్చు, వచ్చుచున్న, వచ్చెడి, రాని, రాగల - మున్నగునవి ధాతుజ విశేషణముల కుదాహరణములు.

ప్రస్తుతోదాహరణమున 'ఎసంగెడు' అనునది ధాతుజ విశేషణము. ఇది 'దేవుని' అను విశేష్యమునకును, తనకు ముందున్న విశేషణములకును వ్యవధానమును కలిగించుచున్నది. కావున సూత్రవిధినిబట్టి ఆవిశేషణములన్నింటిమీద 'అయి' పదము అనుప్రయుక్త మయ్యెను. ఆద్యుఁడు, అప్రమేయుఁడు, అఖిల సేవ్యుఁడు - అను విశేషణము లన్నింటిమీదను 'అయి' పదము అనుప్రయుక్తము కాగా "ఆద్యుఁడయి యప్రమేయుఁడై యఖిలసేవ్యుఁడై యెసంగెడు దేవుని నభినుతింతు" అనియగును.

ఇచ్చట నింకను ప్రయోగము లనేక విధములుగా కలవు. కావున వానిని ప్రయోగము లనుబట్టియే గుర్తించుకొన వలయు నని సూరి నిర్దేశించుచున్నాడు. చివరి విశేషణమునకు ముందు సముచ్చయార్థకము కలిగి "ఆద్యుఁడై యప్రమేయుఁడై యఖిల సేవ్యుఁడునై యెసంగెడు" అని యుండవచ్చును. "ఆద్యుఁ డప్రమేయుఁ డఖిలసేవ్యుఁడునై యెసంగెడు" అని చివరి విశేషణమునకు మాత్రమే సముచ్చయార్థకమును, అయి పదాను ప్రయోగమును కలుగవచ్చును. అన్ని విశేషణములకును సముచ్చయార్థకము కలిగి, ధాతుజ విశేషణమునకు పూర్వము మాత్రమే 'అయి' పదము కలుగవచ్చును. ఇట్టి వింకను గలవు. కావుననే వ్యాకర్త 'ప్రయోగంబుల నెఱుంగునది' అని నిర్దేశించెను.

**63.** భావార్థకాదియోగంబునం గర్తకుం బ్రథమ యగు.

(బా - ౩౨)

రాముఁడు వచ్చుట - రాముఁడు రాఁగా లక్ష్మణుఁడు గాంచె - రాముఁడు పిల్లందినం ద్రిలోకంబు లాకులంబు లగు - రాముఁడు పట్టిన ప్రతిన వారింపం దరంబు గాదు.

వ్యాఖ్య - భావార్థకము మున్నగువానితో కూడియున్నప్పుడు కర్తకు ప్రథమావిభక్తి యగునని సూత్రార్థము.

ధాతువు యొక్క అర్థము భావము. "ట వర్ణంబు భావంబునం దగు" అను క్రియాపరిచ్ఛేద సూత్రము (బా-35)ను బట్టి వచ్చుట, వండుట మున్నగునవి భావార్థకములు . వ్యతిరేక భావార్థకములు రామి, వండమి మున్నగునవి. "భావార్థకాది యోగంబున" అని సూత్రమునం దాది శబ్దమును నిబంధించుట చేత 'రాఁగా' మున్నగు నుజ్యంతరూపములును, 'అందినన్' మున్నగు చేదర్థకరూపములును, 'పట్టిన' మున్నగు ధాతుజ విశేషణములును గూడ గ్రహింపబడుచున్నవి. కావున, ఈసూత్రమున అసమాపకక్రియలకు కర్తయైన శబ్దముయొక్క స్థితిబోధింపబడుచున్నది.

రాముఁడు వచ్చుట - ఇచ్చట 'వచ్చుట' యన్నది భావార్థకము; వచ్చుట యను క్రియను బోధించుచున్నది. వచ్చుటకు కర్త రాముఁడు. కావున, ప్రథమావిభక్తి యయ్యెను. అట్లే తక్కిన యుదాహరణములందును. వాక్యమునందలి క్రియయు, దానితో నన్వయముగల కర్తయు వేరుగా నుండగా అసమాపక క్రియయొక్క కర్త వేరుగా నుండును. అప్పుడు కూడ అక్కడి కర్తకు ప్రథమ యగును. 'రాముఁడు రాఁగా లక్ష్మణుఁడు గాంచె' అన్న లక్ష్యమునందు ప్రధానమగు క్రియ కాంచె;

వాక్యమునందలి కర్త సమాపకక్రియతో నన్వయించెడి 'లక్ష్మ ణుఁడు'. అసమాపకక్రియ యగు 'రాఁగా' అనుదానితో అన్వ యముగల కర్త 'రాముఁడు' అనునది. కావున, వాక్యమునందలి ప్రధానకర్తతో నిమిత్తము లేకుండ, అసమాపకక్రియాన్వయము గల కర్తకు కూడ ప్రథమ యగుచుండుట యిక్కడ విషయము.

**64.** ప్రథమాంతంబు లగు యుష్మదస్మద్విశేషణంబుల కేక త్వంబున వునులును బహుత్వంబున రుములు నంతాగ మంబులు ప్రాయికంబుగ నగు (బా - ౩౩)

వ్యాఖ్య - యుష్మత్ + అస్మత్ + విశేషణములు = యుష్మదస్మద్విశేషణములు = యుష్మచ్ఛబ్దముయొక్క అస్మ చ్ఛబ్దముయొక్క విశేషణములు. యుష్మచ్ఛబ్దము అని యనగా నీవు, ఈవు, మీరు, ఈరు, మీరలు - అను సర్వనామ రూపము లన్నియు బోధింపబడును. అస్మచ్ఛబ్దము అని యనగా నేను, ఏను, మేము, నేము, ఏము, మనము - అను సర్వనామ రూపము లన్నియు బోధింపబడును. అంతాగమంబులు అని యనగా అద నముగా వచ్చి చివర చేరునవి యని యర్థము.

నీవు, ఈవు - అనువాని విశేషణములకు పైని వువర్ణము వచ్చును. వాని బహుత్వమున, అనగా మీరు, ఈరు, మీరలు - అను వాని విశేషణములకు పైని రు వర్ణము వచ్చును. నేను, ఏను - అనువాని విశేషణములకు పైని ను వర్ణము వచ్చును. వాని బహుత్వమున, అనగా మేము, ఏము, నేము, మనము - అను వాని విశేషణములకు పైని ము వర్ణము వచ్చును. సూత్రము నందు 'ప్రాయికముగా' నని యనుటచేత, ఈయాగ

మములు రానిరూపములుకూడ కొలదిగా నుండవచ్చునని తాత్ప ర్యము. 'ప్రాయికముగా' నని యనగా 'తరుచుగా' నని యర్థము,

[ఉదాహరణములు తరువాతి సూత్రమున చూపబడును.]

**65. ఈయాగమంబులు పరంబులగునపు డుత్వంబున కత్వం బగు.** (బా - ౩౪)

నీవు ధన్యుఁడవు - నేను ధన్యుఁడను - మీరు ధన్యులరు - మేము ధన్యులము॥ ఇకారంబు మీఁది కు ను వు క్రియావిభక్తుల యుత్వం బున కిత్వంబగు ననుసూత్రము చేత వు ను ల కిత్వంబగు ॥ నీవు సుకృ తివి - నేను సుకృతిని ॥ అర్తిహరుఁడవౌ నినుఁగొల్తు నంబుజాక్ష - గర్వ గరిష్ఠుండగు నన్ను - మీరలు పెద్దలు ॥ ఇత్యాదులు ప్రాయికగ్రహణ ముచే రక్షితంబులయ్యె.

వ్యాఖ్య - క్రిందటి సూత్రమున చెప్పిన వు ను రు ము అనునవి చేరునప్పుడు, విశేషణముల తుదనున్న ఉత్వమునకు అత్వము నిత్యముగా నగునని సూత్రార్థము.

'నీవు' అను యుష్మచ్ఛబ్దమునకు విశేషణము 'ధన్యుఁడు' అనునది. క్రిందటి సూత్రమునుబట్టి యుష్మచ్ఛబ్దవిశేషణమునకు ఏకవచనమందు 'వు' వర్ణము అంతాగమ మగును. కాబట్టి "'నీవు ధన్యుఁడు + వు' అని యగును. ప్రస్తుత సూత్రమునుబట్టి 'వు' వర్ణమునకు పూర్వమందున్న ఉత్వమునకు అత్వము వచ్చి 'నీవు ధన్యుఁడవు' అని యగును. 'నేను' అనునది కర్తృవాచక మైనపుడు దాన్ని విశేషణమగు 'ధన్యుఁడు' అను శబ్దముపై 'ను'వర్ణము చేరును. అప్పుడు తత్పూర్వమున్న ఉత్వమునకు అత్వము కలిగి 'ధన్యుఁడను' అని యగును. 'మీరు' అను యుష్మచ్ఛబ్దము విశేష్యమైనప్పుడు, దాని విశేషణము 'ధనుంలు' అని యగును. క్రిందటి సూత్రమునుబటి గరుసర

ద్వి శేషణమునకు బహువచనమునందు 'రు'వర్ణము అంతాగమ మగును. 'మీరు ధన్యులు + రు' అని యుండగా ప్రస్తుత సూత్రమునుబట్టి యీ యాగమమునకు పూర్వమందున్న విశేష ణము యొక్క ఉత్వమునకు అత్వము కలుగును. అప్పుడు 'మీరు ధన్యులరు' అని యగును. ఇట్లే 'మేము' అను అస్మ చ్ఛబ్దము యొక్క విశేషణమునకు మువర్ణమును, తత్పూర్వ మందలి ఉత్వమునకు అత్వమును కలిగి 'మేము ధన్యులము' అని యగును.

తత్సమ పరిచ్ఛేదమునందు "ఇకారంబు మీఁది కు ను వు క్రియావిభక్తుల యుత్వంబున కిత్వం బగు"నని యొక సూత్రము (తా-26)కలదు. ఈసూత్రము ప్రకారము ఇకారము మీద వచ్చిన షష్ఠీప్రత్యయమైన 'కు'వర్ణకమునకును, ద్వితీయాప్రత్యయ మయిన 'ను' వర్ణకమునకును, యుష్మదస్మచ్ఛబ్దముల విశేష ణముల కంతాగమములుగా చేరునటువంటి 'ను, వు' అను వర్ణము లకును, క్రియా విభక్తులకును (డు రు వు రు ను ము అనునవి) చివరి ఉత్వమునకు ఇత్వము వచ్చును. ఆసూత్ర మిక్కడ కూడ వ్యవహరించును గావున సూరి దానిని తనవివరణము నందు ఉద్ధ రించి జ్ఞాపనము చేయుచున్నాడు.

'నీవు' అను యుష్మచ్ఛబ్దము కర్తృవాచకము. దీనికి విశేషణము 'సుకృతి' యనునది. పూర్వసూత్రమునుబట్టి దీనిపై వు వర్ణము వచ్చును. "ఇకారంబు మీఁది" అని మొదలయిన సూత్రమువలన 'సుకృతి' అను విశేషణమునకు చివర ఇత్వ ముండుట వలన 'వు'వర్ణములోని ఉత్వమునకు ఇత్వము కావల

యును. అపుడు 'నీవు సుకృతివి' అని యగును. అట్లే అస్మ ద్విశేషణము ఏకవచనమునందు 'ను' వర్ణమును పొంది, ఇకారాంతమగుట వలన, దానిని 'ని'వర్ణముగా మార్చుకొనును. అప్పుడు 'నేను సుకృతిని' అని యగును.

కొన్నిచోట్ల విశేషప్రయోగములును గలవు. 'నిన్న' అను ద్వితీయాంతమునకు విశేషణము 'ఆర్తిహరుఁడు' అనునది. కావున నిదియు 'విశేష్యముంబోలె లింగ విభక్తి వచనముల'ను పొంది 'ఆర్తిహరునిన్' అని కావలయును. విశేషణ విశేష్యములకు నడుమ 'అగు' శబ్దముచేరి వ్యవధానము కలిగించునప్పుడు "భవత్యర్థ వ్యవహితంబు లగు" అని మొదలయిన (బా-28) సూత్రమునుబట్టి విశేషణమునకు ప్రథమ యగును. ఇప్పుడిది ప్రథమాంతమును, ఏకవచనమును, యుష్మద్విశేషణము నగుటచేత వువర్ణమును, తత్పూర్వమున్న ఉత్వమునకు అత్వమును కలుగగా "ఆర్తిహరుఁడ వగు నిన్ను" అను విధముగా నగుట సమంజసమయ్యెను. 'అపదాద్యంబయిన గకారంబునకు వకారము' వచ్చి 'అవు' అనినైు, అయి యవులకు వక్రతమంబులు వచ్చునను విధిచేత 'ఔ' అనినైు "ఆర్తిహరుఁడ వౌ నిన్ను" అని యయ్యెను.

'నన్ను' అను ద్వితీయాంతమైన అస్మచ్ఛబ్దమునకు 'గర్వగరిష్ఠుఁడు' అనునది విశేషణము. భవత్యర్థవ్యవహిత మగుటచేత ద్వితీయకు ప్రథమ యయ్యెను. ఈ విశేషణమునకు వు వర్ణము (బా-33)అంతాగమము కాగా 'గర్వగరిష్ఠుఁడవు' అను విధముగా కావలయును. కాని ఆ సూత్రమునందు 'ప్రాయికముగా నగు'

నని యనుటచేత ఆ యాగమములు కలుగని రూపములు కూడ కొలదిగా నుండవచ్చును. ప్రస్తుత లక్ష్యముకూడ అట్టిదే ఇచ్చట 'వు'వర్ణము రాలేదు. కావుననే 'గర్వగరిష్ఠుండగు నిన్ను' అని యున్నది. వువర్ణము వచ్చియున్నచో 'గర్వగరిష్ఠుండ వగు నిన్ను' అని అయియుండెడిది.

అట్లే 'మీరలు పెద్దలు' అను లక్ష్యమునందును 'రు' వర్ణము అంతాగమము కాలేదు. యుష్మద్విశేషణమునకు బహువచనమునందు 'రు' వర్ణము చేరవలయును. అట్లు రు వర్ణము వచ్చిన యెడల విశేషణముయొక్క కడపటి ఉత్వమునకు అత్వము నిత్యముగా నగును. అప్పుడు 'మీరు పెద్దలరు' అని యగును. కాని ప్రస్తుతలక్ష్యమునందు రు వర్ణము రానిరూపము గలదు. అంతాగమమే కలుగనియప్పుడు ఉత్వమునకు అత్వమువచ్చు ప్రసక్తి లేనేలేదు. అంతాగమము వచ్చినప్పుడు మాత్రమే, పూర్వమున ఉత్వమున్నయెడల నిత్యముగా అత్వమగునని గుర్తించుకొనవలయును.

ప్రాయికగ్రహణము అని యనగా ప్రాయికముగా నని గ్రహించుటయని యర్థము. అనగా సూత్రమునందు ప్రాయికముగా నను దళమును నిబంధించుటచేత నని తాత్పర్యము.

**66. తచ్ఛబ్దాంతములగు ధాతుజ విశేషణంబుల మీఁద నరు చూపట్టుదు. (ప్రౌ - ౨౩)**

ఏయే దేశములం జరించితిరి మీరేయేగిరుల్ చూచినా, రేయే తీర్థములందుఁ గ్రుంకిడితి, రేయేద్వీపముల్ మెట్టినారు ॥ స్వా. ౧౫॥

వ్యాఖ్య - ఇది బాలవ్యాకరణ సూత్రమునకు వివరణమై వ్యవహరింప వలయునన్న యభిప్రాయముతో రచింపబడినది. తచ్ఛబ్దములను అంతమందు గలిగియున్న ధాతుజ విశేషణముల మీద యుష్మదర్థక విశేషణముల కగునట్టి 'రు' వర్ణమును, దాని వెనుకటి ఉత్వమునకు అత్వమును రావని సూత్రతాత్పర్యము.

బాలవ్యాకరణమునుబట్టి యుష్మద్విశేషణమునకు బహుత్వమున రు వర్ణము అంతాగమమగును. అప్పుడు పూర్వపదము యొక్క చివరి ఉత్వమునకు అత్వమగును. క్రియాధాతువులమీద నేర్పడిన విశేషణములను ధాతుజవిశేషణము లని యందురు. అట్టి వానిపై తచ్ఛబ్దము చేరవచ్చును. అది, అవి, వాఁడు, వారు - మున్నగునవి తచ్ఛబ్దముచే గ్రహింపబడును. పై ప్రయోగము నందు 'మీరు' అను విశేష్యమునకు 'చూచినారు' అన్నది విశేషణముగా వ్యవహరించుచున్నది. కావున పూర్వమున్న విధినిబట్టి రు వర్ణము వచ్చి, వెనుకటి ఉత్వమునకు అత్వము కావలయును. కాని అట్లగుట లేదు. 'చూచినారు' అన్నది అంతాగమమును పొందక, యథాతథముగా నుండిపోయినది. కావున, ఇది విశేషము. బాలవ్యాకరణము ప్రాయికగ్రహణముచేత అంతాగమము నొందని రూపములను చూపినది. కాని, అవి యిక్కడనున్నట్లు నిత్యముగా అప్రవృత్తిగల రూపములు కావు. కావున స్పష్టతకొరకు దీని నిక్కడ చూపుట యవసరమే.

తొలుత క్రియాజన్యవిశేషణమే యైనను 'చూచినారు' మున్నగు రూపములు సమాపకక్రియలుగానే వ్యవహరించు చున్నవి. కావున, వీనికి విశేషణముల కగు కార్యము కావలసిన

యవసరములేదని యెవరైన వాదింప వచ్చును. కాని, అది యథార్థము కాదు. ఇంకొక విశేషము కూడ నున్నది. బాల వ్యాకరణకారుడు పెక్కురకముల యుదాహరణముల నిచ్చినను, క్రియాజన్యవిశేషణ మొక్కటియు నందు తావు కలుగజేసికొన లేకపోయినది. దానిని మనసునందుంచుకొనియే ప్రౌఢవ్యాకరణ కారుడు క్రియాజన్యవిశేషణములకు సైతము వు ను లు ను, రు ము లును అంతాగమములుగా వచ్చునని జ్ఞాపనముచేయుట యీ సూత్రప్రయోజన మనియు నెంచవచ్చును. అస్మద్విశేషణ మైనపుడు ఏకవచనమునందు 'చూచినాఁడను' అనియు, బహుత్వమునందు 'చూచినారము' అనియు నగును. యుష్మద్విశేషణ మైనపుడు ఏకవచనమునందు 'చూచినాఁడవు' అని యగును. బహువచనమునందు మాత్రమే యీయాగమము కలుగుటలేదు. కావున కలుగనిచోటునే చెప్పినను, ప్రౌఢవ్యాకరణకారుడు కలుగుట కవకాశమున్న యితరస్థలములను జ్ఞాపనము చేయుటకూడ మనసునందు భావించెనని తలచుట యసమంజసము కాదు.

[ప్రౌఢవ్యాకరణ సూత్రము యుష్మద్బహువచనమున కగు ధాతుజ విశేషణముల మీది తచ్ఛబ్దమునకు మాత్రమే యీ కార్యములు కలుగవనుట చేత కొంత అవ్యాప్తికి పాల్పడుట జరుగుచున్నది. 'మంచివారు' మున్నగు విధమయిన గుణవాచకముల మీది తచ్ఛబ్దమునకు సైతము యుష్మద్బహువచన విశేషణమైనపుడు ఈకార్యము జరుగుట లేదు. 'మీరు మంచివారు' మున్నగు విధముగానే ప్రయోగములుండును. దీనిని ప్రౌఢవ్యాకరణకారుడు సూచింప నయిన లేదు.]

**67. అదిశబ్దంబునకు వు ను లు పరంబు లగునపుడును సంబోధనంబునందును దాన యను నాదేశం బగు. (బా - ౩౫)**

నీవు చిన్నదానవు -. నేను చిన్న దానను - ఓ చిన్నదాన.

వ్యాఖ్య - సంబంధమును తెలియజేయునప్పుడు సర్వ శబ్దములును తచ్ఛబ్దముతో సమసించును. తచ్ఛబ్దము మగవానిని చెప్పునప్పుడు 'వాఁడు' అని యగును. స్త్రీని గురించి చెప్పునప్పుడుగాని, జడములను పశుపక్ష్యాదులనుగురించి చెప్పునప్పుడు గాని 'అది' అని యగును. అట్లు పరమైన 'అది' యను శబ్దమునకు వు ను లు పరములైనపుడును సంబోధనమునందును 'దాన' యను శబ్దము ఆదేశముగా నగునని సూత్రార్థము.

'నీవు' అను యుష్మచ్ఛబ్దమునకు 'చిన్నది' యనునది విశేషణము. కావున యుష్మద్విశేషణమునకు ఏకవచనమున వు వర్ణమగునన్న నియమమునుబట్టి 'చిన్నది + వు' అని యగును. ప్రస్తుతసూత్రమునుబట్టి 'అది' యను శబ్దమున కంతటికిని 'దాన' యను శబ్దము ఆదేశము కాగా చిన్నదాన + వు = చిన్నదానవు అని యగును. అట్లే 'నేను' అను అస్మచ్ఛబ్దము కర్తయైనపుడు ను వర్ణము కలిగి 'చిన్నదానను' అని యగును. అట్లే సంబోధ్య వాచకమునందలి 'అది' శబ్దమునకు 'దాన' శబ్దము ఆదేశముకాగా 'చిన్నదాన' అని యగును.

[సంబోధనంబునందుఁ బదంబుతుది యకారేకారంబులకు దీర్ఘంబు విభాష నకు - నన్న తత్సమపరిచ్ఛేదమునందలి (బా-33) సూత్రమునుబట్టి 'చిన్నదానా' అనియు కావచ్చును. "ఓ యామంత్రణంబునం దగు" నన్న (బా-14) సూత్రమునుబట్టి 'ఓ చిన్నదానా' అనియు నగును.]

**68. అన్య యుష్మ దస్మత్కార్యంబులం దుత్తరోత్తరంబు బలీయంబు. . . (బా - ౩౬)**

**వారును మీరును ధన్యులరు - మీరును మేమును ధన్యులము.**

వ్యాఖ్య - ఒక వాక్యమున నొకటికంటె నెక్కువ కర్తృ వాచకము లున్నప్పుడు విశేషణము దేనితో నన్వయింపవలె నన్న ప్రశ్న సహజముగా కలుగును. దానికి సమాధానముగా నీసూత్రము వ్యవహరించుచున్నది.

అన్యవాచకము అని యనగా వాడు, వారు మున్నగు నర్థములుగల శబ్దమని యర్థము. 'రాముడు' మున్నగువిధముగా వాడిన సంజ్ఞయు అన్యవాచకమే యగును.

అన్యవాచకమును, యుష్మద్వాచకమును, అస్మద్వాచ కమును ఒకే వాక్యమునందు కర్తలుగా నుపయోగింపబడినప్పుడు వాని విశేషణము చిట్టచివరి విశేష్యముతో నన్వయింపవలయును. 'వారును మీరును మేమును ధన్యులము' అన్న యుదాహర ణమునందు 'ధన్యులము' అన్నది అస్మద్వాచకముతో నన్వ యించు బహువచన విశేషణము. అన్యవాచకము కంటె యుష్మ ద్వాచకము బలీయము; యుష్మద్వాచకముకంటె అస్మద్వాచ కము బలీయము; అనగా అన్యయుష్మదస్మద్వాచకములలో అస్మద్వాచకము బలిష్ఠము. కావుననే విశేషణమగు 'ధన్యులు' అనునది అస్మద్వాచకముతో 'ధన్యులము' అని యైనది. విశేష్య ముల క్రమము మారినప్పటికిని విశేషణము అస్మద్వాచకమున కనుగుణముగనే పరిణామము నొందును. మీరును మేమును వారును ధన్యులము - మేమును మీరును వారును ధన్యులము - మేమును వారును మీరును ధన్యులము॥ మున్నగు విధముగా నుదాహరణము లుండును.

అన్యవాచకమును; యుష్మద్వాచకమును కర్తలుగా నున్నప్పుడు 'వారును మీరును ధన్యులరు' అని కాని 'మీరును వారును ధన్యులరు' అని కాని యుష్మద్విశేషణము వాడబడును. యుష్మద్వాచకమును, అస్మద్వాచకమును కర్తలైనప్పుడు 'మీరును మేమును ధన్యులము - మేమును మీరును ధన్యులము' అని యన్నట్టు అస్మద్వాచకవిశేషణము వాడబడును. అట్లే అన్యవాచకమును అస్మద్వాచకమును కర్తలైనప్పుడు 'వారును మేమును ధన్యులము' అనికాని 'మేమును వారును ధన్యులము' అనికాని యన్నట్టు అస్మద్వాచక విశేషణమే వాడబడును.

అన్యవాచకమున కుదాహరణముగా సర్వనామమునే కాక, సంజ్ఞను సైతము వాడవచ్చును. రాముఁడును నేనును ధన్యులము - నేనును రాముఁడును ధన్యులము ॥ మున్నగు విధముగా నుదాహరణములను గ్రహింపవచ్చును.

[ఇక్కడ నింకొక్క విషయము. సూత్రమునందు ప్రసక్తమైన కార్యము జరిగిన విశేషణములను మాత్రమే వ్యాకర్త యుదాహరించెను. నిజమున కీసూత్రము విశేషణములకు మాత్రమే పరిమితము కాదు. క్రియ కర్తకు అనురూపముగా నుండవలయును; బహుకర్తృకమైనపుడు క్రియ యేకర్తృవాచకముతో నన్వయింపవలయునో తెలిసికొనుట యావశ్యకము. దానిని తెలుపుటకూడ ఈసూత్రముయొక్క లక్ష్యము. నేనును, నీవును అనునవి కర్తలైనప్పుడు క్రియ అస్మదర్థకముతో నన్వయించి 'నేనును నీవును వచ్చితిమి' అని యగును. అన్యవాచకమును, యుష్మదర్థకమును కర్తలైనప్పుడు 'రాముఁడును నీవును వచ్చితిరి' అని యగును.]

ఇచ్చటి విశేషణము బహువిశేష్యములతో నన్వయించుట చేత, ఇచ్చటిక్రియ బహుకర్తృకమై యుండుటచేత బహుత్వము నొందునన్న విషయమును గుర్తుంచుకోన వలయును.

**69. ఏకవాక్యమునం దొకానొక్కండు తక్క సర్వపదంబులు క్రమనిరపేక్షంబుగం బ్రయోగింపంబడును. (బా - ౬౩)**

పూర్వమిది పరమిది యను నియమ మపేక్షింపక వాక్యమం దెల్ల పదంబులు వలసినట్లు ప్రయోగింపందగును. ఏని ప్రభృతిశబ్దంబులు కొన్ని నియమసాపేక్షంబులయి యుండు॥ గాలి చల్లఁగా వీచెను - వీచెను జల్లఁగా గాలి - చల్లఁగా గాలి వీచెను - వీచెను గాలి చల్లఁగా - గాలి వీచెను జల్లఁగా - చల్లఁగా వీచెను గాలి.

వ్యాఖ్య - ఒకవాక్యమునందలి పదములు, ఇది ముందుగా నుండవలయునని, యిది వెనుకగా నుండవలయునని యేవిధమైన నియమము కాని క్రమముకాని యవసరములేకుండ నుపయోగింపబడవచ్చునని సూత్రార్థము. "ఒకానొక్కండు తక్క" అని సూత్రమునందు చెప్పుటవలన ఏని, ఏసి - మున్నగు శబ్దములు మాత్రము నియమము ననుసరించి ప్రయుక్తము లగునని సూచనచేయుట జరుగుచున్నది;

సాధారణముగా తెలుగువాక్యమునందు కర్త, కర్మ, క్రియ వరుసగా నుండును. కర్తకు విశేషణములుగా నుండునవి కర్తకు సన్నిహితములుగాను, కర్మకు విశేషణములుగా నుండునవి కర్మకు సన్నిహితములుగాను వర్తించును. క్రియావిశేషణములు క్రియ నంటిపెట్టుకొని యుండును. ఇట్లుండవలయునన్న గట్టి నియమమేమియును లేదు. అందువలన ఏని, ఏసి మున్నగు కొన్నిశబ్దముల విషయమునందు తక్క తక్కినచోట్ల క్రమాపేక్ష లేకుండగనే యుపయోగింప వచ్చును. ఎట్లుపయోగించినను, అర్థము సువ్యక్తమగునట్లుగా చూచుకొనుట వక్తయొక్కవిధి.

కావున అర్థబోధయందు క్లిష్టతకాని, సంకీర్ణత కాని కలుగనంత వరకు మాత్రమే క్రమాపేక్షలేకుండ పదములను వాడవచ్చును. సంకీర్ణత కలిగెడి సందర్భము వచ్చినప్పుడు దానిని పరిహరించుట కొరకు క్రమమును పాటించుట యవసరము.

ఉదాహరణమునందు 'గాలి' కర్తృవాచకము; 'వీచెను' క్రియాపదము; 'చల్లగా' క్రియావిశేషణము. వీని నెన్నివిధము లుగా మార్చినను అర్థబోధయందు బాధ లేదు. కావుననే సూరి మూడు మాటలు గల వాక్యమును మాటల క్రమమును మార్చి ఆరు వాక్యములుగా నిరూపించెను.

# సమాస పరిచ్ఛేదము

**1. సమర్థంబు లగు పదంబు లేకపదం బగుట సమాసంబు.**

**(బా - ౧)**

పృథగ్భూతంబు లగు నర్థంబుల కేకార్థీభావంబు సామర్థ్యంబు. పృథక్ప్రసిద్ధార్థంబు లగు పదంబుల కేకార్థంబునందు వృత్తి సామర్థ్యము.

వ్యాఖ్య - సామర్థ్యము గలిగిన భిన్నపదము లొకేపద మైనచో సమాసమగు నని యర్థము.

సామర్థ్యము అనునది వ్యాకరణ శాస్త్రమున రెండు విధములుగా నుండును. 1. వ్యపేక్షాసామర్థ్యము 2 ఏకార్థీభావ సామర్థ్యము. ఒక వాక్యమునందలి భిన్నభిన్నపదములకు గల యన్వయము వ్యపేక్షాసామర్థ్యము 'రాముఁడు రావణుని సంహారించెను' అని యన్నప్పుడు క్రియ 'సంహారించెను' అనునది. 'ఎవరు ?' అని ప్రశ్న వేయగా 'రాముడు' అను సమాధానము వచ్చును. 'ఎవరిని?' అని ప్రశ్న వేయగా 'రావణుని' అను సమాధానము వచ్చును. కావున ఏకవాక్యమునందు ఆకాంక్షనుబట్టి వేర్వేరు పదముల కొకసంబంధము స్పష్ట మగును. ఇట్టి ఆకాంక్ష వలన ఏర్పడిన సంబంధమునకు వ్యపేక్షాసామర్థ్యము అని పేరు. ఇది వాక్యవిషయము గావున నిచ్చట నవసరము కాదు.

రెండవది ఏకార్థీభావసామర్థ్యము. దానినే సూరి "పృథగ్భూతంబులగు..." మున్నగు విధముగా వివరించెను. పృథగ్భూతంబు లగు నర్థంబులు అని యనగా వేర్వేరుగా నున్న

యర్థము లని యర్థము: వీనికి ఏకార్థీభావము సామర్థ్యము. ఏకార్థీభావము అని యనగా ఒకే యర్థమునందు అన్వయమును గలిగించుట అని యర్థము. దీనినే మరల వివరించెను. వేర్వేరుగా ప్రసిద్ధము లయిన యర్థములు గలిగిన పదములను ఏకార్థమునందు వర్తింపజేయుట సామర్థ్యము. అట్లేర్పడిన భిన్నపదముల సముదాయ రూపమునకు సమాసము అని పేరు. 'రాజనందనుఁడు' అనునప్పుడు 'రాజు' అని 'నందనుఁడు' అని రెండు శబ్దములు గలవు. రాజు అనగా ప్రభు వని యర్థము. నందనుఁ డనగా కొడు కని యర్థము. ఈ రెండింటికిని వేర్వేరుగా వేర్వేరర్థములు గలవు. రెండింటిని 'రాజు యొక్క నందనుఁడు' అను నర్థమున వర్తింపజేసినపుడు సమాస మగును. ఇది ఏకార్థీభావసామర్థ్యము. సమాసవిషయమగుటచేత సూరి దీనినే వివరించెను.

[సమాసమనఁగా సంయోగదశయందుఁ గలిగెడు విభక్తిలోపాత్మక పదస్వరూప సంగ్రహము - అని సమాసపరిచ్ఛేదమున కవతారికగా ముందు తెలిపి 'ఇది లుక్సమాస విషయము' అని కుండలీకరణములందు ప్రౌఢ వ్యాకరణము దెలిపెను. సాధారణముగా సమాసములందు వేర్వేరుపదములు సంగ్రహింపబడి యేకపదముగా భాసించును. అట్టి సమయమునందు పూర్వ పదాంతముననున్న విభక్తికి కాని, వర్ణమునకు కాని లోపము వచ్చుచుండును. 'నాతమ్ముఁడు' అని యన్నప్పుడు 'యొక్క'కు లోపము వచ్చును. 'పూసెజ్జ' అని యన్నప్పుడు 'వు'వర్ణమునకు లోపము వచ్చును. ఇటుకాక 'నాచేతి ప్రోపు' మున్నగుచోట్ల విభక్తిలోపము కలుగుటలేదు, ఇట్లు విభక్తిలోపము కలుగనివానిని అలుక్సమాసములని యందురు. వ్యాకర్త చెప్పిన లక్షణము లుక్సమాసముల వరకు సరిపడును. అలుక్సమాసముల విషయమున సరిపడదు. కావున పై లక్షణము స్థూలముగా నిరూపించునదే కాని సమగ్రము కాదు. ఆసంగతిని గుర్తించియే ప్రౌఢవ్యాకరణకారుడు కుండలీకృత వాక్యమునందు లక్షణావధిని సూచించెను.]

**2. సాంస్కృతి కాచ్ఛిక మిశ్రభేదంబుచే సమాసంబు త్రివిధంబు. (బా - ౨)**

సాంస్కృతికం బని యాచ్ఛికం బని మిశ్రం బని సమాసంబు త్రివిధంబు. అందు సాంస్కృతికంబు సిద్ధంబని సాధ్యంబని ద్వివిధంబు. కేవలసంస్కృతశబ్దముల సమాసంబు సిద్ధంబు నాఁబడు॥ రాజాజ్ఞ - తటాకోదకము - లక్ష్మీవల్లభుఁడు. సంస్కృతసమంబుల సమాసంబు సాధ్యంబు నాఁబడు॥ రాజునాజ్ఞ - తటాకంబునుదకము - లక్ష్మీవల్లభుఁడు. తక్కిన తెనుఁగులసమాసం బాచ్ఛికం బనంబడు॥ ఱేనియానతి - చెఱువునీరు - సిరిచెలువుఁడు. ఉభయంబులు గూడినది మిశ్రంబనంబడు॥ రాజుముదల - చెఱువునుదకము - సిరివల్లభుఁడు.

వ్యాఖ్య - సమాసమునందు పెక్కుపదము లుండునని తొలి సూత్రవిషయమున ప్రస్తావించుకొంటిమి. ఆ పదములను బట్టి సమాసములు మూఁడు విధములుగా నుండును. మొదటిది సాంస్కృతికము. ఇది మరల రెండు విధములు. 1. సిద్ధము. 2. సాధ్యము. కేవలసంస్కృతపదములతో నేర్పడిన సమాసమునకు సిద్ధసమాసము అని పేరు. 'రాజాజ్ఞ' అని యనినప్పుడు రాజ్ఞః + ఆజ్ఞా అని విభాగింపవలయును. రాజ్ఞః (రాజుయొక్క) ఆజ్ఞా (ఆనతి) అని దీనికి విగ్రహము. ఇది సమాస మగునపుడు నడుమ సవర్ణదీర్ఘసంధి కలుగును. 'రాజాజ్ఞా' అని యగును. ఇంత వరకు సంస్కృతవ్యాకరణవిధానము ననుసరించియే యీ రూప మేర్పడినది. తెనుగున సాధారణముగా దీర్ఘాంతశబ్దము లుండవు. "నామంబుల తుది దీర్ఘంబునకు హ్రస్వం బగు" అనుసూత్రమును బట్టి కడపటి దీర్ఘమునకు హ్రస్వము కలుగగా 'రాజాజ్ఞ' అను రూపము సిద్ధించును. ఇట్లే తటాక + ఉదకః అను పదములకు

సామర్థ్యమువలన సమాసత్వము కలిగినది. గుణసంధి కలుగగా 'తటాకోదకః' అనిరైయెనది. ఇంతవరకు సంస్కృతవ్యాకరణమునే యనుసరించితిమి. ఇప్పుడు 'ఉదకః' అనునది తెలుగున అమహద్వాచక మగుటవలన "అమహన్నపుంసకముల కదంతములకు ముపర్ణకం బగు" అను సూత్రమునుబట్టి కడపట ముపర్ణకమును చేర్తుము. ఇప్పుడు 'తటాకోదకము' అను రూప మేర్పడును. ఇట్లే లక్ష్మీ + వల్లభః అను రెండుపదములును సమసింపగా 'లక్ష్మీవల్లభః' అని యగును. ఇంతవరకు సంస్కృతసంప్రదాయము. పై సమాసమునకు 'విష్ణువు' అని యర్థము. కావున మహద్వాచకము; సంస్కృతమున 'వల్లభ' యనునది పుంలింగ శబ్దము; కావున పుంలింగం బయి మహద్వాచకం బయిన శబ్దములకు 'ఉత్వ డుజ్ఞులు' కలుగునను విధిచేత 'లక్ష్మీవల్లభుఁడు' అను రూప మేర్పడును. సంస్కృతవ్యాకరణసంప్రదాయము ననుసరించి సంస్కృతపదముల కైన సమాసము సిద్ధసమాసము. సమాసాంతమున మాత్రమే తెలుగువ్యాకరణమునుబట్టి కొలది మార్పులు జరుగును.

సాధ్యసమాసమునుగూర్చి చూతము. తత్సమపదములతో నేర్పడు సమాసము సాధ్యము. రాజు + ఆజ్ఞ - ఇందు రెండు పదములును తత్సమములే. రాజుయొక్క ఆజ్ఞ యని విగ్రహము చెప్పకొనవలయును. కావున "షష్ఠీసమాసంబున నుకార ఋకారంబుల కచ్చు పరం బగునపుడు నుగాగమంబగు" నను విధిచేత రాజు + ను + ఆజ్ఞ = రాజునాజ్ఞ అని యగును. ఇట్లే తటాకంబు + ఉదకము అని యుండగా నుగాగమము గలిగి 'తటాకంబునుదకము' అని యగును. లక్ష్మీ + వల్లభుఁడు అనునప్పుడు

మార్పేమియు లేకుండ 'లక్ష్మీవల్లభుఁడు' అని యగును. వీని యందలి పదములు తత్సమములు. అనగా సంస్కృతనామములు ఆంగికము లయిన మార్పులు లేకుండ తెనుగు విభక్తులను బొంది శబ్దములుగా ఏర్పడినవి. కావుననే వీనికి సంధిచేయునపుడు తెలుగునందలి సంధివిధానమునే యనుసరింపవలయును. ఇట్లేర్ప డిన సమాసములను సాధ్యము లని యందురు. ఇంతవరకు చెప్పి కొనిన సిద్ధములు సాధ్యములును - రెండును సాంస్కృతిక సమాసములే.

రెండవది ఆచ్ఛికము. అచ్చ తెనుగుపదములచేత నేర్పడు సమాసమునకు ఆచ్ఛికమని పేరు. 'ఱేనియొక్క ఆనతి' అను నర్థమున ఱేని + ఆనతి అను రెండుపదము లుండును. ఇచ్చటి మాటలు రెండును ఆచ్ఛికములే. ఇచ్చట సంధి లేనందువలన "సంధి లేనిచో స్వరంబు కంటెం బరం బయిన స్వరంబునకు యడాగమం బగు" అను విధిచేత ఆగమయకారము కలిగి ఱేని + య్ + ఆనతి = ఱేనియానతి అని యగును. చెఱువు + నీరు, సిరి + చెలువుఁడు - ఇక్కడి పదము లన్నియు అచ్చతెలుగులే. ఉత్తరపదము మొదట హల్లుండుటచే సంధి ప్రసక్తిలేదు. కావున యథాతథముగనే ఆ పదములకు సమాసత్వము కలిగినది. ఇట్టి వానిని ఆచ్ఛిక సమాసము లని యందురు. వీనినే పూర్వ వ్యాకర్తలు 'సమాసకములు' అని పేర్కొనిరి.

మూడవభేదము మిశ్రసమాసము. తత్సమంబులకును ఆచ్ఛి కంబులకును గలిగిన సమాసమును మిశ్రము అని యందురు. రాజు + ముదల. ఇచ్చట పూర్వశబ్దము తత్సమము; ఉత్తర శబ్దము తెనుగు. రెండింటికి 'రాజుముదల' అను రూపమున

సమాస మేర్పడినది. చెఱువు + ఉదకము; సిరి + వల్లభుఁడు. ఇచ్చట పూర్వశబ్దములు అచ్చతెలుగులు; ఉత్తర శబ్దములు తత్సమములు. తత్సమాచ్ఛికములకు రెండింటికి నైన సమాసము లగుటవలన వీనికి మిశ్రసమాసము లని పేరు.

3. తత్పురుషాదులకు లక్షణంబు ప్రాయికంబుగ సంస్కృతోక్తంబ యగు. (బా - 3)

తత్పురుష బహువ్రీహి ద్వంద్వంబు లని సమాసంబులెల్లం ద్రివిధంబు లయి యుండు. అవి ప్రాయికంబుగా నుత్తరాన్యోభయపదార్థ ప్రధానంబు లయి యుండు. అందుఁ దత్పురుషంబు వ్యధికరణం బని సమానాధికరణం బని ద్వివిధంబు ద్వితీయాదులకు మీఁదిపదంబుతోడ సమాసంబు వ్యధికరణంబు నాఁబడు॥ నెలతాల్పు - నెలతక్కువవాఁడు - దేవర మేలు - దొంగభయము - రామునిబాణము - మాట నేర్పరి. విశేషణంబునకు విశేష్యంబుతోడ సమాసంబు సమానాధికరణంబు నాఁబడు. ఇది యె కర్మధారయంబు నాఁబడు. సరసపువచనము - తెల్లగుఱ్ఱము - మంచిరాజు. ఇది సంఖ్యాపూర్వకంబు ద్విగువు నాఁబడు॥ ముజ్జగములు - ముల్లోకములు. బహువ్రీహి॥ ముక్కంటి - చలివెలుఁగు. ద్వంద్వము॥ తల్లిదండ్రులు - అన్నదమ్ములు. ప్రాయికంబుగా ననుటచే సంస్కృత లక్షణంబు దొడరని సమాసంబులుంగల దని సూచింపంబడియె. దానంజేసి చిగురుఁగేలు - బంటిమోవి యిత్యాదు లయిన యుపమాన పూర్వపద కర్మధారయంబులు గ్రాహ్యంబులు. ముఖపద్మము - చరణకమలములు॥ ఇట్టి యుపమానోత్తరపదంబులు గలవు గాని విపరీతంబులు సిద్ధంబులు లేవని యెఱుంగునది. సిద్ధంబు సర్వంబు గ్రాహ్యంబు॥ రాజపురుషుఁడు - నీలోత్పలము - పీతాంబరుఁడు -

రామలక్ష్మణులు. కేవల సంస్కృతశబ్దము వికృతి శబ్దముతోడ సమసింపదు. దానంజేసి యనేకములు లల్పదండికాద్యులు దుష్టములని తెలియునది.

వ్యాఖ్య - తెలుగునందు గల తత్పురుష మున్నగు సమాసములయొక్క లక్షణము తరుచుగా సంస్కృతమునందాయా సమాసముల కెట్లు చెప్పిరో యట్లే యుండు నని యర్థము. వివరణమునందు సూరి వానిని స్పష్టముచేసెను.

అర్థమునుబట్టి సమాసములు మూడు విధములుగా నుండును. సాధారణముగా ఉత్తరపదార్థప్రాధాన్యము గల వానిని తత్పురుషసమాసములని యందురు. అన్యపదార్థ ప్రాధాన్యము గలవానిని బహుప్రీహి సమాసము లని యందురు. ఉభయపదార్థ ప్రాధాన్యము గలవానిని ద్వంద్వ సమాసము లని యందురు.

తత్పురుషసమాసము మరల రెండు రకములుగా నుండును.

1. వ్యధికరణము - ద్వితీయాదివిభక్త్యంతములు మీది పదముతో సమసించిన యెడల వ్యధికరణ మగును. దీనికే తత్పురుష మను పేరు రూఢమై యున్నది. 'నెలతాల్పు' అనునప్పుడు 'నెలను ధరించువాఁడు' అని యర్థము. ఇందలి పూర్వపదము ద్వితీయావిభక్త్యంతము. కావున దీనిని ద్వితీయా తత్పురుష మని యందురు. 'నెలతక్కువవాఁడు' అనగా 'నెల చేత తక్కువైనవాఁడు' అని యర్థము. ఇందలి పూర్వపదము తృతీయా విభక్త్యంతము. కావున దీనిని తృతీయాతత్పురుష మని యందురు ఇట్లే పూర్వపదము ద్వితీయాదివిభక్త్యంతమై తరు

వాతి పదముతో సమసింపగా తత్పురుష సమాస మగును. భిన్న విభక్తుల కేర్పడిన సమాసమగుటచే దీనికి వ్యధికరణసమాస మను పేరు కలిగెను.

2. సమానాధికరణము: విశేషణమునకు విశేష్యముతోడ సమాసము సమానాధికరణము అని సూరి నిర్వచించెను. పూర్వ పదము విశేషణమును, ఉత్తరపదము విశేష్యము నైనయెడల వానివలన నేర్పడిన సమాసము సమానాధికరణ మనిపించు కొనును. ఇందలి పూర్వపదము ప్రథమాంతమై కాని స్త్రీసమమై కాని యుండుననుట గమనార్హము. సరసము + వచనము-అను నప్పుడు పూర్వపదము విశేషణము; ప్రథమావిభక్త్యంతము. 'కర్మధారయంబుల మువర్ణకంబునకుం బుంపు లగు' అను సూత్రమునుబట్టి సరసపువచనము అని యగును. సమాసము నందు 'వచనము' అను నుత్తర పదమునకే అర్థమునుబట్టి ప్రాధా న్యము గలదు. 'సరసము' అను ముందరిపదము తరువాతి పదము యొక్క విశేషమును మాత్రమే తెలియజేయును. ఇట్లె తెల్ల + గుఱ్ఱము; మంచి + రాజు మున్నగువానియందు కూడ పూర్వపదములు విశేషణములు; ఉత్తరపదములు విశేష్యములు. ఈ రెండింటికినైన సమాసము లగుటవలన సమానాధికరణములే యగును. సమానాధికరణసమాసమునే కర్మధారయసమాస మని కూడ అందురు.

ఇందు ఇంకొక అవాంతరభేదముకూడ కలదు. ఇందలి పూర్వపదము సంఖ్యావిశేషణమై తరువాతిపద మగు విశేష్య ముతో సమసించిన యెడల దానిని ద్విగుసమాసమని యందురు. మూఁడు + జగములు - అని యన్నప్పుడు 'మూఁడు' సంఖ్యా

విశేషణము. 'జగములు' విశేష్యము. ఈ రెండును సమసింపగా నేర్పడిన రూపము 'ముజ్జగములు' అనునది ద్విగుసమాసము. ఇట్లే 'ముల్లోకములు' మున్నగు సమాసములను పేర్కొందురు.

మూఁడు + కన్నులు అను రెండుపదములు కలియగా 'ముక్కంటి' అను సమాస మేర్పడును. దీనికి మూఁడు కన్నులు గలవాడైన ఈశ్వరుఁడు అని యర్థము. సమాసము నందలి పూర్వశబ్దమునకు గాని, ఉత్తరశబ్దమునకు గాని అర్థమున ప్రాధాన్యము లేదు. మరేదో పదముయొక్క అర్థమునకు ప్రాధాన్యము కలుగుచున్నది. కావుననే అన్యపదార్థ ప్రధానమైనవానిని సూరి బహువ్రీహిసమాసములని నిర్ణయించెను. 'చలివెలుఁగు' అనునప్పుడు చల్లని వెలుగు కలవాడు అను నర్థము కలిగి 'చంద్రుఁడు' అను తాత్పర్యమును బోధించును. చలి + వెలుగు అను రెండు పదములును కాక అన్యపద మగు 'చంద్రుఁడు' అను పదము అర్థబోధయందు ప్రాధాన్యము వహించుటచే ఇదియు బహువ్రీహిసమాసమే యగును.

తల్లి + తండ్రి అను రెండు పదములును గలియుటచే 'తల్లిదండ్రులు' అను సమాస మేర్పడును. అర్థబోధయందు పూర్వపదమునకును ఉత్తరపదమునకునుగూడ సమప్రాధాన్యము గలదు. ఇట్లు ఉభయపదార్థ ప్రధానము లైనవానిని సూరి ద్వంద్వసమాసము లని నిర్ణయించెను. అన్నదమ్ములు, అక్కసెల్లెండ్రు - మున్నగునవి యిట్టి సమాసములు.

ఇంతవరకు సంస్కృతభాషయందు గల సమాసములను బోలిన సమాసములనే చూచితిమి. సూత్రమునందు 'ప్రాయిక

ముగా' అని యుండుటచేత సంస్కృతమున కనుపట్టని సమాస ములును తెలుగున గల వని సూరి సూచించెను.

ఉపమానోపమేయములకు నేర్పడినవికూడ కర్మధారయ సమాసములే యగును. ఉపమానము ఉత్తరపదముగా నున్న యెడల ఉపమానోత్తరపదకర్మధారయము అని యందురు. ముఖ పద్మము - అనగా పద్మమువంటి ముఖము అని యర్థము. ముఖము ఉపమేయము; పద్మము ఉపమానము - ఉత్తరపదమై యున్నది. ఇట్టివే 'చరణకమలంబులు' మున్నగు సమాసములు. ఉపమానోత్తర పద కర్మధారయములు సంస్కృతము నందును గలవు.

వీనికి విపరీతములైనవి సంస్కృతమునందు లేవు. అనగా ఉపమానము పూర్వపదముగా నున్న కర్మధారయములు సం స్కృతమునందు లేవు కావున సాంస్కృతికములైన సిద్ధసమాస ములు తెలుగునందు నుండుటకు వీలులేదు. సంస్కృతమునందలి సమాసముల నన్నింటిని యథాతథముగా గ్రహించి, సమాసాం తమున తెలుగు సంప్రదాయమును బట్టి మార్పు చేసికొనవల యును. రాజపురుషః అన్న సంస్కృత సమాసము, మహత్పుం లింగ మగుటవలన ఉత్వడుజ్ఞులు కలిగి రాజపురుషుఁడు అని యగును. పీతాంబరః అనునది యిట్లే పీతాంబరుఁడు అని యగును. నీలోత్పలమ్ అనునది నపుంసక శబ్దము కావున తెలు గున మువర్ణకము కలిగి నీలోత్పలము అని యగును. రామ లక్ష్మణౌ అను ద్వంద్వసమాసము తెలుగున ఉత్వమును, బహు వచన లు ప్రత్యయమును పొంది రామలక్ష్మణులు అని

యగును. "సిద్ధంబు సర్వంబు గ్రాహ్యంబు" అని యనుటవలన సంస్కృతమునందలి సర్వ సమాసములను గ్రహింపవచ్చును.

ఇంక, సంస్కృతమున నుండుటకు వీలులేని ఉపమాన పూర్వపద కర్మధారయములు తెలుగునందుమాత్రమే కలవు. చిగురువంటి కేలు అను నర్థమున 'చిగురుఁగేలు' అనియు, జున్ను (తేనె) వంటి మోవి అను నర్థమున 'జుంటిమోవి' అనియు సమాసములు గలవు. ఇందు పూర్వపదములు ఉపమానములు; ఉత్తరపదములు ఉపమేయములు. కావున నివి ఉపమాన పూర్వపదకర్మధారయములు.

కేవలసంస్కృతశబ్దము వికృతిశబ్దముతోడ సమసింపదు. కేవల సంస్కృతశబ్ద మనగా తెలుగు విభక్తిని పొందని శబ్దమని యర్థము. తెలుగువిభక్తి చేరకుండ నున్న సంస్కృతశబ్దములు అచ్చ తెలుగు శబ్దముతో సమసింపవు. అనగా అట్లు సమాసములుగా చేయరాదని యర్థము. అనేక + మాఱులు అని యున్నదనుకొందము. ఇందు పూర్వపదము సంస్కృతము; ఉత్తరపదము తెలుగు. కావున 'అనేకమాఱులు' మున్నగు విధముగా సమాసము చేయరాదు. ఇట్టి సమాసములను దుష్టసమాసములని శిష్టులు నిరసింతురు. వీనికే 'వైరిసమాసములు' అను పేరుకూడ కలదు. అల్పము + దండు అనునప్పుడు పూర్వపదము తత్సమము; ఉత్తరపదము ఆచ్ఛికము. సమాసమునందు పూర్వపదము కొనసనున్న మువర్ణకమునకు లోపము కలిగి 'అల్పదండు' అని యైనది. ఇదియు వైరిసమాసమే.

[రెండవ సూత్రమునందలి మిశ్రసమాసమునకును వైరి సమాసము నకును భేదమును గుర్తింపవలయును. 'తటాకంబు నీరు' అనునపుడు పూర్వపదము తత్సమము (సాంస్కృతిః సు). ఉత్తరపదము అచ్చికము. అయినను సమాసమున వర్ణలోపము మున్నగు మార్పులు లేకపోవుటవలన నిట్టివి అంగీకార్యములే. మిశ్రసమాసము పరిమిత వర్ణములను గలిగి యుండును.]

4. ఆ ఈ ఏ యను సర్వనామంబులు త్రికంబు నాఁబడు. (బా - ౪)

వ్యాఖ్య - మూడింటియొక్క సముదాయమునకు 'త్రికము' అని సంజ్ఞ కలదు. వ్యాకరణమున మాత్రము ఈ త్రికము అను సంజ్ఞ 'ఆ ఈ ఏ' అను సర్వనామములను మూడింటిని కలిపి తెల్పును. 'ఆ' యనునది దూరమును నిర్దేశించును. 'ఈ' యను నది దగ్గఱను నిర్దేశించును. 'ఏ' యనునది ప్రశ్నార్థకము.

5. కర్మధారయంబు త్రిక స్త్రీసమ ముగంత ధాతుజ విశే షణ పూర్వపదంబయి యుండు. (బా - ౫)

ఆ చందము - ఈ చిందము - ఏ బృందము - వాఁడిమాట - పోఁడిపాట - జెడిదపుటడిదము - మడిసెడుదడములు. ఈ నియమ ముచేః బల్లిదుఁడు మల్లుఁడు - కావలుఁడు రావణుఁడుః ఇత్యాదుల సమాసంబు లేదు.

వ్యాఖ్య - కర్మధారయసమాసమున త్రికము గాని, స్త్రీసమ పదముగాని, మువర్ణకాంతపదము గాని, క్రియాజన్య విశేషణము గాని పూర్వపదముగా నుండి ఉత్తరపద మగు విశేష్యముతో

సమసించును. దీనినిబట్టి పైరీ చెప్పినవానికి భిన్నములయిన పదములతో కర్మధారయ సమాసము కలుగదని నిశ్చితార్థము.

త్రికము = ఆ ఈ ఏ అను నిర్దేశాత్మక సర్వనామములు. ఆ + చందము; ఈ + చిందము; ఏ + బృందము. వీనియందు పూర్వపదములు నిర్దేశాత్మక సర్వనామములు

స్త్రీసమము - ప్రథమైకవచనము లోపించిన శబ్దము. వాఁడి + ఘాట; పోఁడి + పాట. వీనియందు పూర్వపదములు స్త్రీసమములు; వీని కడపట ప్రథమైకవచనమునందు కావలసిన మువర్ణము కాలేదు.

ముగంతము - ముక్ + అంతము అని విభాగము చేయవలయును. కర్మధారయమునందు పూర్వపదము మువర్ణకేతర విభక్తితో నుండు నవకాశము లేదు. అట్లున్నచో అది తత్పురుష సమాస మగును. కాని కర్మధారయము కాదు. మువర్ణకేతర విభక్తి పర మగునప్పుడు మాత్రమే ముగాగమ మగును. (బా: తత్సమ-40) కర్మధారయము నందు ముగాగమమునకు ప్రసక్తియే లేదు. కావున 'ముగంతము' అనునప్పుడు ప్రకరణమునుబట్టి మువర్ణకాంతమునే గ్రహింపవలయును. "అమహాన్న పుంసకముల కదంతములకు మువర్ణకంబగు" (బా.తత్సమ - 39) అను సూత్రమునుబట్టి, మువర్ణకము కలిగిన శబ్దములకే యిక్కడ ప్రసక్తి కలదు. బెడిదము + అడిదము. పూర్వశబ్దము మువర్ణకాంతము. కావున సమాసము కావచ్చును. "కర్మధారయంబుల మువర్ణకంబునకుం బుంపు లగు" (బా.సంధి - 32) అను సూత్రముచేత బెడిదపు + అడిదము అని యైనది. తరువాత

"కర్మధారయంబులం దుత్తున కచ్చు పరంబగునపుడు టుగాగమం బగు" (బా.సంధి - 28) అను సూత్రముచేత, బెడిదపు + టు + అడిదము = బెడిదపుటడిదము అని యైనది.

ధాతుజవిశేషణము = క్రియాపదమువలన నేర్పడిన విశేషణము. వచ్చిన - వచ్చుచున్న - వచ్చెడు - రాఁగల - రాని॥ మున్నగునవి ధాతుజ విశేషణముల కుదాహరణములు.

మడిసెడు + దడములు - ఇందు పూర్వపదము (మడియు + ఎడు) క్రియాజన్యవిశేషణము. కావున ఇదియు కర్మధారయసమాసమునందు పూర్వపదముగా నుండవచ్చును.

పైని వివరించినరీతిని కర్మధారయసమాసములుండుట కాక్షేపములేదు; తద్భిన్నముగా నుండుటకు వీలులేదు. డువర్ణకాంత వువర్ణకాంత శబ్దముల వంటివి పూర్వపదములయినచో ఉత్తరపద మగు విశేష్యముతో సమసింపవు. బల్లిదుఁడు మల్లుఁడు - అని యన్నప్పుడు 'మల్లుఁడు' అను శబ్దము విశేష్యము; 'బల్లిదుఁడు' అను శబ్దము విశేషణము. విశేషణ విశేష్యములుండుటవలన కర్మధారయసమాసమున కవకాశము కలదు. కాని, పూర్వశబ్దము త్రికాదులలోనిది కాక డువర్ణకాంత మగుటవలన ఉత్తరపదముతో సమసింపదు. కావున రెండు పదములును వ్యస్తముగా (విడివిడిగా) నుండిపోవును.

**6. షష్ఠీతత్పురుషంబులందు నగాగమంబు విభాష నగు.**

(ప్రౌ - ౧)

ఎలజవ్వనంబున విలసనంబు॥ భార. ఆది. ౩ ఆ॥ యోగక్షేమంబున తెఱఁగు॥ భార. ఉద్యో. ౧ ఆ॥ అరసంబున యురవడికిన్॥ నిర్వ. ౬ ఆ॥

వ్యాఖ్య - షష్ఠీతత్పురుషసమాసముల యందలి షష్ఠ్యంత పదమునకు విభాషగా నగాగమ మగునని సూత్రార్థము.

ఎలజవ్వనంబుయొక్క + విలసనంబు-అని యున్నప్పుడు సమాసవిభక్తికి లోపము కలిగి 'ఎలజవ్వనంబు + విలసనంబు' అని యగును. ప్రస్తుతసూత్రముచేత 'న' వర్ణము ఆగమము కాగా ఎలజవ్వనంబు + న + విలసనంబు = ఎలజవ్వనంబున విలసనంబు అని యగును.

యోగక్షేమంబుయొక్క + తెఱఁగు అనునవికూడ సమసించునపుడు 'యొక్క'కు లోపమును 'నగాగమము'ను కలుగగా 'యోగక్షేమంబున తెఱఁగు' అని యగును. అరదంబు యొక్క + యురవడికిన్ - అని యున్నప్పుడు 'అరదంబున యురవడికిన్' అను సమాసరూపముకూడ నిట్లే యేర్పడును.

ఇచ్చట నివి సమాసములు కావనియు, పూర్వపదము తుద నున్నది సప్తమీవిభక్తి ప్రత్యయమయిన 'నన్' వర్ణకమే కాని, ఆగమముకాదనియు నెవ్వరైన నందురేమోయని యనుమానించి వ్యాకర్త యట్లనుటకు వీలుకాని ప్రయోగము లను ప్రదర్శించుచున్నాడు. మొదటి ప్రయోగమునకు 'ఎల జవ్వనమునందలి విలసనము' అని విగ్రహము చెప్పి ఎలజవ్వ నంబునన్ + విలసనంబు - అని చెప్పవచ్చును. అపుడు "ద్రుతంబు నకు సరళస్థిరంబులు పరంబులగునపుడు లోపసంశ్లేషంబులు విభాషనగు" అను (బా. సంధి. 18) సూత్రమునుబట్టి ద్రుతము నకు లోపమువచ్చి 'ఎలజవ్వనంబున విలసనంబు' అని కావచ్చును. కాని పరమందు పరుషమున్నప్పుడు ద్రుతకార్యము జరిగి సరళా

దేశముకాగా 'యోగక్షేమంబునఁ దెలుఁగు' అని యగును; పరమందు స్వరమున్నప్పుడు 'అరదంబున నురవడికిన్' అను విధముగా ద్రుతము మీదియచ్చుతో సన్నికర్ష పొందవలయును. అట్లు కానిరూపములను చూపి, వ్యాకర్త మిక్కిలి జాగరూకతను ప్రదర్శించి, యివి సమాసము అను విషయమును సమర్థముగా స్థాపించుచున్నాడు.

[ఇచ్చట తత్త్వబోధినీ వ్యాఖ్యాకారులు "పరిశీలింపఁగా నీ ప్రయోగములందు ద్రుతకార్యములు గలవనినను విరోధమేమియును లేదు. ఉదాహృతప్రయోగములు యతిప్రాసాది స్థలములు గావుగదా!" అని యొక యభిప్రాయమును వెలువరించిరి. అట్టి స్థలములు కాకపోవచ్చును. అంత మాత్రమున ద్రుతకార్యము గలదని యనుట యెట్లు? ముద్రితప్రతుల యందైనను, అట్టి పాఠములు లభింపవలయునుగదా! దీని నెట్లును సప్తమీ విభక్తియందలి నవర్ణకమే యనవలయునన్నచో, ఉపాయాంతరము లేక పోలేదు. ఈ సమాసములను షష్ఠీతత్పురుషములుగా కాక, సప్తమీతత్పురుషములుగా స్వీకరించి, అలుక్సమాసము లనుకొన్నచో "అరదంబునన్ + ఉరవడికిన్" అన్నచోటి సమాసద్రుతమునకు లోపముచేసి 'అరదంబున యురవడికిన్' అను రూపమును సాధింపవచ్చును. కాని యింతటి ప్రక్రియా గౌరవము ప్రయోజనవంతము కాదు. కావున షష్ఠీతత్పురుషమందు నగాగమప్రాప్తి నంగీకరించుటయే యుత్తమము. 'వనమునయందు' మున్నగుచోట్ల సైతము నగాగమము కలుగుట చూచితిమి. ఇదియు నట్టిదే.]

సూత్రమున 'విభాష' యను పదముండుటచేత నగాగమము వికల్పముగా నగును. నగాగమము కలుగని యెడల ఎల జవ్వనంబు విలసనంబు, యోగక్షేమంబు తెలుఁగు, అరదంబు నురవడికిన్ - అను విధముగా రూపము లుండవచ్చును. 'విభాష'

యని యనుటచే, ఇచ్చట నిషేధమునుగూడ చెప్పుకొనవచ్చును. ఇచ్చటి నగాగమము ఉదంతములయిన యమహత్తులకు మాత్రమే కలుగును; తక్కినవానికి కలుగదు.

7. కర్మధారయంబు బిరుదాద్యుత్తరపదం బయ్యేనేని ద్వ్యక్షరాదంతస్త్రీపుంసంజ్ఞావాచకంబగు పూర్వపదంబు నంత్యాక్షరంబున కంతట దీర్ఘంబు బహుళంబుగా నగు. (ప్రౌ - ౨)

అంతట ననఁగా సాంస్కృతికాదులు మూఁట నని యర్థము. రామా శాస్త్రి, సుబ్బాశాస్త్రి; రామానాయఁడు, సుబ్బానాయఁడు; రామా రెడ్డి, సుబ్బారెడ్డి; ఎల్లాసెట్టి, వీరాసెట్టి; కుప్పాసామి, వీరాసామి; రామారాయఁడు, సుబ్బారాయఁడు; రామారావు, సుబ్బారావు; ఎఱ్ఱాప్రెగ్గడ; చిన్నాదేవి మొ॥ బహుళంబుగా ననుటచే - రామ రాయఁడు, సుబ్బరావు, ఎఱ్ఱప్రెగ్గడ యిత్యాదులందు దీర్ఘంబు వైకల్పికంబు. కృష్ణశాస్త్రిత్యాదులందు దీర్ఘంబు గలుగదు.

వ్యాఖ్య - కర్మధారయమునందు బిరుదవాచకము, కుల వాచకము మున్నగునవి ఉత్తరపదమైనప్పుడు, రెండక్షరముల పరిమితిగలిగి అదంతమై, స్త్రీనిగాని పురుషునిగాని బోధించు సంజ్ఞావాచకము పూర్వపదమైనప్పుడు దాని చివరియక్షరమునకు దీర్ఘము బహుళముగా నగునని సూత్రార్థము. ఈకార్యము సాంస్కృతికాచ్ఛిక మిశ్రసమాసములకు మూడింటికి కావచ్చును.

'రామ' యనునది అదంత పూర్వశబ్దము. 'శాస్త్రి' యను నది బిరుదవాచకము; ఉత్తరపదము. ఈరెండును ఒకే ఆధార

మును గలిగి యుండుటచేత సమసించి 'కర్మధారయము' అగును. ప్రస్తుతసూత్రముచేత రెండక్షరముల పరిమితిగల యీపూర్వపద మునకు దీర్ఘముగా 'రామాశాస్త్రి' యని యగును. ఇచ్చట పూర్వపదమును, ఉత్తరపదమును గూడ సాంస్కృతికములే.

రెండవ యుదాహరణమునందు పూర్వపదమైన 'సుబ్బ' యనునది ఆచ్ఛికము. దీనికిని 'శాస్త్రి' పరమగునపుడు దీర్ఘము కలుగగా 'సుబ్బాశాస్త్రి' అని యగును. నాయఁడు, రెడ్డి - మున్నగునవి ఆచ్ఛికములు. ఇవి యుత్తరపదములుగా నున్న ప్పుడు పైవిధమయిన మార్పు రావచ్చును - చివరి యుదాహర ణము తప్ప, తక్కినవన్నియు పురుష బోధకములయిన సంజ్ఞలే.

చిన్న + దేవి - అని యన్నప్పుడు పూర్వశబ్దముయొక్క తుది అత్వమునకు దీర్ఘము కలుగగా 'చిన్నాదేవి' అని యగును.

బహుళము అని యనుటచేత దీర్ఘము కలుగనియెడల రామశాస్త్రి మున్నగువిధముగా రూపము లుండవచ్చును.

'కృష్ణశాస్త్రి' మున్నగు వానియందు పూర్వపదము తుది అత్వమునకు దీర్ఘము కలుగదని వ్యాకర్త నిశ్చయించెను.

[అట్లు నిశ్చయించుటకు హేతువు గోచరము కాదు. సర్వమును సాంస్కృతిక మగుటచే అట్లు నిర్ణయించెనేమో యనుకొనుటకును వీలు కాకున్నది. తాను తొలుదొల్త చెప్పిన 'రామాశాస్త్రి' యన్నదియు నిట్టిదే కదా! అక్కడ దీర్ఘము వచ్చుచున్నట్లు తానే చెప్పెను. అంతేకాక 'బహు ళంబుగా ననుటచే రామరాయఁడు' అని మున్నగు విధముగా వివరణము నందు రూపాంతరములను తెలుపుట సమంజసముగాలేదు. రామరాయఁడు

మొదలుకొనియే ద్వైరూప్యము లేదుకదా! పూర్వమున్న రూపములకును, ద్వైరూప్యము గలదు. అట్టి యెడల మొదటి యుదాహరణమును దెల్పి యిత్యాదులని యనవలయును. తన వ్రాతనుబట్టి 'రామశాస్త్రి' యను రూపములేదనియే తన యభిప్రాయమని తలపవలయునా? అట్లైయైనచో అది వ్యవహారవిరుద్ధము. కావున, అంగీకారయోగ్యము కాదు.]

ఇంకొక్క విషయము. "కర్మధారయంబు త్రిక స్త్రీసమముగంత ధాతుజ విశేషణపూర్వపదంబయి యుండు" నన్న (బా - 5) సూత్రమునుబట్టి యిచ్చటి 'రాముఁడు' మున్నగునవి పూర్వపదములుగా నుండుటకే తగవు. కాని సంజ్ఞావాచకములగుట వీనిని యథాప్రయోగముగా స్వీకరించుటయే సమ్మతము. రాబోవు (ప్రౌఢ - 6) సూత్రమునుబట్టి విభక్తిలోపము నందిన రూపములతోనే సిద్ధసమాసముల విధముగనే యిచ్చటి సమాసములు నేర్పడును.

[ఇచ్చట ద్వ్యక్షర పరిమితిని గల్పించుట కూడ యోగ్యముగా లేదు. తిరుమలాదేవి, వేంకటాదేవి, మానికాదేవి మున్నగువిధముగా రూపములు వ్యవహారమున నున్నవి.]

సూత్రమునందలి బహుళశబ్దముచే ఇతరకార్యములు కూడ సూచింపబడుచున్నవి. వానిని ప్రౌఢవ్యాకర్త యీరాబోవు సూత్రములయందు నిర్దేశించుచున్నాడు.

**8. ఇటఁ బూర్వపదంబు నత్వంబున కిత్వంబు బహుళంబుగా నగు. (ప్రౌ - 3)**

సుబ్బినాయఁడు - ఎల్లిసెట్టి మొ॥ రామిసెట్టి - సుబ్బిసెట్టి యిత్యాదులం దిత్వంబు నిత్యంబు.

వ్యాఖ్య - ఇట నని యనగా పూర్వసూత్రమునందు చెప్పినట్లు బిరుదాద్యుత్తర పదమునకు పూర్వమందు అదంతమై ద్వ్యక్షరపరిమితమైన స్త్రీపుం సంజ్ఞాబోధకము పూర్వపదముగా నున్నప్పుడని యర్థము. అప్పుడు పూర్వపదము యొక్క తుద నున్న హ్రస్వమైన అకారమునకు బదులుగా హ్రస్వమైన ఇకారము బహుళముగా వచ్చునని సూత్రార్థము.

సుబ్బ + నాయఁడు - ఇచ్చట ఉత్తరపదము బిరుదాది వాచకము. పూర్వపదము అదంతము. కావున కర్మధారయముగా సమసించునపుడు అత్వమునకు ఇత్వము రాగా 'సుబ్బి నాయఁడు' అని యగును. ఈకార్యము బహుళమగుటచే ఇత్వము రానిపక్షమున 'సుబ్బనాయఁడు' అని యుండవచ్చును. పూర్వసూత్రముచేత దీర్ఘము కలిగి 'సుబ్బానాయఁడు' అనియు నుండవచ్చును.

అట్లే ఎల్ల + సెట్టి అన్నవి సమసించి ప్రస్తుతసూత్రము చేత 'ఎల్లిసెట్టి' యని కావచ్చును. ఇత్వము రానిపక్షమున 'ఎల్ల సెట్టి' అనియే యుండును. దీర్ఘము కలిగినయెడల 'ఎల్లా సెట్టి' అనియును గావచ్చును.

రామిసెట్టి, సుబ్బిసెట్టి మున్నగువానియందు ఇత్వము నిత్యముగా నగునని వ్యాకర్త వివరణములో నున్నది.

[ఇందు దేనినిగాని నిత్యమని అనిత్యమని చెప్పుట కవకాశము కన్పింపదు. వీనిని వ్యవహారమునుబట్టి గ్రహింపవలసినదే కాని గ్రంథస్థము లయిన ప్రయోగములనుబట్టి గ్రహించుటకు అవకాశము లేదు. కావున యథాసంభవముగ గ్రహించుట కర్తవ్యము.]

**9. కొన్ని యెడల నిచ్చో ననాపామా యాగమంబులగు.**

**(ప్రౌ - ౮)**

**తిక్కన సోమయాజి - నన్నపార్యుఁడు - కృష్ణమనాయఁడు - నన్నయభట్టు.**

వ్యాఖ్య - 'ఇచ్చో' నని యనగా పూర్వసూత్రమునందు ప్రసక్తమయిన బిరుదాద్యుత్తర పదమయిన కర్మధారయము నందు ద్వ్యక్షరాదంత స్త్రీ పుం సంజ్ఞావాచకము పూర్వపదమయి నప్పు డని యర్థము. అట్టియెడల అన, అప, అమ, అయ - అను నవి కొన్నియెడల ఆగమనులుగా నగునని సూత్రార్థము.

తిక్క + సోమయాజి - అని యున్నప్పుడు సోమ యాజి' యన్నది బిరుదపదము. 'తిక్క' యన్నది అదంతమైన సంజ్ఞావాచకము. ప్రస్తుతసూత్రముచే 'అన' యనునది పూర్వ పదము కడపట ఆగమముగా చేరగా 'తిక్కన సోమయాజి' యని యయ్యెను. అట్లే 'నన్నపార్యుఁడు' అనుచోట 'అప' యను నాగమమును 'కృష్ణమనాయఁడు' అనుచోట 'అమ' యను నాగమమును 'నన్నయభట్టు' అనుచోట 'అయ' యను నాగమమును కలిగెనని భావము.

[ప్రస్తుత లక్ష్యములనుబట్టి చూడగా తిక్కన, నన్నయ, కృష్ణమ మున్నగు ప్రయోగముల కవకాశము లేదని యనిపించును. బిరుదాద్యుత్తర పద విరహితమైనచోట సైతము పై రీతి నుండుట నాక్షేపము లేదన్న సంగతి యందరకు తెలిసినదే. సూత్రనిర్మాణము సక్రమముగా లేదు.]

**10. పై యాగమంబులు కొన్నియెడల ద్విత్వయుక్తంబు లగు.** **(ప్రౌ - ౯)**

రామన్నసెట్టి - తిమ్మప్పనాయఁడు - కృష్ణమ్మపంతులు - మల్లయ్యశాస్త్రి మొ॥ కృష్ణమ్మ యనుచో అమ్మ ప్రేమసూచకం బని యెఱుంగునది. ఆ నరసింగభూపతి ప్రియంబెనఁగం బినకొండ మాంబయం। దానమితాఖిలాహిత సమాజుఁ దనూజునిఁగాంచె బంధు సం। తాన సురావనీజు సముదంచిత భోగబిడౌజు సూరిమై।। త్రీ నవ భోజు భాను నిభ తేజునిఁ గృష్ణమరాజు నున్నతిన్॥ కళా. ౧౭॥ మొ.

వ్యాఖ్య - పై యాగమంబులు అని యనగా అన, అప, అమ, అయ - అనునవి యని యర్థము. ఇవి కొన్ని యెడల ద్విత్వముతో కూడుకొనియు నుండవచ్చునని సూత్రార్థము.

రామ + అన + సెట్టి - అని యున్నరూపమునందలి యాగమము తుది యక్షరము ద్విత్వయుక్తము కాగా రామ + అన్న + సెట్టి = రామన్నసెట్టి అని యగును. 'కొన్ని యెడల' నని యనుటచేత 'రామనసెట్టి' అనియు నుండవచ్చును.

'కృష్ణమ్మపంతులు' అనునది పురుషవాచకము. నడుమ నున్న 'అమ్మ' యనునది స్త్రీవాచకము. పురుషవాచకముపై స్త్రీవాచక మెట్లు చేరునని ప్రశ్నించు వారికి సమాధానముగా వ్యాకర్త 'అమ్మ' యనునది 'ప్రేమసూచకము' అని వివరించు చున్నాఁడు. అనగా, ఆస్థానమునం దది స్త్రీని బోధింపదని యర్థము.

ఉదాహృత పద్యమునందు 'పినకొండమాంబ' యన్నదియు 'కృష్ణమరాజు' అన్నదియు 'అమ' యను నాగమమును కలిగిన రూపములు. పినకొండ + అమ + అంబ - అని విభాగము. ఇచ్చట 'అమ' యను నాగమము స్త్రీసంజ్ఞకు చేరినది. కృష్ణ +

అమ + రాజు - అన్నచోట 'అమ' యన్నది పురుషసంజ్ఞకు చేరినది. రెండుచోట్లను అది ప్రేమసూచకమై వ్యవహరించు చున్నది.

[ఈ సూత్రము విషయమునను, పూర్వసూత్ర విషయమునను ప్రౌఢ వ్యాకరణకారుని దృష్టి సమంజసముగా లేదు. అన, అప - మున్నగు వానిని ద్విత్వవిరహితముగా చూపి యాగమము లనుటయు, వానికి ద్విత్వ మును కొన్ని యెడల విధించుటయు సరియైన రీతి కాదు. తానే సంధి పరి చ్ఛేదమునందు "శ్రేష్ఠతావాచకంబులగు నార్యాంబాద్యర్థక శబ్దంబులు పరంబులగుచో నన్ని యచ్చులకును సంధి నిత్యము" అని (ప్రౌ - 1) సూత్రించి రామయ్య, సీతమ్మ మున్నగు నుదాహరణములను చూపెను వానికి పైని గిరుదాదివాచకములు చేరునప్పుడు రామయ్య పంతులు, సీతమ్మ సెట్టి - మున్నగు విధముగా కర్మధారయసమాసము లేర్పడుట కభ్యంతరము లేదు. 'అయ్య' మున్నగునవి అక్కటాదులలోనివి. కావున బాలవ్యాకరణముచేతనే ద్విత్వలోపము కలిగి 'అయ' మున్నగు విధముగా నగుట కవకాశము గలదు. కావున ప్రౌఢవ్యాకరణకారుడు ద్విత్వమును విధించుకొనుటయు అనావశ్యకమే. సులభముగా సాధించుకొనుటకు వీలయిన రూపములు, ప్రస్తుత ప్రక్రియచేత క్లేశసాధ్యములు, సందేహభాజనములు నయ్యెననుట యథార్థము. ఇంతచేసియు కృష్ణంసెట్టి చెన్నంసెట్టి, పేరిందేవి మున్నగు విధముగా పూర్ణబిందువుతో నున్న రూపములను; తిమ్మక్కదేవి రమణక పంతులు మున్నగు 'అ' తోడి రూపములను; అమ్మసెట్టి మున్నగు ఉత్వముతోడి రూపములను గ్రహించుట జరుగనే లేదు.]

## 11. కర్మధారయం బియ్యది మిశ్రంబు సిద్ధసమాసం బట్ల యగు. (ప్రౌ - ౬)

ఇట్లనుటచేఁ బూర్వపదంబు లుప్తవిభక్తికంబయి యవికృ తాంతం బగునని యెఱుంగవలయును॥ కృష్ణరాయఁడు - రామ రావు మొ॥

వ్యాఖ్య - బిరుదాదిపదమును పరమందుగల కర్మధార యము మిశ్రసమాసమేయైనను ప్రక్రియావిషయమున సిద్ధసమా సము వలెనే ప్రవర్తించునని సూత్రార్థము.

తెనుగునందు పుంలింగ మహద్వాచకమునకు ఉత్వ డుజ్ఞులు కలుగును. కావున 'రామ' యను ప్రాతిపదిక 'రాముఁడు' అని యగును. ప్రస్తుత సూత్రముచేత తత్సమమైన పూర్వపదము ఇట్టి పరిణామమును పొందక సంస్కృతసమాసము నం దెట్లుండునో అట్లే, 'రామ' యనియే యుండును. అందు వలననే 'రామ' యను సంస్కృత ప్రాతిపదికపై 'రావు' అను నాచ్ఛిక బిరుదపదము పరమైనపుడు సమాసమై 'రామరావు' అని యగును. 'కృష్ణ'యను సంస్కృతప్రాతిపదికపై 'రాయఁడు' అను నాచ్ఛికబిరుదము పరమై 'కృష్ణరాయఁడు' అను సమాస మేర్పడును.

పూర్వసూత్రము (ప్రౌ - 2) చేత పూర్వపదము తుద నున్న అత్వమునకు దీర్ఘము కలుగగా కృష్ణారాయఁడు, రామా రావు - మున్నగు రూపములును కలుగవచ్చును. ప్రస్తుత సూత్రము పూర్వ పూర్వసూత్రముల కవకాశము కలిగించు చున్నది.

[ఇక్కడ 'ఇయ్యది' అని యనుటచేత బిరుదాద్యుత్తర పదంబయిన కర్మధారయము • అని మాత్రమే గ్రహింపవలయును. ద్వ్యక్షరాదంత స్త్రీపుం సంజ్ఞావాచకంబగు పూర్వపదము అను దానినంతను గ్రహింపవలసిన యవసరము లేదు. ఈ బిరుదపదములు రెండక్షరములకంటె ఎక్కువ పరిమితి గల పదములపై కూడ రావచ్చును. మోహనరావు, ప్రభాకరరెడ్డి - మొద లైనవి యుదాహరణములు. అదంతములుకాని పదములపైని కూడ

రావచ్చును. దాశరథిరెడ్డి - గురుమూర్తినాయఁడు మున్నగునవి యుదాహరణములు.]

**12. క్రొత్తాదులు లుప్తశేషంబులు దేశ్యంబులతోడం బలెఁ దత్సమంబులతోడం గొన్నియెడలఁ గర్మధారయంబగు. (ప్రౌ - ౭)**

క్రొంబులకలు - క్రొంబులకల్ జనించె సభకున్॥ ఉ రా. ౬ఆ॥ క్రొన్నారాచములు - క్రొన్నారాచములు మూఁడు గొని నుదురేయన్॥ రా॰ అర. ౧ఆ॥ నెమ్మనము - అనుపమ యోగశీలు నమృతాంబుధియం దుదయించు దేవు నెమ్మనమున నావహించి॥ లక్ష్మి. ౩ఆ॥ పెన్నగము - ఏడు పెన్నగములు సంచలించె॥ రా. అర॥ ౨ఆ॥ ముంగోపము - మొగము బొడువలేని ముంగోప మిఁక నెప్పుడు॥ ఉ. రా ౩ఆ॥ పింజామరము - రమణ శ్రీదేవి పింజామరంబు పి॥ శేష. ౫ఆ॥ సగరాజ్యము - నా సగరాజ్యము ॥రా. కిష్కింధ॥ మొ.

వ్యాఖ్య - క్రొత్త మున్నగు శబ్దములయొక్క తొలి యచ్చు మీఁది వర్ణములకు సమాసమునందు బహుళముగా లోపము బాలవ్యాకరణముచేత విధింపబడెను. అట్లు లోపింపగా మిగిలిన 'క్రొ' మున్నగునవి పరమందున్న దేశ్యపదములతో సమసించినట్లుగానే, కొన్నియెడల తత్సమములతోను సమసించి కర్మధారయ మగునని సూత్రతాత్పర్యము.

[ఇదే విషయమును ప్రౌఢవ్యాకరణకారుడు "సమాసమందుఁ దత్సమంబు పరంబగునపుడును నుగాగమాదులు గానంబడియెడి" నను (ప్రౌ. సంధి. 12) సూత్రమునందు తెలిపియున్నాడు. మరల దానినే రూపాంతరమున నిచ్చట చెప్పుచున్నాడు.]

బాలవ్యాకరణకారుడు ద్రుతాదికార్యములను దెల్పు నప్పుడు ఆచ్ఛికపదములనే ఉత్తరపదములుగా చూపియున్నాడు. కాని తత్సమము లుత్తరపదములుగా నుండరాదని యాయన యెచ్చటను చెప్పలేదు. కాని యుదాహరణములనుబట్టి తత్స మము లుత్తరపదములుగా నుండరాదని బాలవ్యాకరణకారుని యభిప్రాయమైనట్లు తలచి, ప్రౌఢవ్యాకరణకారుడు దానిని సవ రించుటకై యీ సూత్రమును మొదలుపెట్టెను. కాని చిన్నయ సూరి (సంధి - 38) కెంధూళి యనుదానిని విశేషప్రయోగ ముగా చూపియున్నాడు. దానినిబట్టి తత్సమము పరమైనప్పుడు సైతము కర్మధారయము కావచ్చునని యాయన సూచన చేసి నట్లే. ప్రస్తుతము ప్రౌఢవ్యాకరణము చూపుచున్న లక్ష్యములు సవరణమునకుకాక, స్పష్టీకరణమున కుపయోగించును.

క్రొత్త + పులకలు - అని యున్నప్పుడు 'పులకలు' అను తత్సమ శబ్దము పరమందున్నప్పటికిని "క్రొత్తశబ్దమున కాద్యక్షర శేషంబునకుం గొన్నియెడల నుగాగమంబునుం గొన్ని యెడల మీఁదిహల్లునకు ద్విత్వంబు నగు" అను (బా. సంధి. 38) సూత్రమునుబట్టి లుప్తశేషమునకు నుగాగమము కలిగి ద్రుత కార్యము జరుగగా 'క్రొంబులకలు' అని యయ్యెను.

క్రొత్త + నారాచములు - అనుచోటి రెండవ పదము తత్సమము. సమాసమైనపుడు లుప్తశేషముమీది హల్లునకు ద్విత్వముకాగా 'క్రొన్నారాచములు' అని యయ్యెను. నెఱ + మనము - అని యుండి లుప్తశేషముమీది హల్లునకు ద్విత్వమై 'నెమ్మనము' అని యయ్యెను. 'పెన్నగము' అను నుదాహర

ణము కూడ 'పెను + నగము' అనునవి సమసించుటవలన నేర్పడెను.

ముందు + కోపము-అనుచోట పూర్ణబిందువును, దువర్ణమును లోపింపగా 'ము + కోపము' అని మిగులును. లుప్తశేషమునకు ను వర్ణము కలిగి, ద్రుతకార్యము జరుగగా 'ముంగోపము' అని యయ్యెను. వీచు + చామరము - అనునవి విశేష విధిచేత 'వింజామరము' అని యయ్యెను.

[వింజామరము అనునది వెల్ల, చామరము అను పదముల కలయికచే నేర్పడెనని బహుజనపల్లివారి యభిప్రాయము. అప్పుడు 'వెల్ల' శబ్దము యొక్క తొలి యచ్చుమీది వర్ణములకు (బా - సంధి. 36) లోపము రాగా 'వె + చామరము' అని యుండును. క్రొత్త శబ్దమునకు విధించు కార్యమునే దీనికి నన్వయింపగా నుగాగమము కలిగి 'వెంజామరము' అని యగును. దీని ఎత్వమునకు ఇత్వమును విధించుకొనవలయును. కాని, దీని కంటె 'వీచు + చామరము' అనునవి వింజామరము అయ్యెననుట యుక్తియుక్తముగా నుండును. అప్పుడును దీర్ఘమునకు హ్రస్వము విధించుకొనుట యవసరమే.]

సగము + రాజ్యము - అనునవి 'సగరాజ్యము' అని యయ్యెను. ఇందు ఉత్తరపదమైన రాజ్యము తత్సమము; పూర్వపదము తెలుగు, కావున నిది మిశ్రకర్మధారయము.

[ఇచ్చట ప్రధానముగా చెప్పుకొనదగినది ముvarణలోపము. సగము అను పదముదగ్గర శబ్దరత్నాకరమున "దీనికి వృత్తియందు హల్లు పరమగుచో వికల్పముగ నంత్యవర్ణలోపము" అని కుండలీకరణముల నడుమ తెలిపినవాక్యము యోగ్యముగ నున్నది. కాని బహుజనపల్లివారు ఇచ్చట ఆ ప్రసంగమును మాని 'సగము'ను క్రొత్తాదులలో చేర్చి పైరూపమును సాధింపనెంచిరి. దాని హేతువును నిర్ణయించుచు తత్త్వబోధినీవ్యాఖ్యాత

[వ్రాసిన వివరణము నిక్కడ చూడుడు - "ఈసమాసమును (సగరాజ్యము) ప్రాంతాది సమాసములలోఁ జేర్పకపోయినను 'సగము + రాజ్యము' అను పదములు మిశ్రసమాసమగుట కాటంకము లేదు. కాని సమాసమునందు మువర్ణకమునకుఁ బుంపులు రావలసియుండును. అట్లు పుంపులు రాక మువర్ణమునకు లోపము వచ్చుటకే యీ'సగము' శబ్దముకూడఁ గ్రొత్తాదులలోఁ జేర్చెనని తెలియవలయును......" కాని యిచ్చట ఈకల్పనము ప్రౌఢవ్యాకరణకారుని భావమున కనుకూలముగా నున్నదికాని దోషరహితము కాదు ]

సగము + రాజ్యము - అని యున్నప్పుడు సగమును క్రొత్తాదులలో చేర్చుటవలన క్రొత్త యిబ్బంది కలుగును. "ప్రాఁతాదుల తొలి యచ్చుమీఁది వర్ణంబులకెల్ల లోపంబు బహుళంబుగా నగు" నన్న విధినిబట్టి ము వర్ణము మాత్రమే కాక, దానికి ముందున్న 'గ' సైతము లోపింపవలయును. అప్పుడు స + రాజ్యము - అని మాత్రమే మిగులును. అది 'సగరాజ్యము' అను రూపమును సాధించుటకు సమర్థము కాదు. కావున 'అందచందములు' మున్నగు రూపములను సాధించుటకు (ప్రౌ - 29) చెప్పినట్లు, ము వర్ణకలోపమును ప్రత్యేకముగా చెప్పుటయే సూటియైన పద్ధతి.

**13. ధాతుజవిశేషణంబులు తథార్థకావ్యయంబుతోడం గర్మధారయం బగు. (ప్రౌ - ౮)**

భూసురోత్తముల్ వేదముల్ సదువునట్లు॥ భార. ఆది. ౫ ఆ॥
కడుం బెద్దదవ్వు వోయినయట్లు॥ భార. ఆది. ౧ ఆ॥

వ్యాఖ్య - ధాతుజవిశేషణములు పూర్వపదములుకాగా, పరమందు తథార్థకావ్యయము వచ్చి కర్మధారయ సమాస మగు నని సూత్రార్థము.

క్రియలవలన నేర్పడిన చదివిన, చదువుచున్న, చదివెడి - మున్నగునవి ధాతుజ విశేషణములు. అట్లు అన్నది తథార్థకావ్యయము. ఈ రెండును సమసింపగా ఏర్పడునది కర్మధారయ సమాసము. 'చదువు + అట్లు' అని యుండగా "ఉదంతమగు తద్ధర్మార్థ విశేషణమున కచ్చు పరమగునపుడు నుగాగమంబగు" అను (బా - సంధి. 33) సూత్రమునుబట్టి 'చదువు + ను + అట్లు = చదువునట్లు' అని యగును. 'పోయిన + అట్లు' అను చోట పూర్వమున్నది భూతార్థకమైన ధాతుజ విశేషణము; అదంతము. కావున "అత్తునకు సంధి బహుళముగా నగు" నను (బా. సంధి. 4) సూత్రమునుబట్టి సంధియైనచో 'పోయినట్లు' అనియును, సంధికానిచో యడాగమము కలిగి 'పోయినయట్లు' అనియును రూపములు గలుగును.

బాలవ్యాకరణమునందు కర్మధారయమునకు పూర్వపదము (బా - 5) నిర్దేశింపబడినది. ఉత్తరపదము విషయము ప్రసక్తము కాలేదు. అవ్యయము కూడ పదమే కావున సమాసమగుట కభ్యంతరము లేదు. కాని అన్ని యవ్యయములకును సమాసమున నుత్తరపదముగా నుండు యోగ్యతలేదు. కావున 'అట్లు' అను నవ్యయము కర్మధారయమున నుత్తరపదమై యుండగలదని చూపుట స్పష్టతాప్రతిపత్తికి సహకరించుచున్నది.

**14. త్రిసమఘటితంబ యొకానొకండు బహువ్రీహి చూపట్టెడు. (బా - ౬)**

ముక్కంటి - వేగంటి - చలివెలుఁగు - వేవెలుఁగు - మోటరి॰ ఇత్యాదులు వ్యవహార సిద్ధంబులు గ్రాహ్యంబులు.

వ్యాఖ్య- తెలుగునందలి బహువ్రీహి సమాసము స్త్రీసమ ఘటితమై కనుపట్టునని యర్థము. అనగా, బహువ్రీహి సమాసమునందలి పూర్వపదమును, ఉత్తరపదమును స్త్రీసమములై యుండును - అని యర్థము.

మూఁడు + కన్నులు = ముక్కంటి. దీనికి మూడు కన్నులు గలవాఁడని యర్థము, 'ఈశ్వరుఁడు' అనునది తాత్పర్యార్థము. అన్యపదార్థ ప్రధాన మను లక్షణమునకు సరిపడుటచే బహువ్రీహిసమాస మగుచున్నది. ఇందు పూర్వపదము 'మూడు' అనునది స్త్రీసమము. 'కన్నులు' అను శబ్దము ప్రథమా విభక్త్యంత మగుటవలన స్త్రీసమము కాదు. కాని రానున్న (బా - 22) సూత్రమువలన సమాసాంతకార్యములై 'కంటి' అని యగును. అప్పుడది స్త్రీసమశబ్దమే యగును॥ మూడు + కంటి. "సమానాధికరణం బగు నుత్తరపదంబు పరం బగునపుడు మూఁడు శబ్దంబు డువర్ణంబునకు లోపంబును మీఁదిహల్లునకు ద్విత్వంబు నగు" అను (బా - 17) సూత్రముచేత డువర్ణము లోపించును; కకారమునకు ద్విత్వము కలుగును. మూ+క్కంటి. "ద్విరుక్తం బగు హల్లు పరం బగునపు డాచ్ఛికం బగు దీర్ఘంబునకు హ్రస్వం బగు" అను (బా - 13) సూత్రమువలన ము + క్కంటి = ముక్కంటి అని యగును.

ఇట్లే వేయి కన్నులు కలవాఁడు; వే + కంటి = వేగంటి అని యై 'ఇంద్రుఁడు' అను నర్థమును బోధించును.

చలి + వెలుఁగు = చలివెలుఁగు, చంద్రుఁ డని యర్థము. వేయి + వెలుఁగు = వేవెలుఁగు, సూర్యుఁ డని యర్థము. ఇందు పూర్వోత్తర పదములు రెండును స్త్రీసమములే.

మోట + బరువు. వువర్ణమున కాదేశముగా ఇవర్ణము కలిగి 'మోటబరి' అని యైనది. దీనికి బరువును, మోయు లక్షణముబట్టి 'ఎద్దు' అను అర్థము కలుగుచున్నది.

కావున వీని యన్నింటియందును పూర్వోత్తరపదములు స్త్రీసమములై యుండె ననియు, అన్య పదార్థమునకే ప్రాధాన్యము గల దనియు స్పష్టము. సూత్రమునందు 'ఒకానొకండు' అని యనుటచేత 'గట్టువిలుతుఁడు' మున్నగురీతి డువర్ణాంతములును లేకపోవు.

వ్యావహారసిద్ధములు = కావ్యవ్యవహారమునందును, లోక వ్యవహారమునందును స్థిరపడిన ప్రయోగములు. 'ప్రయోగ శరణం వ్యాకరణ' మ్మను సూక్తినిబట్టి, వ్యాకరణములో చూప బడని ప్రయోగములను లోకకావ్య వ్యవహారముల నుండి గ్రహింపవచ్చును. కావున బహుప్రీహి యుదాహరణములను గొన్నింటిని జూపిన పిమ్మట సూరి వాడుకనుండి గ్రహింపు డని యనెను. పోలికనుబట్టి స్వతంత్రముగా కల్పింపక, పూర్వ ప్రయోగములను అనుసరింపు డను నియమముకూడ ఇందున్నది.

**15. ఆచ్ఛిక శబ్దంబుతోడ స్త్రీసమంబు ప్రాయికంబుగా ద్వంద్వం బగు.** **(బా - ౭)**

అన్నదమ్ములు - తల్లిదండ్రులు - ఊరువల్లెలు - ఆలుమగలు॥
మగఁడును బిడ్డలును - పల్లమును గళ్ళెమును ఇత్యాదులు సమసింప
వని యీ నియమంబున నెఱుంగునది.

వ్యాఖ్య - ద్వంద్వ సమాసమునందు సాధారణముగా ఉత్తరపదము ఆచ్ఛికమై, పూర్వపదము స్త్రీసమమై యుండునని యర్థము. ఇది కేవలము ఆచ్ఛికద్వంద్వమునకు సంబంధించిన విషయము.

అన్న + తమ్ముఁడు. ఇర్వురికి సంబంధించిన విషయము కావున 'లు' వర్ణము కలుగును. అన్న + తమ్ములు. ఇందు రెండును ఆచ్ఛికశబ్దములే. 'అన్న' యనునది స్త్రీసమ శబ్దము. కావున పై లక్షణమునకు సరిపోయినది. "ద్వంద్వంబునం బదంబు పయి పరుషములకు గసడదవలగు" (బా. సంధి - 15) అను సూత్రముచేత 'అన్నదమ్ములు' అని యగును. తల్లి దండ్రులు - ఊరువల్లెలు - ఆలుమగలు అను సమాసము లన్నియు నిట్టివే.

మగఁడు + బిడ్డలు అను రెండు పదము లున్న వను కొందము. రెండును ఆచ్ఛికములే. పూర్వపదము డువర్ణకాంతము; స్త్రీసమము కానందువలన సమాసము కాదు. వ్యస్తముగానే యుండును. సముచ్చయార్థక మగు నువర్ణకము కలిగి 'మగఁడును బిడ్డలును' అని వ్యస్తముగనే యుండును. అట్లే పల్లము + కళ్ళెము అను రెండు పదములును సమసింపవు. ఇందు పూర్వ పదము మువర్ణకాంతము. కావున 'ను' అను సముచ్చయార్థకము కలిగి "పల్లమును గళ్ళెమును" అని వ్యస్తముగనే యుండును.

**16. సర్వశబ్దంబులు సంబంధమునందుఁ దచ్ఛబ్దంబుతోడ సమసించు. (బా - ౮)**

నావాఁడు - నాయది - ఇంటివాఁడు - ఇంటిది - రాముని వాఁడు - రామునిది.

వ్యాఖ్య - సంబంధమును బోధించునపుడు అన్నిశబ్దములును తచ్ఛబ్దముతో సమాసరూపము నొందు నని యర్థము. తత్ + శబ్దము తచ్ఛబ్దము. సంస్కృతమున గల తచ్ఛబ్దమునకు తెనుగున సమానార్థకములు అది - అవి - వాఁడు - వారు మున్నగునవి. కావున ఉత్తరపదముగా అది, అవి మున్నగునవి యగు నని భావము.

నాయొక్క + వాఁడు అని యుండగా "సమాసవిభక్తికి లోపంబగు లట్టునకుం గాదు" అను రాబోవు (బా. 25) సూత్రము చేత 'యొక్క' లోపించి నా + వాఁడు - నావాఁడు అని యగును. నాకు సంబంధించిన వాఁడు అని యర్థము.

నా + అది దీర్ఘముమీఁద సంధి లేనందువలన యడాగమము కలిగి నా + య్ + అది = నాయది యని యగును ఇంటి + యొక్క + వాఁడు = ఇంటివాఁడు, అని యగును.

ఇంటి + యొక్క + అది - సమాస విభక్తికి లోపము కలిగి 'ఇంటి + అది' అని యగును. "అది యవి శబ్దంబుల యత్తునకు వృత్తిని లోపంబు బహుళంబుగా నగు" (బా. సంధి-45) అను సూత్రమున విధింపబడినట్లు అత్వమునకు లోపము కలిగి 'ఇంటిది' అని యగును. ఇంటికి సంబంధించినది అని యర్థము. ఇట్లే

రాముఁడు' అను రూపముకూడ నేర్పడును. 'అట్టి' శబ్దము విభాష నగునది యగుటచేత, అది కానప్పుడు 'వచ్చినరాముఁడు' అనియే యుండును

పూర్వసూత్రమును బట్టి తచ్ఛబ్దానుప్రయోగము జరిగినప్పుడుకూడ 'అట్టి' శబ్దము విశేషణమునకు విభాషగా చేరవచ్చును వచ్చు + వాఁడు. 'అట్టి' యను శబ్ద మనుప్రయుక్తము కాగా వచ్చు + అట్టి + వాఁడు అని యగును. "ఉదంతమగు తద్ధర్మార్థవిశేషణమున కచ్చు పరం బగునపుడు నుగాగమం బగు" అను (బా. సంధి - 33) సూత్రమునుబట్టి నుగాగమము కలిగి వచ్చు + ను + అట్టి + వాఁడు = వచ్చునట్టి వాఁడు అని యగును. 'అట్టి' శబ్దము రాని పక్షమున వచ్చు వాఁడు అని యుండును. ఇట్లే వచ్చినవాఁడు, వచ్చినట్టివాఁడు; వచ్చుచున్న రాముఁడు, వచ్చుచున్నట్టి రాముఁడు ఎన్నగు విధముగా రూపము లుండును.

**19.** **అట్టి యిట్టి యెట్టి అను విశేషణంబులమీఁది తచ్ఛబ్ద వకారంబునకు లోపంబు విభాష నగు.** (ప్రౌ - ౯)

విమలతపోవిభవంబునఁ గమలజు నట్టిఁడు ॥భార. ఆది. ౨౨॥ ఇట్లుగాన నెఱుఁగ మేమేవురము నతఁడిట్టిఁ డగుట ॥భార. శాంతి. ౧౭॥ ఎట్టిఁడు వానిఁజేకుఁడు (ఎట్టిఁడు నాహ్వాదీశుఁ డనుట యుక్తము) ॥రా. సు.॥ షు పక్షమున అట్టివాఁడు ౘము॥ తెనుఁగున సాధారణముగ **విశేషణంబుల విభక్తికంబులు.**

వ్యాఖ్య - అట్టి, ఇట్టి, ఎట్టి అను విశేషణములకు పరమందున్న తచ్ఛబ్దముయొక్క వకారమునకు విభాషగా లోప

మగునని సూత్రార్థము. ఇదికూడ కర్మధారయ సమాసమునకు విషయమే.

తచ్ఛబ్దము అని యనగా వాడు, అది, వారు, అవి - అను శబ్దములని యర్థము. ప్రస్తుతప్రసంగమును బట్టి వకార మాదియందున్న తచ్ఛబ్దమే యావశ్యకము. వాడు, వారు అను వానిని గ్రహింపవలసియుండును.

[తత్త్వబోధినీ వ్యాఖ్యాత "ఇట తచ్ఛబ్దమనఁగా ప్రాతిపదికమునే గ్రహింపవలయును. ప్రాతిపదికావయవమగు వకారమునకే లోపము వచ్చును. మఱియుఁ దచ్ఛబ్దమనగా 'వాఁడు' మున్నగుపదములను గ్రహింపరాదు. అట్లయినచో 'వానివలన' మున్నగుపదములలోఁగల పంచమీ విభక్తి ప్రత్యయసంబంధియగు వకారమునకును లోపము రావలసివచ్చును" ఇత్యాదిగా వ్రాసిరి. తచ్ఛబ్దము అని యన్నప్పుడు ప్రాతిపదికమగు 'అ' కారమును గ్రహింపవలయు ననుట సరికాదు. ప్రాతిపదికమునే గ్రహింప వలయునేని, అదియందు వకారముండుటయును సంభవము కాదు. కావున వకారాదియై, ప్రథమావిభక్త్యంతమై యుండు రూపమునే గ్రహింప వలయును. ఉభయ వ్యాకరణములనుబట్టియు అదియే సిద్ధించుచున్నది. ఉదాహరణములును దానినే సూచించుచున్నవి. 'వానివలన' మున్నగుచోట్ల నున్న • పంచమీవిభక్తి ప్రత్యయసంబంధియగు వకారమునకును లోపము వచ్చుట యేమో యర్థము కాకున్నది. తచ్ఛబ్ద వకారమునకు రావలసిన లోపము 'వలన' వర్ణకమునందలి వకారమునకెట్లు వచ్చునని యూహించిరో యవగతము కాకున్నది. కాక 'వాని వలన' అని యున్నప్పుడు ప్రథమాక్ష రమునందలి 'వ' కారమునకు లోపము రాదని చెప్పుట వ్యాఖ్యాతల యభి ప్రాయమేమో! అప్పుడును వచ్చుట కవకాశము లేనేలేదు. కావున, దానిని గూడ పేర్కొనవలసిన యవసరము కానరాదు.]

అట్టి + వాఁడు - అని యున్నప్పుడు తచ్ఛబ్దమునందలి తొలియక్షరము లోపింపగా అట్టి + ఁడు అని మిగులును. అది

'అట్టిఁడు' అని యగును. "హ్రస్వముమీఁది ఖండబిందువునకుఁ బూర్ణబిందువు వైకల్పికముగ నగు" అను (బా - సంజ్ఞ -14) సూత్రమునుబట్టి అరసున్నకు నిండుసున్న కాగా 'అట్టిండు' అని యును గావచ్చును. సూత్రవిధి విభాష నగుటచే వా లోపము లేకుండ 'అట్టివాఁడు' అనియు నుండవచ్చును.

ఇట్టి + వాఁడు - అని యున్నప్పుడు 'ఇట్టిఁడు' అనియు, ఎట్టి + వాఁడు - అని యున్నప్పుడు 'ఎట్టిఁడు' అనియు నగును.

'ఎట్టిఁడు నానిజేశుఁడు' అని యున్నచోట ప్రౌఢ వ్యాకరణకారుడు పాఠమును సవరించు కొననలసిన యవసర మున్నట్లు సూచించుచున్నాడు. అది వ్యాకరణవిషయము కాదు. అయినను ప్రసంగానుప్రసంగముగా ఇతర విషయములుకూడ గ్రహింపబడుచుండుట సహజమే. 'నిజ + ఈశుఁడు' అనియనగా 'నాయొక్క ప్రభువు' అని యే యర్థము. అట్టియెడల మరల 'నా' యను విశేషణమును ముందుచేర్చుట సమంజసము కాదు. కావున 'నాహృదీశుఁడు' అని యున్నచో పునరుక్తి పరిహరింపబడునని ఆయన సూచన పరమార్థము.

తెలుగునందలి విశేషణములు సాధారణముగా విభక్తులను పొందవు. విభక్తిని పొందవలసి వచ్చినప్పుడు తచ్ఛబ్దమును పొందుట స్వాభావికము. 'సాధారణముగః' అని యనుటచేత కొన్ని విశేషణములు ఈనియమమునకు భిన్నముగా విభక్త్యంత ములై యుండినను నుండవచ్చును. 'అట్టి' మున్నగువాని పై ప్రథమైకవచనమున డుజ్వర్ణకమే చేరుచున్నదనియు, తచ్ఛబ్ద కల్పన మవసరము కాదనియు ఎవ్వారైన నందురేమో యని

యెంచి వ్యాకర్త ముందుగనే యీవిషయమును సూచించు చున్నాడు. 'ఎట్టి' అనునది మహద్వాచక మగుటచేత 'డు' వర్ణకము చేరెనని తలపరాదని యీ వివరణమువలన ఆయన స్పష్టము చేయుచున్నాడు.

సూత్రమునందలి 'విభాష' యను దళముచేత అట్టిఁడు, అట్టివాఁడు - మున్నగు రూపములు వికల్పముగా సంభవించును. ఇక్కడి తచ్ఛబ్దము ప్రథమావిభక్త్యంతమై యున్నప్పుడు మాత్రమే యీకార్యము జరుగును. ద్వితీయాది విభక్త్యంతమై యున్నప్పుడు వాలోపము జరుగదు; కావున నిషేధముకూడ 'విభాష' యను దళముచేతనే సూచిత మగుచున్న దనుకొనవచ్చును.

ప్రథమా బహువచనమునందు అట్టిరు, అట్టివారు; ఇట్టిరు, ఇట్టివారు; ఎట్టిరు, ఎట్టివారు - మున్నగువిధముగా రూపము లుండును.

[సూత్రమున "తచ్ఛబ్ద వకారంబునకు లోపంబు" అని యనుట సమర్థముగాలేదు. నిజమున కిక్కడలోపించునది 'వా' అను నక్షరము. "తచ్ఛబ్ద వాక్షరంబు" అను విధముగానుండిన సమంజసముగా నుండును. అట్లు కాక పోవుటచేత 'అట్టి + వాఁడు' అని యున్నప్పుడు 'అట్టి + అఁడు' అను విధముగా అనిష్ట రూపము సిద్ధించును. దీనిని పరిహరించుట యవసరము.]

**20.** ధ్వన్యనుకరణ శబ్దంబులు కొన్నింటి కిందు నిగాగమం బగు. (ప్రౌ - ౧౨)

ఇందున్ = కర్మధారయమునం దని యర్థము॥ గనగనని నిప్పులు॥ స్వా ౪౮॥ తళతళని తరణి మెఱుఁగులు॥ స్వా. ౫౮॥ నిగనిగని కుందనంపుఁ దగడు॥ స్వా. ౪౮॥ మొ.

వ్యాఖ్య - 'ఇందు' అని సూత్రమునందున్న పదమునకు కర్మధారయమునం దన్న యర్థమును సూత్రకారుడే తనవివరణము నందు తెలిపెను. కర్మధారయమునందు పూర్వమందున్న కొన్ని ధ్వన్యనుకరణశబ్దములకు 'ని' అను నాగమము అంతమునందు కలుగునని సూత్రార్థము.

గవగన, తళతళ, నిగనిగ - యనునవి మెరపును సూచించు ననుకరణ శబ్దములు. ధ్వన్యనుకరణశబ్దములని యను టచే, ధ్వనిని అనుకరించు శబ్దములను మాత్రమే కాక, కాంతి మున్నగు వాని ననుకరించు శబ్దములనుగూడ గ్రహింపవలయును.

నిప్పులయొక్క కాంతిని దెలుపు పదము 'గనగన' యనునది. కావున దీనికి నిగాగమము కలిగి తరువాతి పదముతో సమసించును. అప్పుడు 'గనగనని నిప్పులు' అను రూపమేర్పడును. తక్కిన రూపములు కూడ అట్టివే.

**21.** గుణవచనంబులగు నల్లాదులకుం గర్మధారయంబునందు నిగాగమంబు బహుళంబుగా నగు. (బా - ౧౨)

నల్లని గుడ్డము - నల్ల గుడ్డము॥ నల్ల - తెల్ల - పచ్చ - ఎఱ్ఱ - చామ - తియ్య - కమ్మ - పుల్ల - విన్న - తిన్న - అల్ల॥ ఇత్యాదులు నల్లాదులు.

వ్యాఖ్య - ఇది కర్మధారయ సమాస విషయము. గుణములను బోధించునట్టి నల్ల మున్నగు విశేషణములు పూర్వపదములైనప్పుడు, వాని కొసను 'ని' అను వర్ణము బహుళముగా వచ్చి చేరునని సూత్రార్థము.

నల్ల + గుజ్జము. ఇట్టియెడల విశేషణముపై 'ని' వర్ణము ఆగమముగా రాగా నల్ల + ని + గుజ్జము = నల్లని గుజ్జము, అని యగును. నిగాగమవిధి బహుళమగుట వలన నివర్ణము రానిపక్షమున 'నల్లగుజ్జము' మున్నగు రూపములు కూడ నుండవచ్చును.

**22.** **గుణవాచకంబులు కొన్నింటి నిగాగమంబునకుఁ బరుషంబులు పరంబు లగునపుడు బిందు వగు. (బా - ౧౩)**

కమ్మఁదేనె - కమ్మందేనె మొ॥ **మరువాలారు శరంబులం** దొరఁగు కమ్మందనె॥ సై. ౨౪॥

వ్యాఖ్య - గుణవాచకములయిన విశేషణముల మీది ఆగమ నివర్ణమునకు పరుషములు పరముగానున్నప్పుడు ఆదేశముగా బిందువగునని సూత్రార్థము. బిందువని యనుటచేత అర్ధబిందువును, పూర్ణబిందువును గూడ గ్రహింపవలయును.

కమ్మ + తేనె - అని యున్నప్పుడు గుణవాచకమగు 'కమ్మ' యను విశేషణమునకు 'ని' వర్ణము కలిగి కమ్మని + తేనె - అని యగును. ప్రస్తుతసూత్రము చేత 'ని' వర్ణమునకు బదులుగా అనుస్వారము రాగా 'కమ్మఁదేనె' అనియు 'కమ్మందేనె' అనియు రూపము లేర్పడును.

ఇచ్చట సూత్రకారుడు నిగాగమమునకు బిందువును మాత్రమే విధించెను. కాని పరుషము సరళమగుటకు మార్గమును చూపలేదు. సూత్రమునుబట్టి కమ్మ + ఁ + తేనె; కమ్మ + ం + తేనె - అన్నంతవరకు మాత్రమే సిద్ధించును.

[కావున వ్యాఖ్యాతలు ఆలోపమును గుర్తించి, తమకల్పనము నుప యోగించిరి. సుబోధినీ వ్యాఖ్యాకారులు "బిందువు నిగాగమస్థానమున వచ్చిన దగుటచే పరముగానున్న పరుషములకు సరళాదేశము మున్నగు కార్యములు జరుగుట గ్రహించునది" అని వ్రాసిరి. దానిని సవరించుటకై తత్త్వబోధినీ వ్యాఖ్యాకారులు "నిగాగమము ద్రుతము కాకపోవుట చేతనే బిందువును విధించుకొనవలసి వచ్చెను. అట్టిచో దాని స్థానమున వచ్చిన బిందువు మాత్రము ద్రుతధర్మము నెట్లు పొందును? నిగాగమము ద్రుతమే అయినచో నీసూత్ర మనావశ్యకమే యగును. ద్రుతమగుటచేతనే సరళా దేశము, బిందువుకూడ సిద్ధించును. నిగాగమ విధానసామర్థ్యముచేతనే సామా నిక ద్రుతలోపమును రాదు. బింద్వాదేశములు వచ్చుట కాటంకము లేదు." అని సముచితముగా వ్రాసిరి. ఇంతకును నిగామమును విధించిన చిన్నయ సూరి ద్రుతముగా పరిగణింపలేదు. కావుననే 'కమ్మనితేనె' మున్నగు రూప ములు గలుగుచున్నవి. కానియెడల ఉత్తరశబ్దము తొలుతనున్న పరుషము సరళము కావలయునుగదా! కావున ద్రుతము కాదన్నది నిశ్చయము.]

ప్రౌఢ వ్యాకరణకారుడు "పరుషంబులు పరంబులగు నపుడు గుణవాచకముల నిగాగమంబునకుం గొన్నియెడల బిందు వగు; అప్పు డవి సరళంబు లగు" అని యన్నట్లుగా సూత్రించి యుండినయెడల మీదిదోషము తొలగి యుండెడిది.

**23.** గుణవాచకంబు క్రియావిశేషణం బగుచో నొక్కెడ నవర్ణకంబునకు బిందువు గానంబడియెడి. (ప్రౌ - ౧౪)

సని చక్కంగఁ బ్రియుండు వర్థిలుటకై॥ కాశీ. ౨౩॥

వ్యాఖ్య - "నవర్ణకంబు గుణవచనంబులగు నల్లాదుల కగు" నను (బా - తద్ధిత - ౬) సూత్రమునుబట్టి నల్లన, చక్కన మున్నగు తద్ధితరూపము లేర్పడును. 'నవర్ణకాంతములయిన ఆ

తద్ధితములు క్రియావిశేషణములుగా వ్యవహరించునపుడు నవర్ణకమునకు బదులుగా బిందువేర్పడునని సూత్రార్థము. బిందువని యనుటచే ఖండబిందువును, పూర్ణబిందువును గూడ గ్రహింపవలయును.

[పూర్వసూత్రమునందు చెప్పికొన్నట్లే యిచ్చటగూడ బిందువుమీది పరుషము సరళమగునని చెప్పికొనుట యవసరము. వ్యాసకర్త సూత్రమున నట్టిసూచన మేమియును చేయలేదు. ప్రయోగమునుబట్టి, అది యాయనకు సమ్మతమే యన్నది స్పష్టము. కాని, దానిని సూచింపకుండుట మాత్రము సమంజసముగా లేదు.]

'చక్కన' యను తద్ధితరూపమును క్రియావిశేషణముగ వాడునప్పుడు "నుజ్యంతంబగు నగు ధాతువు క్రియావిశేషణంబుల కనుప్రయుక్తం బగు" అను (బా. క్రియ - 115) సూత్రమునుబట్టి కాన్. కన్ - అనునవి అనుప్రయుక్తము కావలయును. అప్పుడు చక్కన + కన్ అని యుండును. ప్రస్తుతసూత్రముచేత నవర్ణకమునకు బిందువు రాగా 'చక్కఁగన్' అని యగును. హ్రస్వముమీఁది దగుటచే ఖండ బిందువునకు వైకల్పికముగా పూర్ణబిందువు కాగా 'చక్కంగన్' అనియు నుండవచ్చును.

సూత్రమునందు 'ఒక్కెడ' నని యనుటచేత బిందువురాని రూపముకూడ నుండవచ్చును. అప్పుడు చక్కనగ, చిక్కనగ - మున్నగు విధముగా నుండవచ్చును,

[నవర్ణకాంతములు క్రియావిశేషణములైనప్పుడు పై రూపములు కలుగును. అటుకాక నల్ల, తెల్ల మున్నగువానిని యథాతథముగా నుపయోగింపవచ్చును. అప్పుడు నల్లగా, తెల్లగా మున్నగు విధములుగా రూపములుండును.]

**24. యుష్మ దస్మ దాత్మార్థకంబుల కు త్తరపదంబు పరం బగునపుడు దుగాగమము విభాష నగు. (బా - ౧౧)**

నీదు కరుణ - నీకరుణ; నాదు నేరిమి - నానేరిమి; తనదు రూపు - తనరూపు.

వ్యాఖ్య - యుష్మదర్థకములు నీవు, మీరు మున్నగు సర్వనామములు. అస్మదర్థకములు నేను, మేము, మనము మున్నగు సర్వనామములు. ఆత్మార్థకములు తాను, తాము మున్నగు సర్వనామములు.

సూత్రవిషయము సంబంధమును దెల్పును. కావున షష్ఠ్యంతములైన యుష్మదర్థకాదులే పూర్వశబ్దములుగా నుండ నగును. "శేషషష్ఠికి యొక్కయు నగు"నను విధినిబట్టి సంబంధము నందు 'యొక్క' యను ప్రత్యయ మగును. కావున యుష్మ దర్థమునందు నీయొక్క, మీయొక్క అని యుండును. నీయొక్క + కరుణ "సమాసవిభక్తికి లోపంబగు" అను నియ మమునుబట్టి 'యొక్క' లోపింపగా నీ + కరుణ అని యగును. ప్రస్తుతసూత్రముచేత దు వర్ణము విభాషగా కలుగగా నీ + దు + కరుణ = నీదు కరుణ అని యగును. అట్లే బహుత్వమున 'మీదు కరుణ' అని యుండును. దుగాగమవిధి పాక్షికమగుట చేత, దుగాగమము రానిపక్షమున నీకరుణ, మీకరుణ - మున్నగు విధముగనే యుండును.

ఇట్లే షష్ఠ్యంతములైన అస్మదర్థకములు నాయొక్క, మాయొక్క, మనయొక్క - అని యుండును. పైని వివరించి నట్లుగా 'యొక్క' విభక్తికి లోపము వచ్చి నాదు నేరిమి,

నానేరిమి; మాదు నేరిమి, మానేరిమి; మనదునేరిమి, మన నేరిమి - మున్నగు విధముగా రూపములు కలుగును.

షష్ఠ్యంతమయిన ఆత్మార్థకము ఏకవచనమున 'తన యొక్క' యనియు, బహువచనమున 'తమయొక్క' అనియు నుండును. తనయొక్క + రూపు యొక్కకు సమాసమున లోపము కలుగగా తన + రూపు అని యగును. దుగాగమము కలిగిన యెడల 'తనదురూపు' అని యగును; కాని [illegible] అనియే యుండిపోవును. అట్లే బహుత్వమునందు తమదురూపు, తమరూపు - అను రెండు విధములగు రూపములును కలుగును.

షష్ఠ్యంతములయిన యుష్మదస్మదాత్మార్థకములకు ఉత్తర పదము పరమైనపుడు 'దు' అను వర్ణము ఆగమముగా వికల్పముగా వచ్చి చేరునని సూత్రార్థము. ఇది షష్ఠీ తత్పురుష సమాసములకు సంబంధించిన విషయము.

**25.** ఒకానొకచో గుణవాచక ధాతుజవిశేషణంబు లవయవ విశేష్యపూర్వకంబులయి యవయవితో సమసించెడి.

(ప్రౌ - ౧౨)

ఒడలుతెల్లని తురగోత్తము వాలంబు (ఒడలుతెల్లని = తెల్లని యొడలుగల యని యర్థము)॥ భార. అది. ౨౫॥ తనువు మీన్పొలవల్పు జాలరిదాన (తనువు మీన్పొలవల్పు = మీన్పొలవల్పు తనువుగల యని యర్థము)॥ భార. ఆది. ౩౫॥

వ్యాఖ్య - అవయవవాచకములు విశేష్యములు కాగా, వానితో నన్వయించు గుణవాచక ధాతుజ విశేషణములు అవయవితో సమసించునని సూత్రార్థము.

ఒడలు, తనువు - మున్నగునవి యవయవములు. తురగోత్తముఁడు, జాలరిది మున్నగునవి అవయవి వాచకములు. 'ఒడలు' అను నవయవవాచక విశేష్యమునకు విశేషణము 'తెల్లని' యనునది. విశేషణము పూర్వము, విశేష్యము పిమ్మటను జెప్ప బడుట సాధారణముగా జరుగు పద్ధతి. అప్పుడు 'తెల్లనియొడలు' అని యగును. కాని ప్రస్తుతప్రయోగమున విశేష్యమునకు పిమ్మట విశేషణము కలిగినది. అంతేకాక, తరువాతనున్న అవ యవి వాచకమయిన 'తురగోత్తముడు' అను దానితో సమాస ముగా నగుచున్నది. కావున, ఇది విశేషము.

'తనువు' అవయవవాచకము. 'మీనొప్పెలవల్చు' అనున దంతయు ధాతుజవిశేషణము ఇది 'తనువు'యొక్క గుణమును దెల్పుచున్నది. కావున 'మీనొప్పెలవల్చు తనువు' అను విధమున సమసించుట సాధారణముగా కనబడురీతి. అటుకాక, తనువు మీనొప్పెలవల్చు - అను విశేష్యముతోడి విశేషణము తరువాత నున్న అవయవివాచకముతో సమసించుచున్నది. ఇది విశేషము.

ఇంతకు పూర్వమే సామర్థ్యముగల పదములు, తత్సంబంధి పదములతో అన్వయించుచుండునన్న విషయమును చూచితిమి. 'తెల్లని' మున్నగుపదములు 'ఒడలు' మున్నగుపదములతో అన్వ యించుచున్నట్లే మీది విశేష్యములతో అన్వయించుచున్నవి. 'ఒడలు' అని యన్నప్పుడు 'ఒడలుచేత' అని యర్థము. 'ఒడలు చేత తెల్లని' అనునది ప్రత్యయము లోపింపగా 'ఒడలు తెల్లని' అని యగును. అది పూర్వభాగముగా వ్యవహరించి 'తుర

గో_త్తము వాలంబు' అను ను_త్తరభాగముతో సమసించుచున్నది. ఇట్లే రెండవలక్ష్యమును గూడ గ్రహింపవలయును.

[పరువుచాలని పని, సిగ్గులేని మనుష్యులు - మున్నగుచోట్ల నున్నట్లే నడుమనున్న ధాతుజవిశేషణము పూర్వపదముతోను, ఉ_త్తరపదముతోను గూడ నన్వయము నొందును. అందువలన అవయవావయ వికల్పనము కూడ ఆవశ్యకము కాదు. 'తెల్లని యొడలుగల' మున్నగువిధమైన విగ్రహము క్లేశకరము. 'ఒడలుచేత తెల్లనయిన' మున్నగువిధముగా విగ్రహము చెప్పికొనిన యెడల సమంజసముగా నుండును.]

**26. తమ్ముఁగుఱ్ఱలు చిలుక మొకరి యిత్యాదులు విశేష్య పూర్వపద కర్మధారయంబులు. (ప్రౌ - ౧౬)**

తమ్ముఁ గుఱ్ఱలు నీవుఁ దగ విపినంబున ॥కిరిగితిరి ॥భార. అర. ౭॥ ప్రభావతి మోదము వెలిఁజిలుకఁ జిలుక మొకరిం బలికెన్॥ శుక. ౨౮॥

వ్యాఖ్య - కర్మధారయములు తొలుత విశేషణమును గలిగియుండి, పిదప విశేష్యమును గలిగియుండును. అట్లు కాక విశేష్యము ముందును, విశేషణము వెనుకను గల సమాసములు గూడ తెలుగున కలవనియు, తమ్ముఁ గుఱ్ఱలు, చిలుక మొకరి- మున్నగునవి అట్టివనియు ప్రస్తుతసూత్ర తాత్పర్యము.

తమ్ములు + కుఱ్ఱలు అని యున్నప్పుడు కుఱ్ఱలయిన తమ్ములు అని యర్థము. ఇచ్చట 'కుఱ్ఱలు', విశేషణము; 'తమ్ములు' విశేష్యము. విశేష్యము ముందుగా వచ్చినది. సమాసమునందు విభక్తికి లోపముకలిగి తమ్మ + కుఱ్ఱలు అని యయ్యెను. ఇచ్చట నుగాగమముకూడ కలిగి తమ్మ + ను +

కుట్టులు అనియై తమ్ముఁగుట్టులు, తమ్ముంగుట్టులు - అను రూపము లేర్పడుచున్నవి.

[సమాసమున విభక్తికి లోపము వచ్చుటకు, నుగాగమము వచ్చుటకు వీలున్నమాట వాస్తవమేకాని, ప్రస్తుతప్రయోగమునందు ఆవీలు కలుగదు. కర్మధారయము త్రిక, స్త్రీసమ, ఋగంత. ధాతుజవిశేషణ పూర్వపదమై యుండవలయును. కాని యిది దానికి భిన్నముగా మహద్వాచకమును పూర్వపదముగా కలిగియున్నది. 'లు'వర్ణము ను విశేషవిధిని గల్పించుకొని లోపింపజేసినచో 'తమ్మ + కుట్టులు' అని యేర్పడును. ఇచ్చట ఉదంతము పై పరుషము పరమగుచున్నది కావున నుగాగమము చేయవచ్చు ననిపించునుగాని, యిదిస్త్రీసమము కాకపోవుట అభ్యంతరమైయున్నది. అయినను విశేషవిధిచేత దానిని సైతమంగీకరింప వలయును. కావుననే 'తమ్ముఁ గుట్టులు' మున్నగువానికి ప్రక్రియను జూపు ప్రయత్నమునుండి తప్పించుకొని ప్రౌఢవ్యాకర్త సమాస స్వభావమును మాత్రమే తెల్పియుండెను.]

చిలుక + మొకరి - అని యున్నప్పుడు మొకరియైన చిలుక యని విగ్రహము. ఇచ్చటకూడ విశేష్యము ముందును, విశేషణము తరువాతను వచ్చి సమసించుచున్నవి. కావున నిదియు విశేషమే.

**28.** ద్విరుక్తం బగు హల్లు పరం బగునపు డాచ్ఛికం బగు దీర్ఘంబునకు హ్రస్వం బగు. (బా - ౧౩)

వ్యాఖ్య - ద్విరుక్తం బగు హల్లు = ద్విత్వాక్షరము. క్క; చ్చ మున్నగునవి యుదాహరణములు. ఆచ్ఛికం బగు దీర్ఘంబు = అచ్చ తెనుగు పదమునకు చెందిన కడపటిదీర్ఘము.

ఇందు పూర్వశబ్దము ఆచ్ఛికమే కావలయును. ఆచ్ఛిక శబ్దము కడపట నున్న దీర్ఘమునకు, పరమందు ద్విత్వ మున్న

యెడల, హ్రస్వము కలుగును - అని సూత్రార్థము. (లక్ష్యము లను తరువాతి సూత్రముక్రింద చూడనగును.)

**29.** త్రికంబుమీఁది యసంయుక్తహల్లునకు ద్విత్వంబు బహుళంబుగా నగు. (బా - ౧౪)

అక్కన్న - ఆకన్య; ఇక్కాలము - ఈకాలము; ఎల్లోకము - ఏలోకము; అయ్యశ్వము - ఆయశ్వము; బాహుళకముచే నూష్మరేఫంబులకు ద్విత్వంబు గలుగదు॥ ఆరూపము - ఈశబ్దము - ఏషండము - ఆసుకృతి - ఆహాయము.

వ్యాఖ్య - త్రికము = ఆ ఈ ఏ అను నిర్దేశాత్మక సర్వనామములు. అసంయుక్తహల్లు = భిన్నహల్లుతో సంయోగము నొందని హల్లు. క - ల - య మున్నగునవి యుదాహరణములు.

త్రికమునకు పరమందున్న పదముయొక్క మొదటియక్షరము సంయుక్తాక్షరము కానియెడల, దానికి ద్విత్వము బహుళముగా నగునని సూత్రార్థము.

ఆ + కన్య, ఇందు తొలుతటిది త్రికము. దానిమీఁది పదముయొక్క ఆద్యక్షరము 'క'. ఇది అసంయుక్తాక్షరము. ప్రస్తుత సూత్రమునుబట్టి దీనికి ద్విత్వము బహుళముగా కలుగవచ్చును. కలిగినయెడల ఆ + క్కన్య అని యగును. పూర్వసూత్రమునుబట్టి 'ఆ' యను వర్ణమునకు హ్రస్వము నిత్యముగా కలిగి 'అక్కన్య' అని యగును. ఇట్లే ఇక్కాలము, ఎల్లోకము - అను రూపము లేర్పడును.

ఆ + అశ్వము అనునపుడు పరమందు హల్లు లేనందు వలన ఈ సూత్రమునకు విషయము కాదేమో యని యని పించును. కాని రెండచ్చులు సన్నిహిత మైనప్పుడు సంధి యగుటయో, సంధి కాకున్న యెడల యడాగమము కలుగుటయో జరుగవలయును. ఇచ్చట పూర్వమందు దీర్ఘముండుట వలన సంధి కలుగదు. "సంధి లేనిచో స్వరంబుకంటెం బరం బయిన స్వరంబునకు యడాగమం బగు" అను సూత్రవిధినిబట్టి ఆ + య్ + అశ్వము = ఆ + య్ + అశ్వము = ఆ + యశ్వము అని యగును. ఇప్పుడు త్రికమునకు అసంయుక్త మగు హల్లు పరమందుండుటవలన ద్విత్వము బహుళముగా కలుగును. ఆ+య్యశ్వము అని యైనపిమ్మట పూర్వసూత్రముచేత ఆచ్ఛికమైన 'ఆ' వర్ణముయొక్క దీర్ఘమునకు హ్రస్వమై 'అయ్యశ్వము' అను రూపము సిద్ధించును.

ద్విత్వము బహుళముగా విధింపబడినది కావున ప్రవృత్తి, అప్రవృత్తి, వికల్పము, అన్యత్వము - అను నాలుగింటికి గాని అందు కొన్నింటికి గాని అవకాశము కలదు. ఇందలి వికల్పవిధి చేత ద్విత్వము కలుగని రూపములుకూడ నుండవచ్చును. అప్పుడు, ఆకన్య - ఈకాలము - ఏలోకము - ఆయశ్వము మున్నగువిధముగనే రూపములుండును. త్రికమునకు హ్రస్వము కలుగు ప్రసక్తియే లేదు.

బహుళము అని యనుటవలన అప్రవృత్తికి కూడ అవ కాశము కలదు. అప్రవృత్తి యనగా సూత్రములో విధింపబడినట్లు

జరుగకుండుట సూత్రమునందు బహుళ మని యనుటచేత త్రికముమీది శబ్దములయొక్క మొదట ఊష్మాక్షరము కాని, రేఫాక్షరము కాని యున్న యెడల వానికి ద్విత్వము కలుగదు. ఊష్మములు = శ ష స హ - అను వర్ణములు. రేఫములు = ఱ ర - అను వర్ణములు.

ఆ + రూపము = ఆరూపము. ఈ + శబ్దము = ఈ శబ్దము. ఇక్కడ ఏవిధమైన మార్పును జరుగలేదు. తక్కిన ప్రయోగములుకూడ ద్విత్వము రానందువలన, ఇట్లే ఏవిధమైన మార్పునకు లోను గాకుండ నుండిపోయినవి.

ఈ సూత్రవిషయము కర్మధారయసమాసమునకు సంబంధించినది.

**30.** కృత హ్రస్వం బగు త్రికంబుమీఁది చోటు శబ్దంబు నోత్వంబున కత్వహ్రస్వంబులు విభాష నగు.

(బా - ౧౫)

అచ్చోటు - అచ్చటు - అచ్చొటు; ఇచ్చోటు - ఇచ్చటు - ఇచ్చొటు; ఎచ్చోటు - ఎచ్చటు - ఎచ్చొటు. వీని ద్విత్వంబునకు వక్ష్యమాణవిధిచేఁ బాక్షికంబుగ లోపం బగు॥ అచటు - అచొటు; ఇచటు - ఇచొటు; ఎచటు - ఎచొటు. ముచ్చోటులు - ముచ్చటులు - ముచ్చొటులు॥ అను రూపంబులు ప్రయోగంబులం గానంబడియెడి.

వ్యాఖ్య - కృతహ్రస్వం బగు త్రికము = చేయఁబడిన హ్రస్వముగల ఆ, ఈ, ఏ అను వర్ణములు. ద్విత్వాక్షరము పరమందుండగా ఆచ్ఛిక దీర్ఘమునకు హ్రస్వ మగు నను నియ

మమును బట్టి, హ్రస్వము లైన అ, ఇ, ఎ అను సర్వనామము లిచ్చట ఉద్దిష్టములు.

అ + చోటు అని యున్నప్పుడు త్రికముమీఁది అసంయుక్తమైన హల్లునకు పూర్వసూత్రముచేత ద్విత్వము కలుగును. అ + చ్చోటు. ద్విత్వమగు హల్లు పర మైనపుడు ఆచ్ఛిక మైన దీర్ఘమునకు హ్రస్వము నిత్యముగా నగును. కావున అ + చ్చోటు = అచ్చోటు అని యగును.

ప్రస్తుత సూత్రముచేత ఉత్తరపద మైన చోటు శబ్దము యొక్క ఓత్వమునకు అత్వము కాని, హ్రస్వము కాని విభాషగా నగును. అచ్చోటు - ఓత్వమునకు అత్వము కలుగగా 'అచ్చటు' అని యగును. ఓత్వమునకు హ్రస్వము కలుగగా 'అచ్చొటు' అని యగును. 'విభాష' అని యనుటచే అత్వ హ్రస్వములలో నేదియు ఓత్వమునకు రాకుండ నుండవచ్చును. అట్టియెడల 'అచ్చోటు' అనియే యుండును.

వక్ష్యమాణవిధి = ముందు చెప్పబోవు విధి. "అక్కటాదుల జడ్డకు లోపంబు విభాష నగు" అను ప్రకీర్ణకపరిచ్ఛేదము నందలి యెనిమిదవ సూత్రము ననుసరించి 'అచ్చోటు' మున్నగు వానియందలి ద్విత్వమునకు లోపము విభాషగా నగును. అపుడు, అచోటు - అచటు; ఇచోటు - ఇచటు; ఎచోటు - ఎచటు మున్నగువిధముగా రూపము లేర్పడును (అచ్చొటు - ఇచ్చొటు - ఎచ్చొటు మున్నగు ఒకారముతోడి రూపములు అక్కటాదులలోనివి కావు. కావున వానియందలి జడ్డకు లోపము రాదని గుర్తుంచుకొనవలయును). ఇంతవరకు కర్మధారయ సమాసవిషయము.

మూఁడు + చోటులు - పూర్వశబ్దము సంఖ్యావిశేషణ మగుట వలన ఇది ద్విగుసమాసవిషయము. రానున్న పదునేడవ సూత్రమునుబట్టి మూఁడు శబ్దముయొక్క డువర్ణమునకు లోపము కలిగి, మీఁదిహల్లునకు ద్విత్వము కలుగును. మూ + చ్చోటులు. పదుమూఁడవ సూత్రవిధినిబట్టి ద్విత్వము పర మందుండగా ఆచ్ఛికమైన 'మూఁడు' శబ్దముయొక్క అవశిష్ట మగు 'మూ' వర్ణముయొక్క దీర్ఘమునకు హ్రస్వ మగును. ము + చ్చోటులు - ముచ్చోటులు ఇంతవరకు పూర్వసూత్ర ములచేతనే సిద్ధించును.

ప్రస్తుత సూత్రముచేత కృతహ్రస్వ మగు త్రికము మీఁది చోటు శబ్దమునకు కలుగు కార్యములు, మూడు శబ్దముయొక్క అవశిష్టముమీది వానికికూడ కలుగుట విశేషము. ముచ్చోటులు- ముచ్చటులు - ముచ్చొటులు॥ వీనియందలి చకారమునకు మాత్రము లోపము రాదని గుర్తుంచుకొనవలయును.

**30. ఉత్తరపదం బగు చోట శబ్దము టాక్షరమునకు లోపంబు విభాష నగు. (బా - ౧౬)**

చోటుశబ్దం బౌపవిభక్తికంబు గావున దాని యంతిమాక్షరంబు సప్తమ్యాదేశమయిన యకారంబుతోడం బాక్షికంబుగ లోపించు నని యర్థము. అచ్చో నున్నాఁడు - అచ్చోట నున్నాఁడు ఒకచోనుండె - ఒకచోట నుండె.

వ్యాఖ్య - సమాసమునందు ఉత్తరపదముగా నున్న చోట శబ్దముయొక్క చివరిదైన టవర్ణమునకు విభాషగా లోప మగు నని సూత్రార్థము. చోటశబ్దము' అనియనుటచేత "ఔప

విభక్తికముల తృతీయాసప్తముల కత్వం బాదేశంబు బహుళంబుగా నగు" (బా.ఆచ్ఛిక-38) అను సూత్రమును బట్టి 'చోటి యందును' అనుటకు బదులుగా పర్పడిన 'చోటను' అను రూపమును గ్రహింపవలయును.

అచ్చోటను - అనునది ఆ + చోటను అని విభక్తమగును. కావున ప్రస్తుతసూత్రముచేత 'చోట' శబ్దము నందలి 'ట' యను వర్ణమునకు లోపము రాగా ఆ + చోను అని యగును. త్రికము మీది చకారమునకు ద్విత్వమును, ద్విత్వము పరమందున్నపుడు ఆచ్ఛికదీర్ఘమునకు హ్రస్వ మగుటయు ఈవరకు ప్రసక్తములే. 'అచ్చోను' అన నది సిద్ధరూపము. టాకార లోపము వైభాషికము కావున లోపము కలుగనియెడల 'అచ్చోటను' అని యుండును. ఇట్టివే ఒకచోను ఒకచోటను, - అను రూపములు.

**31. సమానాధికరణం బగు నుత్తరపదంబు పరం బగునపుడు మూఁడు శబ్దము డువర్ణంబునకు లోపంబును మీఁది హల్లునకు ద్విత్వంబు నగు. (బా - ౧౩)**

మూఁడు జగములు - ముజ్జగములు; మూఁడు లోకములు - ముల్లోకములు.

వ్యాఖ్య - సంఖ్యా పూర్వకమైన సమానాధికరణమునకే ద్విగు సమాసమని పేరు. ద్విగు సమాసమునందు ఉత్తరశబ్దము పరమగునప్పుడు పూర్వమున్న మూఁడు శబ్దముయొక్క డువర్ణమునకు లోపమై, మీది హల్లునకు ద్విత్వ మగునని సూత్రార్థము.

మూఁడు + జగములు. ఇవి సమసించునెడల 'డు' వర్ణమునకు లోపము కలుగును. మూ + జగములు అని యగును. ఉత్తరపదమునందు మొదటిదయిన జ వర్ణమునకు ద్విత్వము కలుగగా మూ + జ్జగములు అని యగును. "ద్విరుక్తంబగు హల్లు పరం బగునపు డాచ్ఛికం బగు దీర్ఘంబునకు హ్రస్వంబగు" అను నియమమునుబట్టి ము + జ్జగములు = ముజ్జగములు అను రూపము సిద్ధించును. సమాసము కానియెడల రెండు పదములును విడివిడిగా 'మూఁడు జగములు' అనియే యుండును. ఇట్లే మూఁడు లోకములు, ముల్లోకములు - అను రెండు రూపములు నేర్పడును.

**32.** ముయ్యేడ్వాదులందు హ్రస్వద్విత్వంబులు నిత్యంబులు.
(ప్రౌ - ౧౦)

రాముఁ డలుకన్ ముయ్యేడుమాఱుల్ రణప్రీతిన్ వైరినరాతలేశ్వరులఁ జంపెం బల్మిగన్॥ భార. ఆది. ౧౭॥ ముయ్యాఱు మార్గణములు ॥రా. యు.॥ దీని ముమ్మడుగగు గణము.। భార. ఆది. ౧౭॥ మొ. ఆంధ్రశబ్ద చింతామణియందుఁగల 'ఇనముచ' సిత్యాది సూత్రమందలి యదః ప్రభృతులు వ్యర్థములగుచు స్వేతరంబులకును నక్కార్యం బని తెలుపుచున్నవి.

వ్యాఖ్య - ముయ్యేడు మున్నగువానియందు డువర్ణమునకు లోపముకాగా మిగిలిన 'మూ'యొక్క దీర్ఘమునకు హ్రస్వమును, మీది హల్లునకు ద్విత్వమును నిత్యముగా నగునని సూత్రార్థము.

మూఁడు + ఏడు అని యున్నపుడు పూర్వసూత్రము చేత (బా - 17) డు వర్ణమునకు లోపము కలిగి, మీది హల్లునకు ద్విత్వము కలుగవలయును. మూ + ఏడు అని యున్నప్పుడు దీర్ఘముమీది దగుటచే 'ఏ' అనుస్వరమునకు యడాగమము కలిగి మూ + యేడు అనియై ద్విత్వము కలుగగా మూ + య్యేడు అని యగును. తరువాత "ద్విరుక్తం బగు హల్లుపరంబగునపు డాచ్ఛికంబగు దీర్ఘంబునకు హ్రస్వంబగు" అను విధినిబట్టి ముయ్యేడు అని యగును. 'ముయ్యాఖు' అను ప్రయోగముకూడ నిట్టిదే.

మూడు + మడుగులు అనునవి మూ + మడుగులు అనియై 'ముమ్మడుగులు' అని యగును రాబోవు (బా - 18) సూత్రముచేత ఏకవచనము కలిగి 'ముమ్మడుగు' అని యగును.

బాలవ్యాకరణమువలననే యీరూపములు సాధ్యములు. కాని, సూత్రమున 'అగు'నని చెప్పినప్పటికిని ఉదాహరణములను బట్టి వికల్పవిధియే సూరికి సమ్మత మని యనిపించుచున్నది. ప్రౌఢవ్యాకరణకారుడుకూడ దానిని వైకల్పికవిధిగానే గ్రహించి, ముయ్యేడు మున్నగుచోట్ల మాత్రము ఆవిధి నిత్యముగా జరుగు నని సూత్రించుచున్నాడు. కావున ముయ్యేడు, ముయ్యాఖు, ముమ్మడుగు - అనురీతిగనే వీని రూపములుండును.

"ఇద మదసేత ద్యత్త్చ్ఛబ్దా శ్శబ్దాంతరాన్వయే బహుళమ్। హ్రస్వం ప్రపద్య దీర్ఘాద్విత్వ ముపర్యక్షరస్య జనయంతి" అని ఆంధ్రశబ్దచింతామణియందు కలదు. ఇదమ్, అదస్, ఏతత్,

యత్, తత్ - అను శబ్దములు శబ్దాంతరముతో బహుళముగా నన్వయించును; దీర్ఘమునకు హ్రస్వమును పొందును; తరువాతి యక్షరమునకు ద్విత్వమును గలిగించును॥ అని దాని యర్థము. ఇదమ్, అదస్, ఏతత్ - అను మూడు శబ్దములును సమానార్థకములు. 'ఈ' యను నొక్కటే తెనుగున నన్నింటికి బోధకమగును. యత్ అనగా 'ఏ' అనియు, తత్ అనగా 'ఆ' యనియు నర్థములు. 'ఈ' యను నొకే యర్థమును దెల్పుటకై మూడు శబ్దములను వాడుట వ్యర్థము. వ్యాకరణమునందు వ్యర్థముగా నేమియు వాడరు. కావున వ్యర్థము లనిపించు ఈ శబ్దములు త్రికమును మాత్రమేకాక (స్వ + ఇతరములు) మిగిలినవానిని గూడ గ్రహింపవలయునని సూచించుచున్నవనియు, అందువలన 'మూఁడు' శబ్దమునకు సైతము పై కార్యములు జరుగుననియు వ్యాకర్త వివరణమునందు జ్ఞాపనము చేయుచున్నాడు.

[ ఈ జ్ఞాపనము నిరర్థకమైనది. బాలవ్యాకరణము త్రికమునుగూర్చి చెప్పినట్లే 'మూఁడు' శబ్దమునుగూర్చి కూడ చెప్పెను. సిద్ధమైనదానిని సాధించుటకు మరల ప్రయత్నము చేయుట సార్థక మనిపించుకొనదు. కావున వివరణమునందలి "ఆంధ్రశబ్ద" అని మొదలుగాగల వాక్యము సర్వము అనావశ్యకము. ]

**33. సమాసఘటితం బీ శబ్దం బొక్కచో సూచనార్థకంబగు.**

**(ప్రౌ - ౧౧)**

ఈయున్న పౌష్యేత్రోలికిం బోయి (ఈ యున్న = ఇదిగో నున్న యని యర్థము) ॥భార. ఆది. ౧౩॥ మొ.

వ్యాఖ్య - సమాసమునందు పూర్వశబ్దముగా కూడియున్న 'ఈ' యను శబ్దము సూచనను తెలుపునని సూత్రార్థము.

'ఈయున్న' యనుచోట 'ఉన్న' అను ధాతుజవిశేష ణముతో 'ఈ' యనునది సమసించుచున్నది. ఈ సమాసమునకు 'ఇదిగోనున్న' యన్నది యర్థమని ప్రౌఢవ్యాకరణకారుడు వివరించెను.

[ప్రౌఢవ్యాకరణకారుడు చెప్పిన యర్థమున కర్థము తెలియ రాకున్నది. 'ఇదిగో' అన్న రూపముపై 'ఉన్న' అను ధాతుజవిశేషణము చేరుట సాధారణముగా గోచరము కాదు. 'ఇదిగో' అన్నది కళ. దానిపైని ద్రుతము చేర్పుటయు వింతగానున్నది. తానే మరొకచోట చెప్పినట్లు నిరర్థకముగానే ద్రుతము చేరెనని తలచియుండవచ్చును.]

'ఆ' యను సర్వనామము దూరమును, 'ఈ' యనునది సామీప్యమును, 'ఏ' యనునది ప్రశ్నమును సూచించును. కావుననే వీనిని నిర్దేశాత్మక సర్వనామములని వ్యవహరింతురు. పై ప్రయోగమునందలి 'ఈ' శబ్దముకూడ సామీప్యమును నిర్దేశించుచు 'ఇక్కడనున్న' అను నర్థము నిచ్చుచున్నది. నిజమునకు అర్థమునుబట్టి యిక్కడ విశేషమేమియు లేదు. 'ఉన్న' యను ధాతుజవిశేషణము, పూర్వశబ్దమైన 'ఈ'తో సమసించుచు, తరువాతి శబ్దముతో కూడ సమసించుచున్నది. కర్మధారయమునందు త్రికము, ధాతుజవిశేషణము కూడ పూర్వశబ్దములుగా నుండదగినవే. కావున నిచ్చటను విశేషము కానరాదు. ఈసూత్రమనావశ్యకము.

**34. ఆ యీత్యాది ఘటితంబులు విశేషణోభయ పద కర్మధారయంబులు.** **(ప్రౌ - ౧౭)**

ఆ యీ నేరములు॥ ఈ యాదేశంబననేల ॥ప్యా. ౧ ఆ॥ ఎత్తిన పెంచినవారి ॥వి|క. ౬ ఆ॥ కలిగిన యొప్పని దోషములు ॥విజ్ఞా.

**అచా॥ కొట్టిన తిట్టిన యాతఁడు ॥భోజ. ౬ ఆ॥ చలి తెలి మంచు తుంపరలు ॥భాను. ౩ ఆ॥ వడ చల్లని చల్లని గాడ్పు ॥రామా. ౧ ఆ॥ తియ్య బెల్లి మాటలు ॥క్షేత్రయ॥ తొంగలి తలచు ఱెప్పల ॥భార. విరా. ౨ ఆ॥ తొలి ప్రాఁత కుప్పసంబు ॥జై. ౬ ఆ॥ నిడు వాలిక కన్నులు (వాలిక = వాఁడి) భోజ. ౫ ఆ॥ పెను నిట్ట తాడు ॥జై. ౨ ఆ॥ మొక్క వోయిన వెలి గొమ్ముదోయి ॥హరి. ఉ. ౭ ఆ॥ విన్న కన్న యర్థము ॥కళా. ౮ ఆ॥ క్రొమ్మించు లేఁజెక్కుటద్దంబు ॥నై. ౨ ఆ॥ తెలి మనుసోగ వెన్నెలలు ॥రామా ౨ ఆ॥**

వ్యాఖ్య - ఆ ఈ మున్నగువానిని కలిగియున్న సమాసములను విశేషణోభయపద కర్మధారయములని యందురని సూత్రార్థము. ఒకే విశేష్యమునకు ఆ, ఈ మున్నగునవి రెండేసి విశేషణములు పూర్వమందు వచ్చినప్పటికిని సమాసమేర్పడునని, దానిని విశేషణోభయపద కర్మధారయముగా గ్రహింపవలయునని సూత్రకారుని యభిప్రాయము.

ఆ యీ నేరములు - అనుచోట 'నేరములు' అన్నది విశేష్యము; ఇచ్చట 'ఆ' యను విశేషణమొక్కటియు 'ఈ' అను విశేషణ మొక్కటియు గలవు. ఈ యాదేశంబు - అను చోట 'దేశంబు' అను విశేష్యమునకు ఈ, ఆ అను రెండును విశేషణములై సమసించుచున్నవి.

ఎత్తిన, పెంచిన - అను రెండు ధాతుజవిశేషణములు 'హారి' అను విశేష్య మొక్క దానితోనే సమసించుచున్నవి.

కలిగిన, ఒప్పని - అను ధాతుజవిశేషణములు రెండును 'దోషములు' అనె నొకేవిశేష్యముతో సమసించుచున్నవి. తక్కిన యుదాహరణములు గూడ నిట్టివే.

బాలవ్యాకరణమునందు "విశేషణంబునకు విశేష్యంబుతోడ సమాసంబు సమానాధికరణంబు నాఁబడు. ఇదియె కర్మధారయంబు నాఁబడు" అని (బా - 3) వివరింపబడినది. దీనిని బట్టి విశేషణముపూర్వముననేయుండవలయునని, ఒక్కటియే యుండవలయునని యూహించి ప్రౌఢ వ్యాకరణకారుడు రెండేసి విశేషణములుగల కర్మధారయములను చూపుచున్నాడు. చిన్నయసూరి చూపిన "ఆయా కాలము" (బా - 21) మున్నగు రూపములవలన అట్టివి యుండుటయు బాలవ్యాకరణమునకు సమ్మతమే యని తెలుచున్నది. కావున, ఇది క్రొత్తవిషయము కాదు. స్పష్టతా ప్రతిపత్తికి సహకరించుచున్నది.

ఈ సమాసమునకు విశేషణోభయపద కర్మధారయము అని ప్రౌఢవ్యాకరణకారుడు పెట్టిన పేరు. ఇక్కడ విశేషణములకు రెండింటికిమాత్రమే సమాసము కలిగినయెడల ఈ పేరు సరిపోవును. 'శీతోష్ణము' మున్నగు సమాసములు ఉదాహరణములు కాగలవు. కాని ప్రస్తుతోదాహరణములందు విశేష్యములు విశేషణములతో సమసించియే యున్నవి. కావున, ఈ పేరు సక్రమముగాలేదు. ఆ యను విశేషణము పూర్వపదముగా, ఈ యను విశేషణము ఉత్తరపదముగా వ్యవహరించుచున్నవన్న భావమున ప్రౌఢవ్యాకరణకారు డట్లు నామకరణము చేయుట జరిగియుండును. ఏమైనను, సూత్రము ప్రత్యేకప్రయోజనమేమియు సాధించుట లేదు.

[పూర్వము చెప్పిన 'ఈ యున్న పౌష్యప్రోలికి' అను సమాసము కూడ నిట్టిదే. దానిని వేరుగా చెప్పి, ఇక్కడ దీనిని చెప్పుటయు సమంజ

సముగా లేదు. ఈ తరువాత మరొక సూత్రమునందుకూడ నిదే ప్రస్తావము మరల వచ్చును.]

**35.** ఆకారంబున కామ్రేడితంబునకుం దదర్థకంబునకయి యాయి యను శబ్దంబులు విభాష నగు. (బా - ౨౧)

వక్ష్యమాణ విధిచేత నయి యనుదాని కైకారాదేశంబు నగు. ఆయయి కాలము - ఆయాయి కాలము - అయ్యయి కాలము - అయ్యాయి కాలము - ఆయై కాలము - అయ్యైకాలము - ఆయా కాలము - ఆయక్కాలము - అయ్యాకాలము - అయ్యక్కాలము.

వ్యాఖ్య - అవ్యవధానముగ ఒకేశబ్దము రెండుసార్లు ఉచ్చరింపబడిన యెడల, రెండవసారి యుచ్చరింపబడిన దానిని ఆమ్రేడితమని యందురు. నిర్దేశాత్మకసర్వనామ మైన 'ఆ' యను శబ్దము రెండుమారు లుచ్చరింపబడగా, అందు రెండవ మారుచ్చరింపబడిన 'ఆ' యను శబ్దమునకు బదులుగా 'అయి' యని కాని, 'ఆయి' యని కాని విభాషగా నగు నని సూత్రార్థము.

వక్ష్యమాణవిధి = ముందు చెప్పబడనున్న నియమము. ఇక ముందరిప్రకరణములో అయి, అవు అనువానికి ఐ, ఔ అను వ్రకతమములు విధింపబడును. కావున ఇకముందు చెప్ప బోయెడు ఆ నియమము ప్రకారము ఇక్కడి 'అయి' కి బదులుగా 'ఐ' అనిష్టము నగును.

ఆ + ఆ + కాలము. ప్రస్తుతసూత్రముచేత రెండవ యక్షరమునకు బదులుగా 'అయి'అనునది యాదేశముగా నగును. ఆ + అయి + కాలము. మొదట దీర్ఘముండుటచే సంధి కలు

గక, యడాగమము కలుగును॥ ఆయయికాలము. అట్లే ఆమ్రేడిత మైన ఆకారమునకు 'అయి' అని యాదేశము కాగా ఆ + అయి + కాలము – అనియై యడాగమము కలుగగా ఆయాయికాలము అని యగును.

ఆ + అయి + కాలము. "సంధి లేనిచోఁ బూర్వ స్వరంబుకంటెం బరం బయిన స్వరంబునకు యడాగమం బగు" అను నియమము ప్రకారము ఆ + యయి + కాలము అని యగును. "త్రికంబుమీఁది యసంయుక్త హల్లునకు ద్విత్వంబు బహుళంబుగా నగు" నను నియమమునుబట్టి ఆ + య్యాయి + కాలము అనియై "ద్విరుక్తంబగు హల్లు పరంబగు నపు డాచ్ఛికం బగు దీర్ఘంబునకు హ్రస్వం బగు" నను విధినిబట్టి 'అయ్యాయి కాలము' అని యగును. అట్లే ఆమ్రేడితమైన 'ఆ' కారమునకు 'ఆయి' ఆదేశము కాగా 'అయ్యాయికాలము' అని యగును.

ఆ + అయి + కాలము. అయికి ఐకార మాదేశము కాగా ఆ + ఐ + కాలము అని యగును. దీర్ఘముపీద సంధి లేనందువలన యడాగమము కలిగి ఆ + య్ + ఐకాలము = ఆయైకాలము అని యగును. త్రికముమీది అసంయుక్తహల్లునకు ద్విత్వము కలిగి, ద్విత్వము పరమగుటచేత ఆచ్ఛికదీర్ఘమునకు హ్రస్వము కాగా 'అయ్యైకాలము' అని యగును.

అయి, ఆయి యనునవి విభాషగా నగు నని యనుట చేత, అవి రానియెడల 'ఆ + ఆ + కాలము' అని యుండి, యడాగమము కలుగుటచేత 'ఆయాకాలము' అని యగును. రెండవ ఆకారముమీది అసంయుక్త వర్ణమునకు ద్విత్వము కలి

గినయెడల ఆ + ఆ + క్కాలము అని యగును. ద్విత్వము పర మగునప్పుడు అచ్చికదీర్ఘమునకు హ్రస్వమై ఆ + అ + క్కాలము అని యగును. దీర్ఘముమీది అత్వమునకు యడాగమము కలిగి 'ఆయక్కాలము' అని యగును. మొదటివర్ణమైన 'ఆ' కారముమీది అసంయుక్త యకారమునకు ద్విత్వమై, ముందరి అచ్చికదీర్ఘమునకు హ్రస్వముకాగా 'అయ్యక్కాలము' అని యగును. ఆ + ఆ + కాలము అని యుండగా దీర్ఘము మీది ఆకారమునకు యడాగమము కలిగి ఆ + యా + కాలము అని యై, ఆకారముమీది అసంయుక్తయకారమునకు ద్విత్వమును, ముందరి యాచ్చికదీర్ఘమునకు హ్రస్వమును కాగా 'అయ్యాకాలము' అని యగును. ఇది కర్మధారయ సమాస విషయము.

**36.** కొన్నియెడల విశేషణోభయపదంబులు త్రిక క్రియాజన్య విశేషణ ఘటితంబులు సందర్భయోగ్యపద వ్యవహితంబులగు. (ప్రౌ - ౧౮)

'త్రిక క్రియాజన్య విశేషణ ఘటితంబులు త్రిక క్రియాజన్య విశేషణోభయ ఘటితంబులు, కేవల క్రియాజన్య విశేషణఘటితంబులు నని ద్వి విధములు.

ఈ కన్నులు తెఅవని శిశు వే కీడొనరించె నీకు ॥భో॰జ. ౬ ఆ॥ నెఱులుగల మరునీలంపుటురుల సిరుల। నరుల గొనఁజాలి నరులను మరులు గొలుపు। నిరులు గెలిచిన తుమ్మెదగఱులఁ దెగడు। కురుల నలిదీర్చి విరులిడి కొప్పువెట్టి ॥భాగ. ౧౦ స్కం. ఉ॥ గగనమును రుద్ర, భూమి నేక తమ తిరుగు। నడఁటు లుమిసెడు కొఱవి దయ్యంబు వీఁడె.

।నై. ౨ ఆ॥ నే బలిమిఁ గుబేరునిం గెలిచి బాగుగఁగొన్న రవి ప్రకాశమో। యలరుచునున్న పుష్పకమునందు రమింపుము కోర్కె లారఁగన్ ॥రా. అర. ౨ ఆ॥ ఎత్తెడునట్టి యెఱ్ఱగాఁ గాఁగిన మడ్డుచందము ॥ప్రభా. ౫ ఆ॥ అనక దుందుభి వనరాని వినరాని దుర్వాక్యసూచులఁ దూలపుచ్చె ॥వి. పు. ౭ ఆ॥ చిక్కని చక్కని నున్నని। స్రుక్కని తోలూడఁ బడని ఛుల్లి సెగలచే। నొక్కఁబడని దండంబులు। తక్కక యుపనయనవేళఁ దాల్పఁగ వలయున్ ॥విజ్ఞా. ఆచా॥ మొ. (ఇట్టి ప్రయోగములు కవిత్రయము వారి గ్రంథములయందు దొరకినవి కావు.)

వ్యాఖ్య - పైని చెప్పికొనిన విశేషణోభయపద కర్మధారయ సమాసములయందు విశేషణములకు నడుమ సందర్భయోగ్యములగు పదములు చేరి వ్యవధానము గలిగించుటయు గలదని సూత్రార్థము. పై సమాసములయందు పూర్వపదములుగా త్రికమును, క్రియాజన్య విశేషణమునుగూడ నుండవచ్చును. కేవలము క్రియాజన్య విశేషణములే పూర్వపదములుగా కూడ నుండవచ్చును.

ఈ కన్నులు తెఱవని శిశువు - అను నుదాహరణము నందు 'శిశువు' విశేష్యము. 'ఈ' అన్నది విశేషణము; త్రికము. 'తెఱవని' అన్నది క్రియాజన్య విశేషణము. కావున, ఇది త్రిక క్రియాజన్య విశేషణోభయ ఘటితము. ఇచ్చట మొదటి విశేషణమునకు, రెండవ విశేషణమునకు నడుమ 'కన్నులు' అనుపదము చేరి వ్యవధానమును గలిగించుచున్నది. 'తెఱవని' అను ధాతుజన్య విశేషణమునకు కర్మగా వ్యవహరించి యీ పదము సంబంధ యోగ్యమైయున్నది. కావున, ఇట్టిపదములచేత విశేషణముల నడుమ వ్యవధానము కలుగవచ్చును.

తరువాతి లక్ష్యమునందు 'కురులు' విశేష్యము. దీనికి చాలి, కొలుపు, తెగడు - అను మూడు ధాతుజ విశేషణములతో అన్వయము గలదు. ఆయా విశేషణములకు నడుమ సందర్భయోగ్యములగు పెక్కుపదములు చేరి వ్యవధానమును గలిగించుచున్నవి. ఇది కేవల క్రియాజన్య విశేషణ ఘటితము.

గగనమను . . . దయ్యంబువీడె - అనుచోట 'కొఱవి దయ్యము అన్నది విశేష్యము. తిరుగు, ఉమిసెడు - అను రెండును క్రియాజన్య విశేషణములు. రెండింటికి నడుమ, పరమందలి విశేషణముతో కర్మార్థమున నన్వయించు 'అడరులు' అను పదముచేరి వ్యవధానమును గలిగించుచున్నది.

కొన్న, అలరుచునున్న - అన్నవి రెండును క్రియాజన్య విశేషణములు. పుష్పకము విశేష్యము. రెండవ విశేషణమునకు పూర్వమందు 'రవిప్రకాశమై' అను నొక సమాసముచేరి వ్యవధానమును గలిగించుచున్నది.

'మడ్డు' అను విశేష్యమునకు ఎత్తెడునట్టి, కాఁగిన - అన్నవి రెండును విశేషణములు. ఇచ్చట 'ఎట్టిగా' అను క్రియా విశేషణము రెండవ విశేషణమునకు ముందు చేరుచున్నది .

'దుర్వాక్యసూచులు' అను విశేష్యమునకు రాని, రాని-యని రెండు విశేషణములు గలవు. ఇందు రెంటింటికి నడుమ 'వినన్' అను నుజ్యంతమైన క్రియ చోటు చేసికొని యున్నది.

చివరి లక్ష్యమునందు చిక్కని, చక్కని, నున్నని, స్రుక్కని, పడని, పడని -, అని మొత్తము ఆరు ధాతుజ విశేష

ణములు వాడబడినవి. ఇవన్నియు 'దండంబులు' అను విశేష్య ముతో సమాసము నొందుచున్నవి. చివరి రెండు విశేషణము లకును పూర్వమందు 'తోలు ఊడ్వన్' అను శబ్దములును, 'ఛుల్లి సెగలచే నొక్కన్' అను శబ్దములు చేరి వ్యవధానమును గలిగించుచున్నవి.

చివరి యుదాహరణమునుబట్టి విశేషణోభయ ఘటితము లయిన యీ సమాసములయందు విశేషణములు రెండు మాత్రమేకాక, అంతకుమించి కూడ నుండవచ్చునని తెలు చున్నది.

ఇట్లు రెండుమూడు విశేషణము లున్నప్పుడు, ఇతర పదములు వాని నడుమచేరి వ్యవధానమును గలిగించిన ప్రయో గములు కవిత్రయమువారి గ్రంథములయందు కనిపింపలేదని వ్యాకర్త తన వివరణమునందు తెలిపియున్నాడు.

**37.** ద్విగువున నేకవచనంబు ప్రాయికంబుగా నగు; మిశ్రంబునకుఁ గాదు. (బా - ౧౮)

ముచ్చిచ్చు - ముక్కారు - ముప్పాతిక - ముత్రోవ॥ ముజ్జిధములు.

వ్యాఖ్య - ద్విగుసమాసమునందు పూర్వోత్తర పదములు రెండును అచ్చికములే యైనయెడల తరుచుగా సమాసాంతమునం దేకవచనమే యుండును; అట్లుకాక ఒకపదము అచ్చికమును, ఒకపదము తత్సమము నైనచో ఏకవచనము కాదు - అని సూత్రార్థము.

మూఁడు + చిచ్చులు - అనునవి సమసించునెడల పూర్వ సూత్రము (శా - 17)చేత 'డు' లోపమును, మీది హల్లునకు ద్విత్వమును గలిగి, ద్విత్వపరకమైనందున ఆచ్ఛికదీర్ఘమునకు హ్రస్వము కలుగగా 'ముచ్చిచ్చులు' అను రూపము సిద్ధించును. ఇందలి పూర్వశబ్దమైన 'మూఁడు' ఉత్తర శబ్దమయిన 'చిచ్చు' - రెండును ఆచ్ఛికములే యగుటవలన లువర్ణమునకు లోపము కలుగవచ్చును; అనగా ఏకత్వము నొందవచ్చునని యర్థము. అప్పుడు 'ముచ్చిచ్చు' అను రూప మేర్పడును. సూత్రమున "ఏకవచనము ప్రాయికముగా నగు" నని యనుటవలన, కొల. దిగా 'ముచ్చిచ్చులు' మున్నగు విధముగా బహువచనాంతమైన ఆచ్ఛిక ద్విగుసమాసములుకూడ నుండవచ్చును.

ముక్కారు, ముప్పాతిక, ముత్తోఁగ - మున్నగునవి యేకవచనాంతములైన ఆచ్ఛిక ద్విగుసమాసముల కుదాహరణములు.

మిశ్రద్విగువైనచో ఏకవచనము కారాదు. మూఁడు + విధములు = ముప్పిధములు అని యగును. పూర్వశబ్దమయిన 'మూఁడు' తెనుగు ; ఉత్తరశబ్దమయిన 'విధములు' తత్సమము. కావున నిది మిశ్రసమాసము. మిశ్రద్విగువునకు ఏకవచనము కాదను నియమముచేత్న, అది బహువచనాంతముగ 'ముప్పిధములు' అనియే యుండును. ఇట్లే ముల్లోకములు, ముజ్జగములు - మున్నగు సమాసములు బహువచనాంతములుగానే యుండును. మిశ్రము లగుటచే వీనికి ఏకత్వము కలుగదు.

## 38. ఒక్కచో ద్విగువు మిశ్రం బేకవచనాంతంబు నగు. (ప్రౌ - ౨౦)

తక్కిన సైన్యము లనిలోఁ జిక్కి పరాఙ్ముఖతఁ దొలఁగ శివుఁడును క్షితిఁ బొక్కుచు నలసత మెయి నల్దిక్కు దిరిగి యావులించుచు నుండెన్॥ ఉ. హరి. ౬ఆ॥ ఉన్నోక నిజ ప్రభావములు సూపెడు గద్దియ మీఁద నెక్కి ముల్లోకము దాన యేలుగతి లోలవిలోచన! యేమి చెప్పుదున్॥ హరి. ౧ఆ॥ ముమ్ముహూర్తమునకు ॥జై. ౭ఆ॥

వ్యాఖ్య - కొన్ని యెడల మిశ్రద్విగువు సైత మేకవచ నాంతమై యుండునని సూత్రార్థము. 'ఒకచో' నని యనుటచే, ఇట్టి రూపములు మిక్కిలి విరళము లన్న సూచన కలదు.

నాలుగు + దిక్కులు - అనియుండగా తొలిశబ్దమునకు ఆదేశముగా 'నలు' అని యగును. అపిమ్మట సమాసముకాగా 'నలుదిక్కులు' అని కావలయును. "పదాంతంబులయి యసం యుక్తంబులయిన నులురు ల యుత్వంబునకు లోపంబు బహు ళంబుగ నగు" నన్న (బా. ప్ర - 16) సూత్రమునుబట్టి 'నల్దిక్కులు' అని యగును. 'దీనికి నాలుగుదిక్కుల యొక్క సమూహము' అని సమాహారార్థమును చెప్పికొనినయెడల, ఏక వచనాంతమైనప్పటికిని అర్థప్రకటనమునందు ఇబ్బంది కలుగదు. కావుననే 'నల్దిక్కు' అనియు నుండుట సంభవించుచున్నది. ముల్లోకము, ముమ్ముహూర్తము - అన్నవికూడ నిట్టివే. మిశ్ర సమాసములైనప్పటికిని ఏకవచనాంతములే యైయున్నవి. ఇవి విశేషప్రయోగములు.

**39. వారార్థక శబ్దంబు లద్విరుక్తంబులు తఱచుగ సంఖ్యాపూర్వకంబు లగు. (ప్రౌ - ౨౧)**

ఒకతడవ – ఒకతూరి – ఒకతేప – ఒకమాటు – ఒకసారి – రెండుతడవులు – ఒకతడవకు – రెండుతడవులకు, మొ॥ అద్విరుక్తంబనుటచే తేపతేపకు, తఱచుగ ననుటచే తడవకు॥ ఇత్యాదు లెఱుంగునది.

వ్యాఖ్య - వారము అను పదముయొక్క అర్థమును బోధించు పదములు ద్విరుక్తములు కానియెడల సంఖ్యాపూర్వకములై యుండునని సూత్రార్థము. తడవ, తూరి, తేప, మాటు, సారి మున్నగునవి వారార్థకశబ్దములు.

ద్విరుక్తములైనప్పుడు తడవతడవకు, మాటిమాటికి - మున్నగువిధముగా నుండును. అట్టియెడల సంఖ్యా పూర్వకవిశేషణము ప్రయుక్తము కాదు. ద్విరుక్తముకాని సమయమునందు ఒకతడవ, రెండుతడవలు - మున్నగువిధముగా సంఖ్యావాచకము పూర్వప్రయుక్త మగును.

"తఱచుగ" నని యనుటచేత సంఖ్యాపూర్వక విశేషణము లేకుండ తడవకు, మాటికి - మున్నగు విధముగా రూపము లుండును.

[తడవకు, మాటికి - మున్నగు విధముగా అద్విరుక్తము లైనచోట్ల కూడ తడవతడవకు, మాటిమాటికి - అను వానియర్థమునే కలిగించును. ఏకత్వమునే అపేక్షించునపుడు 'ఈతడవకు' మున్నగువిధముగా నిర్దేశాత్మక సర్వనామమునుగాని, ఏకార్థక సర్వనామమునుగాని ముందుగా ప్రయోగించుట సాధారణముగా జరుగుచుండును.]

**40. ఒకండ్రాద్యులు పరంబులగుచోఁ దఱచుగ నున్ బదికగు.**
**(ప్రౌ - ౨౨)**

పదునొకండు - పదునొకండ్రు; పదుమూఁడు - పదుమూగురు; పదునాలుగు - పదునలుగురు; పదునేను - పదునేగురు; పదునాఱు - పదునాఱుగురు; పదునేడు - పదునేడగురు; పదునెనిమిది - పదునెనమండ్రు. తఱచుగననుటంజేసి పదియాఱు పదాటిత్యాది రూపంబులను గ్రాహ్యంబులు॥ పోరులఁ గర్ణుండు పదాఱవ కళకు సమానుండు గాఁడు కవ్వడితోడన్॥ భార. అర. ౨౮॥ మొ.

వ్యాఖ్య - 'పది' యను శబ్దమునకు 'ఒకండు' మున్నగు సంఖ్యావాచకములు పరమందున్నప్పుడు 'ఉన్' అను నది ఆగమముగా తరుచుగా నగునని సూత్రార్థము.

పది + ఒకఁడు - అని యున్నప్పుడు 'ఉన్' అనునది ఆగమముకాగా పది + ఉన్ + ఒకఁడు అనియై 'పదునొకఁడు' అని యగును. మహద్వాచకమైనప్పుడు 'పదునొకండ్రు' అని యగును. 'పదుమూఁడు' మున్నగుచోట్ల స్థిరవర్ణము పరమందుండుటచే ద్రుతమునకు లోపము కలుగుచున్నది. ఇవి సమాసములగుటచే స్వత్వము కలుగరాదు.

తఱచుగా నని యనుటచేత 'పది' శబ్దమునకు 'ఆఱు' శబ్దము పరమగునప్పుడు 'ఉన్' అను న్నాగమము గలిగిన 'పదునాఱు' అను రూపముతోపాటు, ఆగమమురాని పదియాఱు, పదాఱు అను రూపములు కూడ కలుగునని సూత్రకర్తయే వివరించెను.

[పైని ఒకండ్వాదులలో రెండు, తొమ్మిది అను సంఖ్యావాచకము లను దెలుపలేదు. వానిని గూర్చి తరువాతి సూత్రమునందు తెలుపు చున్నాడు.]

**41.** పదికి రెం డిరు దొమ్మిదులు పరంబు లగునపుడు బిందు పూర్వక డకారంబును, ద్విరుక్త నివర్ణంబును, బిందు వును గ్రమంబుగ దివర్ణంబున కగు. (ప్రౌ - ౨౪)

పంద్రెండు - పన్నిరుగురు - పన్నిద్దఱు - పందొమ్మిది - పందొమ్మండ్రు.

వ్యాఖ్య - 'రెండు' అను శబ్దము పరమగునపుడు బిందు పూర్వకడకారమును, 'ఇరు' అనునది పరమగునప్పుడు ద్విరుక్త నివర్ణమును, 'తొమ్మిది' అనునది పరమగునప్పుడు బిందువును పదిశబ్దము యొక్క దివర్ణమునకు ఆదేశముగా నగునని సూత్రార్థము.

పది + రెండు - అని యున్నప్పుడు 'ది'కి బదులుగా బిందుపూర్వక డకారముకాగా పండ్ + రెండు = పంద్రెండు అని యగును.

[బిందువు అనియున్నప్పుడు అర్ధ బిందువును పూర్ణ బిందువును గూడ గ్రహింపవచ్చును. కాని "అఁట యిఁక చుఁడు శబ్దంబులం దప్ప నుడితొలి హ్రస్వంబుమీఁద ఖండబిందువును ద్రుతంబునకు లోపంబును లేవు" అను (బా. సంధి - 22) సూత్రమునుబట్టి యిచ్చట పూర్ణబిందువు మాత్రమే కలుగును; అర్ధబిందువున కవకాశము లేదు.]

పది + ఇరుగురు - అని యున్నప్పుడు సూత్రవిధినిబట్టి ద్విరుక్త నివర్ణముకాగా 'పన్ని + ఇరుగురు = పన్నిరుగురు' అని

యగును. "ఒకానొకచో నిరుగురున కిద్దఱాదేశంబగు" అను (ప్రౌ . శబ్ద - 96) సూత్రమునుబట్టి 'ఇద్దఱు' అనునది 'ఇరు గురు' అనుదాని కాదేశముగా వచ్చినరూపమే. కావున 'ఇరు' అన్నది పరమైనప్పుడైన కార్యము 'ఇద్దఱు' అన్నది పరమై నపుడుకూడ కావలయును. కావుననే 'పది + ఇద్దఱు' అని యుండి పన్ని + ఇద్దఱు = పన్నిద్దఱు అని యయ్యెను.

[ఇచ్చట ప్రౌఢవ్యాకరణకారుడు 'ద్విరుక్తనివర్ణము' అని చెప్పుట సమంజసముగా లేదు. నిజమునకు ద్విరుక్తనివర్ణము అనియన్నప్పుడు 'నిని' అని యుండవలయును. కాని వ్యాకర్త యుద్దేశ్యము 'న్ని' యనునది. దీనిని చెప్పవలసివచ్చినప్పుడు 'ఇదంతమైన ద్విరుక్తనవర్ణము' అని చెప్పవలయును. ఇట్లు చెప్పినపిమ్మట నైనత మింకొక చిక్కు గలదు. పన్ని + ఇరుగురు - అని యుండగా నిత్యసంధిని నిర్వహించు సూత్రమేమియు కానరాదు. 'పన్ని యిరుగురు' మున్నగు ననిష్టరూపములు వారించుటకు మార్గము కానరాదు. ఇచ్చట సుబోధినీ వ్యాఖ్యాకారులు "ఇచట అపదాదిస్వరసంధి - నిత్యము" అని కుండలీకరణములందు తెలిపిరి. అది సమంజసము కాదు. ఇచ్చట పరమందున్న ఇరుగురు, ఇద్దరు - అన్నవి పదములే కాని అపద ములు కావు. కాబట్టి అపదాది స్వరసంధి యిక్కడ ప్రవర్తింపదు. మధ్యమ పురుషక్రియలకు తప్ప మఱియెక్కడను ఇత్వసంధి నిత్యముగా నగుటలేదు. కావున ప్రస్తుతలక్ష్యమయిన 'పన్నిరుగురు' మున్నగుచోట నిత్యసంధికి అవ కాశము కలిగించుట అపేక్షితము. ప్రౌఢవ్యాకరణకారుడు 'ద్విరుక్తనకా రము' అని చెప్పియుండినయెడల నిట్టి యిబ్బందులు లేకుండ పన్ + ఇద్దరు = పన్నిద్దఱు మున్నగువిధముగా రూపము లేర్పడియుండును. అది సుకరమగు మార్గము.]

పది + తొమ్మిది - అని యన్నప్పుడు దివర్ణమునకు బిందువుకాగా పం + తొమ్మిది = పందొమ్మిది అని యగును. 'పందొమ్మండ్రు' అనునది మహద్రూపము.

[ఇచ్చటకూడ వ్యాకర్త బిందువును విధించి యూరకొనెను. తరువాతి పరుషము సరళము కావలయును. అట్టి విధిని గల్పింపకుండుట లోపమే యనవలయును. బాలవ్యాకరణకారుడు ప్రాతాదికార్యములను దెల్పి "అన్యంబులకు సహిత మిక్కార్యంబులు కొండొకచోఁ గానంబడియెడి" అన్న సూత్రముక్రింద 'పందొమ్మిది' అనురూపమును లక్ష్యముగా చూపెను. అచ్చటి ప్రక్రియనుబట్టి 'పది' శబ్దముయొక్క తొలియచ్చుమీది వర్ణములకు లోపముకలిగి, నుగాగమము కలుగును. అప్పుడు 'తొమ్మిది' శబ్దము నందలి తొలిపరుషము సరళమగును. అచ్చటనే ప్రౌఢవ్యాకరణకారుఁడీతరువాతి సూత్రమున సాధింపబోవు 'తొంబది' యనునదికూడ లక్ష్యముగా చూపబడినది.]

42. పది యుత్తరపదం బగుచో నేను దొమ్మల నుమ్మలకు బిందువును, ఎని కెనును, ఏడునకు వర్ణవ్యత్యయంబును, ఆ పరుషంబునకు సరళంబును క్రమంబుగ నగు.

(ప్రౌ - ౨౪)

ఏఁబది - ఏఁబండ్రు; తొంబది - తొంబండ్రు; ఎనుబది - ఎనుబండ్రు; డెబ్బది - డెబ్బండ్రు ॥మొ.

వ్యాఖ్య - 'పది' యుత్తరపదముగా నున్నప్పుడు పూర్వమున్న ఏను శబ్దముయొక్క 'ను' వర్ణమునకు, తొమ్మిది శబ్దముయొక్క 'మ్మి' వర్ణమునకును బిందువు ఆదేశముగా వచ్చును; ఎనిమిది, అను శబ్దముయొక్క 'ఎని' అను దానికి బదులుగా 'ఎను' అని యగును. 'ఏడు'నకు వర్ణవ్యత్యయము కలుగును. అన్నియెడల 'పది' శబ్దము నందలి తొలివర్ణము 'బ' అని యగును.

ఏను + పది - అని యున్నప్పుడు నువర్ణమునకు బదులుగా బిందువు వచ్చును. దీర్ఘముమీద సాధ్యపూర్ణములేదు గావున అరసున్నయే వచ్చును. మీది 'ప'వర్ణము సరళముగా మారును. 'ఏఁబది' అను రూపము సిద్ధించును. మహద్వాచక మగునపుడు 'ఏఁబండ్రు' అని యగును.

తొమ్మిది + పది - అనియున్నప్పుడు పూర్ణబిందువును సరళమును గలుగుటచేత 'తొంబది' అని యగును. నుడితొలి హ్రస్వముమీద ఖండబిందువుండదు కనుక, ఇచ్చట పూర్ణబిందువు మాత్రమే యగును.

[ సూత్రమునందు "ఏను దొమ్ముల నుమ్ములకు బిందువును" అని కలదు. 'తొమ్మి' యనునది సమాసమున పూర్వరూపముగా నుండవలయు నని వ్యాకర్త యభిప్రాయము. అనగా 'ది'వర్ణమునకు లోపమువచ్చిన రూపమునే గ్రహించెనని యనుకొనవలయును. అట్లు కానియెడల తొమ్మిది + పది - అని యున్నచో తొంది + పది - అను అనిష్టరూపము కలుగును. బాలవ్యాకరణము చూపిన మార్గమునుబట్టి పోయినచో 'ఏను + పది' అనియుండి 'ఏ + పది' అనియై నుగాగమము కలిగి 'ఏఁబది' అని యగును. అట్లే 'తొమ్మిది + పది' అనియుండి 'తొ + పది' అనియై నుగా గమముకలిగి 'తొంబది' అని యగును. ఇది సుకరము; దోషరహితము. ]

ఎనిమిది + పది - అని యుండగా 'ఎని' అనుదానికి 'ఎను' ఆదేశముగా నగును. పవర్ణకము సరళమగును. అప్పుడు 'ఎనుబది' అని యగును.

[ఇచ్చటకూడ సూత్రమునందు "ఎనికెనును" అనియున్నది. 'మిది' అను భాగము లోపింపగా మిగిలిన 'ఎని' యనుదానినే సమాస పూర్వభాగ ముగా గ్రహింపవలయునని వ్యాకర్త యభిప్రాయము. ఎని + పది అనియుండి ఆదేశము కలుగగా ఎను + పది అనియై 'ఎనుబది' అని

యగును. బాలవ్యాకరణము 'ఎనుబది' యని అమహద్రూపమును 'ఎను బండ్రు' అని మహద్రూపమునుగూడ చూపెను. కాని ప్రక్రియ జోలికి పోలేదు.]

ఏడు + పది - అని యున్నప్పుడు వర్ణవ్యత్యయము కలుగగా 'డుప' అని యగును. అపదాది స్వర మగుటచేత సంధి కాగా 'డే' అని యగును. పకారమునకు సరళమురాగా 'డే + బది' అని యగును. రాబోవు (ప్రౌ - 25) సూత్రముచే 'డే' యనునది హ్రస్వమును పొందును. అప్పుడు "ప్రాప్తహ్రస్వంబు లగు మూడేలమీఁది వర్ణంబులకు ద్విత్వంబు బహుళంబుగా నగు" నన్న (ప్రౌ. శబ్ద - 100) సూత్రమునుబట్టి 'డెబ్బది' అని యగును.

[బాలవ్యాకరణము డెబ్బది, డెబ్బండ్రు అను రెండు రూపములను గూడ ఆచ్ఛికపరిచ్ఛేదమునందు చూపినది. కాని, ప్రక్రియజోలికి పోలేదు.]

**43.** పది యుత్తరపదంబగుచోఁ బూర్వపదంబు దీర్ఘంబునకు హ్రస్వం బగు: ఏను నేకు రాదు. (ప్రౌ - ౨౫)

ముప్పది - ముప్పండ్రు; నలువది - నలువండ్రు; అఱువది - అఱువండ్ర ॥ మొ.

వ్యాఖ్య - 'పది' యను శబ్దము పరమందున్నప్పుడు, పూర్వముననున్న సంఖ్యావాచక పదముయొక్క దీర్ఘమునకు హ్రస్వము కలుగును ఏనుయొక్క 'ఏ' వర్ణమునకు హ్రస్వము కలుగదు - అని సూత్రార్థము.

మూఁడు + పది అని యుండగా "సమానాధికరణంబగు నుత్తరపదంబు పరంబగునప్పుడు మూఁడు శబ్దము డువర్ణంబునకు లోపంబును మీఁదిహల్లునకు ద్విత్వంబు నగు" అను (బా - 17) సూత్రమునుబట్టి మూ + ప్పది అను రూపమేర్పడును. అపిదప

"ద్విరుక్తంబగు హల్లు పరంబగునపు డాచ్ఛికంబగు దీర్ఘంబునకు హ్రస్వంబగు" అను ( బా - 13 ) సూత్రమునుబట్టి 'ముప్పది' అని యగును. ఇదంతయు బాలవ్యాకరణమువలననే సిద్ధించెను. ప్రౌఢవ్యాకరణము తొట్టతొలి యుదాహరణముగా 'ముప్పది' అని చూపెను. కాని 'మూఁడు' శబ్దము డువర్ణమునకు లోప మును ప్రౌఢవ్యాకరణ మెచ్చటను విధింపలేదు. కావున ద్విత్వ హ్రస్వములు సాధ్యములే యైనను 'ముప్పది' యను రూపము ప్రౌఢవ్యాకరణమునుబట్టి వీలుకాదు. 'ముప్పది' యని యమహ ద్వాచక మేర్పడిన పిమ్మట 'ముప్పంద్రు' అను మహద్వాచక మేర్పడును.

నాలుగు + పది - అని యుండగా సమాసమున పూర్వ పదముగానున్న 'నాలుగు' యొక్క కడపటియక్షరము లోపించి 'నాలు' అని కావలయును,

[ దీనిని వ్యాకర్త యెచ్చటను సూచింపనయినలేదు. "సంఖ్యా వాచకంబులకు విభక్తి పరంబగునపుడు కొన్నింటి యంత్యాక్షరంబులకు లోపంబగు" అన్న ( ప్రౌ. శబ్ద - 92 ) సూత్రము దీనికి నిర్వాహకము కాజాలదు. పై సూత్రమునుబట్టి పరమందు విభక్తియున్నపుడే అంత్యాక్షర లోపము కలుగవలయును; ఇచ్చట పరమందు పదముండుట అభ్యంతర కరము.]

ప్రస్తుతసూత్రమునుబట్టి నలు + పది అని యగును. ఇట్లే ఆఱు + పది అని యున్నప్పుడు దీర్ఘమునకు హ్రస్వము రాగా అఱు + పది అని యుండును. ఇప్పుడు గసడదవాదేశము కలుగగా 'నలువది' అనియు 'అఱువది' అనియు రూపము లగును.

[ ఇచ్చట గసడదవాదేశము నిత్యముగా జరుగవలయును. ఒక ద్వంద్వ సమాసమునందు తక్క మఱెక్కడను నిత్యముగా ఈ కార్యము జరుగదు. కావున నిచ్చటి ద్విగు సమాసముల విషయమున విశేషముగా విధించుకొనవలసినది. అట్టిది జరుగలేదు. ఉన్నస్థితినిబట్టి నలుపది, అఱుపది మున్నగు ననిష్టరూపములకు సైత మవకాశము కలుగుచున్నది. ]

ఏను + పది - అని యున్నప్పుడు పూర్వసూత్రము (ప్రౌ - 24)ను బట్టి 'ను'వర్ణమునకు బదులుగా బిందువువచ్చును. పదియొక్క 'ప' కారమునకు 'బ'కారము వచ్చును ప్రస్తుత సూత్రముచేత 'ఏ' వర్ణమునకు హ్రస్వము రావలసియుండగా సూత్రకారుడు "ఏను నేకు రాదు" అని తెల్పి వారించెను. కాబట్టి 'ఏఁబది' అనియే రూపముండును. మహద్వాచకమైనప్పుడు 'ఏఁబంద్రు' అని యగును.

44. కొన్నియెడల నీసమాసపదంబులు యువర్ణ వ్యవహితంబులు నగు. (ప్రౌ - ౨౬)

వనమునఁ బదియుఱేండ్లేఁగు లజ్ఞాతవాస మొక్కేఁడు జనపదంబుననుండి ॥భార. ఆది. ౩ఆ॥ ద్రోహులగు వేలుపులలోన దొరసి యున్న పదియు నొక్కండ్రు రుద్రులఁ బాఱవిడిచె॥ కాశీ. ౭ఆ॥

వ్యాఖ్య - కొన్నిచోటులందు పైనిచెప్పిన సమాసములందలి పదములు 'యు' వర్ణముచే వేరుచేయబడి యుండునని సూత్రార్థము.

పది + యు + రెండేఁడులు - ఇచ్చట 'పది' అను పూర్వపదమును 'రెండు' అను పరపదమును 'యు' వర్ణము వేరుచేయుచున్నది. పది + యు + ఒక్కండ్రు - అని యున్న

ప్పుడు పది, ఒక్కండ్రు - అను శబ్దములకు నడుమ యువర్ణము చేరుచున్నది.

[ఇరువదిరెండవ సూత్రమున 'పది' శబ్దమునకు పరమందు 'ఉన్' అనునది విధింపబడెను. ఇచ్చట సమాసపదములకు నడుమ 'యు'చేరి వ్యవధానమును గలిగించుచున్నట్లు చెప్పబడెను. నిజమునకు అక్కడి 'ఉన్' అనునదియు, ఇక్కడి 'యు' అనునదియు నొక్కటే. ఇవిరెండునుగూడ సముచ్చయార్థకమైన 'ఉను' అనుదానికి మార్పులే. ప్రౌఢవ్యాకరణకారుడు సముచ్చయార్థకమును 'ను' అని గ్రహించెను. ఏకరీతి లేకపోవుటచే విషయము క్లిష్టమగుటయే కాని ప్రయోజనము కనిపింపదు. పది + ఒకఁడు - అని యున్నప్పుడు సముచ్చయార్థకము కలిగి పది + ఉను + ఒకఁడు అని యగును. సంధికాగా 'పదునొకడు' అని యగును. ఇత్వసంధి వైకల్పికమగుటచేత 'పదియునొకఁడు' అని యగును. ఇట్టివే 'పదియురెండు' మున్నగునవి. కావున నిచ్చట 'యు'వర్ణము అదనముగా వచ్చెనని చెప్పుట యవసరము కాదు.]

45. కొండొకచో సమాసంబులందు నామ్వాది కనుమ్వాదుల
ముపర్ణంబులు పఞ్పవర్ణంబు లగు. (బా - ౧౯)

నాఁపచేను - పాఁపఱేఁడు - కనుపపులు - జనుపనార॥ నాము - పాము - ప్రేము - వేము - అమ్మ - ఎమ్ము॥ ఇవి నామ్వాదులు. కనుము - ఇనుము - ఉడుము - ఎనుము - జనుము - మినుము॥ ఇత్యాదులు కనుమ్వాదులు.

వ్యాఖ్య - సమాసములందు పూర్వశబ్దములైన 'నాము' మున్నగువాని ముపర్ణమునకు ఆదేశముగా పఞ్జగును; 'కనుము' మున్నగువాని ముపర్ణమునకు ఆదేశముగా పవర్ణనుగును - అని సూత్రార్థము. 'పఞ్జు' అని యనగా బిందుపూర్వక పవర్ణమని యర్థము.

పైనిచెప్పిన నాము నుండి ఎమ్ము వరకును గల ఆరు శబ్దములు నామ్వాదులు. కనుము, ఇనుము - మొదలుగా గలవి కనుమ్వాదులు. ఇత్యాదులు అని యనుటచే కనుమ్వాదులలో చేరదగినవి యింకను గలవని, ప్రయోగములనుబట్టి వానిని గ్రహింపవలయు ననియు నర్థము.

నాము + చేను. 'ము' వర్ణస్థానమున బిందుపూర్వకమైన పవర్ణము రాగా 'నాఁపచేను' అని అగును. అమ్ము + పాన్పు అని యున్నప్పుడు ముపర్ణమునకు పజ్జు కలిగి అ + పజ్ + పాన్పు అని యగును. "అఁట, ఇఁక, చుఁడు శబ్దంబులం దప్ప నుడితొలి హ్రస్వముమీఁద ఖండబిందువు లేదు" అను నియమమునుబట్టి "అంపపాన్పు" అని పూర్ణానుస్వార పూర్వకమైన పవర్ణము కలిగిన రూప మేర్పడును.

కనుము + పులు అని యున్నప్పుడు సమాసమున కనుమ్వాదుల ముపర్ణమునకు పవర్ణమై 'కనుపపులు' అని యగును.

ప్రేఁపబెత్తము - వేఁపచెట్టు - ఎంపముక్క మున్నగునవి పజ్జుతోడి రూపములు.

ఇనుపపెట్టె - ఉడుపపట్టు - ఎనుపకొమ్ము - మినుపపప్పు మున్నగునవి పవర్ణముతోడి రూపములు.

**46.** నిక్కలాదులు యథాప్రయోగంబుగ గ్రాహ్యంబులు.

(బా - ౨౦)

నిక్కల - కవ్వడి - పువ్విలుకాఁడు ఇత్యాదులు.

వ్యాఖ్య - నిక్కల మున్నగు సమాసములను ప్రయోగ ములలో నున్నట్లుగా గ్రహింపవలయు నని యర్థము.

నిక్కము + కల - ఈ రెండు శబ్దములును సమసించు నపుడు పూర్వశబ్దమునందు తొలియచ్చుమీది వర్ణములకెల్ల లోపము కలిగినది. మీదిహల్లునకు ద్విత్వము వచ్చినది. ని + క్కల = నిక్కల అనినైయెనది. ఇది కర్మధారయసమాసము.

కవ + వడి. ఈ రెండు శబ్దములును సమసించునపుడు పూర్వ శబ్దమునందు తొలియచ్చుమీది వర్ణములకెల్ల లోపమును, మీదిహల్లునకు ద్విత్వమును కలిగి క + వ్వడి = కవ్వడి అను రూప మేర్పడినది. రెండు చేతులకును వడి గలవాఁడు అను శబ్దార్థముచేత "అర్జునుఁడు" అను అన్యశబ్దార్థమును బోధించు చున్నది కావున, ఇది బహువ్రీహిసమాసము.

పువ్వు + విలుకాఁడు. ఈ రెండు శబ్దములను సమసించు నపుడు పూర్వశబ్దమునందు తొలియచ్చుమీది వర్ణముల కెల్ల లోపమును, మీది హల్లునకు ద్విత్వమును కలిగి పు + వ్విలు కాఁడు = పువ్విలుకాఁడు అను రూప మేర్పడినది. పువ్వుల వింటిని గలవాఁడు అని యౌగికార్థము. 'మన్మథుఁడు' అను అన్యశబ్దార్థమును బోధించుచుండుటచేత ఇదియు బహువ్రీహి సమాసమే.

నిక్కల యనునది అమహదర్థకము. కవ్వడి యనునది మహదర్థకము. ఈ రెండును సమాసాంతకార్యములను బట్టి స్త్రీ సమములై యున్నవి. 'పువ్విలుకాఁడు' అనునది మహదర్థకము. డువర్ణకాంత మైయున్నది. "స్త్రీసమఘటితంబ యొకానొకండు

బహువ్రీహి చూపట్టెడు" అను (సమాస-8) నియమ మున్నది. ఐనను డువర్ణకాంతములయిన బహువ్రీహి సమాసములును కొలదిగా కలవనుటకు ఇది యుదాహరణము.

**47.** బహువ్రీహిని సమాసాంత కార్యంబులుం గానంబడి యెడి. (బా - ౨౨)

ముక్కంటి - కడలిరాచూలి - నలువ - గట్టువిలుతుఁడు.

వ్యాఖ్య - బహువ్రీహి సమాసములందు సమాసాంతమున కొన్ని విధములగు ఆగమాదేశాది కార్యములు జరుగునని యర్థము.

మూఁడు + కన్నులు (కలవాఁడు). ఇదియు సమానాధికరణమే యగుటచేత 'డు' వర్ణమునకు లోపము వచ్చి మీది హల్లునకు ద్విత్వమగును. మూ + కన్నులు. ద్విత్వము పరమగుటవలన దీర్ఘమునకు హ్రస్వము కాగా 'ముక్కన్నులు' అని యగును. ఇంతవరకు పూర్వ సూత్రములచేతనే సిద్ధించును. 'కన్నులు' అను శబ్దమునందలి తొలియచ్చు మీది వర్ణముల కెల్ల పూర్ణబిందుపూర్వక టివర్ణము ఆదేశముగా నగును. 'ముక్కంటి' ఇట్లు 'టి' వర్ణము కలుగుట సమాసాంత కార్యము.

కడలిరాజు + చూలు. సమాసమున పూర్వశబ్దము తుది నున్న జువర్ణమునకు లోపమై కడలిరా + చూలు అని యైనది. సమాసాంతమున, ఉత్వమున కిత్వము కలిగి 'కడలి రాచూలి' అని యగును. ఇట్లిత్వము వచ్చుట సమాసాంత కార్యము.

నాలుగు + వాతులు ( కలవాఁడు). తొలిశబ్దమున కాదేశముగా 'నలు' అని యై 'నలు + వాతులు' అని యగును. సమాసాంతమునందలి వర్ణములకు లోపము కలిగి 'నలువ' అని యగును. ఇంతవరకు నున్న బహువ్రీహిసమాసము లన్నియు స్త్రీ సమములు.

గట్టు + విలు (కలవాఁడు), మతుబర్థమునందు మహద్వాచకమున "తుఁడు" అని ఆగమము కలిగి 'గట్టువిలుతుఁడు' అని యగును. ఇది డువర్ణకాంతము. ఇట్లు ఆగమము కలుగుట సమాసాంతకార్యము.

సమాసాంత కార్యములను నిర్దిష్టముగా బాలవ్యాకరణము తెలుపలేదు. కావున, ప్రయోగములనుబట్టి వానిని నిర్ణయించుకొనవలయును.

**48.** బహువ్రీహిని స్త్రీవాచ్యం బగుచో నుపమానంబు మీఁది మేనునకు బోఁడి యగు. (బా - ౨౩)

అలరుబోఁడి - ననబోఁడి - పూబోఁడి - విరిబోఁడి.

వ్యాఖ్య - బహువ్రీహిసమాసమున పూర్వశబ్దము ఉపమానవాచకమై ఉత్తరశబ్దముగా ఉపమేయమగు 'మేను' అను శబ్దముండి, స్త్రీని బోధించునెడల, మేనుశబ్దమున కాదేశముగా 'బోఁడి' అను శబ్ద మగునని సూత్రార్థము.

అలరు + మేను. పువ్వువంటి శరీరముగల స్త్రీ యను నర్థమున ఈ రెండు పదములును సమసింపగా అలరు + మేను =

అలరు + బోఁడి = అలరుబోఁడి అని యగును. ఇట్లే ననబోఁడి - పూబోఁడి, విరిబోఁడి - మున్నగు సమాసము లేర్పడును.

కొందరు మేనునకు బదులుగా సూరి పోఁడి అను శబ్దము విధించినట్లు భావింతురు. అట్లే అయిన యెడల, ఉదంత స్త్రీసమంబులకు పరుషసరళములు పరమగునప్పుడు నుగాగమ మగు నను విధిచేత 'అలరుఁబోఁడి' అను రూపము కలుగవచ్చును. కాని 'ననఁబోఁడి - విరిఁబోఁడి' మున్నగువిధముగా నుగాగమము కలుగుటకు బాలవ్యాకరణమును బట్టి యేయవకాశము లేదు. కావున సూరి 'పోఁడి' యని కాక 'బోఁడి' యనియే వాడె నని నిశ్చయింపక తప్పదు.

అలరుంబోఁడి - పూవుంబోఁడి మున్నగువిధములైన రూపములు బాలవ్యాకరణమునుబట్టియు కావచ్చును. అలరు + ను + బోడి. "సరళ స్థిరంబులు పరంబులగునపుడు ద్రుతంబునకుఁ బూర్ణబిందువును గానంబడియెడి" నని యనుటచేత 'అలరుంబోఁడి' యను రూపము సిద్ధించును.

**49.** అలరుఁ బోఁడిత్యాదు లుపమానపూర్వపద కర్మధారయంబులు. (ప్రౌ - ౮౫)

ఇటఁ బోఁడి పరంబగుచో నెల్లెడల నుమ్మగు. ఆదిపదంబుచే - తియ్యఁబోఁడి, ననఁబోఁడి, విరిఁబోఁడి, ఇగురుఁబోఁడి, చిగురుఁబోఁడి, తలిరుఁబోఁడి, పువ్వుఁబోఁడి, పూవుఁబోఁడి, పూఁబోఁడి - యిత్యాదులు గ్రాహ్యంబులు. (అలరు + పోఁడి) దీనికిఁ బువ్వువలె మనోజ్ఞురాలైనదని యర్థము. ఇట్లంతట నెఱుంగవలయు

చిగురుంబోఁడి యెఱుంగుదే యదుపతిస్త్రీ లెవ్వరే నిందు లేరు గదా ॥ శా. 3 ఆ॥ ద్రోవదిన్ దీయంబోఁడి వరింపఁగా వసుధ కేతేఁ జూచు నాదిత్యులో ॥పాంచా. 3 ఆ॥ వేల్పుం బువుంబోండ్లు ॥య 1ఆ॥ యౌవనము కలిగినప్పుడ। పూవు బోఁడులకు బతుల భోగంబులు గాక ॥శా 4 ఆ॥ మొ.

వ్యాఖ్య - అలరుఁబోఁడి మున్నగునవి ఉపమాన వాచకమును పూర్వపదముగా కలిగిన కర్మధారయ సమాసములని యర్థము.

అలరు అనియనగా 'పువ్వు' అని యర్థము. 'పోఁడి' అనియనగా 'ఒప్పిదమైనది' అని యర్ధము. 'అలరుఁబోఁడి' అని అనగా పువ్వువలె మనోజ్ఞమైనది అని యర్ధము. ఈ యర్థమును గ్రహించుటచేత ప్రౌఢ వ్యాకరణకారుడు దీనిని ఉపమాన పూర్వపద కర్మధారయమని పేర్కొనెను. 'అలరు' అనునది ఉదంత స్త్రీవాచక మగుటచేత పరుష సరళములు పరమందున్నపుడు ఆగమముగా 'ను' వర్ణము కలుగును. అప్పుడు అలరు + ను + పోఁడి అనియుండి ద్రుతకార్యముకాగా అలరుఁబోఁడి, అలరుంబోఁడి, అలరున్బోఁడి - అను రూపములు కలుగును. 'విరి' మున్నగునవి పూర్వశబ్దము లైనప్పుడు పై విధిచేత 'ను' గాగమము కలుగదు. కావుననే ప్రౌఢ వ్యాకరణకారుడు "పోఁడి పరంబగుచో నెల్లెడల నుమ్మగు" అని వివరణమందు 'ను' గాగమము విధించెను. దీనినిబట్టి విరిఁబోఁడి, ననఁబోఁడి - మున్నగు రూపములు గూడ నేర్పడును.

బాలవ్యాకరణమునందు 'అలరు బోఁడి' మున్నగునవి బహువ్రీహి సమాసములుగా గ్రహింపబడినవి. 'అలరు' అన్నది

ఉపమానము; 'మేను' అన్నది ఉపమేయము. ఈ 'మేను' శబ్దమునకు 'బోఁడి' యనునది ఆదేశముగా వచ్చును. అప్పుడు 'అలరుబోఁడి' అని యగును. బాలవ్యాకరణమునుబట్టి యైనచో 'బోఁడి' శబ్దమునకు ముందు అర్ధానుస్వారము కలుగదు. ఉదంత స్త్రీసమములకు సరళములు పరములైనప్పుడు సైతము నుగాగమము కలుగవచ్చును గనుక, కలుగగా అలరుంబోఁడి, పూవుంబోఁడి, పువ్వుంబోఁడి మున్నగు పూర్ణబిందువుతోడి రూపము లేర్పడవచ్చును. విరిబోఁడి, ననబోఁడి - మున్నగుచోట్ల అర్ధబిందువుకాని, పూర్ణబిందువుకాని కలుగుట కవకాశము లేదు.

'మేను' అను శబ్దమునకు ఏమాత్రమును సంబంధము లేని 'బోఁడి' అను శబ్దము ఆదేశముగా నగుననుట సమంజసముగా లేదని, యిట్టియెడల 'పోఁడి' అను శబ్దమే ఉత్తరపదముగా నుండెననుట సమంజసమనియు ప్రౌఢవ్యాకరణ కారుని తాత్పర్యము.

[ బాలవ్యాకరణ కారునకు ముందే అలరుబోఁడి మున్నగు వానిని వ్యాకర్తలు బహువ్రీహిగా పరిగణించిరి. అహోబలపతి "మెఱుఁగుఁబోఁడి తమ్మికంటి ఇత్యాద్యా ఉపమాన గర్భ బహువ్రీహయః" అని తెల్పియున్నాడు. కావున, దానిని కర్మధారయమని చెప్పవలసిన యవసరము కానరాదు. ఉపమానమును చెప్పి, ఉపమేయమును చెప్పకుండుట సమాసమునందు సారస్యము కాదు. సంస్కృతమునందలి శతపత్రేక్షణ, చంచరీక చికుర, విద్యుల్లతాంగి - మున్నగు నన్నిచోట్లను ఉపమానము పూర్వపదముగా, ఉపమేయము ఉత్తర పదముగా స్పష్టముగా అగపడుచున్నవి. అట్లే 'అలరుబోఁడి' మున్నగుచోట్ల 'పువ్వువంటి శరీరముగలది' అని యనుట 'పువ్వువలె నొప్పిదమైనది' అని యనుటకంటె సరసముగా నుండును. 'తియ్యంబోఁడి' అను దానికి సీతారామాచార్యులు శబ్దరత్నాకరమునందు 'చెఱుకువలె

మనోజ్ఞ రాలగు అఁడుది' అను నర్థమును చెప్పెను. కాని 'తియ్య' అను శబ్దమునకు 'మధురము' అను నర్థమును మాత్రమే చెప్పెను.'చెలుకు' అను నర్థము ఈపదమునకు లేనియెడల 'తియ్యఁబోఁడి' అన్నప్పుడు పైయర్థ మెట్లు సంగతమగునని భావించెనో తెలియదు. తానిచ్చిన ప్రయోగము లన్నింటియందును, చిన్నయసూరిచేత సాధింపబడకుండ నుండిన పూర్ణబిందు పూర్వకరూప మిదియొక్కటే. ఇచ్చట 'తియ్య' యన్నది ఉపమానము కాదు. గుణవాచకమైన విశేషణము. ఇది 'న' వర్ణాంతము. దీనికి పరమందున్నది 'పోఁడి' యను శబ్దమే తియ్యన + పోఁడి - అని యున్నప్పుడు 'మధుర మైన యొప్పిదము' అనికాని 'మధురము మనోజ్ఞము నైనది' అనికాని యర్థము చెప్పవలయును. అప్పుడు "గుణవాచకంబులు కొన్నింటి నిగాగ మంబునకుఁ బరుషంబులు పరంబు లగునపుడు బిందువగు" అను (ప్రౌ - 13) సూత్రమును బట్టి తియ్యంబోఁడి, తియ్యఁబోఁడి-అను రూపములేర్పడును. కావున నిది కర్మధారయ సమాసమే యగును. ఇట్టి రూపములను సాధించు టకు వేరుగా సూత్రమును జెప్పవలసిన యవసరములేదు. కావుననే బాల వ్యాకరణము 'తియ్యఁబోడి' వంటి రూపమును దలపెట్టలేదు. 'అలరు బోఁడి' మొదలయినచోట్ల విశేషప్రక్రియను చూపవలసి యున్నది కావుననే ఆ విషయమును చెప్పెను. ఇచ్చట కొందరు 'మేను'నకు సంబంధములేని, అర్థ మెఱుగరాని 'బోఁడి' యాదేశమగుట యేమి? యని ప్రశ్నింతురు. ఇది వ్యాకరణ సంప్రదాయానుకూలమే. అర్థమున్న పదము నాదేశముగా విధించినయెడల, దాని కా యర్థమే యుండును. ఇచ్చట 'స్థాని' యొక్క యర్థమువే యాదేశముగా వచ్చిన శబ్దముకూడ బోధింపవలయును. 'మేను'నకు ఆదేశముగాఁ వచ్చిన 'బోఁడి' కూడ 'శరీరము' అను నర్థమునే బోధించును. కావున నిది స్వయముగా అర్థరహితమైనను, ఆదేశముగా వచ్చినప్పుడు అర్థవంతమే యగుచున్నది. ఇట్లు నాదేశింప వచ్చునా? అను నది మరొకప్రశ్న, సంస్కృతమున 'దా' అను ధాతువునకు 'యచ్ఛ్' అనియు 'పా' అను ధాతువునకు 'పిబ్' అనియు, 'గమ్' ధాతువునకు 'గచ్ఛ్' అనియు నాదేశములుగా వచ్చుట సర్వప్రసిద్ధము కదా! ఇక్కడ సైతమట్లే వచ్చు నని యనుకొనుట సౌలభ్యహేతువు, కావున ఉపమానము మీది మేనునకు

మాత్రమే 'బోఁడి' యనియై బహువ్రీహి యేర్పడుననియు కేవలవిశేషణము మీద నైనచో 'పోఁడి' యను శబ్దమే కలిగి కర్మధారయ సమాసమేర్పడు ననియు గ్రహించుట యనవసరము. బాలవ్యాకరణము 'పోఁడి' అను శబ్దమును ప్రసంగాంతరమున పోఁడిపాట, పోఁడిమి, పోఁడి (పోఁణి) మున్నగుచోట్ల ప్రదర్శించియే యుండెను.]

## 50. కఱకంఠుఁడు బహువ్రీహి. (ప్రౌ - ౨౭)

(సూ. సంజ్ఞా. ౯. సూ. ౬.)

దీని నహోబలపతి పండితుఁడు మిశ్రబహువ్రీహి యనెఁ గాని యది యట్లగుట దుర్ఘటము.

వ్యాఖ్య - 'కఱకంఠుఁడు' అనునది బహువ్రీహి సమాసమని సూత్రార్థము. అహోబలపతి పైసమాసము నందలి పూర్వశబ్దము 'కఱ' యను నాచ్ఛికమును, ఉత్తరపదము 'కంఠుఁడు' అను తత్సమము నగుటచే దీనిని మిశ్రసమాసముగా పరిగణించెను. 'కఱకంఠుఁడు' అని యనగా 'ఈశ్వరుడు' అని యర్థము. అన్యపదార్థ ప్రధానమగుటచే ఇది బహువ్రీహి సమాస మగును. కావున అహోబలపతి మిశ్ర బహువ్రీహి యని పేర్కొనెను. ప్రౌఢవ్యాకరణకారుఁడా యభిప్రాయమును సవరింపబూనుకొనెను. ఈయన యభిప్రాయమునుబట్టి 'గరకంఠుఁడు' అను దానికి తద్భవముగా 'కఱకంఠుఁడు' అనునది యేర్పడెను. తెలుగు నందున్న 'కఱకంఠుఁడు' అన్నది సంస్కృతమునందలి 'గరకంఠః' అను బహువ్రీహి సమాసమునకు తద్భవరూపమే; కావున నిదియు బహువ్రీహియే యని యాయన యభిప్రాయము. (ప్రౌ. సంజ్ఞ - ౮) మిశ్రసమాసములందు బహువ్రీహి సాధారణముగా కానరాదు. రెండును తెలుగుపదములుగాని, రెండును

దత్సమములుగాని అయినప్పుడే 'బహువ్రీహి' యేర్పడును. కావుననే వ్యాకర్త "మిశ్రబహువ్రీహియగుట దుర్ఘటము" అని తెల్పెను. దుర్ఘటము అని యనగా ఘటించుటకు వీలుకానిదని యే తాత్పర్యము.

ఇది తద్భవమైనయెడల నిచ్చట నింకొకదోషము గలదు. ఠవర్ణము తద్భవములందు లేదు. కావున 'కఱకంఠుఁడు' అనునది తద్భవమగుటకును వీలులేదు. కావుననే ప్రౌఢవ్యాకరణ కారుడు దీనిని తద్భవమని యనుచు, అనింద్య గ్రామ్యముగా పరిగణించు చున్నాడు. చిన్నయసూరి కఱకంఠుఁడు అను దానిని మిశ్ర సమాసముగానే పరిగణించియున్నాడు. అది లక్షణ విరుద్ధము కావుననే గ్రామ్యమయ్యెను. ఆర్య వ్యవహారమునందు కలదు; కావున అనింద్యగ్రామ్యముగా ప్రయోగ ప్రతిపత్తిని పొందినది. నిజమునకు 'కఱకంఠుడు' అనునది సిద్ధసమాసమునకు తద్భవమే యైనను, తెనుగున సాధ్యసమాసముగా నేర్పడినను దోష యుక్తము కాకపోదు. కావున దానిని గ్రామ్యమనుటయు, ఆర్య వ్యవహారదృష్ట మగుటచే అనింద్య గ్రామ్యమనుటయు సమంజ సము. ప్రస్తుతసూత్రమువలన ప్రత్యేకప్రయోజన మేమియు లేదు.

**51. ద్వంద్వంబునందు ఋకారంబునకు రవర్ణంబు విభాష నగు.** **(బా - ౨౪)**

**మాత్రపితలు - మాతాపితలు ॥ ఇత్యాదులు.**

వ్యాఖ్య - ద్వంద్వసమాసమునందు పూర్వపదముయొక్క కడపటి ఋ వర్ణమునకు బదులుగా అత్వ విశిష్టమైన రకారము విభాషగా నగునని సూత్రార్థము. ఇది సాంస్కృతిక ద్వంద్వము.

మాతృ + పితలు - ఇచ్చటి ఋవర్ణమునకు అదంతమైన రవర్ణము రాగా మాత్ + ర + పితలు = మాత్రపితలు అని యగును. రవర్ణాదేశము వైభాషిక మగుటవలన, రవర్ణము రాని పక్షమున 'మాతాపితలు' అనియగును. "అనఙ్ఋతో ద్వన్ద్వే" అను నియమము ననుసరించి ఋవర్ణమునకు ఆకారము కలుగగా మాత్ + ఆ + పితలు = మాతాపితలు అను రూపము కలుగును. ఈ సాధారణ నియమమునకు గొన్నియెడల భంగము కలిగించి సూత్రమునందు చెప్పినట్లు ఋ వర్ణమునకు ర వర్ణము వచ్చుట విశేషము. సిద్ధ సమాసమునందు సంస్కృతమున లేని యీమార్పు కలుగుట మరింత విశేషము.

మాంధాతృ + రఘుక్షితీశులు - అని యున్నప్పుడు ప్రస్తుత సూత్రముచేత ఋ వర్ణమునకు బదులుగా అదంతమైన రవర్ణము వచ్చి 'మాంధాత్ర రఘుక్షితీశులు' అని యగును.

[ అప్పకవీయమునందు సంయుతా సంయుత ప్రాసమునకు లక్ష్యముగా, రేఫశ్లిష్టము అను పేరున క్షత్రియ, క్షత్రియ, రిత్రము, ధాతృ- అని ప్రాసస్థానమున పై నాలుగు పదములను వరుసగా వాడుకొని, పై మూడు పాదములందును తకార రకార సంయుక్తము ప్రాసస్థానమున నుండగా, నాలుగవ పాదమునందు ఋవర్ణ సహితమైన తకారము ప్రాసస్థానమున నున్నదనియు, అది సంయుక్తాక్షరము కాదనియు వ్రాసెను. 'తృ' యను నది సంయుక్తాక్షరము కానిమాట వాస్తవమే. కాని పైసూత్రమున కనుగుణమైన 'మాంధాత్ర' అన్నది యేర్పడినప్పుడు ప్రాసస్థానమున సంయుక్తాక్షరమే నిల్చుచున్నది. కావున సంయుతా సంయుత ప్రాసమునకు అది లక్ష్యము కానేరదు! ఆ ప్రయోగము ప్రస్తుత సూత్రమునకు ప్రోద్బలకమగుచున్నది. ]

**52. కొన్నియెడల మహద్ద్వంద్వంబునం బూర్వపదాంత్య స్వరంబునకు దీర్ఘంబును జూపట్టెడు.** (ప్రౌ - ౨౮)

అన్నాదమ్ములు॥ ఉ హరి. ౪౫॥ అప్పాచెల్లెండ్రు॥ నిర్వ ౩౫,॥ తల్లీదండ్రులు॥ భల్లా ౪౫॥

వ్యాఖ్య - మహత్తులకుగాని, మహతీవాచకములకు గాని చేయబడు ద్వంద్వసమాసమును మహద్ద్వంద్వమని వ్యాకర్త పేర్కొనుచున్నాడు. మహద్ద్వంద్వమునందు పూర్వశబ్దము యొక్క తుదిస్వరమునకు కొన్నియెడల దీర్ఘము కలుగునని సూత్రార్థము.

అన్న + తమ్ముఁడు - అని యున్నప్పుడు బహుత్వబోధ యుండుటచేత 'లు' వర్ణకము కలిగి అన్న + తమ్ములు అని యగును. "ద్వంద్వంబునం బదంబుపయి పరుషములకు గ స డ ద వ లగు" అన్న (బా. సంధి - 15) సూత్రమునుబట్టి అన్న + దమ్ములు అని యగును. ప్రస్తుతసూత్రమునుబట్టి పూర్వపదము యొక్క తుదియచ్చునకు దీర్ఘముకాగా అన్నా + దమ్ములు = అన్నాదమ్ములు అని యగును.

అప్ప + చెల్లెలు - అని యున్నప్పుడు బహువచనము కలిగి చెల్లెండ్రు అని యగును. పూర్వశబ్దము తుదియచ్చునకు దీర్ఘముకాగా అప్పా + చెల్లెండ్రు = అప్పాచెల్లెండ్రు అని యగును. తల్లి + తండ్రి అని యున్నపుడు పూర్వశబ్దము ఇదంతమైన మహతీవాచకము. దీనికిని దీర్ఘము కలుగగా, 'తల్లీదండ్రులు' అని యగును. పరమందలిది మహద్వాచకము.

'కొన్ని యెడల...చూపట్టెడు' అని యనుటచేత ఇట్టి రూపములు విరళముగా కలవని చూపుటయే ప్రయోజనము. ఇట్లు చేయవలయునని నిర్దేశించుట యాశయము కాదు.

[మహద్ద్వంద్వము అని యనుటచేత మహద్వాచకములును, మహతీ వాచకములును, ఉభయమునుగూడ గ్రహింపబడును. ఇంక అమహత్తులు ద్వంద్వముగా నేర్పడునప్పుడు జరుగు ప్రక్రియను తరువాతి సూత్రమున సూచించుచున్నాడు.]

**53. ఒకానొకచో ద్వంద్వంబునం బూర్వపదంబు క్లీబసమం బగు; అగుచో నా మువర్ణకంబునకు లోపంబగు.**

**(ప్రౌ - ౭౯)**

అందచందములు॥ అని. ౫౩॥ వెచ్చసచ్చములు। వే. పంచ. ౧౩॥ మొ.

వ్యాఖ్య - సాధారణముగా ద్వంద్వసమాసమునందు పూర్వశబ్దము స్త్రీసమమై యుండవలయును. అదే విషయమును "ఆచ్ఛికశబ్దంబుతోడ స్త్రీసమంబు ప్రాయికంబుగ౦ ద్వంద్వం బగు" అన్న (బా. సమాస - 7) సూత్రమునందు బాలవ్యాకరణ కారుడు తెలిపెను. దానికి సవరణముగా ప్రౌఢవ్యాకరణకారుడు ప్రస్తుతసూత్రమును రచించుచున్నాడు. ఇది విశేషవిధిని సూచించును.

ఒకానొకచోటి ద్వంద్వసమాసమునందు మువర్ణకాంత మగు పదము సైతము పూర్వమున నుండవచ్చుననియు, దానికి మువర్ణకము లోపించుననియు సూత్రార్థము. అందము + చందము - అనుచోట రెండుపదములు మువర్ణకాంతములే. సమ

సించునప్పుడు పూర్వశబ్దము చివరనున్న 'ము' లోపింపగా 'అంద చందములు' అని యగును.

["కొన్నియెడల ద్వంద్వంబునం బగంబుమీఁది చతపలకు సదవలు గానంబడవు" అన్న (ప్రౌ - ౯) సూత్రమునుబట్టి యిచ్చటి 'చ' వర్ణమున కాదేశముగా 'స' వర్ణము రాకుండ నుండిపోయినది.]

వెచ్చము + సచ్చము - అని యున్నప్పుడు రెండును అమహద్వాచకములే. ఇచ్చట పూర్వపదముయొక్క మువర్ణక మునకు లోపమురాగా 'వెచ్చ + సచ్చము' అని యుండి బహుత్వబోధకమై ' లు ' వర్ణకము రాగా ' వెచ్చ సచ్చములు ' అని యగును.

**54.** ద్వంద్వం బప్రాణివాచక కృదంతశబ్ద ఘటితం బేక వచనాంతంబు నగు. (ప్రౌ - ౩౦)

కూడుగుడ్డ - కూరగాయ॥ జై. ౪ ఆ॥ దరిదాపు॥ భోజ. ౨ఆ॥ రేవగలు ॥ రామా. ౨ ఆ॥ తాఁకుదగులు ॥ హరి. ఉ ౫ ఆ॥ ను శబ్దంబు చేఁ గూరగాయ లిత్యాదులు బహువచనాంతంబులు నగునని యెఱుంగవలయును

వ్యాఖ్య - అప్రాణి వాచకములతో కాని, కృదంతములతో కాని యేర్పడిన ద్వంద్వ సమాసము ఏకవచనాంతమై కూడ నుండునని సూత్రార్థము. 'ను' అని సముచ్చయార్థకమును వాడి యుండుటచేత ' కూడుగుడ్డలు ' మున్నగు బహుత్వబోధక రూపము లుండుట కాక్షేపము లేదు.

కూడు + గుడ్డ - అని యున్నప్పుడు బహుత్వ బోధ చేత లు వర్ణకము కలిగి ' కూడుగుడ్డలు ' అని కావలయును.

ప్రస్తుతసూత్రము పై రూపము నంగీకరించుచు ఏకవచనాంతమగు 'కూడుగుడ్డ' అను రూపముకూడ కావచ్చునని చూపుచున్నది. పై సమాసమున రెండు పదములును అప్రాణి వాచకములే. అట్టివే తరువాతి మూడు ప్రయోగములును.

తాఁకు + తగులు - అన్నచోట రెండు శబ్దములును కృదంతరూపములే. బహుత్వబోధచేత 'తాఁకుదగులులు' అను విధముగా కావలసియుండగా, ప్రస్తుత సూత్రముచేత ఏక వచనాంతమై 'తాఁకుదగులు' అని యగుచున్నది.

[ సుబోధినీ వ్యాఖ్యాత 'అప్రాణివాచక కృదంత శబ్ద ఘటితంబు' అను సమాసమును కర్మధారయముగా నెంచి "ప్రాణిని బోధింపని కృదంత శబ్దముతోఁ గూడియున్న ద్వంద్వ సమాసము ఏకవచనాంతముగాఁ గూడ ఉండును" అని వివరించెను. ఈ వివరణమునుబట్టి కూడు మున్నగునవి కృదంతములు కావలసివచ్చును. అట్లు కావు. అప్రాణివాచక ఘటితము, కృదంత శబ్ద ఘటితమునైన ద్వంద్వము అన్న యన్వయము సరియైనది. ]

పై వన్నియు చాల విరళముగా నున్న ప్రయోగములు. కావున సూత్రమున 'ఒకానొకచో' అని చేర్చియుండిన సమంజస ముగా నుండెడిది.

## 55. భావద్వంద్వంబునం దొలిపదంబు టవర్ణకంబునకు లోపం బగు. (ప్రౌ - ౬౧)

టవర్ణకం బిటఁ గృత్ప్రత్యయంబున కుపలక్షణంబు. ఔగాములు (అవుట + కామి)॥ పరి. ౩ఆ॥ చెల్లుచెల్లములు (చెల్లుట + చెల్లమి) ॥వేం. పంచ. ౧ఆ॥ వచ్చురాములు (వచ్చుట + రామి) ॥పాండు. ౬ఆ॥ విని వినములు (వినికి + వినమి) ॥సా. ౨ఆ॥ మొ. (వినికి = వినుట)

వ్యాఖ్య - భావార్థకములయిన పదములతో నేర్పడిన ద్వంద్వసమాసమునందు తొలిపదము తుదనున్న 'ట' వర్ణకమునకు లోపమగునని సూత్రార్థము.

సూత్రకర్త సూత్రమునందు ట వర్ణకము మాత్రమే చెప్పినను, కృత్ప్రత్యయమునకు లోపము చేయవలయునని వివరణమునందు తానేసూచించెను.

'ఔగాములు' అన్నది ఔట + కామి - అను రెండు భావార్థకరూపముల కేర్పడిన ద్వంద్వము. పూర్వపదము తుదనున్న 'ట' వర్ణకమునకు లోపమురాగా ఔ + కామి అని యగును. "ద్వంద్వంబునం బదంబుపయి పరుషములకు గసడదవలగు" నన్న (బా. సంధి - 15) సూత్రముచేత ఔ + గామి అని యగును. బహుత్వబోధచేత 'లు' వర్ణకము కలిగి, చివరి యిత్వమున కుత్వము రాగా 'ఔగాములు' అని యగును.

[ ప్రౌఢవ్యాకరణకారుడు 'అవుట + కామి' యని వేఱుపరిచి చూపుట సరిగా లేదు. పైనున్నట్లే యైన 'అవుగాములు' అని యగును. ]

చెల్లు చెల్లములు, వచ్చురాములు - అనునవి కూడ భావార్థమునందయిన ట వర్ణకమునకు లోపము కలిగిన రూపములు. విని వినములు - అన్నచోట పూర్వశబ్దము ఇకి ప్రత్యయాంతమైన కృదంతశబ్దము. "ఇకి కోర్వాదుల కగు" అను (బా. కృదంత - 16) సూత్రముచేత విను + ఇకి = వినికి అని యగును. "వ్యతిరేక భావంబున మిజీ యగు" అను ( బా. క్రి. - 37 ) సూత్రముచేత విను + మిజీ అనిరైయి 'వినమి' అని యగును. కావున నిచ్చటి రెండు పదములును భావార్థక వ్యతి

రేక భావార్థకములు. వీనికి సమాసము కలిగినప్పుడు పూర్వ శబ్దము తుదనున్న యక్షరమునకు లోపముకలిగి విని + వినమి = వినివినములు అని యగును.

[ టవర్ణకం బిటఁ గృత్ప్రత్యయంబున కుపలక్షణంబు - అని సూత్ర కర్త వివరించెను. టవర్ణమునకు వలెనే కృత్ప్రత్యయమును గూడ లోపింప జేయవలయునన్న యర్థము పై వివరణమువలన స్ఫురించును. కృత్ప్రత్యయములు కొన్ని రెండక్షరముల ప్రమాణము గలవికూడ కలవు. అట్టిచోట్ల తుది యక్షరము మాత్రమే లోపించును. వ్యాకర్త ఆ విషయమును సూచనముగా నైన తెలుపలేదు. మరొక విషయము. పై రూపములు కూడ తరుచుగా కనిపించునవి కావు. కావున 'ఒకానొకచో' అని సూత్రమునందు చేర్చియుండిన సమంజసముగా నుండెడిది. 'విని వినములు' మున్నగుచోటి పూర్వశబ్దము 'వినికి' అని కృదంతమనుటకంటె 'విని' అను క్త్వార్థకమే యనుట యుచితముగా నుండును. చేసి చేయములు, చూచి చూడములు, వచ్చి రాములు, చెల్లి చెల్లములు - మున్నగు విధములయిన రూపములే రూఢములై యున్నవి. ఇవియు పూర్వశబ్దమును క్త్వార్థకముగానే నిరూపించుచున్నవి. ]

**56.** ద్వంద్వంబునం బూర్వపదాంత్యావయవంబునకు లోపం బొండె నగు. (ప్రౌ - ౩౨)

పుట్టుగ్రుంకు గట్టు॥ య. ౫ఆ॥ తొవదమ్మివిందు॥ రామా. ౩ఆ॥ విన్నకన్నది॥ శ. పు. ౨ఆ॥ పుట్టుగ్రుంకు గట్టనఁగా పుట్టుగట్టు, గ్రుంకు గట్టు - ఇట్లంతట నెఱుంగునది.

వ్యాఖ్య - ఒండె నని యనగా వికల్పముగా నని యర్థము. ద్వంద్వసమాసమునందు పూర్వపదముయొక్క తుది యవయవమునకు లోపము వికల్పముగా నగునని యర్థము.

[ఇచ్చట పూర్వపదము సమానమై ఉత్తరపదముకూడ సమానమై యుండవలయును. రెండు సమాసములయందును ఉత్తరభాగము సమానమై యుండవలయును. అప్పుడుమాత్రమే పూర్వసమాసమునందలి అంతిమభాగమునకు లోపము వచ్చును. ఇట్టి యెడల ద్వంద్వసమాసము కలిగినప్పుడు లోపము నిత్యముగానే వచ్చును. లోపము రాని సందర్భమున సమాసముకూడ నేర్పడదు.]

పుట్టుగట్టు + క్రుంకుగట్టు - అని యున్నప్పుడు పూర్వపదముయొక్క తుదిభాగమైన 'గట్టు' లోపించి పుట్టు + క్రుంకు గట్టు - అని యగును. బహుత్వముచేత 'లు' వర్ణకమును, ద్వంద్వముకాబట్టి పదముమీద పరుషములకు గ స డ ద వా దేశము కలుగగా 'పుట్టుగ్రుంకు గట్లు' అని యగును.

తొలవిందు + తమ్మివిందు = తొలదమ్మివిందు, విన్నది + కన్నది = విన్నకన్నది.

[ఇక్కడ బహుత్వము రాకుండుటయు, రెండవరూపమున గ స డ ద వా దేశము రాకుండుటయు గుర్తింపదగినవి. వీనిని విశేషరూపములుగా భావించుటయే యుచితము.]

**57.** **ఒకానొకచో ద్వంద్వంబు మిశ్రంబుగను, అందలి పూర్వపదంబు క్లీబసమంబుగను గానంబడియెడి.**

(ప్రౌ - ౩౩)

అవసర మక్కఅలు - అవసర మక్క అలం గ్రమువు కర్దము లందు వేటదోటల యందున్, దవులైన ప్రాంతలెంకలు మవుటన్ మముం జూడు మోపినపుడైనన్ ॥రామా శితి॥

వ్యాఖ్య - ఒక్కొకచోట ద్వంద్వసమాసము తత్సమపదమును అచ్ఛికపదమును గలియగా ఏర్పడును. అట్టి యెడల పూర్వపదము క్లీబసమముగా నుండవచ్చును-అని సూత్రార్థము.

[ క్లీబసమము అని యనగా మువర్ణకాంతమని వ్యాకర్త యభి ప్రాయము. బాలవ్యాకరణ పరిభాషనుబట్టి 'క్లీబసమము' అన్నది మువర్ణ కాంతమైన అచ్ఛిక శబ్దమును సూచించును. ప్రస్తుతసూత్రమునకు లక్ష్య మయిన 'అవసరము' అనునది తత్సమపదము. దీనిని సంకేతింపవలసినప్పుడు 'క్లీబతుల్యము' అని యనుట సమంజసముగా నుండును. ఇంతకును, ఇచ్చట మువర్ణకాంతత్వము లక్షితము.]

అవసరము + అక్కఱ - అని యున్నప్పుడు పూర్వ శబ్దము తత్సమము; మువర్ణకాంతము. ఉత్తరపదము అచ్ఛికము. ఈ రెండును సమసింపగా బహుత్వబోధచేత 'లు' వర్ణకము కలిగి 'అవసరమక్కఱలు' అని యయ్యెను.

ఉదాహృత పద్యమునందు రెండుపదములును సప్త మ్యంతములై యున్నవి. అవసరమునన్ + అక్కఱన్॥ "సమాసవిభక్తికి లోపం బగు"అను నియమముచేత పూర్వపదము తుదినున్న 'నన్' అనునది లోపించును. దానితోపాటు ముగాగ మమునకు కూడ లోపము కలుగ వలయును. సూత్రమున "క్లీబ సమంబుగను గానంబడియెడి" నను దళముచేత మువర్ణమునకు లోపము రాదన్నవిషయము సూచింపబడుచున్నది. బహుత్వ బోధచే ఉత్తరపదముయొక్క విభక్తికి లడాగమము కలిగి 'అవ సర మక్కఱలన్' అని యయ్యెను.

బాలవ్యాకరణమునందు "అచ్ఛిక శబ్దంబుతోడ స్త్రీ సమంబు ప్రాయికంబుగా ద్వంద్వం బగు" అను (బా - 7) సూత్రముచేత పూర్వపదము స్త్రీసమముగా నిర్ణయింప బడు చున్నది. ప్రస్తుత సూత్రము దానికి సవరణముగా వ్యవహరింప వలయునని ప్రౌఢ వ్యాకరణకారుని యభిప్రాయము. ఇక్కడిది

క్లీబతుల్య మగుటచేత బాలవ్యాకరణ విధివలన నిది సాధ్యము కాదు. ఉత్తర శబ్దమును అచ్చిక శబ్దముగా తెల్పి పూర్వశబ్దమును గుఱించి బాలవ్యాకరణము సూత్రమున నియమింపలేదు. అయినను, ప్రయోగములనుబట్టి చూడగా పూర్వశబ్దము కూడ అచ్చికమే యైయుండవలయు నని తోచును. ప్రస్తుత సూత్రము దానికి కూడ సవరణమును సూచించుచున్నది. ఇక్కడి పూర్వ శబ్దము తత్సమము. కావున నిది విశేషవిధిని సూచించుచున్న దన్న యుద్దేశముతో సూత్రమునందు "ఒకానొకచో" అని సూత్రకర్త తెలిపెను.

[ప్రౌఢ వ్యాకరణ కారుడు సైతము మరొక ప్రయోగమును దీనికి చూపలేదు. ప్రామాణిక కవు లెవ్వరును ఇట్టి ప్రయోగమును చేయలేదు; తదితరులు కూడ చేసినట్లు కానరాదు. కావున దీనికి ప్రామాణికత్వము నంగీకరించి, ప్రక్రియను జూపుట ఆవశ్యకము కాదు.]

## 58. సమాసవిభక్తికి లోపం బగు; లట్టునకుఁ గాదు.

(బా - ౨౫)

రాముని బాణములు - సరసపువచనములు - వేవెలుఁగు - గుణముల ప్రోక.

వ్యాఖ్య - సమాసమునందు పూర్వశబ్దముయొక్క విభక్తికి లోప మగును. ద్వితీయాది విభక్తులకు బహువచనమునందు ఆగమముగా నగు లకారమునకు మాత్రము లోపము రాదు - అని సూత్రార్థము.

రామునియొక్క + బాణములు. ప్రస్తుతసూత్రముచేత 'యొక్క' యను విభక్తికి లోపము కాగా 'రాముని బాణములు' అని యగును.

సరసములు + వచనములు. పూర్వశబ్దముకడపట నున్న బహువచన ప్రత్యయమగు 'లు' వర్ణము ప్రస్తుతసూత్రము చేత లోపించును. సరసము + వచనములు. "కర్మధారయంబుల మువర్ణంబునకుఁ బుంపులగు" అను నియమమునుబట్టి 'సరసపు వచనములు' అని యగును.

వేయి + వెలుఁగులు. బహువ్రీహిని జరుగు సమాసాంత "కార్యమువలన కడపటి లువర్ణకము లోపించును. "బహువచనంబు పరంబగునపుడు రేయిప్రభృతుల తుదియక్షరంబు లోపించు" (బా.అచ్చిక-28)అని సూత్రించి "ఈలోపంబు సమాసంబులందుం జూపట్టెడి" నని తెలిపెను. దీనిని బట్టి సమాసమున పూర్వపదమైన 'వేయి' శబ్దముయొక్క కడపటి 'యి' వర్ణమునకు లోపము కలిగి 'వేవెలుఁగు' అని యగును.

గుణములయొక్క + ప్రోక. విభక్తికి లోపము వచ్చి గుణముల + ప్రోక = గుణములప్రోక అని యగును; లడాగమమునకు లోపమురాదని సూరి యీ విషయమును చెప్పెను.

కొందరు ఏకవచనమునందలి నిగాగమమునకు సైతము సమాసమున లోపము రాదు; సూరి దీనిని చెప్పకుండుట దోషమన్నట్లుగా వాదింతురు. ఇది వాదించువారి తొందరపాటును మాత్రమే సూచించును. సూరి తన ప్రణాళికలో డుమంతమునకు నిగాగమము విధించెను. విభక్తికి లోపమును విధించు సందర్భమున నివర్ణప్రసక్తియే యుండదు. లడాగమ విషయము వేరు. సూరి నామమునకు గాక, ఆగమ లకారమును విభక్తికి ముందు విధించెను. కావున, విభక్తి లోపించు నెడల దానితో

పాటు లడాగమముకూడ లోపింపవలసి వచ్చును. అట్టి లోప మును వారించుటకుగాను సూరి 'లట్టునకుఁ గాదు' అని ప్రత్యే కించి చెప్పెను. కాబట్టి సూరిప్రణాళికనుబట్టి యిదిమే సరియైన విధానము.

**59.** ఒక్కొకచో సమాసగత పూర్వపదంబు వ్యవహితోత్తర పదం బొంటితోడను వాని పెక్కింటితోడను నన్వ యించెడి. (ప్రౌ - ౭౪)

రాహుకంఠము దెగి దేహము ధరణిఁ బడియె॥ భార. ఆది. ౨౫॥ ఒక్కొక కన్నును జెవియును। జెక్కును జను బొడ్డు మూపుఁ జెలువగు చేయున్। బ్రక్కయుఁ బిరుదును గాలును। నక్కజముగ మనుజశకల మపు డుదయించెన్॥ భార. సభా. ౧౫॥ పరుల ధనము నకు విద్యా। పరిణతికిం దేజమునకు బలమునకు మనం।బెరియఁగ నసహ్యపడు నా।న్నరుఁడు దెవులులేని వేదనంబడు నధిపా॥ భార. ఉద్యో. ౨౫॥ నాయింటం బది కడవల।నేయిఁ బెరుగుఁ బాలు ద్రావె నీప్రియతనయుండు ॥హరి. పూ. ౫౫॥

వ్యాఖ్య - సమాసమునందలి పూర్వపదము ఇతరపద వ్యవధానమును గలిగి పరమందున్న ఒక్కపదముతోగాని, పెక్కు పదములతోగాని అన్వయమును గలిగి యుండునని సూత్రార్థము. 'ఒక్కొకచో' అని యనుటచే, ఇట్టి ప్రయోగములు తక్కువ గా నుండునన్న సూచన ముందుగనే చేయబడుచున్నది.

రాహుకంఠము - అనునది షష్ఠీతత్పురుషము. ఇచ్చట పూర్వశబ్దము 'రాహు' అనునది. ఇది తరువాతనున్న 'దేహము' అను దానితో కూడ అన్వయము నొందుచున్నది.

నడుమ కంఠము, తెగి - అను రెండుశబ్దములు వ్యవధానమును గలిగించుచున్నవి. రాహుకంఠము తెగి, రాహుదేహము ధరణిని బడె నని తాత్పర్యము.

ఒక్కొక కన్నును - అనునది ద్విగుసమాసము. ఇందు పూర్వపదము కేవలపదము కాదు. ఒక్క + ఒక అను రెండు పదముల కలయిక వలన సమాస ప్రాయముగా నేర్పడినరూపము. ఇది 'కన్నును' అను నుత్తరభాగముతో నన్వయించుచున్నట్లే చెవియును, చెక్కును - మున్నగు తరువాతిపదములతో నన్వ. యించుచున్నది. ఇచ్చట ఈ పూర్వభాగముతో నన్వయించు పద ములు తరువాతిపదములకు వ్యవధానపును గలిగించుచున్నవి. 'చెలువగు' అనుచోట చెలువు, అగు - అను మరిరెండు శబ్దముల వ్యవధానముకూడ కలదు. ఇది పెక్కుపదములతో నన్వయించుటకు లక్ష్యము.

"పరుల ధనమునకు" అని యున్నప్పుడు షష్ఠీతత్పురుషము. పూర్వమున్న 'పరుల' అను షష్ఠ్యంతరూపము తరువాత వచ్చు విద్యాపరిణతికి, తేజమునకు, బలమునకు - అను వానితో నన్వయించుచున్నది.

'పదికడవల నేయి' అనుచోట పూర్వభాగముకూడ 'పది + కడవలు' అనునవి కలియగా ఏర్పడిన సమాసమే. ఇది తరువాత వచ్చు పెరుగు, పాలు - అనువానితోకూడ నన్వయించుచున్నది.

[పై యుదాహరణము లన్నిటియందును సాధ్యసమాసములే చూపబడినవి. 'రాహుకంఠము' అన్నదానిని సిద్ధసమాసమనియు ననవచ్చును.

కాని, తక్కిన లక్ష్యములనుబట్టి దానినిగూడ సాధ్యసమాసముగానే పరిగ ణించుట సముచితముగా నుండును. సిద్ధసమాస విషయమును తరువాతి సూత్రమునందు ప్రౌఢవ్యాకరణకారుడు చూపుచున్నాడు. కావున ప్రస్తుత సూత్రము సాధ్యసమాస విషయమునే సూచించుచున్నదనుట సమంజసము.]

**60.** కొన్నియెడలసిద్ధసమాసమధ్యగతపదంబులతోఁదద్భిన్న పదంబుల కన్వయంబు చూపట్టెడి. (ప్రౌ - ౩౫)

బహువేదఘోషములఁ జేసి నిరస్తసమస్త కిల్బిషోత్కరులగు చున్న ధన్యులు॥ భార. అర. ౧అ॥ వారి యస్మదీయోరు చమూ సమూహములు॥ హరి. ఉ. ౨అ॥ అఖండితరూప విలాససంపదన్ వం చిత పంచబాణుఁడగువాని॥ నై. ౩అ॥ అందొకటిచే జనితాధరపీడయై॥ కళా. ౫అ॥ మొ.

వ్యాఖ్య - కొన్నిచోట్ల సిద్ధసమాసమునందలి పదములతో, వేరుగానున్న పదము లన్వయము నొందుట సైతము కలదని సూత్రార్థము.

'నిరస్త' అనునది సమాసమున పూర్వపదము; తొలగింప బడిన యని యర్థము. దీనికి హేతువు 'బహువేద ఘోషములఁ జేసి' యని పూర్వప్రయుక్తమైన భిన్నపద సముదాయము. ఇట్లు భిన్నపదము (పదసముదాయము) సమాసగతమైన యొకపద ముతో నన్వయమునొందుట యిక్కడివిశేషము.

అస్మదీయోరు చమూసమూహములు - అన్నది సిద్ధ సమాసము. ఇందలి 'ఉరు చమూసమూహములు' అను భాగ

మంతటితోను 'వారి' యను షష్ఠ్యంత తదర్థకము అన్వయమును గలిగియున్నది.

'వంచిత' అను సమాసగతపదము 'అఖండితరూప విలాస సంపదన్' అను భిన్నపదముతో నన్వయమును గలిగియున్నది.

అందొకటిచే జనితాధరపీడయై - అనుచోట 'జనిత' యను సమాసగత పదముతో 'ఒకటిచే' అను పదము అన్వయము నొందుచున్నది.

[ ఇవన్నియు విశేషప్రయోగములు. సమాసమని యన్నప్పుడు ఏకార్థీభావ సామర్థ్యముచేత ఏకపదముగానే భాసించుట లక్షణము. కావున భిన్నపదములకు సమాసముయొక్క సామూహికార్థముతోనే యన్వయము కలుగవలయును. అట్లుకాక సమాసగతపదములతో భిన్నపదముల కన్వయమున్నయెడల దానిని ఏకదేశాన్వయ మని యందురు. పూర్వసూత్రమున సాధ్యసమాసములు పొందు ఏకదేశాన్వయమును ప్రస్తుతసూత్రమున సిద్ధ సమాసములు పొందు ఏకదేశాన్వయమును వ్యాకర్త నిరూపించెను. ]

సూత్రమున "సిద్ధసమాస మధ్యగత పదములతో" నని 'మధ్య' యని యనుట భ్రాంతిని కలిగింపవచ్చును. ఆదియు, నంతమును గానిది మధ్యయని గ్రహింపవలసి వచ్చును. సూత్ర కర్త యభిప్రాయ మది కాదు. తొలి యుదాహరణమున సమాస మందలి అదిపదముతోనే భిన్నపదమున కన్వయమున్నది. తరువాతి యుదాహరణమున ఆదిపదముకాక మిగిలిన పదసముదాయము సర్వస్వముతోడను 'వారి' యను పదమున కన్వయమున్నది. తరువాతి యుదాహరణములలో ఆదిమపదముతోనే యన్వయమున్నది. కావున సూత్రకర్త 'మధ్య' యను శబ్ద

మును విడిచి 'సిద్ధసమాస గతపదంబులతో' అని యనియుండిన సమంజసముగా నుండెడిది.

**61.** ఆచ్ఛికసమాసములం దఱచుగ వర్ణలోపాగ మాదేశ వికారంబులు నిత్యవైకల్పికములుగాఁ బెక్కులు గానంబడియెడి. (ప్రౌ - ౩౬)

అందాఁక (అంత + దాఁక), ఇట్లు ఇందాక, ఎందాక; అచ్చుతెల్పు (అచ్చము + తెల్పు), ఆఁదోఁక (ఆవు + తోఁక), ఆవల (ఆ + వలను), ఇట్లు ఈవల; ఇబ్బంది (ఇరు + వంది), ఇరుసెవి (ఇరుగు + చెవి), ఉద్దరి (ఉద్ద + దరి), ఎడవంక (ఎడమ + వంక), ఇట్లు వలవంక; ఎగుదల (ఎగువ + తల), ఇట్లు దిగుదల; ఏటవాలు (ఏటము + వాలు), కప్పురవీడెము (కప్పుర + వీడెము), కవ్వడి (కవ + వడి), కుఱుమాపు (కుఱుచ + మాపు), గంధవొడి (గంధము + పొడి), గుండ్రకడుపు (గుండ్రము + కడుపు), గొబ్బండు (గొప్ప + పండు), చిత్తరుబొమ్మ (చిత్తరువు + బొమ్మ), చిమ్మనగ్రోవి (చిమ్మనము + క్రోవి), చిఱుచప్పుడు (చిఱుత + చప్పుడు), చెంద్రకావి (చెంద్రము + కావి), ఇట్లు చందురకావి; చనుమఱ (చను + మఱక), చప్పరమంచము (చప్పరము + మంచము), చొక్కనగతులు (చొక్కము + సగతులు), తెగుదారి (తెగువ + దారి), దట్టకెంపు (దట్టము + కెంపు), దొంతర (దొంతి + తరగ), నడురేయి (నడుము + రేయి), నాన్నాళ్ళు (నాలుగు + నాళ్ళు), నాటకసాల (నాటకము + సాల), నిక్కల (నిక్కము + కల), నిడుమోము (నిడుద + మోము), నెత్తవలక (నెత్తము + వలక), పసిపట్టు (పసిమి + పట్టు) పెందుఱుము (పెనుపు + తుఱుము), పెత్తనము (పెద్ద + తనము),

పొంగట్టు (పొన్ను + గట్టు), బాపురె (బాపు + పురె), బెబ్బులి (పెద్ద + పులి), బెల్లమండెగ (బెల్లము + మండెగ), బొందళము (బొంత + దళము), బోనపుట్టిక (బోనము + పుట్టిక), మిండ తపసి (మిండఁడు + తపసి), ముంగల (ముందు + కలను), ఇట్లు వెనుకల; ముయ్యేఁడు (మూఁడు + ఏడు), ఇట్లు ముయ్యాఱు మొ॥ మోసల (మొగ + సాల), వలిపవెన్నెల (వలిపము + వెన్నెల), వలచెవి (వలను + చెవి), వాతెఱ (వా + తెఱపి), వాలురమ్ము (వాలు + అమ్ము), వేగురుఁజుక్క (వేగు + చుక్క), సగపాలు (సగము + పాలు), సాఁబాలు (సాము + పాలు), సుంకసరకు (సుంకము + సరకు)॥ ఇత్యాదు లూహ్యంబులు. ఇందు అఁదోఁ కేత్యాదులు కొన్నింటియందు వర్ణలోపాగమాదేశ వికారంబులు నిత్యములనియు, అందాఁకేత్యాదులయందు వైకల్పికములనియు నెఱుంగవలయును. వీని కొక్కొక్కటికిఁ బ్రయోగంబులు పెక్కుగలవు గాని గ్రంథవిస్తరభీతిచే నవి యుదాహరింపఁ బడవయ్యెను.

వ్యాఖ్య - ఆచ్ఛికపదములతో నేర్పడిన సమాసముల యందు కొన్నియెడల వర్ణలోపమును, కొన్నియెడల వర్ణాదేశ మును, కొన్నియెడల వర్ణాగమమును, కొన్నియెడల వర్ణవికా రమును, కొన్నియెడల నిత్యముగను, కొన్నియెడల వైకల్పి కముగను కలుగునని సూత్రార్థము. ఇట్లు చెప్పుటచేత, ఈయా కార్యములు ఒకక్రమమ్ము ననుసరించి జరుగుటలేదనియు, ఆయా ప్రయోగములనుబట్టి తెలిసికొనవలయుననియు భావము.

అంత + దాఁక - అని యున్నప్పుడు పూర్వపదము తుద నున్న 'త' వర్ణమునకు లోపము కలిగి 'అందాఁక' అని యగు

చున్నది. ఈలోపము వైకల్పికము. కావున 'అంతదాఁక' యను రూపముకూడ నుండవచ్చును. ఇట్టివే ఇందాఁక, ఇంతదాఁక; ఎందాఁక, ఎంతదాఁక - అను రూపములుకూడ.

ఈతరువాత చూపిన 'బొందళము' అను ప్రయోగము కూడ నిట్టిదే. బొంత + దళము - అని యుండగా పూర్వశబ్దము తుదనున్న 'త' వర్ణమునకు లోపముకలిగి బొం + దళము = బొందళము అని యగును. అచ్చము + తెల్పు - అని యున్నప్పుడు పూర్వశబముయొక్క మువర్ణమునకు లోపముకలిగి అచ్చ + తెల్పు = అచ్చతెల్పు అని యగును. కప్పురవీడెము, గందవొడి, గుండ్రకడుపు, చెంద్రకావి, చందురకావి, చప్పరమంచము, చొక్కసగతులు, దట్టకెంపు, నడురేయి, నాటకసాల, బెల్లమండెగ, బోనపుట్టిక, వలిపవెన్నెల, సగపాలు, సుంకసరకు - అను సమాసము లన్నియు నిట్టిమార్పును పొందినవే. 'చిమ్మనగ్రోవి' యనుచోట గ స డ ద వా దేశముకూడ కలుగుచున్నది.

ఆవు + తోఁక - అని యున్నప్పుడు పూర్వశబ్దము తుదినున్న యక్షరమునకు (తొలియచ్చుమీఁది వర్ణములకన్నింటికి) లోపము వచ్చి నుగాగమము కలుగును. ఆ + ను + తోఁక॥ ఇప్పుడు ద్రుతకార్యము జరుగగా 'ఆఁదోఁక' యని యగును. పెందుఱుము, సాఁబాలు - అనునవి సైతము ఇట్టి మార్పులను బొందినరూపములే.

ఆ + వలను - అని యన్నప్పుడు పూర్వశబ్దము తుదనేమియు మార్పులేదు. కాని, ఉత్తరశబ్దముయొక్క కడపటి వర్ణము లోపించి 'ఆవల' అని యయ్యెను. 'ఈవల' అనునదికూడ

ఇట్టిదే. చనుమఱ, వాతెఱ, వెనుకల-యనునవికూడ నిట్లే ఉత్తర పదము తుదియక్షరమునకు లోపమువచ్చిన రూపములు. దొంతర, ముంగర అనునవి ఉత్తరపదముయొక్క కడపటి యక్షరమునకు లోపమువచ్చుటయే కాక, పూర్వపదము తుదియక్షరమునకు కూడ లోపముకాగా ఏర్పడిన రూపములు. 'ముంగల' యను చోట సరళాదేశముకూడ జరిగినది.

ఇరుసెవి, వలవంక, ఎడవంక, చిత్తరుబొమ్మ, ఎగుదల, దిగుదల, తెగుదారి, వలచెవి - మున్నగువానియందు పూర్వ శబ్దము తుదినున్న యక్షరమునకు లోపముకలిగి, సాధారణముగా గ స డ ద వా దేశము కలుగుచున్నది.

కుఱుమాపు, చిఱుచప్పుడు, నడురేయి, నిడుమోము - మున్నగునవికూడ పూర్వశబ్దము తుదినున్న యక్షరమునకు లోపమురాగా ఏర్పడినరూపములే. బాలవ్యాకరణమునందు "కుఱు చిఱు..." అని ప్రారంభించిన సూత్రమునందు కుఱు, చిఱు, నడు, నిడు - అని నాలుగురూపములను చూపుట జరిగెను. నిక్కల, కవ్వడి - అనువానిని "నిక్కలాదులు యథా ప్రయోగంబుగ గ్రాహ్యంబులు" అనితెల్పి వానినిగూడ సూరి ప్రదర్శించియే యున్నాడు. "అన్యంబులకు సహిత" మని మొద లయిన సూత్రముచేత అఁదోక, పెత్తనము, సాఁబాలు - మున్నగునవి సాధింపబడును. ముద్యోడు, ముయ్యాలు - మున్నగునవికూడ పూర్వసిద్ధములే. నానాళ్లు - అనుదానిని తానే మరొకచోట సాధించెను.

ఆవల, ఈవల - మున్నగుచోట్లగల సమాసాంతకార్యము లను దెలుపుట యావశ్యకము. బాలవ్యాకరణము బహువ్రీహికి మాత్రమే తెలిపియున్నది. వాలుఁగన్నుఁ, వేగురుఁజుక్క - అను చోట్ల రుగాగమముకూడ కలుగుచున్నది. దీనినిగూడ తెలుపుట యావశ్యకమే. మిండఁడు + తపసి యనుచోట పూర్వశబ్దము డువర్ణకాంతము. ఇచ్చటి డువర్ణమునకు లోపముకలిగి సమసించుట విశేషము. కావున నిదియు నావశ్యకమే.

[ఇబ్బంది, గొబ్బండు, బెబ్బులి - అనువాని విషయమున ప్రౌఢవ్యాకరణకారుని ప్రక్రియ సంతృప్తికరముగా లేదు.]

ఆఁదోఁక మున్నగువానియందు లోపాదులు నిత్యములనియు, అందాఁక మున్నగువానియందు వైకల్పికములనియు వ్యాకర్త వివరించెను. ఇట్టిరూపము లింకను పెక్కులు గలవన్న విషయమునుగూడ వ్యాకర్త జ్ఞాపనముచేసెను.

**62.** కొన్నియెడల సప్తమీ తత్పురుషమునందు నవర్ణకంబు నగు. (ప్రౌ - ౩౭)

**కువలయంబునవారు॥ భార. ఆది. ౨అ.॥ వారణావతమున వారెల్ల॥ భార. ఆది. ౬అ॥ ధరణీతలనాథ పురుషునకు నిమ్ముల భార్యయ పాచుఁ జిత్తమున దుఃఖంబుల్॥ భార. అర. ౨అ॥ నిజకులంబునవారికెల్ల॥ హరి. పూ. ౧అ॥ అనఘ యణుహుఁడే వంశంబున వాఁడు॥ హరి. పూ. ౨అ॥ మొ. న శబ్దంబుచేఁ గువలయంబు నందలి వారు॥ మొ.**

వ్యాఖ్య - కొన్నియెడల సప్తమీతత్పురుష సమాసమునందు పూర్వశబ్దము తుదియందు 'న' వర్ణకము సైతము కలుగునని సూత్రార్థము.

'నవర్ణకంబును' అని సముచ్చయార్థకమును జేర్చి పలుకుటచేత 'అందు' అను సప్తమీప్రత్యయముకూడ వచ్చునని ప్రౌఢవ్యాకరణకారుడు జ్ఞాపనము చేయుచున్నాడు. ఇది అలుక్సమాస విషయము, 'లుక్' అని యనగా లోపమని యర్థము. సాధారణముగా సమాసమునందు పూర్వపదము తుదినున్న విభక్తికి లోపము కలుగును. అట్లు లోపము కలుగని వానిని అలుక్సమాసములని యందురు. సంస్కృతసమములయిన పంకేజాతము, మనసిజుడు - మున్నగునవి అట్టివే. తెలుగునందు కూడ అట్టివి కొలదిగా కలవు. బాలవ్యాకరణము చేత, తోడ, వలన, అందు - అను ప్రత్యయములు లోపింపని సమాసములను పేర్కొని వానియందగు మార్పును (బా. సంధి - 43, 44) తెలిపెను. అచ్చట 'నాయందు + కరుణ' మున్నగు విధముగా 'అందు' తోడి రూపముమాత్రమే యుండెను. దానికి 'అలి' యను నాగమము కలిగి 'నాయందలి కరుణ' అని యయ్యెను. ప్రౌఢవ్యాకరణ కారుడు దానిని స్పృశించుచు 'అందు' అను ప్రత్యయముతోపాటు, సప్తమియందు 'న' అను ప్రత్యయముకూడ వచ్చునని, అప్పుడుకూడ అలుక్సమాస మేర్పడునని తెలుపుచున్నాడు.

కువలయంబు + వారు - ఇచ్చట అధికరణమునందు సప్తమీవిభక్తి కలుగగా 'కువలయంబునన్ + వారు' అని యగును. "సమాసంబులందు ద్రుతంబునకు లోపంబగు" అన్న (బా. సంధి - 24) సూత్రమునుబట్టి ద్రుతము లోపింపగా 'కువలయంబునవారు' అని యగును. సూత్రమున సముచ్చయార్థక గ్రహణముచేయుటచేత 'న' వర్ణకము రానిపక్షమున

'అందు' వర్ణకము వచ్చును. అప్పుడు అలిగాగమముకూడ నగును. కువలయంబునందు + అలి + వారు = కువలయంబు నందలివారు. ఇదియు అలుక్సమాసమే. విభక్తికి లోపమే యైన యెడల "కువలయంబు వారు" అని యుండును.

వారణావతమునన్ + వారు = వారణావతమునవారు; చిత్తమునన్ + దుఃఖంబుల్ = చిత్తమునదుఃఖంబుల్; నిజ కులంబునన్ + వారు = నిజకులంబునవారు; ఏవంశంబునన్ + వాఁడు = ఏవంశంబునవాఁడు॥ అని పై వాని రూపనిష్పత్తి యుండును. సముచ్చయార్థక సామర్థ్యముచేత వారణావతమునందలివారు; చిత్తమునందలి దుఃఖంబుల్; నిజకులంబునందలివారు; ఏవంశంబు నందలివాఁడు॥ అను విధముగా కూడ నుండవచ్చును.

[ ప్రౌఢవ్యాకరణ కారుడు "షష్ఠీతత్పురుషములందు నగాగమంబు విభాష నగు" నని సమాసపరిచ్ఛేదమున మొదటిసూత్రమును రచించెను. అందున్న నగాగమమునకు, ఇచ్చటి 'న' విభక్తికి భేదము లేదు. అచ్చట తానూహించిన సంబంధార్థమునే యిచ్చట సైతము చెప్పుకొనవచ్చును. 'కువలయంబునవారు' అని యనఁగా 'కువలయమునకు సంబంధించినవారు' అని యర్థము. "శేషషష్ఠికి యొక్కయునగు" నను సూత్రముచేత 'కువలయంబు యొక్క + వారు' అనియై "సమాసవిభక్తికి లోపంబగు" అను నియమము చేత 'కువలయంబు వారు' అని యగును. అట్టి యెడల "షష్ఠీతత్పురుషము లందు" అని మొదలయిన సూత్రముచేత 'కువలయంబున వారు' అని యగును. ఒకచోట ఆగమముగను, ఒకచోట ప్రత్యయముగను చెప్పుకొన వలసిన యవసరములేదు. వనమునకు, వనమునయందు, ఎలజవ్వనంబున విలసనంబు - మున్నగుచోట్ల చెప్పుకొనినట్లే 'కువలయంబునవారు' అను చోటదికూడ నగాగమమని చెప్పుకొనవచ్చును. అప్పుడు అధికరణమునుబట్టి సప్తమీ తత్పురుషమని కాక, సంబంధమునుబట్టి - షష్ఠీతత్పురుషమనియే చెప్ప

వచ్చును. అప్పు డిది యలుక్సమాసము కాదు. ఇట్లు నిర్ణయించుటయే సముచితము.]

63. అట్లు పోలె బలె వలె శబ్దంబు లివార్థకంబులు. ఉపమేయయు ప్రథమాంతమగునపు డట్లు పరంబగుచో నుపమానంబులగు నామతదస్మద్యుష్మదాత్మార్థములకు షష్ఠియు, పోలెబలెలు పరంబులగుచో నామ తచ్ఛబ్దార్థములకుఁ బ్రథమయు, నస్మదర్థ ప్రభృతులకు ద్వితీయము, వలె పరంబగుచో నామతచ్ఛబ్దార్థములకు షష్ఠియు, నస్మదర్థాదులకు షష్ఠీద్వితీయలయం దెదియే నొక్కటియుఁ గ్రమంబుగ నగు. ఉపమేయము ద్వితీయాద్యంతమగునపుడు, పోలె ప్రభృతులు పరంబులగుచో నుపమానంబుల కుపమేయవిభక్తుల యగు. పోలినయెడఁ దచ్ఛబ్దమే తదాదులకు నుపలక్షణముగా గ్రహించునది. అట్లు కరణ్యాదులకు గ్రాహకము.

ఉ॥ క్రమముగఁ జూచునది. ఉపమేయము ప్రథమాంతమగునపుడు: నారాయణునట్లు – పాయక పాకశాసనికి భారతఘోర రణంబునందు నారాయణునట్లు॥ భార. ఆది. ౧అ॥ (ఉదాహరణంబులు కొన్ని కొంతకొంత వ్రాయఁబడును గాన వానిని సందేహముఁదీఱ నాయాగ్రంథములం, దక్కడక్కడ దుదముట్టఁ జూచుకొనునది.) బకునియట్లు – మనుజ శతణంబు చేసితి రేని బకునియట్లు చత్తురు॥ భార. ఆది. ౬అ॥ ఇట్లు నలునట్లు మొ॥ జలధరసమితి యట్లు॥ భార. అర. ౨అ॥ గజమునట్లు – పుత్త్రదార బంధుమిత్ర సక్తుఁడు రొంపిఁ బడిన గజము

నట్ల యెడరునందు॥ భార. శాంతి. ౬ఆ॥ ఇట్లు వానియట్లు - నాయట్లు - నీయట్లు - తనయట్లు.

చంద్రికయుఁ జంద్రుండువోలె॥ కళా. ౪ఆ॥ పేదవోలె - అమృతమువోలె॥ అని పలికెడి చెలిపలుకులు। తన కమృతమువోలె హృదయతాపము నడఁపన్ ॥కళా. ౬ఆ॥ పరికాఁడు వోలె ॥భార. ఆది. ౪ఆ॥ పాములవాఁడు వోలె॥ కాశీ. ౨ఆ॥ నన్నుఁబోలె - నిన్నుఁబోలె - కానీరాయిటువంటి నీతము లనేకంబుల్ నినుంబోలె విన్నా సేనున్॥ శశాం. ౭ఆ॥ ఇట్లు తన్నుఁబోలె॥ మొ.

రాముఁడుబలె - వేల్పుబలె॥ కళా. ౮ఆ॥ తామరపాకు నీరు బలె ॥హరి. ౩ఆ॥ గోరుబలె ॥కళా. ౭ఆ॥ ఇట్లు వాఁడుబలె - నన్నుబలె - నిన్నుబలె - తన్నుబలె॥ మొ. రామునివలె-వానివలె - నావలె - నన్నువలె - నీవలె - నిన్నువలె - తనవలె - తన్నువలె.

బహుత్వంబున: బకులయట్లు - చంద్రులువోలె - రాములుబలె - రాములవలె॥ మొ. పూరుపురూరవులట్లు భ। గీరథరఘుపతులయట్లు॥ భార. అర. ౨ఆ॥ పరిభవంబులఁ బడితినిట్టి నన్నుఁ బాండవుల్ సూచుచు నుండి రొరులువోలె నుక్కుదక్కి॥ భార. అర. ౧ఆ॥ మాయట్లిడుమలఁ బడిన నరులుగలరె యొరులు పరమమునీంద్రా॥ భార. అర. ౨ఆ॥ మమ్ముంబోలె నొడ్ల నాదరాధిక్యంబున భరంపడి సవిశేషంబుగా నధ్యయనంబు సేయింపకుండుట మాకు వరంబు॥ భార. శాంతి. ౯ఆ॥ ఇత్యాదులెఱుంగునది. (ఇప్పటికిఁ దగినవి దొరకమింజేసి యిందుఁ గొన్నింటికిఁ బ్రయోగంబులు వ్రాయఁబడవయ్యె.)

ద్వితీయాద్యంతమగునపుడు : భీరులఁబోలె నేల వెఱపించెదు మాటల మమ్ము॥ భార. అర. ౬ఆ॥ జ్ఞానులచే మౌనులచే। దానులచే

యోగసంవిధానులచేతన్। బూనిన బద్ధుండగునే। (శ్రీనాథుఁడు భక్తి యుతుల చేతం బోలెన్॥ భాగ. ౧౦స్కం॥ ఏమహాత్ములచేత నీజగత్త్రి యము నాప్యాయితంబయ్యె నయ్యమృతకరునిచేఁ బోలె॥ భోజ. ౧ఆ॥ వెనుకఁ గ్రమక్రమంబున నవీనముగా నుదయంబునొందెఁ బెంపొనర నృపాల! యీతనికి నుత్తమ మధ్యమ వృద్ధధర్మ దర్శనమున ద్రవ్య కర్మగుణజాతి విశేషవివేచనంబు బాలురకునుబోలె మానసములో నిఖిలవ్యవహార హేతువై॥ కళా. ౧ఆ॥ నీవు ననుంబలె నౌర వీరలన్ వేడుకఁ జూతువో॥ కళా. ౬ఆ॥ దేవరకుంబలె నవ్వధూటికిన్। దొత్తగుచుం బనుల్ సలుపుదున్॥ కళా. ౪ఆ॥ ఇట్లితరంబు లూహ్యంబులు.

వ్యాఖ్య - సంస్కృతమునందలి 'ఇవ' అను శబ్దము యొక్క అర్థమునందు తెలుగున అట్లు, పోలె, బలె, వలె - అను నవి వచ్చును. అవి యుపమానమును దెల్పు పదముల నంటి యుండును.

1. ఉపమేయము ప్రథమాంతమగునపు డట్లు పరంబగుచో నుపమానంబులగు నామ తదస్మద్యుష్మదాత్మార్థములకు షష్ఠి యగును.

నారాయణునట్లు - అనుచోట 'అట్లు' అను ఉపమా వాచకము ఉపమానమయిన నామమునుపై ని చేరినది. ఉపమేయము నారాయణభట్టు' ప్రథమాంతము. కావున పైనియ మమునుబట్టి ఉపమానము షష్ఠ్యంతముకాగా 'నారాయణు యొక్క + అట్లు అనియుండి సమాసవిభక్తికి లోపము రాగా 'నారాయణు + అట్లు' అని యయ్యెను. ఆపిమ్మట "షష్ఠి

సమాసంబున నుకారఋకారంబు లకచ్చు పరంబగునపుడు నుగాగ మంబగు'' అన్న విధినిబట్టి 'నారాయణునట్లు' అని యయ్యెను. బకునియట్లు, నలునట్లు - మున్నగు ప్రయోగములు కూడ నట్టివే. బహుత్వమున 'భగీరథ రఘుపతులయట్లు' మున్నగునవి యుదాహరణములు.

తదర్థకమైన 'వాఁడు' అన్నది ఉపమేయమైనపుడు షష్ఠ్యంతమై 'అట్లు' అను ఉపమావాచకమును పొందును. 'వానియట్లు' అన్నది యుదాహరణము. అట్లే అస్మదర్థకము నకు నాయట్లు, మాయట్లు; యుష్మదర్థకమునకు నీయట్లు, మీయట్లు; ఆత్మార్థకమునకు తనయట్లు, తమయట్లు - అన్నవి యుదాహరణములు.

2. ఉపమేయము ప్రథమాంత మగునపుడు పోలె బలెలు పరంబులగుచో నామతచ్ఛబ్దార్థములకుఁ బ్రథమయు, నస్మదర్థ ప్రభృతులకు ద్వితీయయు నగును.

చంద్రుండు వోలె - అన్నప్పుడు 'చంద్రుండు' అను ఉపమానము ప్రథమాంతమై యున్నది. దానిపై వచ్చిన 'పోలె' యనునది గసడదవాదేశ కార్యమువలన 'చంద్రుండువోలె' అని యైనది. ఇట్టివే పేదవోలె, అమృతమువోలె, పరికాఁడువోలె, పాములవాఁడువోలె - మున్నగు నుదాహరణములు. బహు వచనమునందు 'ఒరులువోలె' అన్నది యుదాహరణము. అస్మ దర్థము మున్నగువానికి ద్వితీయ రాగా నన్నుఁబోలె, నిన్నుఁ బోలె, మమ్ముఁబోలె, మిమ్ముఁబోలె, తన్నుఁబోలె, తమ్ముఁ

బోలె - మున్నగు విధముగా రూపము లుండును. ఇచ్చట ద్రుత కార్యమువలన సరళాదేశ మగును.

'బలె' అను నుపమావాచకము పరమందున్నప్పుడు కూడ నామతదర్థకములైన యుపమేయములు ప్రథమాంతములై యుండును. తామరపాకు నీరుబలె, గోరుబలె, వాఁడుబలె - మున్నగునవి యుదాహరణములు. అస్మదర్థకాదులయిన యుపమేయములకు షష్ఠి వచ్చును. అప్పుడు నన్నుబలె, మమ్ముబలె, నిన్నుబలె, మిమ్ముబలె, తన్నుబలె, తమ్ముబలె - అను విధమున రూపము లుండును.

3. ఉపమేయము ప్రథమాంతమగునపుడు వలె పరంబగుచో నామ తచ్ఛబ్దార్థములకు షష్ఠియు, నస్మదర్థాదులకు షష్ఠీ ద్వితీయల యందెదియే నొక్కటియు నగు.

'వలె' అనునది పరమందుండగా 'రాముఁడు' అను నామమునకు షష్ఠికలిగి 'రామునియొక్క' అని యగును. ఆపిదప సమాసవిభక్తికి లోపము కలిగి 'రాముని + వలె = రామునివలె' అని యగును. వానివలె, వారివలె - మున్నగునవి తచ్ఛబ్దమున కుదాహరణములు. నావలె, మావలె, నీవలె, మీవలె, తనవలె, తమవలె - అనునవి అస్మదర్థక ప్రభృతులకు షష్ఠి వచ్చినప్పటి రూపములు. వీనికి ద్వితీయసైతము రావచ్చును. అప్పుడు నన్నువలె, మమ్మువలె, నిన్నువలె, మిమ్మువలె, తన్నువలె, తమ్మువలె - మరిన్నగువిధముగా రూపము లుండును.

4. ఉపమేయము ద్వితీయాద్యంత మగునపుడు పోలె ప్రభృతులు పరంబులగుచో నుపమానంబుల కుపమేయ విభక్తులే యగు.

'భీరులఁబోలె...మమ్ము' అనుచోట 'మమ్ము' అన్నది ఉపమేయము; ద్వితీయాంతమై యున్నది. ఉపమానముకూడ ద్వితీయాంతమై 'భీరులన్' అని యున్నది.

'దానులచే' మున్నగునవి తృతీయాంతములైన యుపమేయములు. ఉపమానము వానికనురూపముగా తృతీయాంతమై ఉపమావాచకమును బొంది 'భక్తియుతులచేతం బోలెన్' అని యయ్యెను.

'ఈతనికి' అనునది ఉపమేయమైనపుడు 'బాలురకును బోలె' అని షష్ఠ్యంతరూపముపైనే ఉపమావాచకము చేరినది. ఇట్లే తక్కినవియు నుపమేయముయొక్క విభక్తినే యుపమానము సైతము పొందుటకు లక్ష్యములై యున్నవి.

వీలయినచోటులందు 'తచ్ఛబ్దము' అని యనుటచేత 'ఏతచ్ఛబ్దము' మున్నగువానినిగూడ గ్రహింప వచ్చునని సూత్రకర్త వివరించెను. అది, అవి, వాఁడు, వారు - మున్నగునవి తచ్ఛబ్దార్థకములు. ఇది, ఇవి, వీఁడు, వీరు - మున్నగునవి ఏతచ్ఛబ్దార్థకములు.

'అట్లు' అని చెప్పుటచేత కరణి, భంగి మున్నగు వానిని గూడ గ్రహింపవచ్చు నని సూత్రకర్త వివరించెను.

**64. ప్రథమాంతములమీఁది పోలె బలెపోని శబ్దంబులు ద్రుతపూర్వకంబులు విభాష నగు. (ప్రౌ - ౩౭)**

సమిద్ధహవ్యవహుఁడుంబోలెన్ ॥హరి. ఉ॥ తిండికాఁడునుబోలె ॥భార. స్త్రీ. ౧ ఆ॥ నిధిఁగన్న పేదయుఁబోలె ॥భార. ఆది. ౪ఆ॥

అగ్నియుఁబోలె ॥భార. ఆది. ౨అ॥ తగరునుబోలె ॥నిర్వ. ౪అ॥ బూడిదపండునుబోలె॥ పాండు. ౫అ॥ అమృతధారా పాతంబునుబోలె ॥భార. అర. ౨అ॥ అనిన విని యేమిచెప్పఁగ నచటనున్న। వారలెల్లఁ జిత్తరువున వ్రాసినట్టి। ప్రతిమలునుబోలె నతినిశ్చలత నొకింత।తడవు గనుపట్టి రత్యద్భుతంబు నొంది ॥కళా. ౫అ॥ పవడంపుఁజుట్టలుగుఁ జంద మునుంబలె॥ య. ౫అ॥ మత్తత విప్రయోగి జనమర్దనుఁడైన ప్రసూన ధన్వికింగత్తు లొసంగినట్టి జనఘాతుక ! మాధవ నామధేయము।త్యుత్తమ మేగతిం గలిగెనో కద నీకు ! సుధాఖ్య గారకున్। హత్తినలీల రక్క సుల కంచితపుణ్యజనాఖ్యయుంబలెన్ ॥ శశాం. ౪ అ ॥ భూషణవిశేష ములుంబలె ॥కళా. ౩అ॥ ఇత్యాదు లెఱుంగునది.

వ్యాఖ్య - పూర్వసూత్రమునందు చెప్పిన పోలె, బలె అను ఇవార్థకములును, పోని అను వదర్థకమును పరమందున్నప్పుడు ప్రథమాంతములయిన యుపమానవాచకములమీద ద్రుతము విభాషగా చేరునని సూత్రార్థము.

'సమిద్ధహవ్యవహుఁడుం బోలెన్'. అనుచోట 'పోలె' అనునది పరమైనది. కావున పూర్వసూత్రముచేత ఉపమానవాచ కము ప్రథమాంతమై యుండును. ప్రస్తుత సూత్రముచేత 'ద్రుతము' ఆగమముగా కలుగగా 'హవ్యవహుఁడు+ను + పోలెన్' అనియుండి ద్రుతకార్యము జరుగగా 'హవ్యవహుఁడుం బోలెన్' అని యయ్యెను.

తిండికాఁడు + పోలె - అనియుండగా, ప్రస్తుతసూత్రము చేత 'ను' వర్ణము కలిగి ద్రుతకార్యము జరిగి 'తిండికాఁడును బోలె' అని యయ్యెను.

తగరు + పోలె - అనియుండగా నువర్ణప్రాప్తిచేత 'తగరునుబోలె' అని యయ్యెను.

[ వేదయుఁబోలె, అగ్నియుఁబోలె - మున్నగు నుదాహరణము లందు ఉపమావాచకమునకు పూర్వమందు ద్రుతము మాత్రమేకాక 'యు' వర్ణముకూడ కనవచ్చుచున్నది. దీనినిబట్టి యిట్టియెడల ద్రుతమునుగాక, 'ఉను' అని సముచ్చయార్థకమును విధించియుండిన సమంజసముగా నుండెడిది. హవ్యవహుఁడుం బోలెన్ - అనుచోట సైతము 'హవ్యవహుఁడు + ఉను + పోలెన్' అని సముచ్చయార్థకమే యున్నట్లు సమర్థించుకొనుట సముచితముగా నుండును; ఏకరీతియును గన్పడును. వీనిని సమాసములుగా పేర్కొనుట కూడ సమంజసముగా లేదు. సమాసమునందు కావలసిన విభక్తిలోపాదు లిచ్చట వచ్చుటలేదు. పైగా ద్రుతమునకు సమాసమున స్వత్వరూపముకూడ కలుగుచున్నది. పోలె బలె - మున్నగునవి ఏసి, అవ మున్నగువానివంటి యపదములు. కావున అవి పరమందున్నప్పుడు పూర్వరూపమెట్లుండునో చెప్పుకొనుట యవసరమే యగును. అంతమాత్రముచేత వానితోడి రూపములను సమాసములుగా నంగీకరింపవలసిన యవసరము లేదు. ]

## 65. కొన్నియెడల నుపమానంబులు పెక్కులగుచో నివి కడదాని కొక్కటిక చూపట్టెడి. (ప్రౌ - ౪౦)

కమలషండంబు నాగలోకంబు దలిగ్గుబొన్ను కల్పాంతమున జము బానసంబు నింటిలోపలవోలె ॥నిర్వ ౪౫॥ పింద్రును వాంద్రును బలె॥ ప్రభా. ౧౫॥

వ్యాఖ్య - ఉపమానము లనేకముగా నున్నప్పుడు పోలె మున్నగు నుపమావాచకము కడపటి యుపమానమునకు మీద మాత్రమేచేరునని సూత్రార్థము.

కమలషండంబు, నాగలోకము, తలిరుఁజాన్పు, జము జానసంబునిల్లు - అని యిచ్చట ఉపమానములు నాల్గుండగా, చివరి యుపమానముమీద మాత్రమే 'పోలె' అను నుపమా వాచకము చేరినది.

[ ఇచ్చట విభక్తికూడ చివరియుపమానము మీదనే చేరినది. తక్కిన వన్నియు ప్రథమాంతములుగానే యున్నవి. ]

వీంద్రును బలె, వాంద్రునుబలె - అని యనుటకు బదులుగా ఉపమావాచకము చివరి యుపమానముమీద చేరుటవలన వీంద్రును వాంద్రునుబలె - అని యగుచున్నది.

[ సూత్రమునందు 'చూపట్టెడి' అని యనుటకంటె 'కొన్ని యెడల' నని యనుట సమంజసముగా నుండెడిది. ఉపమావాచకము తక్కినయుపమానములపైని సైతము ప్రయుక్తము కావచ్చును. వాంద్రనుబలె వీంద్రనుబలె - అను విధముగా నుండవచ్చును. ]

66. పోలె ప్రభృతులు తఱచుగఁ బ్రథమాదివిభక్త్యంతనామంబులకంటెను, తాదర్థ్యార్థక్రియలకంటెను పరంబులయి యుత్ప్రేక్షాద్యోతకంబు లగు. (ప్రౌ - ౪౧)

గచ్చు చమరిన దారుచక్రంపు బిళ్ళపోలె ॥స్వా. ౫౮॥ (ప్రకారాంతరము బిళ్ళయోయన. ఇట్లంతట నెఱుంగునది.) శోకతప్తంబయిన తనహృదయంబు తడుపుచున్నదియుంబోలె ॥భార. అర. ౨౮॥ ధవుఁ గూర్మిఁ గొసరుచున్నదిపోలె॥ స్వా. ౫౮। దినదినమునకుఁ గృశించెను। గను కనియును ద్రపయు నిరవకాశతఁ బోలెన్॥ కళా. ౭౮॥ తనుఁ బాసి శశి దవ్వు చనిన నెవ్వగఁబోలెఁ దొలిదిక్కు జవరాలు

వెలుఁగఁబాఱె ॥ స్వా. ౫౮ ॥ గార యిచ్చుటకును బోలె॥ స్వా. ౬౭॥ కలయ జగమునఁ గలయట్టి వలువుఱెల్లఁ। దెలువులుగఁ జేసి నీడలు తెలుపు సేయఁగా వశము గామిఁ బొడము దుఃఖమునఁబోలె। సాంద్ర చంద్రిక తుహినబాష్పములు గురిసె॥ స్వా. ౭౮॥ వయటకొంగది మాన్పఁగఁబోలెఁ గాళ్ళపైఁ బ్రబ్బికొనన్॥ కళా. ౧౮॥ సాహసపుటగ్గలికంబలె॥ చంద్ర॥ ఇట్లితరంబు లెఱుంగునది.

వ్యాఖ్య - ప్రథమాదివిభక్త్యంతములతో నంతమగు నామముల మీదను, తాదర్థ్యమును బోధించు క్రియలమీదను చేరి పోలె మున్నగునవి యుత్ప్రేక్షను స్ఫురింపజేయు నని సూత్రార్థము. ఉత్ప్రేక్ష యనగా ఊహ యని యర్థము. తాదర్థ్యమని యనగా తదర్థకత్వము; 'దానికొఱకు' అను నర్థమును బోధించునది తాదర్థ్యార్థక క్రియ. 'ఇచ్చుటకొఱకు' అను నర్థముగలది యగుటచే 'ఇచ్చుటకు' అన్నది తాదర్థ్యార్థకము.

దారుచక్రంపు బిళ్ళవోలె - అని యనగా దారుచక్రంపు బిళ్ళయో యన్నట్లు అని యర్థము. ఇచ్చట 'పోలె' అనునది ప్రథమాంతమగు 'బిళ్ళ' పైని చేరినది. గసడదవాదేశము కలుగగా, పై రూప మేర్పడినది.

'తడుపుచున్నది' అను ప్రథమాంతముపై 'పోలె' చేరినది. నడుమ 'ఉను' అని చేరగా 'తడుపుచున్నదియుఁబోలె' అని యయ్యెను. తడుపుచున్నదో యన్నట్లు అని యర్థము. కొసరుచున్నదివోలె - అనురూపముకూడ ఇట్టిదే. (ఇచ్చట ప్రథమాంతముమీదనే 'పోలె' చేరినది. నడుమ ద్రుతము చేరలేదు.)

నిరవకాశతఁబోలె, నెవ్వగఁబోలె - అనుచోట్ల ఇవార్థకము ద్వితీయాంతముపై చేరినది. ఇక్కడి తృతీయాస్థానమున, ద్వితీయ వచ్చెను. ఇచ్చుటకునుబోలె - అనుచోట షష్ఠ్యంతముపై ఇవార్థకము చేరెను. ఇక్కడిది చతుర్థీవిభక్తికి బదులుగా వచ్చిన షష్ఠి. ఇచ్చుటకో యన్నట్లు అని యర్థము. దుఃఖమునఁబోలె - సప్తమ్యంతముపై 'పోలె' వచ్చినది. ఇక్కడిది తృతీయకు బదులుగా వచ్చిన సప్తమి. దుఃఖముచేతనో యన్నట్లు అని యర్థము.

మాన్పఁగఁబోలె - ఇచ్చటి పూర్వరూపము తాదర్థ్యకము. (బాలవ్యాకరణము దీనిని తుమున్నర్థకము అని సంకేతించెను). దానిపై 'పోలె' అనునదివచ్చి మాన్పుటకో అకో యన్నట్లు అన్నయూహను తెల్పుచున్నది.

సాహసపుటగ్గలికన్ + బలె - ఇచ్చట పూర్వరూపము ద్వితీయాంతము. ఇచ్చటి ద్వితీయ తృతీయాస్థానమున వచ్చినది. సాహసపుటగ్గలికంబలె - అని యనగా సాహసపుటగ్గలికచేతనో యన్నట్లు అని యర్థము.

పైయన్ని ప్రయోగములందును సాదృశ్యమును బోధింపవలసిన పోలె బలె ననునవి యుత్ప్రేక్షను బోధించుచున్నవి.

**67. మఱియవి కొన్నియెడల నామంబుల ప్రథమాది విభక్తులు కొన్నింటికిఁ బరంబులై తథార్థంబు లయ్యెడి.**

**(ప్రౌ - ౪౨)**

ఇపుడువోలె॥ క. ౭౫॥ మున్నువోలె॥ క. ౨౫॥ ఎప్పుడు బలె॥ క. ౭౫॥ మథనసమయ ఘూర్ణమానాబ్ధిఁ బోలెఁ బెన్నోత్స

అడర॥ కళా ౧౫॥ శరధి తఁగఁగలమీదనుంబోలె॥ స్వా. ౩౯॥ ఇత్యాదు లూహ్యంబులు.

వ్యాఖ్య - అవి అని యనగా పోలెమున్నగునవి యని యర్థము. ప్రథమాది విభక్త్యంతములయిన కొన్ని నామములపైని 'పోలె' మున్నగునవి చేరి 'తథా' అను అవ్యయముయొక్క అర్థమును బోధించునని సూత్రార్థము.

తథా అనునది ప్రకారార్థకము. ఇప్డువోలె అని యనగా ఇప్పటిప్రకారముగా అని యర్థము. మున్నువోలె అని యనగా మునుపటి ప్రకారముగా నని యర్థము. ఎప్పుడు బలె అవి యనగా ఎప్పటి ప్రకారముగా నని యర్థము. పై యన్ని చోట్ల ప్రథమాంతములపై పోలె, బలె - అన్నవి చేరినవి.

అబ్ధిఁబోలె - అనియనగా అబ్ధిప్రకారముగా నని యర్థము. ఇచ్చట ద్వితీయాంతముపై 'పోలె' అన్నది చేరినది.

**68. అట్టి పోని బోఁటి వంటి శబ్దంబులు వదర్థకంబులు. బోఁటి తనంతఁ బ్రత్యయార్థంబు నగు. అట్టి ప్రభృతులు పరంబులగుచో నట్లుప్రభృతి పరకనామాదులకుం బలెఁ బూర్వపదంబులకు విభక్తులు త్రివిధంబులం బరఁగుఁ, అందు బోఁటివంటులు సమానంబులు. అవి పరంబులగుచో నాత్మార్థమునకు నామ తచ్ఛబ్దములకుం బోలెఁ గార్యంబు. పోని పరంబగుచో ఁడువర్ణకంబుమీఁద ద్రుతంబు నిత్యంబు. (ప్రౌ - ౪౩)**

రామునియట్టి - వానియట్టి - నాయట్టి - నీయట్టి - తనయట్టి॥ నీయట్టి పుణ్యాత్మకుల్ గలరె ॥భాగ. ౧౦ స్కం. పూ॥ రెండవ మన్మ థుండునుం బోనివాని ॥భార. అర. ౨ ఆ॥ సురకన్యవోని - సుర కన్యయుఁబోని ॥ అవనినాథుఁడు గనియెను సురకన్యవోని కన్నియ ॥ భార. ఆది. ౪ ఆ ॥ దేవివోని - దేవియుఁబోని ॥ వరుణేంద్రుదేవియుఁ బోనిదాని దేవయానిఁ గనియె ॥ భార. ఆది. ౩ ఆ ॥ నికుంజంబుఁబోని - నికుంజంబునుబోని ॥ కనకశైల నికుంజంబునుబోని ॥ భార. ఆది. ౬ ఆ ॥ పిడుగులువోని - పిడుగులుంబోని ॥ ఘోరవుం బిడుగులువోని తూపులు ॥ కళా. ౮ ఆ ॥ నన్నుఁబోని - నిన్నుఁబోని - తన్నుఁబోని. మొ॥ రామునిబోఁటి - వానిబోఁటి - తనబోఁటి - నాబోఁటి - నన్ను బోఁటి - నీబోఁటి - నిన్నుబోఁటి మొ॥ వీరెల్లబోఁటి బాలుఁడుగాఁడు ॥ హరి. పూ. ౫ ఆ ॥ ఇట్టి నాబోఁటి భీతుని నీకుఁదోడనఁ బోలునే ॥ రామా. అర. ౨ ఆ॥ నినుబోంట్లను నమ్మక యేనును బ్రతికెద ॥ భార. శాంతి. ౩ ఆ ॥ ఇట్లు మాబోంట్లు - మముబోంట్లు - మీ బోంట్లు - మిముబోంట్లు. మొ॥ బోటుఁదనాలు చన్నె మిముబోం ట్లకుఁ దక్కినవారికిం బలెన్ ॥ కళా. ౭ ఆ ॥ రామునివంటి - వాని వంటి - తనవంటి - నావంటి - ననువంటి - నీవంటి - నినువంటి. మొ॥ దేవా! దేవరవంటి నీదు కరుణాదృష్టిన్ ॥ వి. పు. ౭ ఆ ॥ శార్చిచ్చువంటి శాపంబు ॥ భార. ఆది. ౨ ఆ ॥ పెనునిట్ట టాటివంటి గుదియ ॥ భై. ౨ ఆ ॥ నీవంటి ఘనుఁడు ॥ వి. పు. ౨ ఆ ॥ నిను వంటి నీతిపరులున్ ॥ శాం. ౩ ఆ ॥ నిన్నువంటి పుణ్యనిరతుండు ॥ వి. పు. ౪ ఆ ॥ ఇట్లు మావంటి - మమువంటి - మీవంటి - మిము వంటి ॥ యిత్యాదులు గ్రాహ్యంబులు. వావుఁడు ముని యిట్లను వాత్సా వినుమావంటి తైర్థికావలి కెల్లన్ । మీవంటి గృహస్థుల సుఖ

। జీవనమునఁ గాదె తీర్థసేవయుఁ దలఁపన్ ॥ స్వా. ౧ ఆ ॥ నాకు మిమ్మువంటి లోకోత్తరుల కియ్యఁ గలిగె నింతకంటె ఘనత గలదె ॥ వి. పు. ౭ ఆ ॥ ఇతరంబులు ప్రయోగంబుల నెఱుంగునది.

వ్యాఖ్య - వదర్థకములు అనియనగా సాదృశ్యబోధకము లని యర్థము. అట్టి, పోని, బోఁటి, వంటి - అను శబ్దములు నాలుగును వదర్థకములు. ఇవి పరము లగునప్పుడు పూర్వము చెప్పిన అట్లు, పోలె మున్నగునవి పరములైనప్పటివలెనే నామా దులు మూడు విధములగానుండి విభక్తులను బొందును. బోఁటి, వంటి - అనునవి ప్రక్రియనుబట్టి సమానములు. కావున, అవి పరములగునపుడు నామతచ్ఛబ్దములకు వలెనే ఆత్మార్థమునకును కార్యమగును. పోని పరమగునప్పుడు డువర్ణకముమీద ద్రుతము నిత్యముగా నగును - అని సూత్రార్థము.

1. రామునిబట్టి - అనుచోట 'అట్టి' యను వదర్థకము పరముకాగా ఉపమానవాచకము షష్ఠ్యంతమై యున్నది.

[ అట్లు అనునది పరమగునపుడు నామము షష్ఠ్యంతముగా నుండును. అట్లే 'అట్టి' యనునది వచ్చునప్పుడును గార్యమగును. ]

వానియట్టి, నాయట్టి - మున్నగుచోట్ల తదర్థకమునకు, అస్మదాద్యర్థకములకు కూడ 'అట్టి' యనునది పరమగునప్పుడు షష్ఠీ విభక్తియే కలుగుచున్నది.

[ అట్లు అనునది పరమగునప్పుడు నైతము తదాద్యర్థకము లిట్లే షష్ఠ్యంతములై యుండును. ]

2. 'పోని' యన్నది పరమగునప్పుడు నామ తదర్థక ములు ప్రథమాంతములై యుండును ;. కొన్నియెడల ద్రుతము

కూడ కలుగవచ్చును. మన్మథుఁడునుంబోని, దేవివోని-మున్నగు నవి యుదాహరణములు. అస్మదాద్యర్థకములు ద్వితీయాంత ములై 'పోని' శబ్దమును గ్రహించును. నన్నుఁబోని, తన్నుఁ బోని - మున్నగునవి యుదాహరణములు.

[ పోలె, బలె - అన్నవి పరమైనపుడు నామ తదర్థకములకు ప్రథమయు, అస్మదాద్యర్థకములకు ద్వితీయయు నయ్యెను. 'పోని' అను వదర్థకము ప్రక్రియయందు వానితో సామ్యమును గలిగియున్నది. ]

3. 'బోఁటి' యన్నది పరమగునప్పుడు నామ తదర్థకములును, ఆత్మార్థకమును షష్ఠ్యంతములై యుండును. రాముని బోఁటి, వానిబోఁటి, తనబోఁటి - యన్నవి వరుసగా నుదాహరణములు. అస్మదర్థక యుష్మదర్థకములకు షష్ఠికాని, ద్వితీయ కాని - రెండింట నేదయిన రావచ్చును. నాబోఁటి, నన్నుబోఁటి, నీబోఁటి, నిన్నుబోఁటి - అన్నవి వరుసగా నుదాహరణములు.

[ 'వలె' అను ఇవార్థకము నామతదర్థకములకు పరమైనపుడు షష్ఠిని గలిగించును. అస్మద్యుష్మ దర్థకములకు షష్ఠినిగాని ద్వితీయనుగాని కలుగజేయును. ఇంతవరకు 'వలె' శబ్దము పరమగునప్పుడు జరిగినట్లే 'బోఁటి' శబ్దము పరమగునప్పుడు కూడ జరుగుచున్నది. ఆత్మార్థకము విషయమున మాత్రము భేదము కలదు. 'వలె' పరమైనప్పుడు ఆత్మార్థకము అస్మదాదులలో చేరి షష్ఠినికాని, ద్వితీయనుగాని పొందవచ్చును. తన వలె, తన్నువలె - అన్నవి యుదాహరణములు. 'బోఁటి' శబ్దము పరమైనప్పుడు ఆత్మార్థకము నామాదులలో చేరి షష్ఠిని మాత్రమే పొందుచున్నది. తనబోఁటి, తమబోఁటి మున్నగునవి యుదాహరణములు.']

4. 'వంటి' యను వదర్థకముకూడ బోఁటివలెనే వ్యవహరించును. అనగా, నామతదర్థకములకు అస్మదర్థకములకు షష్ఠీ విభక్తిని గలిగించి చేరును. రామునివంటి, వానివంటి, తనవంటి

- అన్నవి వరుసగా నుదాహరణములు. అస్మద్యుష్మ దర్థకములకు షష్ఠీ విభక్తినిగాని, ద్వితీయా విభక్తినిగాని కలిగించును. నావంటి, నినువంటి; నీవంటి, నినువంటి - అన్నవి యుదాహరణములు.

'పోని' యన్నది పరమైనప్పుడు 'డు' వర్ణకముమీద 'ను' వర్ణకము నిత్యముగా నగును. పూర్వసూత్రము (ప్రౌ - 39) చేత ద్రుతము విభాషగానే కలుగుచున్నది. అందువలన నిచ్చట సూత్రకర్తయే నిత్యముగా విధించుచున్నాడు. మన్మథుఁడునుంబోని - అనునది యుదాహరణము. దేవిపోని మున్నగుచోట్ల పూర్వశబ్దము డు వర్ణకాంతము కానందువలన ద్రుతము వైకల్పికముగా నగును.

[ ప్రౌఢ వ్యాకరణకారుడు 'అట్లు పోలె బలె' మున్నగు విధముగా మొదలుపెట్టిన 38 వ సూత్రమునుండి యింతవరకు నున్నవానిని 'లుగ లుక్సమాసములు' అను శీర్షకక్రింద తెలిపెను. లుక్సమాసము లయ్యెను అలుక్సమాసములైనవన్న యర్థము వెంటనే స్ఫురింపవచ్చును. కాని తాను చూపిన వానిలో లుక్సమాసములు కొన్ని. అలుక్సమాసములు కొన్ని యున్నవన్న దృష్టితో ద్వంద్వ సమాసముగనే పై శీర్షకను వ్యాకర్త వాడుకొనెను. నిజమునకు పై వానిని సమాసములుగా పరిగణింపవలసిన యక్కఱయే లేదన్న విషయమును పైని చూచితిమి. కావున, ఈ శీర్షకయు, విభాగమును గూడ నిరర్థకములే యనవలయును. ]

పైని చూపిన అట్లు ప్రభృతులును, అట్టి ప్రభృతులును విభక్తులను తమంత తాముగా అంగీకరింపవు. అనగా రామునట్లు మున్నగు విధముగా అట్లు ప్రభృతులు పరములై వ్యస్తములు గానే యుండిపోవును. పైని వచ్చినయెడలఁ అవధారణార్థకము గాని, కాన్ ప్రభృతి రూపముకాని రావచ్చును. వానియట్ల,

వచ్చినయట్లుగాన్ - మున్నగునవి యుదాహరణములు. అంతే కాని నామవిభక్తులు చేరు నవకాశము లేదు. అట్టి ప్రభృతులు పైనొక విశేష్యమునుగాని, తదాది శబ్దములనుగాని యంగీకరించును. నీయట్టి వీరుఁడు, నావంటి వాఁడు - మున్నగువాని నుదాహరణములుగా గ్రహింపవచ్చును. అట్టి, వంటి, బోఁటి మున్నగునవి అట్లు, వలె, పోలె మున్నగువానికి ఔపవిభక్తిక రూపములే యని చెప్పుట సమంజసము. తరువాతి విశేష్యముతో సమసించునపుడు ఔపవిభక్తికరూపము నొంది అట్టి, వంటి, బోటి అని యగును.

[ ప్రౌఢ వ్యాకరణము 'బోటి' శబ్దమునందు అర్ధానుస్వారమును నిల్పుట సమంజసము కాదు. శబ్దరత్నాకరమునందు నట్లే యున్నది. నిరనుస్వారమయిన 'బోటి' శబ్దమునకు 'వంటి' అని యర్థము. సానుస్వారమునకు 'స్త్రీ' యని యర్థము. శబ్దరత్నాకర మీరెండింటిని విపర్యయముగా చూపినది. 'పోలె' యనునది సారళ్యము పొంది 'బోలె' అనియై టింటులను బొంది 'బోటి' అని ఏకవచనమున, 'బోంట్లు, బోటులు' అని బహువచనమున నుండును. ]

. 'బోఁటి' శబ్దము మాత్రము తక్కిన పదర్థములకంటె భిన్నమై నామ విభక్తులను గూడ గ్రహించుచున్నది. ఇది విశేషము. నినుబోంట్లను, మముబోంట్లను - మున్నగునవి యుదాహరణములు.

**69. కర్మాదులకుఁ బ్రాధాన్యవివక్షయందు ధాతుజవిశేషణంబులు కర్తతోడంబోలె వానితోడ సమసించు. (బా-౨౬)**

రాముఁడు రక్షించిన భృత్యుఁడు - రాముఁడు వాలి నేసిన బాణము - రాముఁడు గోవు నిచ్చిన విప్రుఁడు - రాముఁడు వెడలిన

వనంబు - రాముఁడు వసించిన పర్ణ గృహము - రాముఁడు వసించిన చోటు.

వ్యాఖ్య - ధాతుజ విశేషణములు కర్తతోడ సమసించినట్లే ప్రాధాన్యము నిచ్చి చెప్పదలచినప్పుడు కర్మ మున్నగువానితోడను సమసించు నని సూత్రార్థము.

రాముఁడు భృత్యుని రక్షించెను. ఇచ్చట రక్షింప బడినవాఁడు భృత్యుఁడు; 'భృత్యుని' కర్మ; రక్షించినవాఁడు రాముఁడు రాముఁడు కర్త. రక్షించినవాఁడు రాముఁడగుటవలన 'రక్షించిన రాముఁడు' అని కర్మధారయ సమాసము చేయనగును. ఇక్కడ ప్రాధాన్యము కర్తయగు రామునకు. కర్మకు ప్రాధాన్యము కలిగించునపుడు 'రాముఁడు రక్షించిన భృత్యుఁడు' అని సమాసమగును. ఇచ్చట 'రక్షించిన' యను క్రియాజన్య విశేషణమేమియు మార్పు నొందలేదు.

రాముఁడు వాలి నేసిన బాణము. సమాస రూపమున గాక, వాక్యరూపమున నున్నచో 'రాముఁడు బాణముతో వాలి నేసెను' అని యగును. ఇందు కర్త రాముఁడు; కర్మ వాలి, బాణము సాధనము. కరణార్థమునందు 'తోడ' వర్ణకమగును గావున 'బాణముతో' అని యైనది. సూరి 'కర్మాదులకు' అని సూత్రమున ఆదిశబ్దమును జేర్చుటచేత ఇట్టి యెడలకూడ ధాతుజవిశేషణము కర్తతోవలెనే సమసింపును. బాణము నేసినవాఁడు రాముఁడు. కాని ప్రాధాన్యవివక్షచేత కరణార్థమునకు ముందు ధాతుజవిశేషణము చేరి 'రాముఁడు వాలి నేసిన బాణము' అని యగుచున్నది.

రాముఁడు గోవు నిచ్చిన విప్రుఁడు. ఈ సమాసమున సంప్రదానార్థమునందలి 'విప్రుఁడు' అను శబ్దమునకు ముందు 'ఇచ్చిన' అను ధాతుజ విశేషణము చేరినది. వాక్యరూపమున "రాముఁడు విప్రునికి (విప్రునికొఱకు) గోవు నిచ్చెను" అని సంప్రదానార్థమున చతుర్థి కాని, షష్ఠి కాని యగును. 'గోవు' అనునదియే కర్మ. సూత్రమునందలి 'అది' శబ్దముచేత దీనితో ధాతుజవిశేషణము కర్తతో వలెనే సమసించును.

వనమునకు వెడలెను, పర్ణగృహమునందు వసించెను, చోట వసించెను - మున్నగుచోటులందలి షష్ఠీసప్తమ్యంతములయిన శబ్దములకు ప్రథమ యగును. వానికి వెడలిన, వసించిన - అను ధాతుజవిశేషణములు ముందు చేరి, వానితో సమసించును. వెడలినవాఁడు రాముఁ డగుటవలన 'వెడలిన రాముఁడు' అను సమాసము అర్థమునుబట్టికూడ సరిపోవును. వాని కర్మాదులకు ప్రాధాన్యమును చెప్పినప్పుడు కర్తతో సమసింపదగు ధాతుజ విశేషణము మార్పునొందక, వానిముందు చేరుచుండుట విశేషము. ఇది కర్మధారయసమాస విషయము.

# తద్ధిత పరిచ్ఛేదము

**1. తద్ధిత ప్రత్యయములు పరంబులగునపుడు పదంబుల డువర్ణకాదులకు లోపంబగు. (ప్రౌ - ౧)**

వ్యాఖ్య - విభక్త్యంతములగు పదములమీద భావార్థము, మతుబర్థము మున్నగువానియందు చేరెడు వానిని తద్ధితప్రత్యయము లని యందురు. తద్ధిత ప్రత్యయములు పరములగునప్పుడు పూర్వమున్న పదములయొక్క విభక్తి ప్రత్యయములకు లోపము కలుగునని సూత్రార్థము. ఉదాహరణములు తరువాతి సూత్రము కడ చూడదగును.

[ బాలవ్యాకరణము తద్ధిత ప్రత్యయములను విధించునప్పు డిట్టి లోపమును చెప్పలేదనియు, అట్లు చెప్పకుండుట ప్రక్రియకు బాధకమగు ననియు నెంచి ప్రౌఢవ్యాకరణకారు డీ సూత్రమును ప్రారంభించెను. చిన్నయ సూరి సమాస పరిచ్ఛేదమునందు "సమాన విభక్తికి లోపంబగు; లట్టునకుఁ గాదు" అని సూత్రించెను. సమాసవృత్తియందగు కార్యములు తద్ధితవృత్తి యందు కూడ నగును. అందులకు నిదర్శనముగా సూరి 'తనము' తోడి రూపములను సంధిపరిచ్ఛేదమందు (బా - ౩౮) చూపి యున్నాడు. 'సరసపుఁ దనము' మున్నగుచోట్ల కర్మధారయములందు మువర్ణమునకు పుంప్వా దేశము కలిగినట్లే తద్ధిత ప్రత్యయము పరమైనప్పుడును పుంప్వాదేశము కలిగినది. దీనినిబట్టి సమాసవృత్తియందగు కార్యములకు తద్ధితవృత్తి యందును ప్రవృత్తి కలదని తేలుచున్నది. కావున, ప్రౌఢ వ్యాకరణకారుని ప్రస్తుత సూత్రము నిరర్థకము. ]

**2. తన వర్ణకంబు త్వార్థంబునం దగు. (బా - ౧)**

త్వార్థం బనఁగా భావంబు. ప్రకృతి జన్య బోధంబునందుఁ బ్రకారంబు భావంబు ॥ రాముని తనము - రాము తనము - మను

మని తనము - సీత తనము - గొప్పతనము - కొఱతనము - నల్లఁదనము - పుల్లఁదనము.

వ్యాఖ్య - 'త్వ' యను ప్రత్యయము సంస్కృతమున నేయర్థమున కలుగునో ఆయర్థమున తెనుగునందు 'తన' అను ప్రత్యయము కలుగునని సూత్రార్థము.

త్వార్థము అని యనగా భావము అని యర్థము. అనగా భావమును దెలుపవలసి వచ్చినప్పుడు తన వర్ణకము కలుగునని తాత్పర్యము. సంస్కృతమున రామత్వమ్, పౌత్రత్వమ్ - అను విధముగా నన్నపుడు 'రామ' మున్నగు ప్రాతిపదికలవలన పుట్టిన అర్థబోధయందలి విశేషము భావమగును. 'రామత్వమ్' అని యనగా రామునియొక్క విశిష్ట ప్రకారము అని యర్థము. తెలుగున 'రామునియొక్క + తనము' మున్నగుచోట్ల 'తనము' అన్నదికూడ అట్లే విశిష్ట ప్రకారమును దెల్పును. కావుననే చిన్నయసూరి "ప్రకృతిజన్య బోధంబునందుఁ బ్రకారంబు భావంబు" అని నిర్వచించెను.

'రాముఁడు' అనగా 'రామత్వ విశిష్టుడయిన వ్యక్తి' యని యర్థము. 'పౌత్రుఁడు' అనగా 'పౌత్రత్వ విశిష్టుడయిన వ్యక్తి' యని యర్థము.

రామునియొక్క + తనము అని యున్నప్పుడు "సమాస విభక్తికి లోపంబగు" అను విధిచేత 'యొక్కకు' లోపమురాగా 'రాముని తనము' అని యేర్పడును. నిగాగమము పాక్షికమగుటచే 'రాముయొక్క + తనము' అని యున్నప్పుడు 'రాము తనము' అని యగును.

మనుమని యొక్క + తనము అని యున్నప్పుడు యొక్కకు లోపము కలిగి 'మనుమని తనము' అని యగును. నిగాగమము అనుదంతమయిన తెనుగు డుమంతమునకు నిత్యముగా నగును. కావున నిది యొక్కచే రూపము.

నల్లఁదనము అని యన్నప్పుడు అదంతగుణవాచకమునకు తనము పరమందుండుటచేత నుగాగమను (బా. సంధి - 46) కలుగును. ఇట్టిదే పుల్లఁదనము అను యుదాహరణము.

గొప్పతనము అని యన్నప్పుడు 'గొప్ప' యను విశేషణముపై 'తనము' చేరినది. కొంచెం + తనము అని యున్నప్పుడు పూర్వశబ్దము యొక్క తుది వర్ణమునకు (సానుస్వారమునకు) లోపను కలుగును. అప్పుడు కొంచ + తనము = కొంచతనము అని యగును.

3. తన వర్ణకంబు పరంబగునపుడు తచ్ఛబ్దార్థకమునకు లోపంబు విభాష నగు. (ప్రౌ - ౨)

ఆఁకొన్నతనము - ఓర్వలేనితనము. మొ॥ పక్షమున ఆఁకొన్నవానితనము - ఓర్వలేని వానితనము - ఓర్వలేని దానితనము॥ పెల్లాఁకొన్నతనాన॥ భీమ. ౨౫॥

వ్యాఖ్య - భావార్థమునందు వచ్చు 'తనము' అను ప్రత్యయము పరమగునప్పుడు తత్పూర్వమున్న తచ్ఛబ్దమునకు విభాషగా లోపము కలుగునని సూత్రార్థము.

'ఆకొన్న' అన్నది ధాతుజవిశేషణము. దీనికి విభక్తిని నిపడించునపుడు (బాల. సమా - 9) తచ్ఛబ్దము అనుప్రయుక్త

మగును, ఆకొన్నవానియొక్క + తనము - అనియుండి సమాస విభక్తికి లోపమురాగా 'ఆకొన్నవానితనము' అని యగును. ప్రస్తుతసూత్రముచేత విభాషగా తచ్ఛబ్దమునకు లోపము రాగా 'ఆకొన్నతనము' అనియు నుండవచ్చును. ఓర్వలేని వానియొక్క + తనము అన్నవి ఓర్వలేనివానితనము, ఓర్వలేని తనము - అనియు కావచ్చును. తచ్ఛబ్దము అనియనుటచేత ఓర్వ లేని దానితనము అన్నది 'ఓర్వలేనితనము' అని కావచ్చును.

పెల్లాకొన్నతనాన - అనుచోట 'వాని' అను షష్ఠ్యంత తచ్ఛబ్దమునకు లోపము కలిగినది.

[ ధాతుజవిశేషణములపై విశేష్యములుచేరుట వలన నేర్పడినట్లే 'తనము' అన్నది చేరినప్పుడును కర్మధారయసమాస మేర్పడవచ్చును. కావున ధాతుజవిశేషణమునకు తచ్ఛబ్దమును జేర్చుటయు, దానినిలోపింప జేయుటయు ప్రక్రియాభారమునకు పాల్పడుటయే. 'తనము' అనగా ప్రకారము. ఆకొన్నప్రకారము, ఆకొన్నలక్షణము-అని యన్నట్లుగా ననుకొన్నను ఇచ్చట ఇబ్బంది కలుగదు. నిడుపుదనము, మేలుతనము-మొదలయిన వాని యెడలనైతము నిడుపైన దానితనము, మేలయిన వానితనము-మొదలయిన విధముగా చెప్పుకొనవలసి వచ్చునేని మఱింత యసంగతముగా కనిపించును. కావున నున్నవాని నున్నట్లుగానే గ్రహించుట యుక్తముగా నుండును. ఈసూత్ర మవసరము కాదు. ]

**4. ఇట విశేషం బుత్సర్గంబునకు విభాషను బాధకంబగు. (బా - ౨)**

స్పష్టము.

వ్యాఖ్య - ఈతద్ధితపరిచ్ఛేదమునందు విశేషముగా విధింప బడు ప్రత్యయములు• సామాన్యప్రత్యయమైన 'తనము'నకు

విభాషగా బాధకము లగునని సూత్రార్థము. భావమునందు పై సూత్రమునందు 'తనము' విధింపబడినది. ఇది సామాన్యము. ఇక ముందు రాబోవు(8వ సూత్రమువరకు) సూత్రములందు విశేష ప్రత్యయములు విధింపబడును. అవి వచ్చుచో 'తనము' అను ప్రత్యయము రాదు. అవి రానియెడల 'తనము' అనునదియే వచ్చును.

**5. చిన్నాదులకు ఱికవర్ణకం బగు. (బా - 8)**

చిన్నఱికము - కన్నెఱికము॥ చిన్న - కన్నె - చుట్టము - దొంగ - పేద - మిండ - లంజె ॥ ఇత్యాదులు చిన్నాదులు.

వ్యాఖ్య - భావమునందు చిన్నాదులకు 'ఱికము' అను ప్రత్యయము కలుగునని సూత్రార్థము.

చిన్న + తనము = చిన్నతనము. ప్రస్తుతసూత్రముచేత 'ఱికము' కలుగగా 'చిన్నఱికము' అని యగును. అట్లే కన్నె యొక్క భావము అనునర్థమున 'కన్నెతనము' అనియు 'కన్నెఱికము' అనియు రూపములగును.

చిన్నాదులలో ముువర్ణకాంత మగు 'చుట్టము' అన్నది చేరి యున్నది. దీనికి 'ఱికము' అన్నది చేరగా 'ము' వర్ణకము నకారలోపము కలిగి 'చుట్టఱికము' అని యగును. తనము పర మైనప్పుడు కర్మధారయ సామ్యమున ముువర్ణకమునకు పుంప్వాదేశము కలిగి, నుగాగమమై 'చుట్టపుఁ దనము' అని యగును. దొంగఱికము, పేదఱికము, మిండఱికము, లంజెఱికము - అను నవి తక్కినవాని రూపములు.

**6. ఉత్వంబున కత్వంబు ఱికము పరంబగునపు డగు.**
(బా - ౪)

తొ త్తఱికము - వెడ్డఱికము - వెజ్జఱికము.

వ్యాఖ్య - 'ఱికము' అను ప్రత్యయము పరమగునప్పుడు పూర్వమున్న ఉత్వమునకు అత్వము ఆదేశముగా నగునని సూత్రార్థము. తొత్తు, వెడ్డు, వెజ్జు - అనునవి శబ్దములు. వానికి ఱికము పరము కాగా ఉత్వమున కత్వము కలిగి తొ త్తఱికము మున్నగు పై రూపము లేర్పడినవి.

**7. పేర్యాదుల కిమి వర్ణకం బగు.** (బా - ౫)

పేరిమి - కడిమి ॥ పేరు - కడు - ముచ్చు - మేలు - చెలి పోఁడి - వాఁడి - వేఁడి ॥ ఇత్యాదులు పేర్యాదులు.

వ్యాఖ్య - పేరు మున్నగు వానికి భావమునందు ఇమి అను ప్రత్యయము కలుగునని సూత్రార్థము. పేరు + ఇమి - పేరిమి; కడు + ఇమి - కడిమి. అపదాది సంధి యగుటచే అన్ని యచ్చుల మీదను సంధి నిత్యముగా జరుగును. ముచ్చిమి, మేలిమి, చెలిమి, పోఁడిమి, వాఁడిమి, వేఁడిమి - అన్నవి తక్కిన వానిరూపములు. ఇత్యాదులు అని యనుటచే ఇట్టి వింకను గల వనితాత్పర్యము.

**8. నవర్ణకంబు గుణవచనంబు లగు నల్లాదుల కగు.** (బా-౬)

నల్లన - తెల్లన ॥ నల్ల - తెల్ల - పచ్చ - ఎఱ్ఱ - చామ - తియ్య - కమ్మ - పుల్ల - చప్ప - విన్న - తిన్న - అల్ల - ఒయ్య - తిమ్మ - చక్క - క్రేఁక ॥ ఇత్యాదులు నల్లాదులు.

వ్యాఖ్య - గుణములను దెల్పు నల్ల మున్నగువానికి భావమునందు 'న' వర్ణకము కలుగునని సూత్రార్థము. నల్ల + న = నల్లన; తెల్ల + న - తెల్లన. నల్లాదులని యనుటచేత అదంతము లయిన విశేషణములనే గ్రహింపవలయును. గుణవచనము లన్నప్పుడు గుణము, వర్ణము, రుచి మున్నగువానిని బోధించునవన్నియు గ్రహింపబడును. పచ్చన, ఎఱ్ఱన, చామన, తియ్యన, కమ్మన, పుల్లన, చప్పన - మున్నగు విధముగా మిగిలిన వాని రూపము లుండును.

'తనము' పరమైన యెడల అదంత గుణవాచకము లగుటచేత (బా. సంధి - 35) వీనికి నుగామమై నల్లఁదనము, తెల్లఁదనము - మున్నగు విధముగా రూపము లేర్పడును.

**9.** ఇక వర్ణకం బగ్గలాదుల కగు. (బా - ౯)

అగ్గలిక - ఒమ్మిక ॥ అగ్గలము - ఒమ్ము.

వ్యాఖ్య - అగ్గలము మొదలగు శబ్దములకు భావమునందు 'ఇక' అను ప్రత్యయము కలుగునని యర్థము. అగ్గలము + ఇక - అని యుండగా మువర్ణమునకు లోపము కలిగి, సంధి కాగా 'అగ్గలిక' అని యగును. 'ఒమ్ము' అనుదానికి 'ఇక' పరమై 'ఒమ్మిక' అని యగును. ఇచ్చటి 'ము' వర్ణము శబ్దగత మగుటచే లోపమును పొందలేదు.

**10.** మగఁటిమ్యాదులు యథాప్రయోగంబుగ గ్రాహ్యంబులు. (బా - ౧౦)

మగఁటిమి - మగతనము - పేదఱిమి - ఒజ్జసము - కోఁటరము - కోడంట్రము-కోడంట్రికము - కోడఱికము - కోమలికము - చెలి

కారము - తెలుపు - ఎఱుపు - పసుపు - నలుపు. అికాదులు రాని పక్షమందుఁ దన ప్రత్యయం బన్నింటి కగు ॥ చిన్నతనము - ముచ్చుఁ దనము - నల్లఁదనము - అగ్గలపుఁ దనము - ఒజ్జతనము,

వ్యాఖ్య - మగఁటిమి మున్నగు తద్ధితరూపములను ప్రయోగముల ననుసరించి తెలిసికొనవలయునని సూత్రార్థము. అనగా ప్రకృతి ప్రత్యయములను విభాగించి చూపుటయు, ప్రక్రి యను చూపుటయు క్లేశకరమన్న యుద్దేశముతో సూత్రకర్త యిట్లు చెప్పుట సమంజసమే.

'మగ' అనుదానికి 'టిమిఙ్' అను ప్రత్యయము రాగా మగఁటిమి అని యగును. మగవానియొక్క + తనము •అని యున్నప్పుడు తచ్ఛబ్దమునకును, విభక్తికిని లోపము కలుగగా 'మగతనము' అని యగును. పేద + అిమి = పేదఅిమి. ఒజ్జ + న + ము = ఒజ్జనము. 'టరము' అను ప్రత్యయము పరముకాగా 'కోడలు' అనుశబ్దమున తొలియచ్చుమీది వర్ణము లకు లోపము కలిగి 'కోటరము' అని యగును. 'కోడలు' శబ్దముయొక్క అంత్యాక్షరమునకు లోపము కలిగినపుడు పూర్ణ బిందుపూర్వకమైన ట్రము, ట్రికము - అను ప్రత్యయములును పరము కావచ్చును; కేవలము 'అికము' అన్నప్రత్యయమైనను పరము కావచ్చును. అప్పుడు కోడంట్రము, కోడంట్రికము, కోడ అికము - అను రూపములు వరుసగా ఏర్పడును, 'కోమలము' అను తత్సమశబ్దముపై 'ఇకము' అన్నది చేరునపుడు మువర్ణ కమునకు లోపము కలిగి 'కోమలికము' అన్న రూప మేర్ప డును. 'చెలి' అను శబ్దమునకు 'కారము' అన్నది భావమ్ము నందు పరమై 'చెలికారము' అని యగును. తెల్ల, ఎఱ్ఱ, నల్ల -

అనువానికి 'పు' వర్ణము పరముకాగా ద్విత్వమునం దొకదానికి లోపమువచ్చి, ఉత్వము కలుగుచున్నది. అప్పుడు తెలుపు, ఎఱుపు, నలుపు - అను రూపము లేర్పడును. 'పచ్చ' యన్నది పై మార్పులను పొందినపిమ్మట 'చ' వర్ణమున కాదేశముగా సవర్ణము నొందును. అప్పుడు 'పసుపు' అని యగును. ఇట్లు వివరించి చెప్పుటవలన క్లేశమే కాని లాభము లేదు. అందువలననే సూరి ప్రయోగములనుబట్టి గ్రహింపవలయునని చెప్పుట జరిగెను.

త్వార్థమునందగు 'ఱికము' మున్నగు ప్రత్యయములు రానియెడల, అన్నింటికిని 'తనము' అను ప్రత్యయము వచ్చును. 'చిన్నఱికము' అన్నది ఱికము ప్రత్యయము రాని యెడల 'చిన్నతనము' అని యగును. 'ముచ్చిమి' అనునది ఇమివర్ణకము రానియెడల 'ముచ్చు + తనము' అని యగును. ఉదంతస్త్రీసమమునకుఁ దనము పరమగునపుడు నుగాగమము కలుగునన్న (బా - సంధి - 45) విధిచేత ముచ్చు + ను + తనము'' అనినై "ముచ్చుఁదనము" అని యగును. 'నల్లన' అన్నది నవర్ణకము రానియెడల 'తన' వర్ణకము నొందును. అదంతగుణవాచక మగుట చేత నుగాగమమై 'నల్లఁదనము' అను రూపమేర్పడును. 'అగ్గలిక' అన్నది ఇక వర్ణకము రాని యెడల 'అగ్గలము + తనము' అనినైయె మువర్ణమునకు బదులుగా పుంపులు రాగా 'అగ్గలంపు + తనము' అనినైయె నుగాగమమునొంది 'అగ్గలంపుఁ దనము' అని యగును. 'ఒజ్జనము' అని యున్నట్లు నవర్ణకము రానియెడల 'తనము' పరమై 'ఒజ్జతనము' అని యగును.

**11.** అరమరాదులకు స్వార్థంబునం దిక వర్ణకం బగు.

(బా - ౯)

అరమరిక - ఆమిక ॥ అరమర - ఆము - అల్లిబిల్లి - గండి - నడవడి - నాడు - నివ్వాళి - పొత్తి - మాన - మెలి - వాలు ॥ ఇత్యాదు లరమరాదులు.

వ్యాఖ్య - అరమర మున్నగువానికి తమకు నియతమైన యర్థమునందు 'ఇక' అను ప్రత్యయము కలుగునని సూత్రార్థము. అనగా ఈ ప్రత్యయము చేరుటచేత అర్థమున నేమియు మార్పు కలుగదు.

అరమర + ఇక = అరమరిక; ఆము + ఇక = ఆమిక. ఇట్లే అల్లిబిల్లిక, గండిక, నడవడిక, నాడిక, నివ్వాళిక, పొత్తిక, మానిక, మెలిక, వాలిక - మున్నగువిధముగా తక్కిన వానికి రూపము లేర్పడును.

**12.** ఉక వర్ణకంబు చిఱుతాదులకు స్వార్థంబునం దగు.

(బా - ౧౦)

చిఱుతుక - నాతుక ॥ చిఱుత - నాతి - నెలఁత - మెలఁత - పడఁతి - మడఁతి - పొలఁతి - వెలఁది - నిప్పు - ఎమ్ము ॥ ఇత్యాదులు చిఱుతాదులు.

వ్యాఖ్య - చిఱుత మున్నగువానికి స్వార్థమునందు 'ఉక' యను ప్రత్యయము చేరునని సూత్రార్థము. చిఱుత + ఉక - సంధి నిత్యమగుటచేత 'చిఱుతుక' అని యగును. ఇట్లే నాతుక, నెలఁతుక, మెలఁతుక, పడఁతుక, మడఁతుక, పొలఁతుక - మున్నగువిధముగా మిగిలినవాని రూపములు నేర్పడును.

**13. కా కత్తియ వర్ణకంబులు పుంస్త్వస్త్రీత్వంబుల మతు బర్థంబునం దాటాదుల కగు. (బా - ౧౧)**

కాప్రత్యయాంతంబునకు మగాదిగణనంబునం జేసి డుజ్జగు. ఆట కాఁడు - ఆటకత్తియ॥ ఆట - అడపము - ఎమ్మె - ఓయారము - కటారి - కొల్లి - చెలిమి - చేరువ - చౌరవ - జట్టి - జాజర - జూదము - తిండి - తేర - దొడ్డ - నీటు - నేస్తము - బేరము - వగ - విలు - వెచ్చము - సొగసు॥ ఇత్యాదు లాటాదులు.

వ్యాఖ్య - ఆట మున్నగువానికి మతుబర్థమునందు పురుష బోధకముగా 'కా' అను ప్రత్యయమును, స్త్రీబోధకముగా 'కత్తియ' యను ప్రత్యయమును వచ్చునని సూత్రార్థము. మతుబర్థము అని యనగా సంస్కృతమునందలి 'మతుప్' ప్రత్యయమునకు ఏయర్థమో ఆయర్థమని యర్థము. కలిగి యుండువాడు, కలిగియుండునది - అను నర్థములందు మతు ప్రత్యయము వచ్చును.

ఆట + కా అని యున్నప్పుడు 'కా' ప్రత్యయాంతములు మగాది గణములోని వగుటచే డుజ్ ప్రత్యయము నొందును. అప్పుడు ఆట + కా + డుజ్ = ఆటకాఁడు అని యగును. ఆటను గలవాడని యర్థము.

'ఆట' యను దానికి స్త్రీత్వమునందు 'కత్తియ' వర్ణకము రాగా 'ఆట కత్తియ' యని యగును. "ఇయకు మాఱుగా నామాంతంబున కెత్వంబు బహుళంబుగా నగు" అను (బా. ఆచ్ఛిక - ౨౩) సూత్రమును బట్టి 'ఆటకత్తె' యనియు కావచ్చును. ఎమ్మె మున్నగునవి యిట్టివి.

అడపము, ఓయారము, జూదము, నేస్తము, వెచ్చము - మున్నగువాని ముపర్ణమునకు వృత్తియందు లోపము కలుగును. అప్పుడు అడపకాఁడు, అడపకత్తె; ఓయారకాఁడు, ఓయారకత్తె మున్నగు రూపములు పర్పడును.

**14.** కాకత్తియల కకారంబునకు గకారంబు కొండొకచోఁ గానంబడియెడి. (బా - ౧౨)

అందగాఁడు - అందగత్తియ - కొండెగాఁడు - కొండెగత్తియ బేరగాఁడు - బేరగత్తియ ॥ ఇత్యాదులు.

వ్యాఖ్య - పూర్వ సూత్రముచేత వచ్చిన కా, కత్తియ యను ప్రత్యయముల యొక్క కకారమునకు కొన్నియెడల గకారము కలుగునని సూత్రార్థము.

అందము+కా అనియుండి ములోపమును డుజ్వర్ణకమును పొంది అంద + కాఁడు అని యగును. ప్రస్తుత సూత్రముచేత క వర్ణకమునకు ఆదేశముగా గవర్ణము రాగా 'అందగాఁడు' అని యగును. స్త్రీత్వమునందు 'అందగత్తియ' యను రూప మిట్లే యేర్పడును.

[ ఇచ్చట ఉదాహరణములుగా చూపబడిన శబ్దములన్నియు ముపర్ణ కాంతములే. కావున సర్వస్వవేటికా కారులు "క్రింది యుదాహరణముల ననుసరించి ముపర్ణక లోపము తద్ధితవృత్తిని దోఁచెడి పదములమీఁది కకారములకే గకారాదేశము చూపట్టునని చెప్పఁదగును" అని వ్రాసిరి. అది యట్లనిపించుట సహజమే కాని సత్యము కాదు. ఒక్కసూత్రమును దాటి చూచినయెడల ఇబ్బందిగాఁడు, ఒంటిగాఁడు - మున్నగురూపములు పై నిర్ణయమునకు ఇబ్బంది కలిగించును. అక్కడ ముపర్ణక ప్రసక్తి యేమియు లేదు. ]

'కొండెము' అన్నది మతుబర్థమునందు పురుషబోధక మైనపుడు 'కొండెగాఁడు' అనియు, స్త్రీబోధకమైనపుడు 'కొండెగత్తియ' అనియు నగును. అట్లే 'బేరము' అన్నది బేరగాఁడు, బేరగత్తియ అని యగును.

**15. కా కత్తియలు కొండొకవానికి స్వార్థంబునం జూపట్టెడు. (బా - ౧౩)**

చెలికాఁడు - చెలికత్తియ - హెగ్గడికాఁడు - హెగ్గడికత్తియ.

వ్యాఖ్య - 'కా' యను ప్రత్యయము పురుషబోధకముగాను, 'కత్తియ' యను ప్రత్యయము స్త్రీబోధకముగాను స్వార్థమునందు కొన్నిపదములపైని చేరునని సూత్రార్థము.

'చెలి' యని యనగా సఖుఁడు, సఖియని యర్థములు. ఆయర్థమునందే 'కా' ప్రత్యయము వచ్చి 'చెలికాఁడు' అనియు, 'కత్తియ' ప్రత్యయము వచ్చి 'చెలికత్తియ' యనియు నగును. 'హెగ్గడి' అని యనగా 'అంతఃపురమును కావలి కాయువాడు' అని యర్థము. స్త్రీబోధకముగా కూడ ఇది యుపయోగింపబడును. దీనిపై 'కాఁడు' అనివచ్చి 'హెగ్గడికాఁడు' అని యగును; స్త్రీబోధయందు 'కత్తియ' వచ్చి 'హెగ్గడికత్తియ' అని యగును.

**16. కా వర్ణకంబు తిర్యక్కులకుం గాఁడంబడియెడి. (బా - ౧౪)**

ఇబ్బందిగాఁడు - ఒంటిగాఁడు - కొమ్ముకాఁడు - పరికాఁడు ఇత్యాదులు మృగవిశేషవాచకంబులు.

వ్యాఖ్య - 'కా' యను ప్రత్యయము మృగవాచకములకు సైతము కలుగుచున్నదని సూత్రార్థము. పూర్వసూత్రముల యందు పురుషబోధకముగా ఉపయుక్తమయిన 'కా' ప్రత్యయము తిర్యక్కులకు నగుచుండుట విశేషము.

ఇబ్బందిగాఁడు - అనునది 'ఇబ్బంది' అను శబ్దముపై కా ప్రత్యయము కలిగి డు వర్ణకము చేరగా నేర్పడినది. ఇచ్చటి క కారమునకు గకారము కూడ గలిగినది. ఒంటిగాఁడు మున్నగు నవి కూడ జంతువులను బోధించును.

**17.** అటమటాదులకు మతుబర్థంబునం దీ వర్ణకంబు పుంస్త్వంబునం దగు. (బా - ౧౫)

ఈ ప్రత్యయాంతంబు మగాదిగణంబు. అటమటీఁడు - కమ్మతీఁడు ॥ అటమటము - కమ్మతము - కన్నడము - కొండెము - జాననము - బూటకము - మందడి - మన్నెము-సుంకము ॥ ఉక్కివంబునకు వలోపంబు నగు - ఉక్కీఁడు ॥ ఇత్యాదులు.

వ్యాఖ్య - అటమటము మున్నగు పదములకు మతుబర్థమున పురుషుని బోధించునపుడు 'ఈ' అను ప్రత్యయము కలుగును. ఈ ప్రత్యయాంతములు మగాది గుణములోనివి. కావున వానికి డుజ్జగ్గున్ను; ఉత్వము కాదు.

అటమటము + ఈ + డుజ్ - అని యుండగా 'ము' వర్ణమునకు వృత్తియందు లోపము కలుగును. తరువాత అపదాది సంధి జరిగి 'అటమటీఁడు' అని యగును. కమ్మతీఁడు,

కొండీఁడు, బానసీఁడు, బూటకీఁడు, మందడీఁడు, మన్నీఁడు, సుంకీఁడు - మున్నగునవి తక్కినవానికి రూపములు.

'ఉక్కివము' అను శబ్దమునకు 'ఈ' ప్రత్యయము పరమగునప్పుడు మువర్ణకముతోపాటు తత్పూర్వమున్న 'వ' కూడ లోపించును. ఉక్కి + ఈ + డు - ఉక్కీఁడు ॥ అని యగును.

**18.** ఈ ప్రత్యయంబు కొన్నింటికి స్వార్థంబునం దగు. (బా - ౧౬)

మొక్కలీఁడు - కల రీఁడు.

వ్యాఖ్య - 'ఈ' యను ప్రత్యయము మతుబర్థమునందే కాక, కొన్నింటికి స్వార్థమునందుకూడ అగునని సూత్రార్థము. 'మొక్కలి' అని యనగా 'వీరుడు' అని యర్థము. ఇదే యర్థమున ఈప్రత్యయమును, డుజ్వర్ణకమును కలుగగా 'మొక్కలీఁడు' అని యేర్పడును. ఇట్లే 'కల్లకలవాడు' అను నర్థముగల 'కల్లరి' అను శబ్దముపై ఈవర్ణకము కలుగగా 'కల్లరీఁడు' అని యేర్పడును. దీనికి అదియే అర్థము.

**19.** అరివర్ణకంబు మతుబర్థంబున జాలాదు కగు. (బా - ౧౭)

జాలరి - ఒఱపరి॥ జాల - ఒఱపు - కల్ల - చదువు - జూదము - టక్కు - తగవు - తీరుపు - తెంపు - తెరువు - నేరుపు - మతకము - వెరవు - వేఁట - సిగ్గు - సుంకము ॥ ఇత్యాద్యుల్లు.

వ్యాఖ్య - కలిగియుండుటను బోధించునప్పుడు జాల మున్నగుశబ్దములకు 'అరి' యను ప్రత్యయము కలుగునని సూత్రార్థము.

జాల + అరి = జాలరి. వల కలవాఁడని యర్థము. ఒఱపు + అరి = ఒఱపరి. అందము గలవాడని యర్థము. కల్లరి, జూదరి, టక్కరి, తగవరి, తీరుపరి, తెంపరి, తెరువరి, నేరుపరి, మతకరి, వెరవరి, వేఁటరి, సిగ్గరి, సుంకరి - మున్నగునవి తక్కినవానికి రూపములు.

[ అరి ప్రత్యయాంతములు స్త్రీపురుషసామాన్య బోధకములు. స్త్రీని విశేషించి చెప్పునప్పుడు 'అది' యనియు, పురుషుని విశేషించి చెప్పునప్పుడు 'వాఁడు' అనియు పైని చేరును. జాలరిది - జాలరివాఁడు ॥ మున్నగునవి యుదాహరణములు. ]

**20.** మతుబర్థంబునం దరివర్ణకము పరంబగునపుడు పూజ సొన్నముల కడయచ్చునకు వైకల్పికముగాను నిత్యముగాను దీర్ఘంబగు. (ప్రౌ - ౩)

పూజారి, పూజరి; సొన్నారి.

వ్యాఖ్య - అరి వర్ణకము మతుబర్థమునందు పరమగునప్పుడు 'పూజ' అను శబ్దము యొక్క తుది యచ్చునకు దీర్ఘము వైకల్పికముగా నగును; సొన్నము అను శబ్దము యొక్క తుది యచ్చునకు దీర్ఘము నిత్యముగా నగును - అని సూత్రార్థము.

'పూజ' అన్నది 'పూజా' యను సంస్కృత శబ్దమునకు తద్భవ రూపము. దీన్కిపైని మతుబర్థమునందు 'అరి వర్ణకము రాగా 'పూజ + అరి = పూజరి' యని యగును. ప్రస్తుత సూత్రమువలన 'పూజారి' యను రూపముకూడ నగును. అట్లే సొన్నము + అరి అనియుండగా, తద్ధితవృత్తి చేత ముపర్ణకము

లోపించి సొన్న + అరి అని యుండును. ప్రస్తుత సూత్రముచేత 'సొన్నారి' అని కావలయును.

[ నిజమునకు పై సూత్రమువలన పూజారి, సొన్నారి రూపములు సిద్ధించుట కవకాశము లేదు. సూత్రమునుబట్టి 'పూజా + అరి' అని యుండును. అపదాదిసంధిరాగా పరస్వరమే పూర్వపరస్వరంబులకు రెండింటికి బదులుగా వచ్చును. అప్పుడు 'పూజరి' అనియే యగును. కావున సూత్రరచన సమర్థముగా లేదు. "పూజసొన్నములకు మతుబర్థంబునం బరంబయిన యరి వర్ణకము తొలియచ్చునకు వైకల్పికముగ నిత్యముగ దీర్ఘంబగు" అను విధముగా నుండిన బాగుండెడిది. ]

## 21. ఇవర్ణకం బోయారాదులకు మతుబర్థంబునం దగు.

(బా - ౧౮)

ఓయారి - అక్కసి॥ ఓయారము - అక్కసము - కడలు - చాగము - బోగము - తమకము - తుటారము - బండారము - బిత్తరము - బిటారము - బేహారము - మచ్చరము - మిటారము - విన్నాణము - వెక్కసము॥ ఇత్యాదులు.

వ్యాఖ్య - ఓయారము మున్నగువానికి కలిగియుండుటను బోధించినప్పుడు 'ఇ' అను ప్రత్యయము కలుగును. ఇదియు స్త్రీ పురుష సామాన్య బోధకము.

ఓయారము + ఇ - అని యున్నప్పుడు తద్ధిత వృత్తియందు ము వర్ణక లోపము; అపదాది సంధియై 'ఓయారి' అని యగును. ఇట్లే అక్కసము కలవాడు 'అక్కసి. కడలి, చాగి, బోగి, తుటారి, బండారి, బిత్తరి, బిటారి, బేహారి, మచ్చరి, మిటారి, విన్నాణి, వెక్కసి - మున్నగునవి తక్కిన వానికి రూపములు.

[ 'కడలు' అని యనగా 'అల' అని యర్థము. కడలు గలది 'కడలి'; సముద్రమని యర్థము. ఇది యిక్కడ అమహదోబోధక మగుచున్నది. ]

**22. తవర్ణకంబు కులవాచకంబునకు స్త్రీ వాచ్యం బగునపుడు మతుబర్థంబునం దగు. (బా - ౧౯)**

కొఅవత - చాకిత ॥ కొఅవ - చాకి - బోయ - వానె - వ్రే - సాలె ॥ ఇత్యాదులు కులవాచకంబులు.

వ్యాఖ్య - స్త్రీని బోధించునపుడు కులమును దెల్పు శబ్దముపై మతుబర్థమునందు 'త' యను ప్రత్యయము కలుగు నని సూత్రార్థము.

'కొఅవ' యనునది యొక కులమునకు పేరు. దానిపైని 'త' వర్ణకము చేరి 'కొఅవత' యని యగుచున్నది. కొఅవ కులమును గల స్త్రీ యని యర్థము. చాకిత, బోయత, వానెత, వ్రేత, సాలెత - మున్నగునవి తక్కినవానికి రూపములు

**23. తవర్ణకంబు పరం బగుచో నొకానొకచో నెత్వంబు చూపట్టెడు. (బా - ౨౦)**

చెంచెత - మాలెత

వ్యాఖ్య - పూర్వ సూత్రముచేత 'త' ప్రత్యయము పర మైన చోట్ల తత్పూర్వమున్న అచ్చునకు ఎత్వము కొన్నిచోట్ల కలుగుచున్నదని సూత్రార్థము.

'చెంచు' అను కుల వాచకమునకు మతుబర్థమున 'త' వర్ణకము పరము కాగా, తుదియచ్చున కెత్వము కలిగి చెంచు +

ఎ + త = చెంచెత అని.యగును. ఇట్టిదే 'మాల' యను కుల వాచకమునకు 'మాలెత' యను రూపము కూడ.

**24. మతుబర్థంబునం జెంచునకుఁ దవర్ణకంబు పరంబగుచో నిత్వంబు నగు. ( ప్రౌ - ४ )**

చెంచిత - చెంచితలం బింఛపత్ర చేలాంచితలన్ ॥ భాగ. ౧౦ స్కం పూ. ॥ ( గ్రామ్యజనుల పాటలయందును జెంచీత యని యికార దీర్ఘంబ వినంబడియెడి. )

వ్యాఖ్య - కులవాచకమైన ' చెంచు ' శబ్దమునకు మతు బర్థమున స్త్రీవాచ్యమగు నపుడు తవర్ణకము కలుగును. అపుడు శబ్దము తుదియచ్చున కిత్వముకూడ నగునని యర్థము.

చెంచు + ఇ + త = చెంచిత. పోతన అయిత్యప్రాసను బాటించు స్వభావము గలవాడు. 'అంచితలన్' అని యన్నప్పుడు దానికి పూర్వమందు 'చెంచితలన్' అని ఇత్వముతోడి రూపము నే వాడియుండును - ఈ భావముతోనే ప్రౌఢవ్యాకరణ కారుడు పై లక్ష్యమును చూపెను. సూత్రమునందు 'ఇత్వంబునగు' అని సముచ్చయమును జేర్చి పలుకుటచేత పూర్వసూత్రముచే సిద్ధించిన 'చెంచెత' యను ఎత్వముతోడి రూపముకూడ నుండుట కవకాశము కలుగుచున్నది. గ్రామ్యజనుల పాటలయందు 'చెంచీత' యని వినబడుచుండును. పాటలలో హ్రస్వము దీర్ఘ మగుటయు, దీర్ఘము హ్రస్వమగుటయుఁ స్వాభావికము. కావున 'చెంచిత' యని యున్నప్పుడే 'చెంచీత' యని యగుటకు వీలు కలుగును. కావున ప్రౌఢవ్యాకరణ కారుడు దీనిని కూడ ప్రమాణముగా చూపుచున్నాడు.

**25. యువతీ విటీ రజస్వలలు గుబ్బెత మిండత ముట్టుతలు నా(బడుదురు.** (బా - ౨౧)

స్పష్టము.

వ్యాఖ్య - యువతిని గుబ్బెతయనియు, విటిని మిండత యనియు, రజస్వలను ముట్టుతయనియు నందురని సూత్రార్థము. ఇచ్చట 'త' వర్ణకము మతుబర్థమునందే స్త్రీబోధకముగానే కలుగుచున్నది. కాని పై 'గుబ్బ' మున్నగునవి కులవాచకములు కావు. కావుననే వానిని వేరువేర నిరూపింపక నిపతించుట జరిగినది.

**26. వగాదులకు బహువచనాంతంబులకు స్త్రీవాచ్యంబగు నపుడు మత్వర్థంబునం దా(డి వర్ణకం బగు.** (బా - ౨౨)

వగలా(డి - చిన్నెలా(డి॥ వగ - చిన్నె - కులుకు - వన్నె - దొమ్మి - ఎమ్మె॥ ఇత్యాదులు వగాదులు.

వ్యాఖ్య - స్త్రీని బోధింపవలసి వచ్చినపుడు మతుబర్థము నందు బహువచనాంతములైన 'వగ' మున్నగుశబ్దములకు 'ఆ(డి' యను ప్రత్యయము కలుగునని సూత్రార్థము.

'వగ' కు బహువచనము 'వగలు'. దీనికి 'ఆ(డి' యను ప్రత్యయముచేరగా 'వగలాడి' యనియగును. వగలు గలస్త్రీ యని యర్థము. ఇట్టివే చిన్నెలా(డి, కులుకులా(డి, వన్నె లా(డి, ఎమ్మెలా(డి - మున్నగు రూపములు కూడ.

'దొమ్మి' అను దానికి బహువచనము పరమైనపుడు ఉత్వము కలిగి 'దొమ్ములు' అని యగును. దొమ్ములు + ఆఁడి = దొమ్ములాఁడి.

27. వగాదులకు బహువచనాంతంబులకుఁ బుంస్త్వంబున మతుబర్థం బాకారం బగు. (బా - ౨౭)

ఆప్రత్యయాంతంబు మగాదిగణంబు॥ వగలాఁడు - చిన్నెలాఁడు.

వ్యాఖ్య - బహువచనాంతంబులయిన 'వగ' మున్నగు శబ్దములకు మతుబర్థమున 'ఆ' యను ప్రత్యయము కలిగి పురుష వ్యక్తిని బోధించునని సూత్రార్థము. ఆప్రత్యయమును గలిగిన రూపములు మగాదులలోనివి, కావున డుజ్జు కలుగును.

వగలు + ఆ + డుజ్ = వగలాఁడు; వగలు కలవాఁడని యర్థము. చిన్నెలాఁడు, కులుకులాఁడు, వన్నెలాఁడు, దొమ్మె లాఁడు, ఎమ్ములాఁడు - మున్నగునవి మిగిలినవానికి రూపములు.

28. చెడుగు దుడుకు నిడుపులకుఁ బుంస్త్వంబున మతుబర్థం బకారం బగు. (ప్రౌ - ౫)

చెడుగఁడు - దుడుకఁడు - నిడుపఁడు.

వ్యాఖ్య - చెడుగు, దుడుకు, నిడుపు - అను మూడు మాటలకు మతుబర్థమునందు పురుషబోధకముగా 'అ' అను ప్రత్యయము కలుగునని సూత్రార్థము. అవంతములయిన యీ మాటలు మగాదులలో చేరును. కావున డుజ్జగును.

చెడుగు + అ + డుజ్ = చెడుగఁడు. ఇట్టివే తక్కిన రూపములు కూడ.

**29.** వేఱున కత వర్ణకంబు స్వార్థంబునందగు. (ప్రౌ - ౬)

వేఱడము.

వ్యాఖ్య - 'వేఱు' అను పదమునకు 'అడము' అను ప్రత్యయము స్వార్థమునందు చేరునని సూత్రార్థము. 'వేఱు' అని యన్నను 'వేఱడము' అని యన్నను అర్థ మొక్కటే.

**30.** వెల్ల కడి వర్ణకంబు స్వార్థంబునం దగు. (ప్రౌ - ౭)

వెల్లడి.

వ్యాఖ్య - 'వెల్ల' అను పదమునకు ప్రాతిపదికార్థము నందు 'అడి' యను ప్రత్యయము కలుగునని సూత్రార్థము. వెల్ల + అడి = వెల్లడి.

**31.** ముక్కు లోనగువానికిం దదభావద్యోతకం బయి మతు బర్థంబునం దిఁడి వర్ణకం బగు. (ప్రౌ - ౨౪)

ముక్కిఁడి - ముక్కులేనివాఁడని యర్థము॥ ముక్కు - వాలు - వెరవు - సిగ్గు॥ ఇత్యాదులు ప్రయోగంబుల నెఱుంగునది.

వ్యాఖ్య - ముక్కు మున్నగు శబ్దములకు మతుబర్థ మందు అభావద్యోతకముగా 'ఇఁడి' యను ప్రత్యయము కలుగు నని సూత్రార్థము. అభావద్యోతకమని యనగా లేకుండుటను స్ఫురింపజేయునది యని యర్థము.

ముక్కు లేనివాఁడను నర్థమున ముక్కు + ఇఁడి = ముక్కిఁడి అని యగును. ఇట్లే వాలిఁడి, వెరవిఁడి, సిగ్గిఁడి - యనునవి మిగిలినవానికి రూపములు. ఇత్యాదులు ప్రయో

గంబుల నెఱుంగునది - అని చెప్పుటచేత 'ఇఁడి' అను ప్రత్యయము నియతముగానే యుపయోగింపబడునన్న విషయము జ్ఞాపనము చేయబడుచున్నది. ఈప్రత్యయము స్త్రీపురుషోభయ సామాన్యము.

**32.** తెలివి విరివి వినికి లేమి రాపులకు స్వార్థంబునం దిడి వర్ణకం బగు. (ప్రౌ - ౮)

తెలివిడి - విరివిడి - వినికిడి - లేమిడి - రాపిడి,

వ్యాఖ్య - తెలివి, విరివి, వినికి, లేమి, రాపు - అను వానికి ప్రాతిపదికార్థమునందు 'ఇడి' యను ప్రత్యయము కలుగునని సూత్రార్థము. తెలివి + ఇడి = తెలివిడి.

[ సార్థబిందుకమయిన 'ఇఁడి' ప్రత్యయము మతుబర్థమున, అభావ ద్యోతకముగా నగును. దానిని బాలవ్యాకరణము తెలిపెను. ప్రస్తుత ప్రౌఢ వ్యాకరణ ప్రతిపాదిత ప్రత్యయము నిర్బిందుకము. ఇది స్వార్థమునందు కలుగును. ఈభేదమును గుర్తించుకొనుట యవసరము. ]

**33.** ఇతవర్ణకం బింపు బిగు పోరులకు స్వార్థంబునం దగు. (ప్రౌ - ౯)

ఇంపితము - బిగితము - పోరితము.

వ్యాఖ్య - ఇంపు, బిగు, పోరు - అను మూడు మాటలకు స్వార్థమునందు 'ఇతము' అను ప్రత్యయము కలుగునని సూత్రార్థము. ఇంపు + ఇతము = ఇంపితము; పోరు + ఇతము = పోరితము.

ఇచ్చట 'బిగు' అన్నది తద్ధిత వృత్తియందు అంత్యాక్షరము లోపింపగా మిగిలిన 'బిగువు' శబ్దముయొక్క రూపము. బిగు + ఇతము = బిగితము.

**34.** ఇద వర్ణకం బొప్పు తప్పు పెల్లులకు స్వార్థంబునందును, క్రొవ్వు బెట్టులకు మతుబర్థంబునందును నగు.

(ప్రౌ - ౧౦)

ఒప్పిదము - తప్పిదము - పెల్లిదము - క్రొవ్విదము-బెట్టిదము.

వ్యాఖ్య - ఒప్పు, తప్పు, పెల్లు - అను మాటలకు స్వార్థమునందును, క్రొవ్వు, బెట్టు - అను మాటలకు మతుబర్థమునందును 'ఇదము' అను ప్రత్యయము కలుగునని సూత్రార్థము.

ఒప్పు + ఇదము = ఒప్పిదము. ఇట్టివే తప్పిదము, పెల్లిదము - అనునవికూడ. క్రొవ్వుకలది అను నర్థమున క్రొవ్వు + ఇదము = క్రొవ్విదము అని యగును. బెట్టుకలది అను నర్థమున 'బెట్టిదము' అని యగును.

**35.** స్వార్థంబునం దిరి వర్ణకంబు వాపున కగు.

(ప్రౌ - ౧౧)

వాపిరి.

వ్యాఖ్య - 'వాపు' అనుమాటకు ప్రాతిపదికార్థమున 'ఇరి' అను ప్రత్యయము కలుగును. వాపు + ఇరి = వాపిరి.

**36.** కర వర్ణకంబు నాయఁకశబ్దంబునకు భావంబునం దగు.
(ప్రౌ - ౧౨)

నాయఁకరము.

వ్యాఖ్య - నాయఁక శబ్దమునకు భావమునందు 'కరము' అను ప్రత్యయము కలుగునని సూత్రార్థము. నాయఁక + కరము = నాయఁకరము; నాయఁకునియొక్క విశేషప్రకారమని యర్థము. నాయఁకుఁడు అన్నది అధిపతియను నర్థముకల ఆచ్ఛిక శబ్దము.

[ నిజమునకు 'నాయఁకునియొక్క + కరము' అని యన్నప్పుడు తద్ధితవృత్తియందు 'యొక్క'కు లోపము రాగా 'నాయఁకుని కరము' అని మాత్రమే యగును. 'నాయఁక' అని 'క' కారాంతమైన శబ్దము లేదు. ఉన్న దని యంగీకరించినప్పటికిని 'నాయఁక + కరము' అనియైనప్పుడు ఒక కకారమును లోపింపజేసికొనుట యవసరము. అది యిక్కడ జరుగలేదు. శబ్దరత్నాకరమునందు 'నాయఁకుఁడు + కరము' అను విభాగము చూప బడినది. అప్పుడును 'డు' వర్ణమును, దానికి పూర్వమందున్న 'కు' వర్ణమును లోపింప జేసికొనవలయును. ప్రస్తుతసూత్రము వానిని సాధించుటకు సమర్థముగా లేదు. ఇంతకంటె "నాయఁకుని భావము నాయఁకరము" అని నిపతించుట సమంజసముగా నుండెడిది. ]

**37.** కార వర్ణకంబు చెలి నయములకు భావంబు నందును, నుడి కొలతలకు స్వార్థంబునం దగు; ఈ కకారము నకుఁ గొన్నియెడలఁ గకారం బగు. (ప్రౌ - ౧౩)

చెలికారము - నయగారము - నుడికారము - కొలగారము.

వ్యాఖ్య - చెలి, నయము - అనుశబ్దములకు భావము నందు 'కారము' అను ప్రత్యయము కలుగును. చెలియొక్క

స్వభావము అనునర్థమునందు చెలి + కారము = చెలికారము అని యగును. నయముయొక్క స్వభావము అనునర్థమున నయము + కారము అనియుండి 'ము' వర్ణకమునకు లోపమురాగా 'నయ + కారము' అని యగును. కకారమునకు గకారము రాగా 'నయగారము' అని యగును.

నుడి, కొలత - అను రెండుశబ్దములకు ప్రాతిపదికార్థము నందే 'కారము' అను ప్రత్యయము కలుగును. నుడి+కారము= నుడికారము. 'కొలత+కారము' అని యున్నప్పుడు పూర్వపదము తుదివర్ణమునకు లోపము కలుగును. 'కొల + కారము' అని యుండగా కకారమునకు గకారము కలిగి 'కొలగారము' అని యగును.

[ నుడి యన్నను నుడికార మన్నను భేదములేదు. కొలత యన్నప్పుడు కొలుచుటయని యర్థము; కొలగారము అని యన్నప్పుడు కొలత కిచ్చెడి కూలి యని యర్థము. కావున కొలగారము అనుచోట కారప్రత్యయము స్వార్థమునం దగుననుట సరికాదు. ]

**38. చలికి మిరి వర్ణకంబు స్వార్థంబునం దగు. (ప్రౌ- ౧౪)**

చలిమిరి.

వ్యాఖ్య - 'మిరి' అను ప్రత్యయము 'చలి' కి స్వార్థమునం దగునని సూత్రార్థము. చలి + మిరి = చలిమిరి. చలి యన్నను చలిమిరి యన్నను ఒక్కటే యర్థము.

**39. టి వర్ణకం బొందు నంత్యవర్ణంబునకు భావంబునం దగు. (ప్రౌ - ౧౫)**

ఇంటి

వ్యాఖ్య - 'ఒండు' అను శబ్దముయొక్క తుది యక్ష రమునకు బదులుగా 'టి' అను ప్రత్యయము భావమునందు కలుగు నని సూత్రార్థము. ఒండు యొక్క స్వభావము అను నర్థమున 'ఒంటి' అని యగును. అనగా 'ఒంటరి తనము' అని యర్థము.

**40.** మానార్థంబున నేకత్వంబునం దేఁడు వర్ణకం బగు.
(బా - ౨౫)

తూమేఁడు - ముంతేఁడు - ఎత్తేఁడు - వీసేఁడు - జేనేఁడు - మూరేఁడు - కుండేఁడు - గంపేఁడు.

వ్యాఖ్య - పరిమాణమును తెలియజేయునప్పుడు ఏకత్వ మును బోధించుపదమునకు 'ఏఁడు' అను ప్రత్యయము కలుగునని సూత్రార్థము. తూము + ఏఁడు = తూమేఁడు. ఇక్కడతూము, ముంత, ఎత్తు, వీసె, జేన, మూర, కుండ, గంప - అన్నవి ఏక వచనాంత శబ్దములు. వీనికి 'ఏఁడు' అను ప్రత్యయము కలిగి అపదాదిసంధికాగా పైనిచూపిన రూపము లేర్పడును.

**41.** ఏఁడు వర్ణకంబు పరంబగునపుడు లివర్ణంబు లోపించు.
(బా - ౨౬)

కమికేఁడు - కొడిదేఁడు - దోసేఁడు - పిడికేఁడు - పుడిసేఁడు- సందేఁడు.

వ్యాఖ్య - పరిమాణార్థమున ఏఁడు వర్ణకము పరమగు నపుడు పదము తుదనున్న 'లి' వర్ణమునకు లోపము కలుగునని సూత్రార్థము. 'కమికిలి + ఏఁడు' అని యుండగా 'లి'వర్ణమునకు లోపము కలిగి 'కమికి+ఏఁడు' అని యగును. సంధికాగా 'కమి

కేఁడు' అని యగును. కొడిదిలి, దోసిలి, పిడికిలి, పుడిసిలి, సందిలి - అన్నవి తక్కినపదములు. 'ఎఁడు' పరముకాగా 'లి' వర్ణమునకు లోపముకలిగి పైనిచూపిన రూపము లేర్పడినవి.

**42.** పరిమాణార్థంబునం బ్రథమైక వచనంబునంద యెఁడు వర్ణకం బగు (ప్రౌ - ౧౬)

విశేష్యంబు భిన్నవచన విభక్తికంబయ్యు మానార్థక శబ్దముల మీఁదఁ బరిమాణార్థంబునఁ బ్రథమైకవచనంబునందే యెఁడు వర్ణకంబు వచ్చునని సూత్రార్థము॥ మూరెఁడు తోఁక - తూమెఁడు బియ్యము - పుట్టెఁడు తవిదలు - పుట్టెఁడు తవిదలకు రెండుపుట్ల గింజలు॥ మొ.

వ్యాఖ్య - పరిమాణము దెలుపునప్పుడు ప్రథమావిభక్తియం దేకవచనమును గలిగియున్న శబ్దముమీదనే 'ఎఁడు' అను ప్రత్యయము కలుగునని సూత్రార్థము. బాలవ్యాకరణసూత్రము (25) నకు ఇది సవరణముగా ప్రతిపాదింపబడినది. ఏకత్వమనునది రెండింట సమానముగా నున్నది. మానార్థకము ప్రథమావిభక్తియందే యుండునని బాలవ్యాకరణము తెలుపలేదు. ఉదాహరణములనుబట్టి అది గమ్యమాన మగుచున్నను, సూత్రమునుబట్టి పొరపాటున కవకాశము కలదన్న యుద్దేశముతో ఈసవరణము ప్రతిపాదింపబడియుండును. ఆయభిప్రాయమును కలిగియుండుట చేతనే విశేష్యము భిన్నవచనమును గలదైనను, భిన్నవిభక్తినిగలదైనను కొలతను సూచించు శబ్దముమీద ప్రథమైకవచనమునందు మాత్రమే 'ఎఁడు' అను ప్రత్యయము వచ్చునని సూత్రకర్త వివరించుట జరిగినది.

మూర + ఎఁడు + తోఁక = మూరెఁడు తోఁక; తూము + ఎఁడు + బియ్యము = తూమెఁడు బియ్యము. 'తవిదలు' అని విశేష్యము బహువచనాంతమై యున్నప్పటికిని, 'తవిదలకు' అని షష్ఠ్యంతమై యున్నప్పటికిని 'పుట్టి' అను ప్రథమైకవచనరూపముమీదనే 'ఎఁడు' వర్ణకము వచ్చి 'పుట్టెఁడు' అని యగుచున్నది.

[ ఈసూత్రము అనావశ్యకము. బాలవ్యాకరణసూత్రమే పైప్రయోగములను సాధించును 'పుట్టెఁడు తవిదలు' అని యన్నప్పుడు 'తవిదలు' బహువచనాంతమై యున్నను 'పుట్టి' ఏకవచనాంతమే. ఒక ప్రమాణమును మాత్రమే చెప్పుచున్నది. అందువలన దీనిపై 'ఎఁడు' వర్ణకమువచ్చుట కాక్షేపము లేదు. రెండుపుట్లు, మూఁడుపుట్లు అనువిధముగా బహుత్వబోధ యున్నప్పుడు 'ఎఁడు' వర్ణకము కలుగనే కలుగదు. ఇంక విశేష్యము భిన్నవిభక్తికమైనప్పుడును మానార్థకము ప్రథమావిభక్తియందే యుండునన్న విషయమును చూతము. 'పుట్టికి తవిదలకు' అని రెండును షష్ఠ్యంతములై యుండవలయును. 'ఎఁడు' వర్ణకము పరమగునపుడు తద్ధితవృత్తిచేత విభక్తికి లోపము రాగా 'పుట్టి + ఎఁడు' అనియే యేర్పడును. అట్లే తక్కివ ప్రయోగములయందును. అందువలన ప్రస్తుతసూత్రము దేనినిగాని క్రొత్తగాఁ సాధించుట లేదు. ]

## 43. దఘ్నార్థంబున బంటి కొలఁదు లగు. (బా - ౨౭)

మోఁకాలిబంటి - మోఁకాలికొలఁది; ఱొమ్ముబంటి - ఱొమ్ము కొలఁది.

వ్యాఖ్య - ప్రమాణమును దెలుపవలసి వచ్చునప్పుడు సంస్కృతమున 'దఘ్నచ్' ప్రత్యయము వచ్చును. ఆప్రత్యయము వచ్చుటకు వీలయిన సందర్భమునందు తెలుగునందు 'బంటి' అను

ప్రత్యయముకాని 'కొలఁది' అను ప్రత్యయముకాని వచ్చునని సూత్రతాత్పర్యము.

జానుదఘ్న మన్న యర్థమున 'మోఁకాలు + బంటి' అనియై పూర్వశబ్దము తుదియచ్చున కిత్వము కలిగి 'మోఁకాలి బంటి' అని యగుచున్నది. 'మోఁకాలి కొలఁది' అన్నదికూడ ఇట్టిదే. 'మోఁకాలు లోతువరకు' అని యర్థము. 'ఱొమ్ము' అను శబ్దముపై 'బంటి' యని వచ్చి 'ఱొమ్ముబంటి' యని 'కొలఁది' రాగా 'ఱొమ్ముకొలఁది' యని యగును. ఱొమ్ము లోతువరకు అని యర్థము.

[ 'కొలఁది' యనుదానిని తద్ధిత ప్రత్యయముగా సూరి గ్రహించెను. 'కొలఁది' యనునది అర్థవంతమయిన శబ్దమే. 'మా కొలఁది జానపదులకు' 'నీరు కొలఁది తామర సుమ్మీ' మున్నగుచోట్ల ప్రమాణమును జూపుచు ప్రత్యేక శబ్దముగా నున్నదనుటయే సమంజసము. ]

**44.** దఘ్నార్థంబునం దత్సమపదంబులమీఁదను బంటి కానంబడియెడి. ( ప్రౌ- ౧౬ )

కటిబంటి నెతురు కాలువల్ ॥ రామా. ౮ ౭ ॥

వ్యాఖ్య - తత్సమ పదములమీద సైతము 'బంటి' యను తద్ధిత ప్రత్యయము దఘ్నార్థమున కలుగుచున్నదని సూత్రార్థము.

బాలవ్యాకరణము 'బంటి' ని తెనుగు శబ్దముల మీద మాత్రమే చేర్చి యుదాహరించినది. తక్కిన తద్ధిత ప్రత్యయములును తెనుఁగు పదములమీదనే చేరుచున్నవి; కావున, తత్సమ పదములమీద తద్ధిత ప్రత్యయములు చేరవు. కాని దఘ్నార్థమున

వచ్చు 'బంటి' అను ప్రత్యయము తత్సమమైన 'కటి' అను శబ్దముమీద చేరిన ప్రయోగము కనబడుటచే ప్రౌఢవ్యాకరణ కారుడు దానిని విశేషప్రయోగముగా చూపుచున్నాడు.

**45. ప్రాచుర్యార్థంబునం దెలుఁగు పదంబులమీఁదను మయ ప్రత్యయము చూపట్టెడి.** (ప్రౌ - ౧౮)

తనమయము - విచ్చలవిడిని దనమయంబుగా గగనంబున నిగుఢ నచ్చక్రంబుం గనుంగొని॥ ఉ. హ. ౩ఆ॥ తమమయము - సమదవృత్తిఁ గేలిసలిపెఁ జకోరచయంబు చదలు తమమయంబుగాఁగ ॥సర్వ. ౬ఆ॥ మెదడు ప్రోవులమయము-ప్రథనభూమి మెదడు ప్రోవులమయమయ్యె మిక్కుటముగ ॥హరి ఉ. ౧౦ ఆ॥ మొ.

వ్యాఖ్య - సంస్కృతమున ప్రాచుర్యార్థమునందును, వికారార్థమునందును 'మయట్' ప్రత్యయము కలుగును. ఇది సంస్కృత ప్రత్యయము. కావున తెలుగుపదములపైని చేరు నవకాశములేదు. అయినను తెనుగుపదములమీద నైతము 'మయట్' ప్రత్యయము ప్రాచుర్యార్థమునందు కలుగుచున్నదని సూత్రార్థము.

తనమయము - ఇచ్చటి పూర్వశబ్దము షష్ఠీవిభక్త్యంతమై యున్నది. 'తనయొక్క + మయము'. అనియుండి తద్ధితవృత్తి యందు 'యొక్క'కు లోపమ్ము రాగా 'తనమయము' అని యయ్యెను. 'తనయొక్క ప్రాచుర్యము' అని యర్థము. ఇట్టివే తమమయము, ప్రోవులమయము - అన్న రూపములుకూడ. 'చూపట్టెడి' అని చెప్పుటచేత సూత్రకర్తీనిన్ని విశేషప్రయోగములుగా భావించె ననుట స్పష్టము కలుగును (కా - 41).

**46. ఒకానొకచో మతుబర్థంబున నవర్ణకంబు చూపట్టెడి.**
**(ప్రౌ - ౧౫)**

అగిలజ నీకిట్లని పల్కను జనునే తలఁప లేడి కడుపునఁ బులి పుట్టునె యిట్టి దివ్యతేజంబునవాఁడ ధమాన్వయముఁ బుట్టునె చెపుమా (దివ్యతేజంబునవాఁడు = దివ్యతేజముగలవాఁడు) ॥ భార. ఆది. ౬ఆ, ఇతరంబులు ప్రయోగదృష్టంబులు గ్రాహ్యంబులు.

వ్యాఖ్య - మతుబర్థమునందు కొన్ని యెడల 'న' యను తద్ధితప్రత్యయము ప్రయోగములందు కనబడుచున్నదని సూత్ర తాత్పర్యము.

దివ్యతేజంబు + వాఁడు అని యున్నప్పుడు పూర్వ పదముపై 'న' వర్ణకనుఁచేరి మతుబర్థమును గలిగించుచున్నది. దివ్యతేజంబు + న + వాఁడు = దివ్యతేజంబునవాఁడు. దీనికి 'దివ్యతేజము గలవాఁడు' అన్న యర్థమునుగూడ సూత్రకర్తయే తెలిపెను.

నిజమునకు 'దివ్యతేజంబు + వాఁడు' అని యున్నప్పుడు ఆగమముగా 'న' యను వర్ణము కలుగవచ్చును. ఇది యిక్కడ సంబంధమును బోధించును. సమాసపరిచ్ఛేదమునందు మొదటి సూత్రముగా ప్రౌఢవ్యాకరణకారుడు "షష్ఠీతత్పురుషంబులందు నగాగమంబు విభాషనగు" అనితెల్పి "ఎలజవ్వనంబున విలస నంబు" మున్నగు నుదాహరణములను చూపెను, 'దివ్యతేజంబున వాఁడు' అను ప్రస్తుత ప్రయోగముకూడ అట్టిదే. స్వస్వామి సంబంధమును సూచించు శేషార్థమునందు వచ్చిన 'న' యను

నాగమమేకాని యిది తద్ధితప్రత్యయము కాదు. కావున, ప్రస్తుత సూత్రము నిష్ప్రయోజనము.

[ నగాగమవిషయమునందు ప్రౌఢవ్యాకరణకారుడు పెక్కు తబ్బిబ్బులకు లోనయ్యెను. సమాసపరిచ్ఛేదమున మొదటిసూత్రమునందు షష్ఠీ తత్పురుషములం దయ్యెడు నగాగమముగాను ముప్పదియేడవ సూత్రము నందు సప్తమీతత్పురుషమునందు లోపింపక, నిల్చిపోయిన నప్రత్యయము గాను తెలిపెను. ప్రస్తుతపరిచ్ఛేదమునందు దీనిని మతుబర్థమునందు వచ్చు తద్ధితప్రత్యయముగా తెలిపెను. శబ్దపరిచ్ఛేదమునందు (21వ సూత్రము) నగాగమముగా తెలుపుట జరిగెను. వీనినన్నింటిని ఒకే విధముగా ఆగమములనియు సంబంధమునందు కలుగుచున్నవనియు నన్నయెడల సమంజసముగా నుండును. ]

తద్ధిత ప్రత్యయములందు 'న' వర్ణము కలదు. నలన, తెల్లన - మున్నగుచోట్ల దాని యునికినిగూర్చి బాలవ్యాకరణము (6వ సూత్రము) తెలిపినది.

**47.** అర్థవిశేషంబుల వర్ణకాంతరంబులును మహత్ప్రయోగంబుల నెఱుంగునది. (ప్రౌ - ౨౮)

మంటమారి - తిండిపోతు॥ తాచ్ఛీల్యంబున మారి పోతు వర్ణకంబులు. అడప, తాంబూలకరండవాహి ॥ మతుబర్థంబునం దప్రత్యయంబు. పెండ్లము, ఊఢ ॥ పెండ్లి శబ్దంబునకు మతుబర్థంబునం దము ప్రత్యయంబు ॥ ఇత్యాదు లూహ్యంబులు.

వ్యాఖ్య - ఇంకను వేరువేరర్థములను దెలుపుచు వేరు వేరు తద్ధితప్రయోగములు వచ్చుచుండుననియు, వానిని పెద్దల ప్రయోగములనుబట్టి తెలిసికొనవలయునని యీసూత్ర తాత్పర్యము.

తత్ + శీలము = తచ్ఛీలము. దానియొక్క స్వభావము అని యర్థము. స్వభావమునకు సంబంధించిన విశేషము తాచ్ఛీల్యము.

మంట + మారి = మంటమారి. మండుట స్వభావముగా గల వ్యక్తియని యర్థము. తిండి + పోతు = తిండిపోతు. తినుట స్వభావముగా గల వ్యక్తియని యర్థము. 'మండు' అను ధాతువు యొక్క కృదంతరూపము 'మంట' యనునది. అట్లే 'తిను' ధాతువుయొక్క కృదంతరూపము 'తిండి' అనునది. కావున, మారి, పోతు - అను తద్ధిత ప్రత్యయములు తాచ్ఛీల్యమునందు కృదంతరూపములపై చేరుచున్నవి దేని కీ ప్రత్యయములు చేరు నన్న విషయమును ప్రయోగములనుబట్టి గ్రహింపవలయును.

'అడపము' అని యనగా 'తాంబూలకరండము' అని యర్థము. దానిని మోయునటువంటి స్త్రీని బోధింపవలసి వచ్చి నప్పుడు అప్రత్యయము వచ్చును. అడపము + అ - అని యున్న ప్పుడు తద్ధితవృత్తిచేత మువర్ణకమునకు లోపము కలిగి అడప + అ = అడప అని యగును. తాంబూలకరండమును గల స్త్రీయనియే యర్థము.

పెండ్లి + అము = పెండ్లము. ఇక్కడకూడ 'పెండ్లి' అను శబ్దమునకు 'అము' ప్రత్యయము మతుబర్థముననే కలుగు చున్నది. పెండ్లిని గ్గలది అని యనగా వివాహమునొందిన స్త్రీ యని యర్థము.

['పెండ్లి' అను శబ్దమునకు 'అ' యను ప్రత్యయమును విధించిన చాలుననియు [redacted] 'ము' వర్ణకము కళత్రము మున్నగువానియందు చేరినట్లే

బాగుగా లేదనియు కొందరు వ్యాఖ్యాతలు తలచిరి. గుప్తార్థ ప్రకాశికా కారులు "గ్రంథకర్త మూలంబునందు 'అము' ప్రత్యయమని మువర్ణకంబు గూడ తద్ధిత ప్రత్యయంబులోనిది యనుట యవిచారిత రమణీయము" అని యనిరి. వేటికాకారులు దానికి సమాధానముగా "పెండ్లి శబ్దముమీఁద మత్వర్థమున 'అ' ప్రత్యయమని యని పిదప మువర్ణకముఁ జేర్చినఁ బైరూపము సాధువగుంగాని విశిష్టము స్త్రీవాచక మగుటను నాచ్ఛిక శబ్దమగుటను ప్రథమైకవచనము నిలువ నవకాశము శాస్త్ర మీయకుండుటం జేసి మువర్ణకమును నిల్పుటకు వీలులేక 'అము' ప్రత్యయమని మువర్ణాంతముగా వివరించెనని తోఁచెడి"నని వ్రాసిరి. దీనిని మువర్ణకముగా భావించుటయే సరియైన పద్ధతి కాదు. ఇచ్చట నున్నది మువర్ణకమే అయినయెడల పూర్ణబిందుపూర్వక బువర్ణమును, మాముడియును వచ్చుటకు సైత మవకాశము కలుగును. కాని అట్టి రూపములు ప్రయోగములందు లేవు. అంతేకాక, ఈ ప్రత్యయమును వేరుగా విధించుకొనుటయే జరిగినయెడల అదంతముల పైని మాత్రమే చేరెడి మువర్ణకమున కిక్కడ అవకాశమే కలుగదు. ఇన్ని చిక్కుల నూహించియే సూరి 'అము' అన్న రూపమునే ప్రత్యయముగా గ్రహించెను. అదియే సరియైన పద్ధతి. బాలవ్యాకరణ మంతటిలోను మువర్ణముతోడి యాచ్ఛిక పదములను నపుంసకములుగా నంగీకరించుట మాత్రమే జరిగెననియు, మువర్ణకముకు విధించుట జరుగలేదనియు గుర్తుంచుకొనుటకూడ అవసరము.]

ఇట్టులే యింకను పెక్కు ప్రత్యయములు కలుగవచ్చును. ప్రౌఢ వ్యాకరణకారుడు చూపిన అడము, ఇడి, ఇతము, ఇదము, ఇరి, కరము, కారము, మిరి - మున్నగునవి అట్టివానిలో కొన్ని ప్రత్యయములు. పెద్దల ప్రయోగములనుబట్టి ఆయా విశేషములను గ్రహింపవలయుననుట వ్యాకరణవిషయమున నెప్పుడును సమంజసమే. 'ప్రయోగశరణం వ్యాకరణ[redacted]మ్మనుట యిందులకే.

# క్రియా పరిచ్ఛేదము

## 1. ధాతువునకు. (బా - ౧)

ఇది యధికారసూత్రంబు. ఇంక నెయ్యది యుపక్రమింపంబడు నయ్యది ధాతువున కగునని యెఱుంగునది.

వ్యాఖ్య - ఇకముందు విధింపబడు కార్యములు ధాతువున కగు నన్న భావముతో 'ధాతువునకు' అని తెలుపబడెను. ఇది అధికార సూత్రము. అనగా, తాను ప్రత్యేకముగా వాక్యార్థమును గలిగియుండక, ఇతర సూత్రములలోని కన్వయించి యర్థమును గలిగించు సూత్రమని యర్థము. ఈ పరిచ్ఛేదము నందు ఇకముందు విధింపబడున వన్నియును ధాతువునకు అగునని వివరణముయొక్క తాత్పర్యము,

## 2. వర్తమానంబున లట్టగు. (బా - ౨)

వర్తమాన క్రియా వృత్తియగు ధాతువునకు లడ్వర్ణకంబగు. వర్తమానంబనాఁ బ్రారబ్ధాపరిసమాప్తంబు - అప్పటికి ముగియకుండునది.

వ్యాఖ్య - ధాతువునకు వర్తమానమునందు లట్టగునని సూత్రార్థము. ప్రారబ్ధము అని యనగా మొదలు పెట్ట బడినదని యర్థము. అపరిసమాప్తము అని యనగా ముగింపబడనిదని యర్థము. మొదలు పెట్టబడి ముగింపబడని దానిని 'వర్తమానము' అని యందురు. జరుగుచు నున్నదని యౌగికార్థము. అప్పటి

కింకను జరుగుచున్న క్రియకు వాచకమైన ధాతువునకు 'లట్టు' అను ప్రత్యయము కలుగునని యర్థము.

['లట్టు' మున్నగునవి తమంతట తాము ప్రత్యయములుగా 'అందు' మున్నగువానివలె చేరునవి కావు ఇవి యొక రకముగా సంకేతములు. వీని స్థానమున ముందు విధింపబోవు ప్రత్యయములు ధాతువులకు చేరును.]

**3. భూతంబున లిట్టగు. (బా - ౩)**

భూత క్రియావృత్తియగు ధాతువునకు లిడ్వర్ణకం బగు. భూతంబనా విద్యమానధ్వంసప్రతియోగి-ముందుండి యప్పటికి లేకుండునది.

వ్యాఖ్య - భూతకాలము నందు ధాతువునకు లిట్టగునని సూత్రార్థము. భూతమని యనగా విద్యమాన = కనిపించుచున్నటువంటి; ధ్వంస = నాశమునకు; ప్రతియోగి = శత్రువైనది యని యర్థము. అట్టి భూతకాలమును సూచించు క్రియయందు వర్తించు ధాతువునకు 'లిట్టు' అను ప్రత్యయము కలుగునని భావము.

**4. భావిని లృట్టగు. (బా - ౪)**

భావినా క్రియావృత్తియగు ధాతువునకు లృడ్వర్ణకం బగు. భావినా విద్యమాన ప్రాగభావ ప్రతియోగి-అప్పటికిఁ బుట్టకుండునది.

వ్యాఖ్య - భవిష్యత్కాలమునందు ధాతువునకు 'లృట్టు' కలుగునని సూత్రార్థము. భావియనగా విద్యమాన = కన్పించుచున్నటువంటి; ప్రాగభావ = ముందున్న లేమికి; ప్రతియోగి = శత్రువైనది అని యర్థము. అనగా అంతవరకు లేకపోయినను, తరువాత కలుగునదని యర్థము. అట్టి భవిష్యత్కాలమును

సూచించు క్రియయందు వర్తించు ధాతువునకు 'ఌట్టు' అను ప్రత్యయము కలుగునని భావము.

**5. తద్ధర్మాదులందు లాట్టగు. (బా - ౫)**

తద్ధర్మాది క్రియావృత్తి యగు ధాతువునకు లాడ్వర్ణకం బగు. తచ్ఛీల సంభావనా సంప్రశ్న సాతత్య వర్తమాన భావ్యాశీరాదులాదిపద గ్రాహ్యంబులు.

వ్యాఖ్య - తద్ధర్మార్థకము మున్నగువానియందు ధాతువునకు 'లాట్టు' అను ప్రత్యయము కలుగునని సూత్రార్థము. తద్ధర్మార్థకము అని యనగా ధాతువుయొక్క యర్థమును తెల్పునదని యర్థము. అనగా ప్రత్యేక మే యొక్క కాలమును గాని సూచింపక అన్ని కాలములకు బోధకమగునది యని యర్థము. 'తద్ధర్మాదులు' అని 'ఆది' పదము నుపయోగించుట చేత తచ్ఛీలము, సంభావన, సంప్రశ్నము, సాతత్యము, వర్తమానము, భావి, ఆశీస్సు - మున్నగువానిని గూడ గ్రహింప వలయును.

తచ్ఛీలము = దానియొక్క స్వభావము; సంభావన = ఊహ; సంప్రశ్నము = ప్రశ్నించుట; సాతత్యము = ఎల్లప్పుడు నుండుట: ఆశీస్సు = దీవెన. ఇచ్చట మరల 'ఆది' పదముండుటచేత 'శాపము' మున్నగువానినిగూడ గ్రహింపవలయును.

**6. ఆశీశ్శాప సంప్రార్థన విధులందు లూట్టగు. (బా - ౬)**

...రాదులందు ధాతువునకు లూడ్వర్ణకం బగు.

వ్యాఖ్య - ఆశీస్సు, శాపము, సంప్రార్థన, విధి (ఆజ్ఞాపించుట) అను క్రియలయందు వర్తించు ధాతువునకు 'లూట్టు' అను ప్రత్యయము కలుగునని సూత్రార్థము.

7. వ్యతిరేకంబున లజీ యగు. (బా - ౬)

వ్యతిరేక విశిష్ట క్రియావృత్తియగు ధాతువునకు లజీ వర్ణకంబగు.

వ్యాఖ్య - వ్యతిరేకార్థమునందున్న క్రియయందు వర్తించు ధాతువునకు లజీ అను ప్రత్యయము కలుగునని సూత్రార్థము.

8. లకారంబునకు డుౙ్రావురునుముఙ్ఞగు. (బా - ౭)

లడాది లకారంబులం దొక్కొక్కటికి డజాదు లాదేశం బగు. ఇందు ఞకారంబు ప్రత్యాహారార్థంబు.

వ్యాఖ్య - లట్టు, లిట్టు, ల్‌ృట్టు, లాట్టు, లూట్టు, లజీ - అను నాటింటినిగూర్చి రచయిత యింతవరకు చెప్పియున్నాడు. వాని యన్నింటియందు లకారము సామాన్యముగా నుండుటచే, సామూహికముగా చెప్పవలసి వచ్చినపుడు 'లకారము' అని చెప్పుట సంప్రదాయము.

లట్టు, లిట్టు - మున్నగువానిలో నొక్కొక్కదాని కాదేశముగా డు, రు, వు, రు, ను, ము - అను క్రియావిభక్తు లగునని సూత్రార్థము. సమాపకక్రియల నేర్పరుచుటకు చేరు విభక్తు లగుటచే వీనికి క్రియా విభక్తులనియు, పురుష బోధకము లగుటచే పురుష ప్రత్యయము లనియు వ్యవహారము గలదు.

పైని చూపిన ప్రత్యయములకు ఙ కారము, జి కారము అన్నవికూడ కలుపబడినవి. వీనిని ఇత్సంజ్ఞలని యందురు. ఏదయిన ప్రయోజనము నపేక్షించి, యుపయోగించుకొని. ప్రయోగించు నపుడు మానునటువంటి వానిని ఇత్సంజ్ఞలని యందురు. ప్రత్యాహారముచేత 'దుఙ్ఞు' అని అన్నయెడల పైని చూపిన 'డు రు వు రు ను ము' అను ప్రత్యయము లారును గ్రహింపబడును. ఞ కారము ప్రత్యాహార సంజ్ఞ.

[సంస్కృతమునందు లకారములు పది విధములుగా కలవు. అందు అయిదు టకారము ఇత్సంజ్ఞగా కలవి. వర్తమాన కాలమునకు లట్టు; భూతకాలమునకు లిట్టు, లఙ్ఞు, లుఙ్ఞు; భవిష్యత్కాలమునకు లుట్టు; లృట్టు; విధియందు లోట్టు; ఆశీస్సునందు లిఙ్ఞు; క్రియాపత్తియందు లృఙ్ఞు వాడబడును. 'లేట్టు' అన్నది వేదములందు మాత్రమే యున్నరూపము. చిన్నయసూరి ఈ సంజ్ఞలను కొన్నింటిని యథాతథముగను, కొన్నింటిని మార్చియు గ్రహించెను. కొన్నింటిని విడిచివేసెను. సంస్కృతమునందు ఒకే కాలమును రెండు మూడు రకముల ప్రత్యయములు తెల్పును. వానికి ప్రయోగములందు ఏ భేదము సైతము కలదు. తెనుగునందు అట్టి యావశ్యకము లేదు. కావున సూరి మార్పులను అంగీకరించెను. వర్తమానమున లట్టును, భూతమున లృట్టును సూరి యథాతథముగా గ్రహించెను, లాట్టు, లూట్టు - అనువానిని ప్రత్యేకముగా సృష్టించుకొనెను. వ్యతిరేక బోధయందు 'లజి' అని 'జి' ఇత్సంజ్ఞగా గల ప్రత్యయమును వేరుగా సృజించుకొనియెను. సంస్కృత సంప్రదాయమునే యనుసరించి నప్పటికి, అవసరము కానివానిని పరిహరించుటకు, అవసరమయిన వానిని సృజించుకొనుటకు సూరి వెనుదీయలేదు. సూరి సూక్ష్మదృష్టికి ప్రస్తుత ప్రణాళిక నిదర్శనము.]

**9. అందు వరుసను రెండేసి ప్రథమ మధ్యమోత్తమంబు లనంబడు.** **(బా - ౯)**

డుఙ్, రు - ప్రథమము. వు, రు - మధ్యమము. ను, ము - ఉత్తమము.

వ్యాఖ్య - పైని చూపిన 'డు రు' అనునవి ప్రథమ పురుష. 'వు రు' అనునవి మధ్యమ పురుష. 'ను ము' అనునవి ఉత్తమపురుష. నామముతో కాని, తదాది శబ్దముతోకాని అన్వయించు క్రియారూపమును ప్రథమపురుషమని యందురు. అనగా ఆ క్రియాపదమునకు చివర డు, రు - అను ప్రత్యయములు చేరునని భావము. యుష్మదర్థకముతో అన్వయించు క్రియారూపమును మధ్యమపురుషమని యందురు. ఆ క్రియాపదమునకు చివర వు, రు - అనునవి చేరును. అస్మదర్థకముతో అన్వయించు క్రియారూపమును ఉత్తమపురుషమని యందురు. ఆ క్రియా పదమునకు చివర ను, ము - అన్నవి చేరును.

**10. వానిలో రు ము లు బహువచనంబులు; పెఱ లేకవచనంబులు. (బా - ౧౦)**

వ్యాఖ్య - పైని చెప్పిన ప్రత్యయములలో రు, ము - అనునవి బహుత్వసంఖ్యను బోధించును. పెఱలు అని యనగా ఇతరములైన డు, వు, ను - అన్నవి ఏకత్వసంఖ్యను బోధించును.

**11. నామ యుష్మ దస్మదర్థములందుఙ్ బ్రథమ మధ్యమోత్తమంబు లగు. (బా - ౧౧)**

వ్యాఖ్య - నామము కర్తగానున్నపుడు, దానియొక్క క్రియను ప్రథమ పురుషమనియు, యుష్మదర్థకము కర్తయై

నపుడు దాని క్రియను మధ్యమ పురుషమనియు, అస్మదర్థకము కర్తయైనపుడు దాని క్రియను ఉత్తమ పురుషమనియు నందు రని భావము.

**12.** అమహదర్థంబునందు డుజ్రులకు దువులగు నున్నాను బంధంబుమీఁద దివి యగు. (బా - ౧౨)

వ్యాఖ్య - అమహత్తును బోధించునపుడు డుజ్వర్ణకమునకు బదులుగా 'దు' అనియు, 'రు' వర్ణకమునకు బదులుగా 'వు' అనియు నగును. ధాతువుపై 'ఉన్న' అను అనుబంధము చేరినపుడు దానిమీద ఏకత్వమున 'ది' అనియు, బహుత్వమున, 'వి' అనియు నగును. కల + డుజ్ - డుజ్జున కాదేశముగా 'దు' రాగా 'కలదు' అని యగును. అట్లే బహుత్వమున 'కలవు' అని 'వు' వర్ణము కలుగును. ఉన్నాను బంధముపై నైనచో 'వచ్చుచున్నది' అన్నట్లు 'ది' వర్ణమును, 'వచ్చుచున్నవి' అన్నట్లు 'వి' వర్ణమును కలుగును.

**13.** ఉదంతంబునకు లట్టు పరంబగునపు డున్నానుబంధం బగు. (బా - ౧౩)

ఉదంతంబయిన ధాతువునకు లట్టు పరంబగునపుడు 'ఉన్న' అను శబ్దం బనుప్రయుక్తం బగు.

వ్యాఖ్య - హ్రస్వమైన ఉకారము నంతమందు గలిగిన ధాతువునకు లట్టు పరమగునపుడు 'ఉన్న' అన్నది అనుబంధముగా ప్రయుక్తమగునని యర్థము. "వర్తమానంబున లట్టగు" నని యనుటచేత వర్తమానకాలమును సూచించునపుడు లడ్వర్ణ

కము చేరునని యర్థము. లడ్వర్ణకము కేవల సాంకేతిక మగు టచే, దాని స్థానమున నేవో ప్రత్యయములు విధింపబడును. వానికి పూర్వమందు 'ఉన్న' అన్నది ధాతువున కనుప్రయుక్త మగు నని సూత్ర తాత్పర్యము.

**14.** ఉన్న శబ్దంబు పరంబగునపుడు చువర్ణకం బగు. (బా - ౧౪)

వ్యాఖ్య - సూత్రమునందు చెప్పినట్లు 'ఉన్న' యన్నది వచ్చిన యెడల దానికి పూర్వమందు 'చు' అను ప్రత్యయము కలుగునని సూత్రార్థము.

'వచ్చు' అన్నది ఉదంతధాతువు. దానికి లట్టు పరము కాగా 'ఉన్న' అన్న అనుబంధము చేరును. అపుడు 'వచ్చు + ఉన్న' అని యుండును. ప్రస్తుత సూత్రముచేత ధాతువునకు చువర్ణకము కలుగగా 'వచ్చు + చు + ఉన్న' అని యగును. ఏకవచనమున 'ది' అనియు, బహువచనమున 'వి' అనియు చేరగా (సూత్రము 12) 'వచ్చుచున్నది' అనియు 'వచ్చు చున్నవి' అనియు రూపము లేర్పడును.

[ఇవి అమహద్రూపములు. తక్కిన రూపములను సాధించుట కీ తరువాతి సూత్ర మావశ్యకము.]

**15.** దివీతరంబగు డుజ్ఞు పరంబగునప్పుడున్నానుబంధంబునకు దీర్ఘం బగు. (బా - ౧౫)

ప్రథమము: వాఁడు వండుచున్నాఁడు-వారు వండుచున్నారు-అది వండుచున్నది - అవి వండుచున్నవి ॥ మధ్యమము : నీవు వండు

చున్నావు-మీరు వందుచున్నారు॥ ఉత్తమము: నేను వందుచున్నాను-మేము వందుచున్నాము.

వ్యాఖ్య - 'డుఙ్ఞు' అని యనగా 'డు రు వు రు ను ము' అను పురుష ప్రత్యయములని యర్థము. ది, వి - యనునవి కూడ డు రు లకు ఆదేశముగా వచ్చునవే కాని అవియు పురుష ప్రత్యయములే. ది వి యనునవి కాక మిగిలిన పురుష ప్రత్యయములు పరమగునపుడు 'ఉన్న' యన్న యనుబంధమునకు దీర్ఘ మగునని సూత్రార్థము.

['ఉన్న' యన్న యనుబంధమునకు దీర్ఘ మగును - అని యనగా పూర్వమందా? పరమందా? అను ప్రశ్న వేయవచ్చును. ద్విత్వము పరమందుండగా అచ్చిక శబ్దములలో దీర్ఘము కలుగదు. ఉవర్ణమునకు దీర్ఘము రాదు. ఇంక ఉన్నది చివరి వర్ణము కావున దానికే దీర్ఘము వచ్చునని భావము. 'ది వి' యన్నవే కాక దు, వు అన్నవియు పురుషప్రత్యయముల లోనివే. కాని అవి పరమందుండగా 'ఉన్న' అన్న యనుబంధము కలుగదు. కావున వాని ప్రసంగమునకు ప్రస్తుత సూత్రమున నావశ్యకము లేదు.]

వందు + చు + ఉన్న + డుఙ్ - అని యున్నప్పుడు 'ఉన్న' కు దీర్ఘము రాగా 'వందుచున్నాఁడు' అని యగును. తక్కినవియు నిట్టి రూపములే. వందుచున్నది, వందుచున్నవి - అన్నవి అమహత్తులకయిన రూపములు. అచ్చట ది, వి - అను ప్రత్యయములు పరమగుటచే 'ఉన్న'కు దీర్ఘము కలుగలేదు.

**16. లిఙాతుల డుఙున కెను ను వర్ణకంబులగు. (బా-౧౬)**

**లిఙాదేశంబగు డుఙునకు 'ఎను' అనునది లాఙాదేశంబగు డుఙునకు 'ను' అనునదియు నాదేశంబు లగు.**

వ్యాఖ్య - భూతమునందగు లిట్టు వర్ణకము యొక్క డుజ్జునకు బదులుగా ఎను వర్ణమును, తద్ధర్మాదులందగు లాట్టు వర్ణకముయొక్క డుజ్జునకు బదులుగా 'ను' వర్ణకమును ధాతువునకు చేరునని సూత్రార్థము.

'వచ్చు' అను ధాతువునకు ప్రథమ పురుషైకవచనమున డుజ్జు కలుగును. వచ్చు + డుజ్జు - ఇట్లు కలుగవలసి యుండగా ప్రస్తుత సూత్రము డుజ్జునకు బదులుగా 'ఎను' విధించుచున్నది. కావున 'వచ్చు + ఎను = వచ్చెను' అని యగును. ఇది లిట్టు రూపము.

లాట్టుయొక్క డుజ్జునకు 'ను' వర్ణము కలుగును. అపుడు 'వచ్చు + ను = వచ్చును' అని యగును.

**17.** భూతంబునం దిగాగమం బగు. (బా - ౧౩)

భూతార్థ వృత్తియగు ధాతువున కిగాగమం బగు.

వ్యాఖ్య - భూతార్థమునందు వ్యవహరించు ధాతువునకు ఇగాగమము కలుగునని యర్థము.

[చిన్నయసూరి యిచ్చట తాను కల్పించుకొన్న పరిభాష ననుసరించి "లిట్టు పరంబగునపు డిగాగమం బగు" అను విధముగా చెప్పవలసి యున్నను, సంగ్రహత్వ మపేక్షించి 'భూతంబునందు' అని ప్రయోగించుట జరిగెనని యనిపించుచున్నది.]

**18.** లిటు వుఞు పరంబగునపుడు ఇవర్ణకం బగు.

(బా - ౧౮)

ఇకారంబు మీఁది కుమవు క్రియావిభక్తుల యను సూత్రముచే

రుష్మున కిత్వంబగు ॥ ప్ర : వండెను - వండిరి ॥ మ : వండితివి - వండితిరి ॥ ఉ :వండితిని - వండితిమి.

వ్యాఖ్య- భూతకాలమును సూచించు లిట్టుయొక్క పుష్మ పరమగునపుడు ధాతువునకు 'తి' అను ప్రత్యయము కలుగు నని యర్థము. పుష్మ అనియనగా మధ్యమ పురుషయందలి వురు లును, ఉత్తమపురుషయందలి నుములును గ్రహింపబడును.

'వండు' అను ధాతువునకు మధ్యమపురుషైక వచనమున 'వు' వర్ణకము పరముకాగా 'వండు + వు' అనియగును. పూర్వ సూత్రముచేత భూతమునం దిగాగమము కాగా 'వండి + వు' అని యగును. ప్రస్తుతసూత్రముచేత 'తి'వర్ణకముకలుగగా 'వండి + తి + వు' అని యగును. 'ఇకారంబుమీఁది కునువు క్రియావిభ క్తుల యుత్వంబున కిత్వం బగు" అన్న (బా.తత్సమ-26) సూత్ర మును బట్టి 'వు' ప్రత్యయము 'వి' యని మారును. అప్పుడు 'వండితివి'అని యేర్పడును. ఇది భూతకాలిక మధ్యమ పురుషైక వచనము. ఇట్లే బహువచనరూపము 'వండితిరి' అని యగును. ఉత్తమపురుషయందు 'వండితిని' అని యేకవచనమునందు 'వండి తిమి' అని బహువచనమునందు రూపము లుండును.

ప్రథమపురుషయందు పూర్వ (బా-16) సూత్రముచేత 'ఎను' వర్ణకముకలిగి 'వండు + ఎను = వండెను' అని యేక వచన రూపమేర్పడును. బహుత్వమునందు 'వండు + రు' అని యుండి భూతమునం దిగాగమము కాగా 'వండి + రు' అనియై 'ఇకారంబుమీది అని మొదలయిన సూత్రము వలన 'వండి + రి' అనియై 'వండిరి' అను రూపమేర్పడును.

**19.** కలజ్యనుబంధంబు ల్ఋట్టు పరంబగునప్పు డగు
(బా - ౧౯)

ల్ఋట్టు పరంబగునపుడు ధాతువునకు 'కలజి' అనునది యను ప్రయుక్తం బగు.

వ్యాఖ్య - భవిష్యత్కాలమును సూచించు ల్ఋట్టు పర పరమగునపుడు ధాతువునకు 'కలజి' అన్న యనుబంధము కలుగు నని సూత్రార్థము. ఇందు 'కల' యనునదియే అనుబంధము. 'జి' యనునది ఇత్సంజ్ఞ.

**20.** జీత్తు పరం బగునప్పు డుత్వంబున కత్వం బగు.
(బా - ౨౦)

జీత్తు పరంబగునపుడు ధాతువు ను త్వంబున కత్వం బగు.

వ్యాఖ్య - 'జి' యనునది ఇత్తుగా గలది జీత్తు. జీత్తు పరమయినపుడు ధాతువుయొక్క ఉత్వమునకు అత్వము కలుగు నని సూత్రార్థము. 'వండు' అను ధాతువునకు భవిష్యత్కాల సూచకముగా 'కలజి' అన్న యనుబంధము కలిగి, ఆ పిదప పురుష ప్రత్యయము కలుగును. వండు + కలజి + డుజ్ అని యున్నచో 'కలజి' అనుచోటి జీత్తుచేత ధాతువుయొక్క ఉత్వము అత్వమగును. అప్పుడు ఇత్సంజ్ఞ తొలగిపోవును. వండ + కల + డుజ్ అని యుండును. తరువాతి (బా-21) సూత్రమునుబట్టి నుగాగమము కలుగగా 'వండ + ను + కల + డుజ్' అనియై ద్రుతకార్యముచేత 'వండఁగల + డుజ్' మున్నగు విధముగా చేర్పడును. 'డుజ్' అనునది జిత్తు కావున బిందుపూర్వకమై 'వండఁగలఁడు' అని యగును.

## 21. కలజీ పడుజులు పరంబులగునపుడు నుగాగమం బగు.

(బా - ౨౧)

ద్రుతకార్యంబు ॥ ప్ర : వండఁగలఁడు - వండఁగలరు - వండఁగలదు - వండఁగలవు ॥ మ : వండఁగలవు - వండఁగలరు ॥ ఉ : వండఁగలను - వండఁగలము.

వ్యాఖ్య - కలజీ, పడుజీ - అను అనుబంధములు పరములగునపుడు ధాతువునకు ఆగమముగా 'ను' వర్ణము కలుగునని సూత్రార్థము. కలజీ అన్నది లృట్టు పరమగునప్పుడు అయ్యేడి అనుబంధము. కర్మమున కయ్యేడి అనుబంధము 'పడుజీ' అనునది (బా-49).

ఈ రెండును జీత్తులగుటచేత ధాతువుయొక్క ఉత్వమునకు అత్వము కలుగును. ఆపిదప 'ను' వర్ణము కలిగి ద్రుతకార్యము జరుగగా వండఁగలఁడు, వండఁగలరు, వండఁగలదు, వండఁగలము - మున్నగు రూపము లేర్పడును. పడుజ్యనుబంధము పరమగునపుడు వండఁబడను, వండఁబడవు - మున్నగు రూపము లేర్పడును.

## 22. లాట్టు రుణ్ణు పరంబగునపుడు దుగాగమం బగు.

(బా-౨౨)

ప్ర : వండును - వండుదురు ॥ మ : వండుదువు - వండుదురు॥ ఉ : వండుదును - వండుదుము॥ లాడర్థంబులయందోలి నుదాహరణంబులు వక్కాణించెద॥ తద్ధర్మంబు-కులాలుండు కుండలు వానును॥ తచ్ఛీలంబు-జాలనజాలంబు లుపకరం [illegible]

వాఁడింట నుండును॥ సంప్రశ్నము-ఉందునా పోదునా॥ సాతత్యము-సర్వంబునం దీశ్వరుఁ డుండును - సర్వంబీశ్వరునియం దుండును॥ వర్తమానంబు-మేన నిప్పుడుం బులకలు వొడమెడును. వక్ష్యమాణవిధిచేఁ బ్రాయికంబుగ వర్తమానంబునం దెడుగా వ్యాగమంబు లగు॥ భావి-వాఁడు రేపు వచ్చును॥ ఆశీస్సు - శుభంబగును॥ వచ్యర్థంబుల కొకానొకచో భూతంబున లాట్టు గానంబడియెడును.

వ్యాఖ్య : తద్ధర్మాదులందు లాట్టగును. కావున తద్ధర్మాదులను తెలియజేయు రు, వు, రు, ను, ము - అను క్రియా విభక్తులు పరమగునప్పుడు ధాతువునకు 'దు' వర్ణము ఆగమముగా కలుగునని సూత్రార్థము. తద్ధర్మాదులని యనుటచేత తద్ధర్మము, తచ్ఛీలము, సంభావన, సంప్రశ్నము, సాతత్యము, వర్తమానము, భావి, ఆశీస్సు - మున్నగువానిని గూడ గ్రహింపవలయును.

వండు + లాట్టు॥ ఇట్లున్నప్పుడు ప్రథమైక వచనమున డుజ్జు కావలయును. కాని డుజ్జునకు బదులుగా 'ను' వర్ణము (బా-16) కలుగును. అప్పుడు 'వండును'అని యగును. ప్రస్తుత సూత్రము ఈ విషయమున వర్తింపదు.

ప్రథమపురుష బహువచనమునం దగు 'రు' వర్ణము మొదలుకొని, మధ్యమపురుషయందు నుత్తమపురుష యందును ఉభయవచనములు పరమగుచుండగా ధాతువునకు 'దు' వర్ణము కలుగవలసియున్నది. వండు + రు - అనియుండగా దుగాగమము కలిగి వండు + దు + రు = వండుదురు అని యగును. ఇది ప్రథమపురుష యేకవచనమున 'వండుదువు'అని బహువచనమున

'వండుదురు' అని, ఉత్తమపురుష యేకవచనమున 'వండుదును' అని బహువచనమున 'వండుదుము' అని రూపము లేర్పడును.

తద్ధర్మాదులకు ఉదాహరణములుగా చూపిన వన్నియు దుగాగమమురాని రూపములే. అక్కడ కర్తలు 'కులాలుడు' మున్నగు అన్యార్థకములే యగుటచేత క్రియ ప్రథమ పురుషయందుండును. ప్రథమపురుష యేకవచనమున ఈదుగాగమము కలుగదు. కులాలుఁడు కుండలు వానును - మున్నగుచోట్ల నిట్టి రూపములను చూడవచ్చును. జ్వలనజ్వాలంబు లుప్పరం బెగయును - అను చోట కర్త బహువచనమున నున్నది. అయినను క్రియాపదము ఏకవచనమునందే యుండును. (బా - 25) కాబట్టి యిక్కడ సైతము దుగాగమమున కవకాశము లేకపోయినది.

సంప్రశ్నమునందు "ఉందునా పోదునా" అన్నది యుదాహరణము. ఇచ్చట నిజమునకు 'ఉందును,పోదును' అన్నవియే రూపములు. వీనిపై ప్రశ్నార్థమునం దగు 'ఆ' కలిగినది. కేవల ప్రశ్నయే యైనచో సమాధానము నపేక్షించును. ఇది యితరులనుండి సమాధానము నపేక్షింపక, తన్ను తాను ప్రశ్నించుకొనుటయే. కావున దీనిని సంప్రశ్నమని పేర్కొనెను. ప్రశ్నమునందును, సంప్రశ్నమునందునుగూడ లాద్రూపముపై 'ఆ' వర్ణము చేరును.

వక్ష్యమాణవిధి యని యనగా ఇకముందు చెప్పబడు నియమ మని యర్థము. ఎడు, ఎడి - అను నాగమములను ఇరువది మూడవ సూత్రమున సూరి విధింపబోవుచున్నాడు. దానిని సూచించుచు "మేన నిప్పుడుం బులకలు వొడమెడును" అను నాగమాగమును చూపుచున్నాడు.

వచి + అర్థము = వచ్యర్థము = అను, పలుకు, చెప్పు - మున్నగు నర్థము అని యర్థము. ఈ పయినున్న యర్థము లను దెలుపు క్రియ యుపయోగించునప్పుడు భూతకాలమును సూచించు క్రియకు బదులుగా తద్ధర్మాద్యర్థకమును వాడుట ప్రయోగములందు కలదని వివరణార్థము. "పౌరుషంబు చూవె ఫలమండ్రు కొందఱట్లనక దైవమిచ్చు నండ్రు కార్యఫలము". అనుచోట 'అండ్రు' అను రూపమునకు 'అనిరి' అనియే యర్థము. అనగా భూతకాలమునందగు రూపమునకు బదులుగా తద్ధర్మ ర్థాపము ప్రయోగింపబడినదని యర్థము.

[తద్ధర్మరూపము భూతకాలమును, వర్తమానకాలమును. భవిష్య త్కాలమును గూడ బోధించుట సామాన్యవిషయమే. కావున భూతమును గూర్చి మాత్రమే వేరుగా వేర్కొనవలసిన యవసరము లేదు. సూరియే 'లాట్టు గానంబడియెడును' అనుచోట లాడ్రూపమును లిట్టునకు బదులుగా వాడుట కలదు. 'కానంబడియెడును' అని యనగా 'కానంబడియె' ననియే యర్థము. అయినను వచ్యర్థములకు తక్కిన ధాతువులకంటె మిక్కిలిగా లాట్ప్రయోగము కనిపించుటచేత సూరి వేరుగా పరిగణించి చెప్పుట జరిగె నని తలపవలయును.]

**23.** లాట్టు రుణ్ణు పరంబగునపు డెదగాగమంబును, ప్రథమ, ను వర్ణకంబు పరంబగునపు డెడు గెడి గాగమంబులును బహుళంబుగా నగు. (బా-౨౭)

ప్ర : వండెడను-వండెడిని-వండెదరు॥ మ : వండెదవు-వండె దరు॥ ఉ : వండెదను-వండెదము.

వ్యాఖ్య - తద్ధర్మాదులందు వచ్చు లాట్టునకు బదులుగా వచ్చు నువర్ణకము పరముగా నున్నప్పుడు ఎడు, ఎడి - అను నాగమములును, మిగిలిన రుజ్ఞు పరముగా నున్నప్పుడు 'ఎద' యను నాగమమును బహుళముగా ధాతువునకు చేరునని సూత్రార్థము.

'వండు' అను ధాతువునకు ప్రథమైకవచన ప్రత్యయమైన 'ను' పరము కాగా 'ఎడి' అని కాని 'ఎడు' అని కాని అదనముగా వచ్చి చేరవచ్చును. వండు + ఎడు + ను = వండెడును. 'వండు + ఎడి + ను' అని యున్నప్పుడు "ఇకారంబుమీఁది కు ను వు క్రియావిభక్తుల యుత్వంబున కిత్వం బగు" అన్న (బా. తత్సమ - 26) సూత్రమును బట్టి 'వండెడి + ను = వండెడిని' అని యగును.

'వండు' అను ధాతువునకు ప్రథమపురుష బహువచన ప్రత్యయమైన 'రు' వర్ణకము పరముకాగా 'ఎద' అను నాగమము కలుగును. వండు + ఎద + రు = వండెదరు అను రూపమేర్పడును. ఇట్లే మధ్యమపురుషయందు వండెదవు, వండెదరు అనియు-ఉత్తమ పురుషయందు వండెదను, వండెదము అనియు రూపము లేర్పడును.

బహుళ కార్యముగా పేర్కొనుటచేత పైని చెప్పిన ఆగమములు రాని పక్షమున వండును, వండుదురు - మున్నగు రూపములు రావచ్చును.

**24. లిఙ్లాట్టుల వకారంబునకు లోపంబు విభాష నగు.**

**(బా - ౨౪)**

వండితి - వండితివి; వండుదు - వండుదువు; వండెదు - వండెదవు.

వ్యాఖ్య-భూతకాలమునందును, తద్ధర్మాద్యర్థమునందును మధ్యమ పురుషైకవచనమునకు వచ్చు ప్రత్యయముయొక్క 'వ' కారమునకు లోపము విభాషగా వచ్చునని సూత్రార్థము.

'వండితివి' అన్నది భూతకాలక్రియ; మధ్యమపురుషము. ఇచ్చటి పురుషప్రత్యయము 'వి' అన్నది. ఇందలి 'వ' కారమునకు లోపము రాగా 'వండితి + ఇ' అని యుండి అపదాదిసంధి వలన 'వండితి' అని యగును. తద్ధర్మాద్యర్థక రూపమయిన 'వండుదువు' అను దానిలో 'వ' కారము లోపింపగా 'వండుదు + ఉ' అనియుండి అపదాది సంధివలన 'వండుదు' అని యగును. 'వండెదవు' అన్నది కూడ తద్ధర్మార్థకరూపము. ఇచ్చట కూడ వకారమునకు లోపము రాగా 'వండెద + ఉ' అని యుండి, అపదాదిసంధివలన 'వండెదు' అని యగును.

[వకారంబునకు అని చెప్పిన విషయమును గమనించుట యిచ్చట ముఖ్యము. వు, వి-మున్నగు ప్రత్యయములకు కాక అందలి హల్భాగమునకు మాత్రమే సూరి లోపమును విధించెను. అది గమనింపక పూర్తి ప్రత్యయమునకు లోపము చేయునెడల వండితి, వండుదు - అనురూపములకడ ఇబ్బంది యుండదు; కాని 'వండెదు' అను రూపము సాధ్యము కాదు. కావున హల్మాత్రమునకే లోపమన్న సంగతిని గుర్తించుట యవసరము.]

'విభాష' యని సూత్రమునందు నిబంధించుటచేత, లోపము రాని పక్షమున వండితివి, వండుదువు, వండెదవు - మున్నగు విధముగనే రూపము లుండును.

**౨౫. తిర్యగ్జడంబులు వాచ్యంబు లగునపుడు లిడ్లాట్ల ప్రథమ బహువచనంబున కేకవచనం బగు (బా-౨౫)**

చిలుకలు పలికెను-చిలుకలు పలుకును - చిలుకలు పలికెడును-మేఘములు గర్జిల్లెను-మేఘములు గర్జిల్లును-మేఘములు గర్జిల్లెడును.

వ్యాఖ్య - తిర్యక్కులును జడములును క్రియచేత చెప్పబడినప్పుడు లిట్టు యొక్కయు లాట్టు యొక్కయు ప్రథమ పురుషబహువచనమునకు ఏకవచన మగునని సూత్రార్థము. 'చిలుకలు పలికెను' అనుచోట కర్త 'చిలుకలు', తిర్యగ్వాచకము ; బహువచనము. కావున కర్తకు అనురూపముగా క్రియయు బహువచనమున నుండవలయును. కాని ప్రస్తుత సూత్రముచేత ఏకవచనమే కలుగుచున్నది. కావుననే 'పలుకు + లిట్టు' అనియుండి లిట్టు స్థానమున ప్రథమైక వచనమగు 'డుఙ్జు' వచ్చును. 'పలుకు + డుఙ్జు' అని యున్నపిమ్మట 'ఎను' వర్ణకము (బా-౧౬) రాగా 'పలుకు + ఎను' అని యగును. "ఇత్వంబుగాని యెత్వంబుగాని కూడుచో ననాద్యంబయిన యుత్వంబున కిత్వంబగు" అన్న (బా-౮౫) సూత్రమునుబట్టి 'పలికెను' అని యగును. ఇట్లే లాట్టుయొక్క ప్రథమ బహువచనమునకు ఏకవచనము రాగా "పలుకు + డుఙ్జు" అనియుండి 'ను' వర్ణము ఆదేశము కాగా 'పలుకును' అని యగును. ఎడు వర్ణకము (బా-౨౩) రాగా పలుకు + ఎడు + ను = పలికెడును అని యగును. జడములయిన మేఘములు కర్తగా నున్నప్పుడును ప్రక్రియ యీ విధముగనే యుండును.

['తిర్యగ్జడంబులు' అని యనుటచే స్త్రీలను కాక, అమహద్వాచకము ంబులో శక్తి సన్మానిని చెప్పుటి జరిగినది. (స్త్రీలనుగూర్చి చెప్పునప్పు డెట్లుండ

వలయునో ఆచ్ఛికపరిచ్ఛేదమున "సర్వనామ క్రియాపదంబుల బహువచనంబు మహత్తునకుం బోలె మహతి కగు" అను (బా-26) సూత్రముచేత నిరూపింపబడెను.]

## 26. మహద్బహు కర్తృక క్రియకు నేకవచనంబు విభాష నగు. (ప్రౌ - ౬)

తన యెఱింగిన యర్థం బొరు । డనఘా! యిది యెట్లు చెప్పుమని యడిగినఁ జె । ప్పనివాఁడును సత్యము చె । ప్పనివాఁడును ఘోర నరక పంకమునఁ బడున్ ॥ భార. ఆది. ౧ ఆ ॥ పక్షమున - బలవంతుఁడు పయినెత్తిన । బలహీనుఁడు ధనము కోలుపడిన యతఁడు ము । చ్చిలి ప్రేఁగునతఁడుఁ గామాకులచిత్తుఁడు నిద్ర లేక కుందుదు రధిపా । భార. ఉద్యో. ౨ ఆ ॥ మొ.

వ్యాఖ్య - మహద్వాచకములను పెక్కింటిని కర్తలుగా గల క్రియకు విభాషగా ఏకవచనము కలుగునని సూత్రార్థము. కర్త బహువచనము నందున్నప్పుడును, కర్తలు అనేకముగా నున్నపుడును క్రియ బహుత్వమును గలిగియుండును. కాని ప్రస్తుత సూత్రము విశిష్టకార్యమును నిరూపించుచున్నది.

అడిగినఁ జెప్పనివాఁడును, సత్యము చెప్పనివాఁడును- అని కర్తృవాచకములు రెండున్నవి. అయినప్పటికిని క్రియాపదము 'పడున్' అని యేకవచనమునందే యున్నది. ప్రస్తుత సూత్రము ఇట్టి రూపమున కవకాశము కలిగించుచున్నది. "విభాష నగు" నని చెప్పుటచేత, ఏకవచనము రానిపక్షమునందు 'పడుదురు' అని బహువచనముకూడ నుండవచ్చును. "బలవంతుఁడు పయినెత్తిన" మున్నగా గల యుదాహరణమునందు క్రియా

పదము బహువచనాంతముగనే యున్నది. అచ్చటకూడ 'కుందుదురు' అని యనుటకు బదులుగా 'కుందును' అన్న ఏకవచన రూపము సైతము నుండవచ్చును.

[సూత్రమున "మహద్బహు కర్తృకక్రియ" అని యున్నది. మహత్తులను బోధించు ననేక కర్తలు గల క్రియ యని యర్థము. ఏ కర్త కా కర్త యేకవచనము నందున్నప్పుడే సై కార్యము జరుగును. బహువచనము నందున్నప్పుడు ఏకత్వము కలుగుటయన్న ప్రసంగము లేనే లేదు. కావున, వ్యాకర్త దానిని స్పష్టము చేయుచు "ఏకవచనాంత మహత్ కర్తృ పదంబులు పెక్కులున్నను తత్క్రియకు నేకవచనంబు విభాషనగు." అను విధముగా చెప్పియుండిన సమంజసముగా నుండెడిది.]

ప్రౌఢ వ్యాకరణకారుడు పూర్వ పరిచ్ఛేదములయందు అనుసరించిన విధానమునుబట్టి 'మహత్' అని యన్నప్పుడు మహతీవాచకములను, మహద్వాచకములను గలిపియే గ్రహించుట సమంజసము. మహతీవాచకములయిన పెక్కు కర్తలున్నపుడు సైతము క్రియాపదము ఏకవచనాంతమై విభాషగా నుండునని తేలుచున్నది.

**27.** తద్ధర్మార్థక విశేషణం బసహాయతం త్రికాలవాచి యగు. (ప్రౌ - ౧)

వారి యనుపయించు సితకృష్ణ తంతురాజిత తంత్రమది (అనుపయించు = అనునయించుచున్న॥ భార. ఆది ౧ ఆ॥ నానేర్చు విధంబున (నేర్చు = నేర్చిన)॥ భార. ఆది. ౧ ఆ॥ నాపదు ప్రయాసము లూరక పోకయుండ (పడు = పడిన) ॥క శా. ౪ ఆ॥ ద్రుపదు వీటిలోన దొమ్మికయ్యము రేచెఁ। బసుఁబట్టె విరటు పట్టణమున। మఱియుఁ తెన్ని లేవ మారాండ తనయుండు। తొడరి మనకుఁ జేయు దుండ

గములు (చేయు = చేసిన) ॥ జై. ౧ ఆ ॥ జనమేజయు చేయు సర్ప యాగమున (చేయు = చేయఁగల)॥ భార. ఆది ౧ ఆ॥ మొ.

వ్యాఖ్య - తద్ధర్మమును బోధించు ధాతుజవిశేషణము, ఇతరపదములయొక్క సాహాయ్యము లేనియెడల మూడు కాలములను బోధించునని సూత్రార్థము. ధాతువుయొక్క అర్థమును బోధించునది తద్ధర్మార్థకము. ఇది సమాపక క్రియా రూపము. ఇది ధాతుజవిశేషణములలో నొకటిగా వ్యవహరించునపుడు 'తృవర్ణకార్థము' అని పిలువబడును. చేయు, చేసెడి, చేసెడు - మున్నగునవి యుదాహరణములు. ఇట్టివానినే 'తద్ధర్మార్థక విశేషణము'అని ప్రౌఢ వ్యాకరణకారుడు వ్యవహరించుచున్నాడు.

ఇట్టి తద్ధర్మార్థక విశేషణము మూడు కాలములను బోధించును. తద్ధర్మార్థకమునకు కాలబోధక చిహ్నమేమియు చేరదు. ఇతర పదములనుబట్టి కాలమును నిర్ణయించుకొనవలయును. 'అనువయించు' అని యన్నప్పుడు 'అనువయించుచున్న' అని వర్తమానకాలము బోధింపబడుచున్నది. 'నేర్చు విధంబున' అని యన్నప్పుడు 'నేర్చిన' అని భూతకాలము బోధింపబడుచున్నది. అట్లే 'పడు' అని యన్నప్పుడు 'పడిన' అని, 'చేయు' అని యన్నప్పుడు 'చేసిన' అని భూతకాలబోధ జరుగుచున్నది. 'జనమేజయు చేయు' అని యన్నప్పుడు 'చేయఁగల' అని భవిష్యత్కాలము స్ఫురించుచున్నది. సందర్భమునుబట్టియే వాని కాయాకాలముల బోధ కలుగుచున్నది.

' [ఇచ్చట ప్రౌఢ వ్యాకరణ కారుడు 'త్రికాలవాచి' అని 'కాల' శబ్దమును వాడుట యుచితముగా లేదు. చిన్నయసూరి యిట్టియెడల భవిష్య

దర్థకము, వర్తమానార్థకము, భూతార్థకము మున్నగు విధముగా 'అర్థకము' అను శబ్దమును వాడును. 'కాలము' అను పదమును సమాపకక్రియను బోధించుటకు మాత్రమే యుపయోగించును. ఆ రెండింటికిని భేదము పాటించుట యవసరమే. ఇంకొక విషయము. సూరి "తద్ధర్మాదులందు లాట్టగు" అని (శా - ౕ) తెల్పి వివరణమునందు వర్తమానము, భావి మున్నగువాని నాదిపదముచేత గ్రహించెను. తద్ధర్మార్థకముయొక్క లక్షణముచేతనే తద్ధర్మార్థక విశేషణముయొక్క లక్షణముకూడ గ్రహింపబడును. కావున, ప్రస్తుత ప్రౌఢవ్యాకరణ సూత్ర మావశ్యకము కాదు. తద్ధర్మార్థకము మూడు కాలములను బోధించునట్లే, తద్ధర్మార్థక విశేషణము భూతభవిష్యద్వర్తమానార్థములను బోధించును.]

**28.** ఒకానొకచోఁ దద్ధర్మార్థకములగు నుండు చను చేరుకొనులు ప్రశ్నార్థ కైకారపరకంబు లగునపుడు వాని కడయచ్చులకు లోపంబు విభాష నగు: అగుచో నుండు డకారంబునకు నకారం బగు. (ప్రౌ - ౨)

చేరుకొను అనఁగా నను ప్రయుక్తమగు కొను ధాతువని యర్థము. అమ్మరియాద దప్పమెలఁగినఁ బురుషార్థంబునకు హాని వట్టకయున్నే ॥ భార. విరా. ౧ ఆ ॥ మునీంద్ర! నీకుఁ జన్నె నలినాక్షులందు మది నిల్పఁగ ॥ భార. ఆది. ౮ ఆ ॥ అహితముం భయముం దొరకొన్నె నాకు నాపుత్త్రులకున్ ॥ భార. సభా. ౨ ఆ ॥ పక్షమున - ఉండునే॥ మొ.

వ్యాఖ్య - ప్రశ్నార్థమునందు వచ్చెడి 'ఏ' యనునది పరమైనప్పుడు తద్ధర్మార్థకము లయిన ఉండు, చను, అను ప్రయుక్తమగు కొను-అనువానియొక్క చివరి అచ్చునకు లోపము విభాషగా వగును; ఇట్లు లోపము వచ్చునప్పుడు

'ఉండు' ధాతువుయొక్క డకారమునకు బదులుగా నకారము వచ్చును - అని సూత్రార్థము.

'ఉండును' అన్నది తద్ధర్మార్థకము. దీనిపైని ప్రశ్న యందు 'ఏ' యని రాగా 'ఉండును + ఏ' అని యగును. ప్రస్తుత సూత్రమునుబట్టి 'ఉండు' యొక్క చివరి ఉత్వమునకు లోపము రాగా 'ఉండ్ + ను + ఏ' అని యగును. డకారమునకు నకారము రాగా 'ఉంన్ + ను + ఏ' అని యగును. తెలుగునందు పరుష సరళములకు ముందుమాత్రమే బిందు వుండును. ఇక్కడ పరమందు స్థిరమున్నది కావున బిందువు తొలగిపోగా 'ఉన్ + ను + ఏ = ఉన్నే' అని యగును. ఇది విభాషగా నగును కావున, కాని పక్షమున 'ఉండునే' అనియు నుండవచ్చును.

'చనును + ఏ' అని యుండగా ప్రస్తుత సూత్రముచేత చను ధాతువు తుది యచ్చునకు లోపముకాగా 'చన్ + ను + ఏ = చన్నే' అని యగును. ఇట్లు లోపముకాని పక్షమునందు 'చనునే' యని యుండవచ్చును. చేరుకొను అని యనగా చేరు నటువంటి 'కొను' ధాతువని యర్థము. శబ్దపల్లవములలో (శా-118) 'కొను' ధాతువు చేరిన రూపములు గలవు. ఆత్మనే పదార్థమునందును ధాతువునకు 'కొను' ధాతువు అనుప్రయుక్త మగును (శా. 52). ఇట్లు అనుప్రయుక్తముగా చేరెడు 'కొను' ధాతువునే ప్రౌఢవ్యాకరణకారుడు 'చేరుకొను' అని వ్యవహరించుచున్నాడు. 'దొరకొనును + ఏ' అని యున్న ప్పుడు 'కొను' యొక్క తుది యచ్చునకు లోపమురాగా

'దొరకొన్నే' అని యగును. లోపము రానిపక్షమున 'దొర కొనునే' అనియే యుండును.

[సూత్రమునందు 'తద్ధర్మార్థకములు' అని సాధారణముగా ఉప యోగించుటయే కలదు. కాని యుదాహరణము లన్నింటియందును ప్రథమ పురుషైకవచన రూపములు మాత్రమే గ్రహింపబడెను. నిబమునకు ప్రథమ పురుషైకవచనమునందే పై సూత్రము వర్తించును. కావున "ను వర్ణాంతములై తద్ధర్మార్థకములగు" మున్నగు విధముగా సూత్రరచన సాగిన సమంజసముగా నుండెడిది. పైగా ప్రస్తుతసూత్రమునందు ప్రారంభ మున నున్న "ఒకానొకచో" అన్నమాటకు సార్థకత్వముకూడ లేదు. కావున దానిని తొలగించుటకూడ అవసరమే.]

**29. తద్ధర్మ భూతక్రియ లార్యాద్యర్థ పరకంబులయి ప్రశ్నార్థకంబు లగు. (ప్రౌ. - ౩)**

మీ వంశమున నరదేవోత్తములరైన సద్ధర్మమార్గంబు నలుపు దయ్యా ॥ భార. సభా. ౧ఆ ॥ సన్మానితులై వర్తింతురయ్యా నీవైవ జ్ఞుల్ ॥ భార. సభా. ౧ ఆ ॥ పంచితయ్యా ॥ భార. సభా ౧ ఆ ॥

వ్యాఖ్య - అయ్యా, అమ్మ మున్నగునవి పరమందు రాగా తద్ధర్మార్థక క్రియలును, భూతకాల క్రియలును ప్రశ్నా ర్థకము లగునని సూత్రతాత్పర్యము.

'చలుపుదువు' అన్నది తద్ధర్మార్థకము; మధ్యమ పురుష; ఏకవచనాంతము "లిఙ్లొట్టుల వకారంబునకు లోపంబు విభాష నగు" అన్న (బా - 24) సూత్రముచేత 'వ' కారమునకు లోపము కలిగి 'చలుపుదు + ఉ = చలుపుదు' అని యగును. దీనికి ప్రస్తుత సూత్రముచేత 'అయ్యా' అను శబ్దము పరముకాగా

'చలుపుదు + అయ్యా = చలుపుదయ్యా' అని యగును. దీనికి 'చేయుచున్నావా ?' అని యర్థము.

'వర్తింతురు' అన్నది తద్ధర్మార్థకము; ప్రథమ పురుష; బహువచనాంతము. దీనిపై 'అయ్యా' అన్న శబ్దము చేరి 'వర్తింతురయ్యా' అని యగును. "వర్తించుచున్నారా ?" అని దీని యర్థము.

'పంచితివి' అన్నది భూతకాలము; మధ్యమ పురుష; ఏకవచనము. ఇచ్చట లిడ్వకారమునకు (బా - 24) లోపము రాగా 'పంచితి + ఇ = పంచితి' అని యగును. దీనికి 'అయ్యా' అను శబ్దము పరము కాగా 'పంచితయ్యా' అని యగును. దీనికి "పంపితివా ?" అని యర్థము.

"ఆర్యాద్యర్థపరకములు" అని సూత్రమునందు తెల్పినను వ్యాకర్త ఆర్యార్థకము పరమైనవానినే యుదాహరణములుగా చూపెను. ఆర్యాద్యర్థకము లని యనగా అయ్యా, అమ్మ, అన్న - మున్నగునవని యర్థము.

**30.** ఒక్కొకచోఁ దద్ధర్మక్రియ యార్యాద్యర్థపరకంబయి వ్యతిరేక వ్యంజక ప్రశ్నార్థకం బగు. (ప్రౌ - ౪)

తనయుఁడు తండ్రి యగ్రజుఁడు తమ్ముఁ డనంజనునయ్య రాజ్యముం గొనుచోట ॥ నిర్వ. 3 ఆ ॥ సురాంగనలెల్ల నిట్టి నీచేఁతకు మెత్తురమ్మ ॥ స్వా 3 ఆ ॥

వ్యాఖ్య - ఒక్కొకయెడ తద్ధర్మార్థకము 'అయ్యా' మున్నగు శబ్దమును జేర్చుకొని వ్యతిరేకార్థమును స్ఫురింప

జేయు ప్రశ్నార్థక మగునని సూత్రార్థము. 'చనును' అన్నది తద్ధర్మార్థకము; ప్రథమపురుష; ఏకవచనాంతము. దీనిపై 'అయ్యా' అన్నది చేరగా 'చనునయ్యా' అని యగును. దీనికి 'చనునా?' అని యర్థము. ఇచట కేవలము ప్రశ్నముకాక 'చనదు' అను సమాధానముకూడ ప్రశ్నముచేతనే స్ఫురించు చున్నది. ఇట్లే 'మెత్తురు + అమ్మ' అని యన్నప్పుడు 'మెచ్చరు' అన్న వ్యతిరేకార్థమును స్ఫురింపజేయుచు 'మెత్తురా?' అన్న ప్రశ్నవాచకము 'మెత్తురమ్మ' అన్న రూపమున ప్రవర్తించును.

[ఇది యిచ్చట ప్రశ్నమా? వ్యతిరేకార్థ వ్యంజకమా? నిశ్చయాత్మకమా? అన్నవిషయము సందర్భమునుబట్టియు కాకువునుబట్టియు నిర్ధారింపబడును. కావున, దీనిని వ్యాకరణవిషయముగా గ్రహించుట యుచితము కాదు. ఏయర్థమునందైనను రూపసాధన మొక్క తీరుననే యుండును. ఈ తరువాతి సూత్రముకూడ ఇట్టిదే.]

## 31. ఆర్యాద్యర్థక మొక్కచో నటు శబ్దపూర్వకంబు నగు. (ప్రౌ - ౫)

చెల్లునటయ్యా - చెల్లునటమ్మ॥ దయసేయక తిన్నని మేను వెన్నెలన్। వేతురటమ్మ యింత కనువేదురు సెల్లునటమ్మ యింతికిన్॥ స్వా. ౩ ఆ॥

వ్యాఖ్య - పైని చెప్పినట్లుగా 'అయ్యా' మున్నగు శబ్దములు పరములగునపుడు, వానికి పూర్వమందు, 'అటు' అను శబ్దము కొన్నియెడల కలుగునని సూత్రార్థము.

'చెల్లును' అన్నది తద్ధర్మార్థకము; ప్రథమపురుష; ఏకవచనము. దీనికి పైని, 'అయ్యా' అను శబ్దము చేరుకొనగా,

దానికి ముందు 'అటు' అన్నది యగును. చెల్లును + అటు + అయ్యా = చెల్లునటయ్యా॥ "చెల్లునా ?" అను ప్రశ్నార్థకమే యైనను 'చెల్లదు' అన్న వ్యతిరేకార్థమును స్ఫురింపజేయు చున్నది.

**32. లూట్టు డుఞున కెడుత వర్ణంబులు ద్రుతాంతంబులగు. (బా - ౨౬)**

ఆశీస్సు : మీకు మేలు గలిగెడును - మీకు మేలు గలుగు తను ॥ శాపంబు : నీకు రాక్షసత్వంబు గలిగెడును - నీకు రాక్ష సత్వంబు గలుగుతను ॥ సంప్రార్థనంబు : హరి ననుఁ గృపఁ గాంచె డును - హరి ననుఁ గృపఁ గాంచుతను.

వ్యాఖ్య - లూట్టు యొక్క డు రు వు రు ను ము - అను ప్రత్యయముల కన్నింటికి బదులుగా ద్రుతాంతము లయిన ఎడు, త - అను ప్రత్యయములు కలుగు నని సూత్రార్థము.

'మేలు' అన్నది అన్యార్థము. దీనితో అన్వయము కలుగు క్రియాపదము 'కలిగెడును' అన్నది. 'కలుగు' అను ధాతువుపై ద్రుతాంతమైన 'ఎడు' చేరగా ఈ రూప మేర్పడి నది. ఇట్లే ద్రుతాంతమైన 'త' వర్ణకము చేరగా 'కలుగుతను' అని యగును. ఈ రెండును ఆశీస్సున కుదాహరణములు. శాపమునందును, సంప్రార్థనమునందును గూడ నిట్లే యేర్ప డును.

సూరి చూపిన యుదాహరణము లన్నింటియందును 'ను' వర్ణక స్థానముననే ఎడు, తలు వచ్చుట కలదు. ప్రథమ పురుష బహువచనమునం దగు 'రు' వర్ణకమునకు బదులుగా

ఎడు, తలు రాగా ప్రసన్నులయ్యెడున్, ప్రసన్నులవుతన్ - అను విధముగా రూపము లుండును. ఇట్లు ప్రథమ పురుష యందు మాత్రమే ఎడు, తలు వచ్చుట ప్రయోగములందు కానిపించుచున్నది. వ్యాకర్త దుష్టునకని చెప్పి మూడు పురుష లను గూడ గ్రహించుట జరిగెను. రాబోవు సూత్రము (బా- 29) చేత మధ్యమపురుషకగు కార్యములను వేరుగా నిరూపించి, ప్రస్తుత కార్యమును వారించుట జరుగనున్నది. ఆశీశ్శాప విధ్యాదులయందు ఉత్తమపురుష యుండుట అసంగతముగా నుండును. ఎవరిని వారు దీవించుకొనుట, ఎవరిని వారు శపించుకొనుట, ఎవరిని వారు ఆజ్ఞాపించుకొనుట సాధారణముగా జరుగవు. ఎప్పుడేని జరిగినయెడల తద్ధర్మార్థక రూపమే అట్టి వానికి సాధకము కాగలదు. కావున, ఉత్తమ పురుష యందును ఎడు, తలు కలుగవు. కావుననే సూరి ఉదాహరణము లను చూపలేదు. దీనిని గుర్తుంచుకొనుట యవసరము.

[లూట్టు అని యన్నప్పుడు ఆశీస్సు, శాపము, సంప్రార్థనము, విధి - అను నాలుగును చేరయుండును. మొదటి మూడింటిని మాత్రమే యీ సూత్రమున గ్రహించుట జరిగినది. నాలుగవదైన 'విధి'ని గూర్చి యీ తరువాతి సూత్రము ప్రవర్తించును.]

**33. విధియందు లూట్టునకు మాఱుగా నది యను తచ్ఛబ్దం బును ముందు నుగాగమంబు నగు. (బా - ౨౮)**

మైత్రుండు నా నిర్దిష్టకార్యంబు చేయునది - వానికి నీవు భాసటయయి యుండునది.

వ్యాఖ్య - లూట్టునకు మాఱుగా విధియందు నుగా మముతో కూడుకొనిన 'అది' యను తచ్ఛబ్ద మగునని సూత్రార్థము. 'లూట్టునకు మాఱుగా' అని యున్నను, పూర్వ సూత్రమునందలి డుఞ్ఞు అనునది అనుగతము కావలయును. అట్లు కాగా "లూట్టు డుఞ్ఞునకు మాఱుగా విధియందు ధాతువునకు నది యను తచ్ఛబ్దంబును ముందు నుగాగమంబు నగు" అన్నది సూత్రముయొక్క సంపూర్ణ స్వరూపము.

'మైత్రుండు' అన్నది నామము. ఇది కర్తయైనప్పుడు క్రియకు 'డు' వర్ణకము వచ్చును. అప్పుడు "చేయు + డు" అని యుండును. ప్రస్తుతసూత్రముచేత 'డు' వర్ణమునకు బదులుగా 'అది' శబ్దమును, దానికి ముందు నుగాగమమును గలుగగా 'చేయు + ను + అది = చేయునది' అని యగును. ఇట్లే బహువచనమునందు "వారు నా నిర్దిష్టకార్యంబు చేయునది" అను విధముగా ప్రయోగముండును.

"నీవు జాసటయయి యుండునది" అనుచోట యుష్మదర్థకము కర్తయై యున్నది; ఏకవచనము. కావున 'ఉండు + వు' అను విధముగా రూపము కలుగును. ప్రస్తుత సూత్రముచేత 'ఉండు + ను + అది = ఉండునది' అని యగును. ఇట్లే బహుత్వమునందును 'మీరు కుశలులై యుండునది' మున్నగు విధముగా ప్రయోగము లుండును.

[సూరి ప్రథమ మధ్యమ పురుషలకు మాత్రమే ప్రయోగములను చూపెను. తన్ను దాను ఆజ్ఞాపించుకొనుట యన్నది సాధారణముగా జరుగదు. కావున 'అది' శబ్దముతోడి ఉత్తమ 'పురుషరూపము లుండు నవ

కాశము కూడ లేదు. అందువలననే సూరి అట్టి రూపములను చూపుట జరుగలేదు.]

**34. ఎడు తల ద్రుతంబున కచ్చు పరంబగునపుడు మకారం బగు. (బా - ౨౮)**

నీకు మేలు కలిగెడు మనియెను - నీకు మేలు కలుగుత మనియెను.

వ్యాఖ్య - పైని చెప్పిన ఆశీరాద్యర్థములం దగు ఎడు, త - అనువాని ద్రుతమునకు అచ్చు పరమగునప్పుడు మకార మాదేశముగా నగునని సూత్రార్థము.

కలిగెడును + అనియెను - అని యున్నప్పుడు పూర్వ రూపము ఆశీరర్థకము. పరమందు అచ్చున్నది. కావున ప్రస్తుత సూత్రమునుబట్టి ద్రుతమునకు బదులుగా మకారము రాగా 'కలిగెడుము + అనియె = కలిగెడుమనియె' అని యగును. ఇట్లే 'త' వర్ణకము మీది ద్రుతమునకు కూడ మకారము వచ్చును. కలుగుతను + అనియెను = కలుగుతము + అని యెను = కలుగుత మనియెను.

[అథర్వణ కారికలయందు ఆశీరాద్యర్థములందు 'డుమ' యను ప్రత్యయము విధింపబడెను. సూరి "డుమ కాతావిత్యాది" కారికను సరిగ గ్రహింపమిఁ జేసి యట్టి మకారస్థితిని సమర్థించుటకయి ప్రకృత సూత్రము నుపదేశించె నని యొప్పనగును - అని వజ్ఝలవారు సూరిని గూర్చి పలికిరి. అథర్వణుడు 'డుమ' అని చెప్పినదానిని సూరి యనువదింపకపోవుట సూరి యందలి లోపముగా వజ్ఝలవారి నిర్ణయము. సూరి ప్రణాళికను బట్టి యైనచో కలిగెడుమనియెను, కలిగెడున్ - అను రెండు రూపములును గలు గుట కవకాశము గలదు. అథర్వణుని ననుసరించునెడల 'కలిగెడుమనియె'

అను రూపము మాత్రమే యేర్పడును. ఆశీరాద్యర్థమునందు 'కలిగెడున్' అను రూపమునకే అవకాశము కలుగదు. అట్లే యగుచో 'ప్రసన్నుడయ్యెడున్' మున్నగు నన్నయభట్టారకుని ప్రయోగములకు సైత మవకాశము లేకపోవును. ఇచ్చటి 'అయ్యెడున్' అను దానిని తద్ధర్మార్థకముగా పరిగణించినను, పరిగణింపవచ్చును. 'ఘోరఫణిరాజులు మాకు ప్రసన్నులయ్యెడున్' అనుచోట 'అయ్యెడున్' అను దానిని తద్ధర్మార్థకముగా అంగీకరించుటకు వీలులేదు. తద్ధర్మార్థకమే యైనచో బహుత్వము నొంది కర్తకనురూపముగా నుండవలయును. కావున, దీనిని ఆశీరర్థకముగా అంగీకరింపక తప్పదు. ఇచ్చటి రూపము 'ఎడున్' అని స్పష్టముగా కనబడుచునే యున్నది. ఇట్లు ఉభయాకారకముగా నుండునట్లు సూరి తన ప్రణాళికను సిద్ధము చేసికొనియుండగా దానిని 'సరిగ గ్రహింపమి' యని యనుట సమంజసము కాదు.]

## 35. లోణ్మధ్యమ వురులకు ముడుఙ్లు అగు. (బా - ఒక)

ఆశీస్సు : దీర్ఘాయు వగుము - దీర్ఘాయువు రగుఁడు ॥ శాపంబు: రాక్షసుఁడ వగుము - రాక్షసుల రగుఁడు ॥ సంప్రార్థనంబు : నన్ను రక్షింపుము - నన్ను రక్షింపుఁడు ॥ విధి : నా చెప్పిన పనిచేయుము - నా చెప్పిన పని చేయుఁడు.

వ్యాఖ్య - ఆశీరాద్యర్థములందు వచ్చు లోట్టు యొక్క మధ్యమ పురుష ప్రత్యయములయిన వు రు లకు బదులుగా 'ము' వర్ణకమును డుజ్వర్ణకమును వచ్చునని సూత్రార్థము.

దీర్ఘాయువు + అగుము - అని యున్నప్పుడు కర్త 'నీవు' అనునది అధ్యాహృతము. 'అగు' అన్నది ధాతువు. దీనికి ఏకవచనమున మధ్యమ పురుషయందు 'వు' అను ప్రత్యయము కలుగును. అప్పుడు 'అగు + వు' అని యుండును. ప్రస్తుత

సూత్రముచేత 'వు' వర్ణమునకు బదులుగా 'ము' వర్ణము వచ్చును. అప్పుడు 'అగు + ము = అగుము' అని యగును. అట్లే బహువచనమునందు 'అగు + రు' అని యుండగా 'రు' వర్ణమునకు డుజ్ఞు ఆదేశముగా నగును. జిత్తు బిందు పూర్వక మగును. కావున డు వర్ణమునకు ముందు బిందువు కలుగగా 'అగుఁడు' అని యగును.

[దీర్ఘాయువు అన్నది యుష్మద్విశేషణము. "ప్రథమాంతంబు లగు" అని మొదలుగా నున్న (బా. కా. 33) సూత్రమును బట్టి 'వు' వర్ణము కలిగి వెనుకటి ఉత్వమునకు అత్వము రాగా 'దీర్ఘాయువవు' అని యగును. ప్రాయిక గ్రహణముచేత వు వర్ణాదులు రాని రూపములు కొలదిగా నుండ వచ్చును. 'దీర్ఘాయు వగుము' అన్నది 'వు' వర్ణము రాని రూపము. ఆ తరువాతి యుష్మద్బహువచన విశేషణమునకు 'రు' వర్ణము కలిగినది. 'దీర్ఘాయులు + రు' అని యుండగా, వెనుకటి ఉత్వమున కత్వము కలిగి 'దీర్ఘాయులరు' అని యయ్యెను.]

శాపమునకు సైతమిట్లే మధ్యమ పురుషయందు ఏక వచన ప్రత్యయమైన 'వు' వర్ణమునకు బదులుగా 'ము' వచ్చి 'అగుము' అని యయ్యెను. బహుత్వమున 'రు' వర్ణమునకు బదులుగా డుజ్ఞు కలిగి 'అగుఁడు' అని అయ్యెను. సంప్రార్థనమునందు నిట్లు కాగా 'రక్షింపుము' అని యేకవచనమునందును, 'రక్షింపుఁడు' అని బహువచనమునందును రూపము లేర్పడెను.

[ఆశీశ్శాప సంప్రార్థనములందు పూ. వ్వ (బా - 26) సూత్రముచేత ఎడు తలు విధించుట జరిగెను. ప్రస్తుత సూత్రము మధ్యమ పురుష విషయమున తత్సూత్ర ప్రవృత్తిని బాధించుచున్నది. అనగా మధ్యమపురుషయందు ధాతువునకు పైని ఎడు త -అను ప్రత్యయములు చేరవని యర్థము.]

విధియందు 'చేయు + వు' అని యుండగా, ప్రస్తుత సూత్రముచేత 'ము' వర్ణకను కలిగి 'చేయుము' అని యగును. బహువచనమునందు 'చేయు + రు' అని యుండగా 'రు' వర్ణమునకు బదులు డుజ్జు ఆదేశము కాగా 'చేయుఁడు' అని యగును.

[ఉదాహరణ సామర్థ్యమువలననే మధ్యమపురుషయందు చేయునది, చేయుము - అని ఏకవచనమునకు చేయునది, చేయుఁడు - అని బహువచనమునను రెండేసి రూపములుండును. ప్రథమపురుషయందు 'చేయునది' మున్నగు విధముగా నొక్కటే రూపముండును.]

**36. ఉభయ ప్రార్థనంబున దుగాగమంబున కత్వం బగు.**

(బా - ౩౦)

మనము వండుదుము ॥ జీత్తు పరంబగునపు డుత్వంబున కత్వం బగు నను సూత్రముచే లజీ పరంబగునపు డత్వంబు ॥ ప్ర. వండఁడు - వండరు - వండదు - వండవు॥ మ. వండవు - వండరు॥ ఉ. వండను - వండము.

వ్యాఖ్య - ఉభయార్థకమైన 'మనము' అన్నది కర్తగానున్నప్పుడు ప్రార్థనమునందు ఆగమమైన దు వర్ణముయొక్క ఉత్వమున కత్వ మగునని సూత్రార్థము.

తద్ధర్మాదులందు లాట్టగును. ఆది శబ్దముచేత ప్రార్థనార్థకముకూడ గ్రహింపబడును. కావున "లాట్టు రుజ్జు పరంబగునపుడు దుగాగమం బగు" అన్న (బా - 22) సూత్రమును బట్టి 'వండు + ము' అని యుండగా 'దు' ఆగమముగా నగును. అప్పుడు 'వండు + దు + ము' అని యగును. ప్రస్తుత సూత్రమును బట్టి ఉభయ ప్రార్థనమునందు దుగామమున కత్వము

కలుగగా 'వండు + ద + ము = వండుదము' అని యగును. 'మనము' అన్నది ఉభయార్థకమే యైనను(నీవు + నేను; మీరు + మేము) అస్మదర్థకముగానే పరిగణింపబడును. కావుననే అస్మదర్థకమునకు అనురూపముగా ఉత్తమ పురుష బహువచన ప్రత్యయమైన 'ము' వర్ణము కలుగుచున్నది.

"వ్యతిరేకంబున ల జీ యగు" అని సూరి పదవ సూత్రముగా చెప్పెను. ల జీ యన్నది జీ వర్ణము నిత్సంజ్ఞగా గలది. "జీత్తు పరంబగునపు డుత్వంబున కత్వం బగు" అన్న (ఛా - 20) సూత్రముచేత వ్యతిరేకార్థమునందు పురుష ప్రత్యయములు కలుగునపుడు తత్పూర్వమున్న ఉత్వమునకు అత్వము కలుగును. వండు + డు-ఇది వ్యతిరేకార్థకమైనపుడు అత్వముకలిగి 'వండఁడు' అని యగును. ఇది మహత్ప్రథమైకవచనరూపము. బహువచనమునందు 'వండు + రు' అనియుండి ఉత్వమున కత్వము కలుగగా 'వండరు' అని యగును. 'వండు + డు' అని యుండగా "అమహదర్థంబునందు డుబు లకు దువు లగు" మున్నగు విధముగా నున్న (ఛా - 12) సూత్రమును బట్టి 'వండు + దు' అనియై ఉత్వమున కత్వము కలిగి 'వండదు' అని యగును. అట్లే బహుత్వమునందు 'వండు + రు' అని యుండగా రుస్థానమున వు వర్ణము వచ్చును. అప్పుడు ఉత్వమునకు అత్వము కలుగగా 'వండు + వు = వండ + వు = వండవు' అని యగును. ఇది ప్రథమ పురుష; అమహద్బహువచన వ్యతిరేకార్థక రూపము.

మధ్యమ పురుషయందు వు రు లు పరముకాగా వండవు, వండరు అనియు ఉత్తమ పురుషయందు నుములు పరముకాగా వండను, వండము అనియు వ్యతిరేకార్థక రూపము లేర్పడును.

["జీత్తు పరంబగునపుడు" మున్నగు విధముగా మన్న ప్రసంగము నకును, సూత్రమునకు నేమాత్రమును సంబంధము కానరాదు. వివరణము నందలి విషయమంతయు వ్యతిరేకార్థకములకు సంబంధించినది. దీని నంతటిని 'వ్యతిరేకంబున లజీ యగు' అన్నచోట చెప్పవలసినది. లకారములను వేర్వేరుగాను వరుసలో ఉదాహరణములను చూపలేదు కావున సమత్వమునకై అచ్చట మానె ననుకొన్నచో "జీత్తు పరంబగునపు డుత్వంబున కత్వంబగు" అన్న సూత్రముకడ చూపవలసినది. ఏమాత్రమును సంబంధములేని సూత్రముకడ వ్యతిరేకార్థక రూపములను చూపుట సమంజసముగా లేదు. సూత్రమునందు ఉత్వమునకు అత్వము కలుగు ప్రసక్తి యున్నది. జీత్తు పరమైనప్పుడు ఉత్వమునకు అత్వము కలుగును. ఆపాటి సామ్యమును పురస్కరించుకొని సూరి యీ రూపముల కిచ్చట తావు కల్పించుకొనె నని పించును.]

## 37. వ్యతిరేకక్రియ యర్థత్రయ బోధకంబగు. (ప్రౌ - ౮)

అర్థత్రయము = వర్తమాన భూత భవిష్యదర్థములు. వర్తమానమునకు - పాఱఁడు లేచి దిక్కులకు (పాఱఁడు = పాఱుచున్నవాఁడు కాఁడు)॥ భాగ ౮ స్కం॥ పలుకదు సఖులతో లలి తాంగి పలుకదు = పలుకుచున్నది కాదు)॥ భార. ఆర. ౨౫ ॥ భూతమునకు - నలుఁగాన మివ్వనంబున (కానము = కనినవారము కాము) ॥ భార. ఆర. ౨౫॥ ఱెక్కలు రావు పిల్లలకు (రావు = వచ్చినవి కావు) ॥ భాగ. ౭ స్కం॥ భవిష్యత్తునకు - వాసుదేవుఁడున్ రాఁడను (రాఁడు = రాఁగలవాఁడు కాఁడు)॥ భాగ ౧౦ స్కం. పూ॥ నఖునె కాని నళినదళ నేత్ర వరి

యింపదట్టె (వరియింపదు - వరియించునది కాదు)॥ భార. అర. ౨ ఆ॥
ఇత్యాదు లెఱుంగునది.

వ్యాఖ్య - వ్యతిరేకార్థమును బోధించునపుడు లజీ వర్ణక
మగును. ఇట్లు లజ్యంతమైన క్రియ భూత భవిష్యద్వర్తమాన
కాలములను మూడింటిని బోధించునని సూత్రార్థము.

[సూత్రమునందు 'అర్థత్రయము' అని యనుట సమంజసముగా
లేదు. సమాపకక్రియలను దెలుపునపుడు 'కాలత్రయము' అని యనుట
యుచితము. ధాతుజన్య విశేషణములను దెల్పునపుడు వర్తమానార్థకము,
భూతార్థకము, భవిష్యదర్థకము - అని యనవచ్చును. ప్రౌఢ వ్యాకరణ
కారు డీసంజ్ఞలను వ్యత్యస్తముగా నుపయోగించుట కనిపించును.]

'పాఱు' అను ధాతువునకు లజీ వర్ణకము కలిగి,
ప్రథమైకవచనమున డుజ్ప్రత్యయము రాగా 'పాఱఁడు' అని
యయ్యెను. సందర్భమునుబట్టి దీనికి 'పాఱుచున్న వాఁడు
కాఁడు' అని యర్థము. 'పలుకు' అను ధాతువునకు లజీ వర్ణ
కము కలిగి, అమహదర్థంబున డుజ్జునకు దు వర్ణము రాగా,
'పలుకదు' అని యయ్యెను. సందర్భమునుబట్టి దీనికి 'పలుకు
చున్నది కాదు' అన్న వర్తమానార్థము కలుగుచున్నది. 'కను'
అను ధాతువునకు లజీ వర్ణకమును ఉత్తమ పురుష బహువచ
నమునందలి ము వర్ణకమును పరములయ్యెను. కను + లజీ + ము.
ఇట్లుండగా 'కను'నకు విభాషగా 'కాన' యనునది (శా-96)
యాదేశమయ్యెను. కాన + లజీ + ము = కానము. దీనికి 'కనిన
వారము కాము' అన్న భూతార్థము కలుగుచున్నది. 'వచ్చు'
అను ధాతువునకు లజీ పరమై పిదప అమహదర్థమునందు 'రు'
వర్ణమునకు 'వు' వర్ణకము కలుగగా 'వచ్చు + లజీ + వు' అని

యుండును. ఇట్లుండగా 'వచ్చు' అను దాని కంతటికి ఆదేశముగా 'రా' అనునది కలిగి (బా-91) రా+వు = రావు అని యయ్యెను. దీనికి 'వచ్చినవికావు' అన్న భూతార్థమే సందర్భమునుబట్టి యేర్పడిన యర్థము. 'వచ్చు' ధాతువునకు లజీ పరమై ప్రథమ పురుషైకవచన ప్రత్యయమగు డుజ్ఞు రాగా వచ్చు+లజీ+డుజ్ఞు – అని యగును. జీత్తు పరమగుటచే 'వచ్చు' అను దాని కంతటికి 'రా' యన్నది ఆదేశము కాగా 'రాఁడు'. అని యగును. దీనికి సందర్భమునుబట్టి 'రాఁగలవాఁడు కాఁడు' అన్న భవిష్యదర్థము స్ఫురించును. 'వరియించు' అనుదానికి లజీ పరమై, 'దు' వర్ణకము కలుగగా వరియించు+లజీ+దు – అని యగును. "ఆగమాన్య చకారంబుల కద్విరుక్తంబులకు ముత్తు పరంబగునపుడు పవ లగు" అన్న (బా - 88) సూత్రమునుబట్టి 'వరియింపు+లజీ+దు' అని యగును. జీత్తు పరమగుటచే ధాతువు యొక్క ఉత్వమున కత్వము కలుగును. అప్పుడు 'వరియింప +దు = వరియింపదు' అని యగును. దీనికి 'వరియింపఁ గలది కాదు' అన్న భవిష్యదర్థమే యేర్పడుచున్నది.

['వరియింపదు' అను దానికి వ్యాకర్త 'వరియించునది కాదు' అని తద్ధర్మార్థకరూపముతో నర్థమును చూపుట సరికాదు. భవిష్యత్కాలము ను సూచింపవలసి వచ్చినప్పుడు నిర్దిష్టముగా కలజ్యనుబంధము తోడి రూపమును చూపుట యుచితము. ఉదాహరణముల నడుమ వ్యాకర్త 'భవిష్యత్తు' అను పదమును వాడుట యుచితముగా లేదు. 'భవిష్యత్'అను దానికి వ్యస్తముగా ఉత్వద్విత్వముల తోడి రూపము ప్రయోగింపబడదు. చిన్నయసూరి తత్సమ పరిచ్ఛేదము చివర "భవచ్ఛబ్దాదుల కిందుఁ బ్రయోగంబు లేదు" అను సూత్రమునకు లక్ష్యముగా 'భవిష్యత్కాలము' అని

చూపెను. దాని నట్లు సమాసమునందు పూర్వశబ్దముగా వాడుకొనవచ్చును గాని వ్యస్తముగా వాడుట సరి కాదు.]

తద్ధర్మార్థకము వలెనే వ్యతిరేకార్థకము కూడ కాల బోధక చిహ్నములను కలిగి యుండదు. ధాతువుయొక్క అర్థమును దెల్పునది తద్ధర్మార్థకము. ధాత్వర్థముయొక్క అభావమును దెల్పునది వ్యతిరేకార్థకము. కావుననే యిదియు కాల త్రయ బోధకముగా వ్యవహరించును. సందర్భమే కాలమును స్ఫురింపజేయును.

## 38. మధ్యమ ముడుజ్ఞులు ముజ్ఞునాఁ బడు. (బా - ౩౧)

వ్యాఖ్య - లూట్టు పరమగునపుడు మధ్యమ పురుష యందగు 'వు' వర్ణమునకు బదులుగా 'ము' వర్ణమును, 'రు' వర్ణమునకు బదులుగా 'డు'జ్ఞ వర్ణమును వచ్చునని పూర్వ (బా - 29) సూత్రమున చెప్పబడినది. అట్లు వచ్చిన ము వర్ణకమును, డు వర్ణకమును కలిపి 'ముజ్ఞు' అని సంకేతించుట ప్రస్తుత సూత్ర ప్రయోజనము.

[డుజ్ఞు - రుజ్ఞు మొదలగు సంజ్ఞలు ముందు చేయబడినవి. వాని వలెనే యిదియు నొక సంజ్ఞ యని గ్రహించునది - అని సర్వస్వ వేటికా కారులు వ్రాయుట సరి కాదు. పై సంజ్ఞల యందలి ఞ కారము ప్రత్యాహారసంజ్ఞ. ఆ సంగతిని గూరియే తెలిపెను. కావున పైవి ప్రత్యాహార ప్రక్రియవలన నేర్పడిన సంజ్ఞలు. అక్కడి ఞ కారము ప్రత్యాహార ప్రక్రియకు మాత్రమే తోడ్పడును. దానికి మరొక ప్రయోజనము లేదు. 'ముజ్ఞు' అన్నది వ్యాకర్త ప్రత్యేకముగా కల్పించుకొన్న సంకేతము. ఇచ్చట ఞ కారము ప్రత్యాహార సంజ్ఞ కాదు. పైగా దీనికి మరొక

ప్రయోజనము కూడ కలదు. జీత్తు బిందు పూర్వం బగు - అని సూరి ఆ ప్రయోజనమును తెలిపియే యున్నాడు.]

సూత్రమునందు ము డుజ్జులు అని మాత్రమే యనక, 'మధ్యమ' అని విశేషణము చేర్చుట సార్థకము. అట్లు కాని యెడల నామ విభక్తులయిన ము, డు అన్న భ్రమ కలుగుట కవకాశము గలదు. పోనీ! సందర్భమును బట్టి నామ విభక్తుల కవకాశము లేదనుకొన్నను, క్రియా విభక్తులయందు ఉత్తమ పురుష బహువచన ప్రత్యయమయిన 'ము' వర్ణమును ప్రథమ పురుషైకవచన ప్రత్యయమైన డుజ్వర్ణమును స్ఫురించుట కాక్షేపము లేదు. కావున వానిని వారించుటకై "మధ్యమ ముడుజ్జులు" అని నిర్దేశ పూర్వకముగా, చెప్పుట సార్థకమును సమంజసమునై యున్నది.

**39.** వ్యతిరేకంబున ముజ్జు పరంబగునపుడు కుజీ యగు.

(బా - ౩౨)

నీవు వండకుము - మీరు వండకుఁడు.

వ్యాఖ్య - వ్యతిరేకార్థమునందు మధ్యమ పురుష ప్రత్యయములయిన ము, డు అనునవి పరమగునపుడు ధాతువునకు 'కుజీ' యగు నని సూత్రార్థము.

'వండు' అను ధాతువునకు మధ్యమ పురుషమున, ఏకవచన ప్రత్యయము పరము కాగా 'వండు + ము' అని యుండును. ప్రస్తుత సూత్రముచేత 'కుజీ' కలుగగా వండు + కుజీ + ము - అని యగును. 'కుజీ' అను దానిలో 'జీ' ఇత్సంజ్ఞ. జీత్తు పరంబగు నపు డుత్వంబున కత్వం బగు నన్న నియమ

మును బట్టి 'వండ+కు+ము - వండకుము' అని యగును. ఇట్లే బహుత్వమునందు డుగ్ప్రత్యయము కలుగగా 'వండకుఁడు' అని యగును.

**40. సంప్రార్థనంబుల ముజ్జున కదాదులు విభాష నను ప్రయుక్తంబు లగు.** (బా - ౩౩)

వండుమ - వండుమా - వండుమి - వండుమీ - వండుఁడ - వండుఁడా - వండుఁడి - వండుఁడీ ॥ అ - ఆ - ఇ - ఈ - ఎ - ఏ - ఒ - ఓ - అమ్మ - అయ్య ॥ ఇత్యాద్యదాదులు.

వ్యాఖ్య - సంప్రార్థనములయందు మధ్యమ పురుష ప్రత్యయములయిన ము డుజ్జులకు అ ఆ మున్నగునవి విభాషగా అనుప్రయుక్తము లగునని సూత్రార్థము. ఇచ్చట 'సంప్రార్థనముల' నన్న బహువచన సారస్యముచేత భావార్థకమునందైన సంప్రార్థనమును, వ్యతిరేకార్థమునందైన సంప్రార్థనమును గూడ గ్రహింపవలయు నని తాత్పర్యము.

'వండుము' అన్నది మధ్యమ పురుషైక వచన రూపము. దీనికి పైని 'అ' వర్ణము కలుగగా 'వండుమ' అని యగును. ఇట్లే 'వండుమా' మున్నగు రూపములు నేర్పడును. అదాదులు విభాషగా ననుప్రయుక్తము లగును. కావున అదాదులు రాని పక్షమున 'వండుము' అని ఏకవచనమునను 'వండుఁడు' అని బహువచనమునను రూపము లుండును.

[అదాదులు అని తెల్పి పదింటిని పేర్కొన్నను, ఉదాహరణము లందు నాలుగింటిని మాత్రమే చూపెను. 'ఎ' వర్ణము మొదలుకొని మిగిలినవాని నన్నింటిని ఎదాదులుగా రాబోవు సూత్రమున గ్రహించుట

జరిగెను. ఏదాదులు పరమగునప్పుడు వేరు కార్యములు జరుగును. కావుననే వానిని ప్రస్తుత సూత్రముకడ నుదాహరింప లేదు.]

సూత్రమునందు 'విభాష' అని యనుటచేత వందుము, వందుమ; వందుఁడు, వందుఁడ - మున్నగు వికల్పవిధితోపాటు, అన్యత్వమునకు సైతము అవకాశము కలుగుచున్నది. తరువాతి సూత్రము దానిని ప్రదర్శించును.

**41.** ఏదాదు లనుప్రయుక్తంబు లగునపుడు ముజ్ఞునకు వుజీ రుజీ యగు. (బా - ౩౪)

వినవె - వినవే - వినరె - వినరే-వినకువె-వినకువే-వినకురె - కురే.

వ్యాఖ్య - ఎ, ఏ, ఒ, ఓ, అమ్మ, అయ్య - మున్నగు ఏదాదులు. ఇవి పరములగునపుడు మధ్యమపురుషయందలి వర్ణమునకు బదులుగా 'వు జీ' యనియు 'డుజ్ఞు' నకు బదులుగా 'రు జీ' యనియు వచ్చునని సూత్రార్థము. 'వినుము' అన్నది మధ్యమపురుషైక వచనము. దీనికి సంప్రార్థనమున్నందు 'ఎ' వర్ణము కలుగగా 'వినుము+ఎ' అని యుండును. ప్రస్తుత సూత్రమునుబట్టి 'ము' వర్ణమునకు బదులుగా 'వుజీ' వచ్చును. 'విను+వుజీ+ఎ' - ఇందు 'వు' అనునది ప్రత్యయము. జీ ఇత్సంజ్ఞ. కావున ధాతువుయొక్క ఉత్వమునకు అత్వము రాగా 'విన+వు+ఎ=వినవె' అని యగును ఇట్టిదే 'వినవే' అను రూపముకూడ.

'వినుఁడు' అన్నది మధ్యమ పురుష బహువచన రూపము. దీనికి సంప్రార్థనమున 'ఎ' వర్ణము పరముకాగా డుజ్ఞునకు బదు

లుగా రుజీ వచ్చును. అప్పుడు 'విను+రుజీ+ఎ' అని యగును. 'రుజీ' అనునది జీత్తగుటచేత ధాతువుయొక్క ఉత్వమునకు అత్వమురాగా 'విన+రు+ఎ=వినరె' అని యగును. 'వినరే' అన్నదికూడ ఇట్టి రూపమే. ఇట్లులే ఒ ఓ లు పరమగునప్పుడును వినవొ, వినవో, వినరొ, వినరో - మున్నగువిధముగా రూపము లుండవచ్చును.

'వినకుము' అన్నది వ్యతిరేక మధ్యమ పురుషైక వచనము. దీనికి 'ఎ' వర్ణము పరమగునపుడు 'వుజీ' వచ్చును. 'వినకు+వుజీ+ఎ' అని యుండును. 'వినకువె' అను రూపమేర్పడును. ఇచ్చటి వుజీకి పూర్వమందు ఉత్వమున్నది కాని దానికి అత్వము రాదు. ఇచటి ఉత్వము వ్యతిరేకమునం దయిన కుజీకి సంబంధించినది. జీత్తు పరమైనపుడు ధాతువుయొక్క ఉత్వమునకు మాత్రమే అత్వము వచ్చును. కావున 'కు' వర్ణకముయొక్క ఉత్వమునకు అత్వము కలుగదన్న విషయమును గుర్తుంచుకొనుట యవసరము.

'వినకువే' యన్నది యిట్టి రూపమే. వినకురె, వినకురే- యనునవి బహుత్వమున వ్యతిరేక సంప్రార్థనమునం దగు రూపములు.

[వ్యతిరేక సంప్రార్థనమునందు ఒ ఓ ల తోడి రూపములు కానరావు. సూరి భావార్థముగందును, వ్యతిరేకార్థమునందును గూడ ఒ ఓ ల తోడి రూపములను ఉదాహరించుట మానివేసెను. అయ్య, అమ్మ - అను వానిని ఎదాదులలో చేర్చినప్పటికిని, వానికికూడ ఉదాహరణములను సూరి చూపలేదు. ప్రస్తుత సూత్రమునందు తెల్పిన వుజీ రుజీ యనునవి సంప్రార్థనమున ఎదాదులు పరమగునపుడు నిత్యముగా నగును. కాని అమ్మ

మున్నగునవి పరమగునపుడు వుజీ రుజీ యనునవి వైకల్పికముగా నగును. వినుమమ్మ - వినవమ్మ - వినుమయ్య - వినవయ్య ॥ మున్నగు విధముగా రూపము లుండును. ఈ ప్రయోగ వైవిధ్యమును సూచించుటకే సూరి పూర్వసూత్రమున (బా - ३३) విభాషయను పదము నుపయోగించెను.]

**42. ప్రార్థనమునం దద్రుత్యయాంత క్రియల మీఁదఁ గద కదవు పూర్వకంబు లన్నాదు లనుప్రయుక్తంబు లగు. (ప్రౌ - ८)**

ప్రోవఁ గదన్న - ప్రోవఁ గదవన్న - ప్రోవఁ గదయ్య-ప్రోవఁ గదవయ్య - ప్రోవఁ గదమ్మ - ప్రోవఁ గదవమ్మ - ప్రోవఁ గదె - ప్రోవఁ గదవె - ప్రోవఁ గదే - ప్రోవఁ గదవే ॥ సుకీర్తి మనఁగదన్న॥ భాగ. ౧౦ స్కం. పూ ॥ చెప్పఁ గదయ్య ॥ భాస్కరశతకము ॥ తుది యెప్పుడు మద్విరహాంబురాశికిన్ జెప్పఁ గదమ్మ ॥ భాగ. ౧౦ స్కం. పూ ॥ తండ్రీ నాకు ననుగ్రహింపఁగదె వైద్యంబంచుఁ బ్రార్థించినన్॥ స్వా. ౫ ఆ॥ నీపాదకమలసేవయు। నీపాదార్చకులతోడి నెయ్యమును నితాం । తాపార భూతదయయును । దాపసమందార నాకు దయ చేయఁ గదే ॥ భాగ. ౧౦ స్కం. పూ ॥ పురంబుఁ జేర నింకెవ్విధిఁ గాంతుఁ దెల్పఁగదవే తెరువేది శుభంబు ॥ స్వా. ౨ ఆ॥

వ్యాఖ్య - ప్రార్థనమునందు అద్రుత్యయాంతములయిన అసమాపక క్రియారూపములపై 'అన్న' మున్నగు పదములు కద, కదవు అను వానిని ముందు చేర్చుకొని అనుప్రయుక్తము లగునని సూత్రార్థము.

బాలవ్యాకరణము సంప్రార్థనము అను దానినే ప్రౌఢ వ్యాకరణము 'ప్రార్థనము' అని పేర్కొనుచున్నది. సంప్రార్థనము

నందు లూట్టగుట బాలవ్యాకరణమునందు చెప్పబడినది. కాని నుజ్యంతమగు రూపముపై కద, కదవు - అనువానితో కూడిన 'అన్న' మున్నగు శబ్దములు అనుప్రయుక్తమగుట విశేషము. ప్రస్తుతసూత్రము ఆ విశేషమునుగూర్చి ప్రవర్తించుచున్నది. తుమర్థమునందును భావలక్షణమునందును ధాతువునకు నుజీ వర్ణకము కలుగును. అట్లు నుజీ వర్ణకము కలిగిన రూపమునే ప్రౌఢవ్యాకరణకారుడు 'అన్నప్రత్యయాంతక్రియ' యని వాడుచున్నాడు. అట్లే బాలవ్యాకరణము 'ఎదాదులు' అని పరిగణించిన వానిని ప్రౌఢవ్యాకరణము 'అన్నాదులు' అని పరిగణించుచున్నది.

ప్రోవను + కద + అన్న - అనియుండగా ద్రుతకార్యమును, సంధియు రాగా 'ప్రోవఁ గదన్న' అని యగును. 'కదవు' అన్నది వచ్చునెడల 'ప్రోవఁగదవన్న' అని యగును. ఎదాదులుగా పరిగణింపబడిన ఎ, ఏ, ఒ, ఓ, అయ్య, అమ్మ, అన్న, అప్ప, అక్క మున్నగునవి పరమగునపు డీకార్యము జరుగును.

• కద, కదవు - అనునవి రానియెడల మధ్యము ముడుజ్ఞుల తోడి రూపములకే అన్నాదులు చేరగా ప్రోవుమన్న, ప్రోవవన్న - అను విధముగా రూపము లేర్పడును.

**43. ప్రార్థనాదులం దన్నప్రత్యయాంతక్రియల మీఁది యిమ్మునకికారంబు విభాష నగు. (ప్రౌ - ౧౦)**

ఒర్పుమై నుప్పిండి యుపవాసముండనీ మగనాలి సరిఁబోల్పఁదగదు విధవ. (ఉప్పిండి = ఉప్పిండిగ)॥ కాశీ. ౨ ఆ॥ ముని,ధర్మంబుల

కెల్ల దవ్వని జనంబుల్ నవ్వినన్ నవ్వనీ॥ కళా. ౩ ఆ॥ కననీ గొ్రాలు విడన్ గగనకుసుమముం గల్గనీ యీ యి మాటల్। వినసీ ముక్తుండు వెండిన్ విపులఁ బొడమనీ॥ పాండు. ౩ ఆ॥ మొ.

వ్యాఖ్య - ప్రార్థనాద్యర్థములందు నుజ్యంతక్రియల మీద 'ఇమ్ము' అనునది చేరును. దానికి విభాషగా ఈ కారము కలుగును - అని సూత్రార్థము.

ప్రస్తుత సూత్రము నుజ్యంత క్రియపైని 'ఇచ్చు' ధాతువు చేరి ప్రార్థనాద్యర్థక మగునని జ్ఞాపనము చేయుచున్నది. నిజమునకు దీనిని చెప్పుటయే ప్రస్తుత సూత్రముయొక్క ప్రయోజనము. అయినను సూత్రకర్త దీనిని భంగ్యంతరముగ చెప్పుటకుపక్రమించెను.

'ఉండను + ఇచ్చు' అని యుండగా మధ్యమ పురుషైక వచనమున మువర్ణకను పరముకాగా 'ఉండను + ఇచ్చు + ము' అని యగును. అప్పుడు 'ఇచ్చు' అను రూపమున కంతటికి బదులుగా 'ఈ' అని యగును (బా - 92). అప్పుడు దీర్ఘమునకు హ్రాస్వమును మువర్ణకమునకు మాముడియు (బా-61) అగును. ఈ + ము = ఇమ్ము అని యగును. ఉండను + ఇమ్ము = ఉండనిమ్ము అను రూప మేర్పడును. బహుత్వమునందు దీర్ఘము హ్రాస్వమగును. ఇ + డుఋ - అని యుండును. 'జీత్తు బిందు పూర్వంబగు' నన్న నియమముచేత బిందువు రావలయును. నుడితొలి హ్రాస్వముమీద ఖండ బిందువును, ద్రుతమునకు లోపమును లేనందువలన 'ఇండు' అను రూప మేర్పడును. 'ఉండను + ఇండు ఉండనిండు' అన్నది ప్రార్థనార్థకమం దయిన బహువచన రూపము.

ప్రస్తుత సూత్రము బహువచనరూపమునుగురించి ప్రస్తా వించుట లేదు. ఏకవచనరూపమయిన 'ఇమ్ము' అను దానికి 'ఈ' అనునది యగునని తెల్పుచున్నది. 'ఉండును + ఇమ్ము' అని యున్నప్పుడు ఆదేశముగా 'ఈ' రాగా 'ఉండనీ' అని యేర్పడును. నవ్వనిమ్ము అన్నది 'నవ్వనీ' అని యగును. కననీ, కలగనీ, విననీ, పొడమనీ - అను మిగిలిన యుదాహరణములు నిట్టివే.

**44.** ఒ ఓ లకు సందేహార్థకంబులకు వలయుచోఁ గొన్ని యెడలఁ గదా కదే లనుప్రయుక్తంబు లగు ; ఉద్దే శ్యంబు ద్వ్యవయవం బేని విధానం బందొక్కటి కడ దాని కగు. (ప్రౌ - ౨౮)

ఎంత కృతార్థులమో కదా ॥ వి. పు. ౭ ఆ ॥ శాంతంబు కాదో కదే ॥ భోజ. ౩ ఆ ॥ అవునో కాదో కదా ॥ రామా. ౬ ఆ ॥ మొ.

వ్యాఖ్య - సందేహమును సూచించునట్టి ఒ ఓ అను శబ్దములకు కావలసినయెడల కొన్నియెడల కదా, కదే - యను నవ్యయములు అనుప్రయుక్తయు లగును; ఉద్దేశ్యము రెండు భాగము (ద్వి + అవయవము)లను కలిగియున్నయెడల చివరి భాగమున కొక్కచోటనే కదా యని కాని, కదే యని కాని, చేరును - అని సూత్రార్థము.

కార్యము దేనికి విధింపబడునో దానిని ఉద్దేశ్యమని యందురు. ఉద్దేశ్యమున కేది విధింపబడునో దానిని విధాన మని యందురు.

'కృతార్థులము' అన్నది అస్మద్బహువచన విశేషణము. దీనిపైని సందేహార్థకమైన 'ఓ' శబ్దము చేరగా 'కృతార్థులము+ ఓ=కృతార్థులమో' అని యయ్యెను. ఇట్లున్న నుండవచ్చును. ప్రస్తుత సూత్రముచేత 'కదా' యన్న యవ్యయము అనుప్రయుక్తమైన రూపము 'కృతార్థులమో + కదా = కృతార్థులమో కదా' అని యైన నుండవచ్చును.

'శాంతంబు కాదు' అనుచోట 'కాదు' అన్నది వ్యతిరేక క్రియారూపము. దానిపైని సందేహార్థకము చేరగా 'కాదు+ ఓ = కాదో' అని యగును. దీనికి మరల కావలయునని తోచిన యెడల 'కదా' అన్న అవ్యయమును చేర్పగా 'కాదో + కదా = కాదో కదా' అని యగును.

ఉద్దేశ్యము రెండు అవయవములను గలిగి యున్నప్పుడు 'ఓ' అను సందేహార్థకము రెండింటికిని తుదియందు చేరును. 'అవును + ఒ + కాదు + ఒ = అవునొ కాదొ కదా యన్న యవ్యయము మాత్రము తుది దానికి చేరును. 'అవునొ కాదొ కదా' యని యగును.

ఇచ్చట సందేహార్థకము విశేషణముపైని, క్రియపైని వ్యతిరేకక్రియపైని చేరుట కుదాహరణములు చూపబడినవి. 'కొన్నియెడల' అని యనుటచేత సందేహార్థకము వచ్చిన చోటులందెల్ల కదా, కదే యనునవి యనుప్రయుక్తములు కాజాలవని, వాని వాడుక యవసరమునుబట్టి విరళముగా జరుగునని సూచింపబడుచున్నది.

**45. తఱచుగఁ గ్రియలమీఁది కద కదవుల కన్నాదులు పర్యాయంబున ననుప్రయుక్తంబు లగు. (ప్రౌ - ౨౯)**

అలసితివి గదన్న! యాఁకొంటివి గదన్న ॥ భాగ. ౧౦ స్కం. పూ ॥ వీయపురాలవై తికదవే యిపుడు ॥ విజ. ౩ ఆ ॥ మొ. తఱచుగ ననుటచే పూఁతపసింఁడివంటి వలపుం బచరించు కులంబు నీకిఁకన్ । లేఁత గదమ్మ యిత్తెఱఁగు లేమ ॥ స్వా. ౩ ఆ ॥ దయాంబురాశివి గదమ్మ॥ భాగ. ౧౦ స్కం పూ ॥ ఇత్యాదు లూహ్యంబులు.

వ్యాఖ్య - సమాపకక్రియల మీద చేరు కద, కదవు - అనువానికి పర్యాయముగా అన్న మున్నగునవి తఱచుగా ననుప్రయుక్తము లగునని సూత్రార్థము. 'పర్యాయంబున' నని యనగా 'ఒకటి రానియెడల నొక్కటిగా' నని యర్థము.

అలసితివి + కద + అన్న = అలసితివి గదన్న ॥ ఆఁకొంటివి + కద + అన్న = ఆఁకొంటివి గదన్న ॥ ఈ రెండుచోట్లను సమాపకక్రియలమీదనే 'కద' యన్న శబ్దము వచ్చినది; 'అన్న' యనునది అనుప్రయుక్తమైనది. 'ఐతి + కదవు + ఏ = ఐతికదవే ॥ ఇచ్చట మధ్యమపురుష వకారమునకు లోపము కలిగిన 'ఐతి' అను క్రియాపదము నిల్చినది. దానిపైని 'కదవు' అన్న శబ్దము చేరినది. తరువాత ఎదాదులలోని 'ఏ' చేరినది. క్రియలని సాధారణముగా చెప్పినను, ఎదాదుల యనుప్రయోగమునుబట్టి మధ్యను పురుషక్రియిలె యిచ్చట నుద్దిష్టములు.

'తఱచుగ' నని సూత్రమునందు నిల్పుటచే క్రియేతరములకు నైతమీ కార్యము జరుగునన్న సూచన కలదు. 'లేఁత' యని విశేషణముపై 'కద' అను శబ్దము కలిగినది. 'అమ్మ'

యమనది అనుప్రయుక్తమైనది. లేఁత + కద + అమ్మ = లేఁత గదమ్మ॥ అని యైనది ఇట్లే 'దయాంబురాశివి' అన్నది యుష్మద్విశేషణము. దీనిపైని కూడ కద, అమ్మ - అన్నవి చేరి 'దయాంబురాశివి గదమ్మ' అని యయ్యెను.

[సూత్రమునందలి 'పర్యాయంబున' అను పదము సార్థకము కాదు. పూర్వసూత్రములయందు 'అన్నాదులు' విధింపబడినపుడు 'పర్యాయము ననే' యవి ప్రయోగింపబడుచున్నవి. అయినను, అక్కడ నెచ్చటను శేర్పని యీ దశము నిచ్చటను జేర్చుట యావశ్యకము కాదు. ఈ పదమువలన అన్నాదులలో నేదో యొకటి తప్పక యనుప్రయుక్తము కావలయునన్న భ్రాంతి కలుగుట కవకాశమున్నది. కావున ఆ పదము లేకుండుటయే యుక్తము.]

ఇచ్చటి కద, కదవు - అన్నవి సందేహమునుగాక, నిశ్చయమునే ద్యోతనము చేయుచున్నవి.

## 46. కాదె కదార్థకం బగు. (ప్రౌ - ౬౧)

శౌరికృపగాదె నాకు నక్షయబలంబు॥ జై ౨ ఆ॥

వ్యాఖ్య - 'కాదె' అను నవ్యయము 'కదా' యను నర్థమునందు ప్రయోగింపబడునని సూత్రతాత్పర్యము.

'శౌరికృపగాదె' అని యనగా 'శౌరి కృప కదా' అనియే యర్థము. ఇచ్చట 'కాదె' యన్నది నిశ్చయార్థముననే ప్రయుక్తమయినది.

## 47. అయి కా నవ్యయంబులు స్వయమర్థకంబు లగు. (ప్రౌ - ౬౨)

వాఁడయి వచ్చెను - వాఁడుగా వచ్చెను (వాఁడు తనంత వచ్చెననుట) ॥ తలంపరు నీకుఁ దెల్పనీ। వై పరికింపవంచు దురహంకృతి

నాయమఁ గన్న దంపతుల్॥ కళా. ౭ ఆ॥ అతీంద్రప్రభావుండు సర్వకళా సంజనకుండు నారదుఁడుగాఁ రాఁజూచి॥ నిర్వ. ౫ ఆ॥

వ్యాఖ్య - 'అగు' అను ధాతువుయొక్క క్త్వార్థక రూపము 'అయి' అనునది; నుజ్యంతరూపము 'కాన్' అన్నది. అయి, కాన్ - అను రెండును అసమాపకక్రియలు; అందువలన అవ్యయములయందే చేరును. ఈ రెండును సుబంతములపైని జేరి 'స్వయముగా' నన్న యర్థమును గల్పించును.

వాఁడు + అయి = వాఁడయి అని యనగా 'తనంత తాను' అని యర్థము. నీవు + ఐ = నీవై అని యనగా 'నీ యంతట నీవు' అని యర్థము. 'అయి' యనునది వక్రతమము (ఐ) గా రూపొందినది. "అచ్చికంబులం దయి యవులకు వక్రతమంబులు బహుళంబుగా నగు" అన్న (బా - 103)సూత్రము ఆ యవకాశమును గల్పించుచున్నది.

వాఁడు + కాన్ = వాఁడుగాన్. 'తనంత తాను' అని యర్థము. "ప్రథమమీఁది పరుషములకు" అని మొదలయిన సూత్రము ననుసరించి 'క' కారమునకు 'గ' కారము కలిగినది. నారదుండు + కాన్ = నారదుండుగాన్. 'నారదుఁడు తనంత తానుగా' నని యర్థము.

'అయి' యన్నది క్త్వార్థకముగాను, 'కాన్' అన్నది తుమున్నర్థకముగాను సుప్రసిద్ధములు. ఇట్టియెడల స్వయమర్థకములుగా వ్యవహరించుట విశేషము. కావున ప్రౌఢ వ్యాకరణ కారుడు వ్యాకరణ విషయము కాకపోయినప్పటికిని, విశేష వ్యవహారమును ప్రదర్శించుటకయి యీ సూత్రమును దెలి

పెను. సూత్రమునందు 'కొన్ని యెడల' అని చేర్చియుండిన యుచితముగా నుండెడిది.

**48. అకా నిత్యర్థకం బగు. (ప్రౌ - ౬౩)**

అపజయమకాఁ దలఁచి॥ భార. అర. ౨ ఆ॥

వ్యాఖ్య - 'అ' అను నవధారణార్థకమును, 'అగు' ధాతువుయొక్క నుజ్యంతరూపమును గలిపి 'అకాన్' అని వ్యాకర్త పిలుచుచున్నాడు. 'అకాన్' అన్నది 'అని' యన్న యర్థము నొసగునని సూత్రార్థము

అపజయము + అకాన్ అపజయమకాన్ ॥ 'అపజయమే యని' అన్నది యర్థము.

[ఇచ్చట 'అకాన్' అని పేర్కొనుట సరికాదు. 'అపజయముగాన్' అని యున్నప్పుడు సైతము పైని చెప్పినట్లు ఇత్యర్థక మగుట కాక్షేపము లేదు. అవధారణమునందలి 'అ' వర్ణకము ముందున్నను, లేకపోయినను కూడ సందర్భమునుబట్టి ఆ యర్థము రావచ్చును. 'తప్పుగాఁ దలఁచునో' అని యనగా 'తప్పని తలచునో' యనియే యర్థము.]

సూత్రమున 'కొన్ని యెడల' అని చేర్చుట యవసరము.

**49. ట వర్ణకంబు భావంబునం దగు. (బా - ౬౫)**

భావం బనఁగా ధాత్వర్థంబు॥ వండుట-పండుట-వినుట-కనుట

వ్యాఖ్య - 'ట' యను ప్రత్యయము భావమునం దగు నని సూత్రార్థము.

భావము ' అని యనగా ధాతువు 'యొక్క అర్థమని యర్థము. 'ఫల వ్యాపార యోర్ధాతుః' అను నిర్ణయమును బట్టి ఫలమును వ్యాపారమును గూడ ధాతువునకు అర్థము లగును. 'వండు' అను ధాతువునకు వంట చేయుట యని యర్థము. ఇది

వ్యాపారము. కావున నీ వ్యాపారార్థమును బోధించుచు 'వండు' ధాతువుపై 'ట' వర్ణకము చేరి 'వండుట' యని యగును.

'పండు' అను ధాతువునకు 'పండుకొనుట' యని యర్థము. ఈ యర్థమును బోధించుచు ధాతువుపై 'ట' ప్రత్యయము రాగా 'పండుట' అని యయ్యెను. 'పండుట' అని యన్నప్పుడు 'పండుగా నగుట' యన్న యర్థమును గ్రహించు నెడల, ఇచ్చట ధాతువుయొక్క అర్థము ఫలమును సూచించు చున్న దనవలయును. పండు అను ధాతువుయొక్క ఫలరూప మయిన అర్థమును బోధించుచు ట ప్రత్యయమువచ్చి 'పండుట' అని యగును.

'వండు' అన్నది కర్మాకాంక్షగల ధాతువు; అనగా సకర్మకము అని యర్థము. 'పండు' అన్నది కర్మాకాంక్షలేని ధాతువు; అనగా అకర్మకము అని యర్థము. కావున ఈ ట వర్ణకము సకర్మకధాతువులపైని, అకర్మకధాతువులపైని కూడ చేరును. అట్లే వండించుట, పండించుట - మున్నగు విధముగా ప్రేరణార్థకములపైనికూడ చేరును

వినుట, కనుట - యన్నవి కూడ వ్యాపారార్థమును బోధించు ధాతువులపైని 'ట' చేరగా ఏర్పడిన రూపములే.

**50.** భావంబునం దనుప్రయుక్తంబగు కొనుటకుం గోలు విభాష నగు. (ప్రౌ - ౧౩)

ఇచ్చుకోలు - పుచ్చుకోలు ॥ మొ. పక్షమున ఇచ్చుకొనుట - పుచ్చుకొనుట ॥ మొ.

వ్యాఖ్య - ధాతువునకు అనుప్రయుక్తమైన 'కొను' ధాతువుయొక్క భావార్థకరూపమున కంతటికి బదులుగా 'కోలు' విభాషగా నగునని సూత్రార్థము.

'ఇచ్చుకొనుట' అని యన్నప్పుడు 'ఇచ్చు' అను ధాతువునకు అత్మనేపదార్థమునందు 'కొను' అనుప్రయుక్తమై 'ఇచ్చుకొను' అని యగును. భావమునందు ట వర్ణకము రాగా 'ఇచ్చుకొనుట' అని యగును. ప్రస్తుతసూత్రముచేత 'కొనుట' అను దాని కంతటికి బదులుగా 'కోలు' అన్నది ఆదేశము కాగా 'ఇచ్చుకోలు' అని యగును. 'పుచ్చుకోలు' అన్నది కూడ ఇట్లే యేర్పడిన రూపము.

ఇది విభాషగా నగున దగుటచేత, ఆదేశముకాని పక్షమున ఇచ్చుకొనుట, పుచ్చుకొనుట — అనువిధముగా రూపము లుండును.

**51. కొఱకు కంటె పొంటెలు పరంబులగునపుడు భావార్థక టువర్ణకంబునకు లోపంబు విభాష నగు. (ప్రౌ - ౧౪)**

దానిఁ జూపుకొఱకునె కాదె యీ యయ్యఁ బట్టి తెచ్చుట ॥ కళా. ౩ ఆ ॥ భూమి పాలించుకొఱకునె పుట్టినాఁడ ॥వి పు ౧ ఆ॥ పతి కలుగుకంటె సౌఖ్యము। సతులకు నొంకొకటి కలదె చర్చింపంగాఁ। బతిలేమి సర్వశూన్యము। పతి గలిగిన సతికి నింద్రపదవది యేలా ॥ విక్ర. ౬ ఆ ॥ ఏ పగిదిని బ్రతుకరాదె యిటు చెడుకంటెన్ ॥ హరి పూ. ౭ ఆ॥ అన్నత విక్రమముం బ్రకటిరచుకంటె। నిర్వ ౭ ఆ॥ అఖిల తృణలతా తరు నిచయంబుఁ జీడ। పట్టె నిట్టలంబుగ జడి పట్టుపొంటె॥ హరి. పూ. ౭ ఆ॥ మొ. పక్షమున చూపుటకొఱకు - కలుగుటకంటె - పట్టుటపొంటె॥ మొ

వ్యాఖ్య - కొఱకు, కంటె - అనునవి విభక్తి ప్రత్యయములు. 'పొంటె' అను దానిని గూడ ప్రౌఢవ్యాకరణకారుడు చతుర్థీ విభక్తి ప్రత్యయముగా పేర్కొనెను.

కావున నామవిభక్తులయిన యీ ప్రత్యయములు సుబంతముల మీదనే చేరును గాని క్రియల మీద చేరుటకు వీలులేదు. 'చూపుకొఱకు' మున్నగు రూపములను చూడగా తద్ధర్మార్థక రూపముపై 'కొఱకు' అన్న ప్రత్యయము చేరినట్లు కనిపించును. 'చూపుట' అన్న భావార్థకముపైనే 'కొఱకు' అన్న ప్రత్యయము చేరును; అట్లు చేరునప్పుడు విభాషగా భావార్థక ట వర్ణకమునకు లోపము కలుగును. ఇట్లే కంటె, పొంటె - అనునవి పరమగునప్పుడు కూడ జరుగును. ఇది సూత్ర తాత్పర్యము.

పాలించుట + కొఱకు అని యున్నప్పుడు 'ట' లోపింపగా 'పాలించుకొఱకు' అని యగును. లోపము రానిపక్షమున 'పాలించుటకొఱకు' అనియే యుండును. ఇట్లే 'కలుగుటకంటె' అన్నది 'కలుగుకంటె' అనియు 'చెడుటకంటె' అన్నది 'చెడుకంటె' అనియు విభాషగా ట వర్ణకము లోపము నొందియుండవచ్చును. 'పట్టుట పొంటె' అన్నది కూడ 'పట్టుపొంటె' అని యిట్లే కావచ్చును.

**52.** కజీ వర్ణకంబు, పురార్థ యోగంబున విభాషను భావంబునం దగు. (బా - ౩౬)

పండక మునుపు - పండుటకు మునుపు - చేయక మునుపు - చేయుటకు మునుపు; మునుపు - ముందు - మున్ను - తొల్లి.

వ్యాఖ్య - పురార్థయోగము అని యనగా మునుపు, ముందు మున్నగు నర్థముగలవానితో కలియుట యని యర్థము. పురార్థయోగమును గలిగియున్నపుడు ధాతువునకు 'కజీ' యను ప్రత్యయము భావార్థమునందు విభాషగా నగునని సూత్రార్థము.

'వండుట' అన్నది భావార్థకము. దీనికి 'మునుపు' అను పురార్థముతో యోగము కలిగినపుడు సంబంధమును తెలియ జేయుచు షష్ఠీప్రత్యయమైన 'కు' వర్ణకము వచ్చును. అప్పుడు 'వండుటకు మునుపు' అను రూపమేర్పడును. ప్రస్తుతసూత్రము విభాషగా ట వర్ణకమును వారించి భావార్థకమునందు కజీ యను ప్రత్యయమును గలిగించుచున్నది. 'వండు' అను ధాతువునకు 'మునుపు' అనుదానితో సంబంధము కలుగగా 'కజీ' వచ్చును. అప్పుడు వండు + కజీ + మునుపు-అని యుండును. జీత్తు పర మైనపుడు ధాతువుయొక్క ఉత్వమునకు అత్వము కలుగగా 'వండక మునుపు' అని యగును. ఇట్లే తక్కిన రూపములు ఏర్ప డును. కజీ రాని పక్షమున 'వండుటకు మునుపు' మున్నగు టవర్ణకముతోడి రూపములే యుండును.

[ఇంతవరకు నిది వికల్పకార్యమునే సూచించినది. విభాష యని యనుటచే అన్యత్వమునకు కూడ సూరి అవకాశమును గలిగించుచుండెనని యనవలయును. ఉదాహరణములను చూపలేదు. తప్పు, మాను - మున్నగు ధాతువుల లజ్యంతరూపములు పరమందున్నప్పుడు సైతము భావమునందు ధాతువునకు కజీ వచ్చుట కొన్నియెడల కలదు. పురార్థయోగమున వచ్చునని తెల్పినది అన్యత్ర వచ్చుట అన్యత్వము. చేయుట తప్పదు - చేయక తప్పదు; వచ్చుట మానదు - రాకమానదు ॥ మున్నగువానిని ఉదాహరణ ములుగా గ్రహింపనగును.]

మునుపు, ముందు, మున్ను, తొల్లి-యనునవి పురార్థకములు.

## 53. వ్యతిరేక భావంబున మిజీ యగు. (బా - ౪౪)

వ్యతిరేక విశిష్ట క్రియాభిధాయి ధాతువునకు మిజీ యగు వండమి - పండమి.

వ్యాఖ్య - వ్యతిరేకమగు ధాత్వర్థమున ధాతువునకు 'మిజీ' యను ప్రత్యయము కలుగునని సూత్రార్థము. వ్యతిరేక విశిష్టమయిన క్రియను దెలుపునది వ్యతిరేక విశిష్ట క్రియాభిధాయి. 'వండుట' అన్నది భావార్థకము. దీనికి 'వంట చేయుట' యని యర్థము. దీనికి వ్యతిరేకము 'వంట చేయకుండుట' కావున ఈ యర్థమున ధాతువునకు 'మిజీ' రాగా 'వండు+మిజీ' అని యగును. 'మిజీ' యన్నది జీత్తు కావున ధాతువు యొక్క ఉత్వమునకు అత్వము వచ్చును. అప్పుడు 'వండ+మి = వండమి' అని యగును. 'పండమి' అనునది కూడ ఇట్లేర్పడిన రూపమే.

## 54. సమానాశ్రయంబులం బూర్వకాలంబునం దివర్ణకం బగు. (బా - ౪౫)

ఏకాశ్రయంబులగు క్రియలలోపల నెయ్యది పూర్వ కాలికం బగుం దద్వాచి యగు ధాతువున కివర్ణకం బగు. ఇదయే క్త్వార్థంబు నాఁబడు॥ వండి - పండి - విని - కని॥ సమానకర్తృకంబు లనక సమానాశ్రయంబు లనుటం జేసి చైత్రునిచేత మైత్రుండు కొట్టంబడి మడిసెనిత్యాది సిద్ధం బయ్యె.

వ్యాఖ్య - ఒకే యాశ్రయమును గల క్రియలలోపల పూర్వమందుగల క్రియావాచికములయిన ధాతువులకు 'ఇ'యను ప్రత్యయము కలుగు నని సూత్రార్థము. సంస్కృతమునం దిట్టి యెడల 'క్త్వ' అను ప్రత్యయము కలుగును. 'క్త్వ' యొక్క అర్థమునందు తెలుగునందు కలుగు 'ఇ' వర్ణకమును 'క్త్వార్థము' అని కూడ పిలుచుట వ్యాకరణ సంప్రదాయము.

'వాఁడు చూచి చదివెను' అని యున్న వాక్యమునందు చూచుట, చదువుట అను రెండును వ్యాపారబోధకములు. ఈ రెండింటికిని ఆశ్రయము 'వాఁడు'. కావున నవి సమానాశ్రయములు. ఇందు 'చూచుట' యన్నది ముందు జరిగినది. చదువుట యన్నది అనంతరమందు జరిగినది. కావున పూర్వకాలికమైన క్రియను బోధించునట్టి 'చూచు' అను ధాతువుపై 'ఇ' వర్ణకము చేరి 'చూచి' అని యైనది.

వండి, పండి, విని, కని - మున్నగు రూపములు ఇట్లేర్పడినవే.

సూత్రమునందు 'సమానకర్తృకములు' అని యనక 'సమానాశ్రయములు' అని యనుటకు గల ప్రయోజనమును వ్యాకర్తయే వివరించెను పై వాక్యమునందు 'వాడు' అన్నదే 'చూచి' అనుదానికిని 'చదివెను' అనుదానికిని గూడ కర్తయై యున్నది. కొన్ని యెడల నట్లు కాకపోవచ్చును. 'చైత్రునిచేత మైత్రుండు కొట్టంబడి మడిసెను' అను వాక్యమునందు 'కొట్టంబడి' అనుదానికి కర్త చైత్రుఁడు. కావుననే "చేత వర్ణకంబు కర్త కగు" అన్న (బా. కారక - 3)

నియమమును బట్టి 'చైత్రునిచేత' అనియైనది. 'మడిసెను' అను క్రియకు కర్త మైత్రుండు. కావున నిచ్చటి వ్యాపార బోధకములయిన ధాతువులు రెండును భిన్న కర్తృకము లగు చున్నవి. కావుననే సమాన కర్తృకములని యున్నచో ఇచ్చటి క్త్వార్థరూపమునకు అవకాశము కలుగదు. నిజమునకు కొట్టబడిన వాడు మడిసినవాడు కూడ మైత్రుడే. అనగా రెండు క్రియలకు ఆధారమైనవాడు మైత్రుడు. కావున మైత్రుడు ఆధారముగా ప్రవర్తించిన రెండు క్రియలయందును పూర్వక్రియను తెలుపు ధాతువునకు ఇ వర్ణకము కాగా 'కొట్టఁబడి' అని యయ్యెను.

**55.** ఒక్కొకచో భూతార్థకాసమాపకక్రియ హేత్వర్థకంబును నగు. (ప్రౌ-౧౫)

రాహుకంఠము దెగి దేహము ధరణిఁ బడియె॥ భార. ఆది. ౨ ఆ॥ బిట్టడలు మనంబునం గదిరి హా! యను వారును॥ భార. విరా. ౩ ఆ॥ ఏ త్తైఱ వ్రేసిన మోము దాఁకి తిరిగె గరుడి॥ నిర్వ. ౩ ఆ॥ అది యున్ మేనుచ్చి హా లక్ష్మణా యంచున్ గూలె॥ రా. అర. ౨ ఆ॥ పౌరలెత్తి ఘనసారతరువులఁ దనుదాన దొరఁగిన పచ్చకప్పురపు రజము॥ స్వా. ౨ ఆ॥ మొ.

వ్యాఖ్య - ఒక్కొకచోట భూతార్థకమైన అసమాపక క్రియ హేతువును గూడ బోధించు నని సూత్రార్థము. భూతార్థకమైన అసమాపకక్రియ అని యనగా క్త్వార్థకమని యర్థము. క్త్వార్థకము సమానాశ్రయము లయిన క్రియలలో, పూర్వకాలిక క్రియలపైని చేరుట సామాన్యలక్షణము. బాలవ్యాకరణము ఆ విషయమును చెప్పినది. క్త్వార్థకము హేత్వర్థమును చెప్పుట

కూడ కొన్ని యెడల కలదు. ఆ విశేషప్రవృత్తిని తెల్పుటకయి యీ సూత్రము ప్రవర్తించుచున్నది.

'రాహుకంఠము దెగి దేహము ధరణిఁబడియె' అనుచోట దేహము ధరణిఁబడుటకు రాహుకంఠము తెగుట కారణము. 'తెగుటవలన' అన్న హేత్వర్థమును 'తెగి' యన్న క్త్వార్థక రూపమే కల్పించుచున్నది. ఇట్లే 'కదిరి' అని యనగా కదురుట చేత ననియు, 'తాకి' అని యనగా తాకుటచేత ననియు, 'ఉచ్చి' అని యనగా ఉచ్చుటచేత ననియు, 'పొరలెత్తి' అని యనగా పొరలెత్తుట వలన ననియు నర్థములు.

**56.** కజీ వ్యతిరేక క్త్వార్థంబునం దగు. (బా-౬౯)

వండక - పండక - కొట్టక - తిట్టక.

వ్యాఖ్య - వ్యతిరేక విశిష్టమైన పూర్వకాలిక క్రియా వాచియగు ధాతువునకు 'కజీ' అను ప్రత్యయము కలుగునని సూత్రార్థము.

'వాడు కొట్టక వదలిపెట్టెను' అను వాక్యమునందు కొట్టకుండుటకు, వదలిపెట్టుటకు ఆశ్రయము ఒక్కటే. కావున పూర్వకాలిక క్రియను దెల్పు ధాతువునకు ఇత్వము వచ్చును. ఇచ్చటిది వ్యతిరేక క్రియ యగుటచే 'కజీ' అన్న ప్రత్యయిము వచ్చును. కొట్టు + కజీ - కొట్టక॥ కజీ యిన్నది జిత్తు గావున ధాతువుయొక్క ఉత్వమునకు అత్వము కలిగి పై రూప మేర్పడినది. ఇట్లే వండక, పండక, వినక, తినక - మున్నగు వ్యతిరేకక్త్వార్థకము లేర్పడును.

## 57. తుమర్థ భావలక్షణంబులందు నుజ్ యగు. (బా-౪౦)

భావలక్షణంబునా నన్యక్రియకు లక్షణభూతం బగు క్రియ. తుమర్థంబందును భావలక్షణంబునందును ధాతువునకు నుజ్ వర్ణకం బగు. తుమర్థంబు - చైత్రుండు వండను బోయెను. పాక క్రియార్థంబు పోయె నని యర్థము. భావలక్షణము - చైత్రుండు వండ నతిథి వచ్చెను. ఇచట వంట లక్షణము; వచ్చుట లక్ష్యము.

వ్యాఖ్య - తుమర్థము నందును, భావలక్షణము నందును ధాతువునకు నుజ్ యను ప్రత్యయము కలుగునని సూత్రార్థము.

సంస్కృతమునందు గంతుమ్, భోక్తుమ్-మున్నగుచోట్ల 'తుమ్' అను ప్రత్యయము గలదు. 'గంతుమ్' అని యనగా వెళ్ళుటకొఱకు అని యర్థము. 'భోక్తుమ్' అని యనగా భుజించుట కొఱకు అని యర్థము. కావున 'తుమర్థము' అని యనగా 'కొఱకు' అను నర్థమని యర్థము.

తుమర్థమునందు ధాతువునకు 'నుజ్' వర్ణకము కలుగును. 'వండు' అను ధాతువునకు 'నుజ్' రాగా 'వండు + నుజ్' అని యగును. 'నుజ్' యన్నది జిత్తు గావున ధాతువుయొక్క ఉత్వమునకు అత్వము కలిగి 'వండను' అని యగును. దీనికి 'వండుట కొఱకు' అని యర్థము.

ఇతర క్రియకు లక్షణముగా ప్రవర్తించు క్రియకు భావలక్షణము అని పేరు. ఒక క్రియయొక్క కాలమును గుర్తించుటకు మఱొక క్రియ సహకరించును. సహకరించిన క్రియ లక్షణము; సహకారము నొందిన క్రియ లక్ష్యము. చైత్రుండు వండ

నతిథి వచ్చెను- అను వాక్యమునందు వండుట, వచ్చుట - అను రెండు క్రియలు జరుగుచున్నవి. వచ్చుట యన్నది యెప్పుడు జరిగెనన్న ప్రశ్నకు లక్షణముగా వండుట యన్నది వ్యవహరించు చున్నది. కావుననే 'వండు' అను ధాతువునకు 'నుజీ' వర్ణకము కలుగగా 'వండు + నుజీ = వండను' అని యగును. 'వండను' అనగా 'వండిన కాలమునందు' అని యర్థము. కావున వచ్చుట అను క్రియకు 'వండుట' యన్నది లక్షణ మగుచున్నది.

**58. వ్యాపారోన్ముఖత్వంబున నన్నంతక్రియలకుఁ బాఱు ధాతు వనుప్రయుక్తం బగు. (ప్రౌ-౧౯)**

వయిఁ బరామరిక చొప్పడమిఁ బాకను తప్పి వండఁ బాఱిన పాల మెండఁ బాఱె॥ స్వా. ౩ ఆ॥ మొ.

వ్యాఖ్య - వ్యాపారము అని యనగా చేష్ట యని యర్థము. ఉన్ముఖత్వము అని యనగా అనుకూలముగా నుం డుట యని యర్థము. వ్యాపారమున కనుకూలతను సూచించు నపుడు అన్నంత క్రియలకు 'పాఱు' అనెడి ధాతు వనుప్రయుక్త మగు నని సూత్రార్థము.

అన్నంత క్రియ యనగా నుజ్యంతమగు క్రియ యని భావము. 'వండన్' మున్నగు రూపములయందు ధాతువుపైని 'అన్' అన్నదే అదనముగా నున్నది. కావుననే ప్రౌఢ వ్యాకరణ కారుడు అట్టివానిని అన్నంత క్రియలుగా పేర్కొనుచున్నాడు. బాలవ్యాకరణమునుబట్టి అన్నంతక్రియ తుమర్థమునందును,

భావలక్షణమునందును వ్యవహరించును. ఇది సాధారణ విష యము దీనికి విశేషప్రవృత్తి కలదు. ఆ విశేష ప్రవృత్తిని ప్రస్తుతసూత్రము జ్ఞాపనము చేయుచున్నది.

'పండు' అను ధాతువుపై 'నుజీ' వర్ణకము కలిగి, పాఱు అను ధాతు వనుప్రయుక్తము కాగా 'పండను + పాఱు' అని యగును. ద్రుతకార్యము కాగా 'పండఁబాఱు' మున్నగు విధముగా రూపమేర్పడును. పండఁబాఱుట అని యనగా పండుట అను వ్యాపారమునకు ఉన్ముఖముగా నగుట యని యర్థము. అట్లే 'ఎండు' ధాతువుయొక్క అన్నంతరూపమునకు 'పాఱు' అనుప్రయుక్తము కాగా 'ఎండఁబాఱు' అనియగును. దీనికి ఎండుట యను వ్యాపారమునకు ఉన్ముఖముగా నగుట యని యర్థము.

**59.** తిగుచు ధాతువు నన్నంతరూపములు తివ్వఁ దివ ననియు. (ప్రౌ - ౨౦)

ఎవ్వరికిని మోపెట్టను। దివ్వను శక్యంబుగాని దృఢకార్ముకముఁ॥ భార. ఆది. ౭ ఆ॥ కొప్పు వట్టి తివం ꠱ోవ॥ కళా. ౩ ఆ॥

వ్యాఖ్య - తిగుచు అను ధాతువుపై నుజీ యను ప్రత్యయము చేరునపుడు తివ్వన్, తివన్-అనియు రూపములు గలుగునని సూత్రార్థము.

ఇది నిపాత సూత్రము. ప్రక్రియనుబట్టి యొక విధముగా కావలసియుండగా, మఱొక విధమయిన రూపమును విధించుట యిక్కడ జరుగుచున్నది. తివ్వన్, తివన్ - అను రూపములు

నిపాతము లగుటచే వీనికి ప్రక్రియను చూపవలసిన యవసరము లేదు. భారతమునుండి 'తివ్వను' అను రూపమునకును. కళా పూర్ణోదయమునుండి 'తివన్' అను రూపమునకును ప్రయోగ ములు చూపబడినవి.

సూత్రమునందు 'అనియు' అని సముచ్చయార్థమును జేర్చి పలుకుటచేత లక్షణానుగుణముగా నేర్పడు రూపము కూడ కల దన్న విషయము సూచింపబడుచున్నది. 'తిగుచు' అను ధాతువు నకు 'నుజీ' చేరగా 'తిగుచు + నుజీ' అని యుండును. "ఆగ మాన్య చకారంబులకు ముత్తు పరంబగునపుడు పవ లగు" అన్న (బా - 88) సూత్రమునుబట్టి చకారమునకు వకారము రాగా 'తిగువు + నుజీ'అని యగును. జీత్తు పరమందుండుటచే ధాతువు యొక్క ఉత్వమునకు అత్వము కాగా 'తిగువను' అని యగును. ఈ రూపము కూడ సమ్మతమే.

**60.** చేదర్థంబునందు వృత్తంబగు భావలక్షణంబునందు నవర్ణ కంబు ద్రుతాంతం బగు. (బా - ౬౧)

వానలు గురిసినం బంటలు పండును - వాఁడు రమ్మనినఁ బోయితిని.

వ్యాఖ్య - చేదర్థమునందును, భూతార్థకమయిన భావ లక్షణమునందును ధాతువునకు ద్రుతాంతమైన న వర్ణకము కలుగునని సూత్రార్థము.

సంస్కృతమున 'చేత్' అనునది యే యర్థమున వచ్చునో, ఆ యర్థమునందు వచ్చునది చేదర్థము. తెనుగునందు అయినచో,

అయిన యెడల - మున్నగు విధమయిన యర్థము నొసగును. వృత్తంబగు బావలక్షణంబు అని యనగా జరిగిపోయిన భావలక్షణము అని యర్థము; అనగా భూతార్థకమని భావము. భావలక్షణము అని యనగా అన్యక్రియకు లక్షణ భూత మగు క్రియ యని వ్యాకర్తయే పూర్వసూత్రముకడ నిర్వచించి యున్నాడు.

'కురియు నెడల' అను నర్థమున 'కురియు' అను ధాతువుపై ద్రుతాంతమైన 'న' వర్ణకము చేయను. అప్పుడు 'కురియు + నను' అని యుండును. రాబోవు "చేదర్థయోగంబున లృట్టునకు లిట్టగు" అన్న (బా - 119) సూత్రమును బట్టి 'కురియు' ధాతువునకు లిట్టు కావలయును. "భూతంబునం దిగాగమం బగు" నన్న (బా - 17) సూత్రమును బట్టి 'ఇ' యను నాగమము కలుగగా 'కురియు + ఇ + నను' అని యగును. ఇకారము యొక్క కూడికచేత 'కురియు' ధాతువుయొక్క యకారమునకు సకారము (బా - 54) కాగా 'కురిసి + నను = కురిసినను' అని యగును. చేదర్థము భవిష్యద్బోధకమే యైనను భూతార్థకము తోడి గూపమును పొంది, ఆ పిమ్మట ద్రుతాంతమైన న వర్ణకమును పొందును.

'రమ్మనినన్' అన్నది వృత్తమగు భావలక్షణమునకు ఉదాహరణము. 'పోవుట' అను వ్యాపారమునకు 'రమ్మనుట' అను వ్యాపారము లక్షణము. 'అనుట' జరిగిన పిమ్మటనే వెళ్లుట జరిగెను. కావుననే యిది భూతార్థకము. 'అను' ధాతువునకు "భూతంబునం దిగాగమం బగు" నన్న సూత్రమును బట్టి 'ఇ' వర్ణము కలిగినపిమ్మటనే ద్రుతాంతమైన న వర్ణకము కలుగును. "అను + ఇ + నను అనినను" అని యగును.

**61. ఆనంతర్యంబున డు వర్ణకంబు ద్రుతాంతం బగు.**

**(బా - ४౨)**

జాబిలి తోఁచెంచుడుం గువలయంబులు వికసిల్లె.

వ్యాఖ్య - అనంతరమందు జరిగిన దానిని సూచించు ధాతువునకు ద్రుతాంతమయిన డు వర్ణకము కలుగునని సూత్రార్థము.

అనంతరము యొక్క భావము ఆనంతర్యము. దీనికి పిమ్మట అని యర్థము. 'న + అంతరము' అను విభాగము వలన 'ఎడము లేకుండ' అను యౌగికార్థము కూడ ఇక్కడ వ్యవహరించును. అవ్యవహితముగా జరుగు దానిని దెల్పు ధాతువునకు 'డును' అని చేరునని తాత్పర్యము.

'తోఁచెంచు' అన్న ధాతువునకు 'డును' అని చేరగా 'తోఁచెంచుడును' అని యయ్యెను. అనగా 'తోఁచెంచిన వెను వెంటనే' అని యర్థము. 'వికసిల్లె' అను కార్యమునకు 'తోఁచెంచుట' కారణ మగుచున్నది. కావున కారణవాచకము పూర్వ ప్రయుక్తమగును. దానికి 'డు' వర్ణకము చేరును. అవ్యవహిత ముగా కార్యము దాని ననుసరించును.

**62. కొన్ని యెడల భావార్థకరూపము ను శబ్ద పరకంబయి యానంతర్యార్థకం బయ్యెడి.** **(ప్రౌ - ౧౨)**

అనుటయు లబ్ధకుం డిట్లనియె॥ భార. అర. ౫ అ॥

వ్యాఖ్య - కొన్ని యెడల ట వర్ణకాంతమయిన భావార్థకము కూడ 'ను' అను శబ్దమును జేర్చుకొని ఆనంతర్యార్థమును బోధించునని సూత్రార్థము.

'అనుట' యనునది భావార్థకము. దీనిపైని ను వర్ణకము చేరును. 'అనుట + ను' అని యగును. 'అనుట' యన్నది కళ యగుటచేత 'ను' వర్ణమునకు ముందు 'యు' అని (ప్రౌ. శబ్ద- 116) చేరును. అప్పుడు 'అనుట + యును = అనుటయును, అని యగును. దీనికి 'అనిన పిమ్మట' యనియే యర్థము. బాల వ్యాకరణము డు వర్ణకము నానంతర్యార్థమునందు తెలిపెను. అది సాధారణ విషయము. భావార్థకము కూడ సముచ్చయార్థకమును జేర్చుకొని ఆనంతర్యార్థమును బోధించుట విశేషము. దానిని చూపుట ప్రస్తుత సూత్ర ప్రయోజనము.

[ప్రౌఢ వ్యాకరణకారుడు 'ను' అను శబ్దమును జేర్చుకొని అని వ్రాయుట సరికాదు. "సముచ్చయార్థకమైన 'ను' శబ్దము" అని వ్రాసినప్పుడు కాని 'యును' మున్నగువానిని చేర్చుకొనవలయునన్న స్ఫురణము కలుగదు. సముచ్చయమునందు 'ను' శబ్దమని యనుటయే సరియైన మార్గము కాదు. 'ఉను' అని సముచ్చయార్థకమును గ్రహించిన యెడల సమంజసముగా నుండెడిది.]

ఉన్నది యున్నట్లుగా సూత్రము నిర్దోషము కాదు. సూత్రమున 'ఆనంతర్యార్థకం బద్యోడి' అను దానికి కర్త భావార్థకరూపము. కాని, నిజమునకు భావార్థకరూపము ఆనంతర్యార్థకము కాదు. భావార్థకరూపముపైని చేరెడు 'ను' వర్ణము మాత్రమే ఆనంతర్యార్థకము. అట్లు కానియెడల 'అనుటయు' అను దాని కంతటికిని కలిపి 'పిమ్మట' నని యర్థము చెప్పుకొన

వలసి వచ్చును. అది సూత్రకర్త యభిప్రాయము కాదు. 'అనిన తరువాత' అన్నదియే ఆయన యభిప్రాయము. కావున "భావార్థకంబు మీఁది సముచ్చయార్థక శబ్దంబు కొన్నియెడల నానంతర్యార్థకం బయ్యెడి" నన్నట్లు సూత్రముండుట సమంజసముగా నుండును.

**63.** చువర్ణకంబు ద్రుతాంతంబు క్రియాన్వయంబున శత్రర్థంబునం దగు. (బా - ౪౩)

చూచుచుం బోవుచున్నాఁడు - చూచుచుం బోయెను - చూచుచుం బోవఁగలఁడు.

వ్యాఖ్య- సమాపకక్రియతో అన్వయమును గలిగియున్న ధాతువునకు శత్రర్థము నందు ద్రుతాంతమైన చుప్రత్యయము కలుగునని సూత్రార్థము. సంస్కృతమున శతృ ప్రత్యయము ఏ యర్థమున వచ్చునో ఆ యర్థమును శత్రర్థమని యందురు; అనగా వర్తమానార్థ మని తాత్పర్యము.

చు ప్రత్యయము చేరిన శత్రర్థకము అసమాపక క్రియా రూపము; కావున దీనికిది వాక్యములందు నిలువదు. సమాపక క్రియతో అన్వయమును గలిగియుండును.

చూచుచున్ + పోవుచున్నాఁడు - అని యన్నప్పుడు 'చూచు' ధాతువుపైని ద్రుతాంతమైన చువర్ణకము చేరి, ఆ పిమ్మట నున్న వర్తమానకాలిక సమాపకక్రియతో నన్వయమును గలిగియున్నది. అట్లే తరువాతి యుదాహరణమునందు శత్రర్థకము భూతకాలక్రియతో అన్వయమును గలిగియున్నది.

తరువాతి యుదాహరణమునందు భవిష్యత్కాలిక క్రియతో అన్వయమును గలిగియున్నది. కావున శత్రర్థకము తనకు దానుగా వర్తమానార్థమునే బోధించుచున్నను, సమాపక క్రియను బట్టి కాలబోధ జరుగును.

## 64. తృవర్ణకార్థంబునం డెడి యెడు వన్నియ లగు.(బా-౪౪)

ప్రహరించెడి వాఁడు - ప్రహరించెడు వాఁడు ॥ ప్రహర్త యని యర్థము.

వ్యాఖ్య- తృవర్ణకము యొక్క అర్థమునందు ధాతువునకు ఎడి, ఎడు - అను ప్రత్యయము లగునని సూత్రార్థము.

సంస్కృతమునందు కర్త్రర్థమున 'తృ' అను ప్రత్యయము విధింపబడును. 'కర్తృ' అను రూపమునందు కర్ - తృ- అను రెండు భాగములు గలవు. ఇందు రెండవదయిన 'తృ' ప్రత్యయము. సంస్కృతమున 'తృ' యను ప్రత్యయము ఏ యర్థమున నగునో, ఆ యర్థమునం దగు ప్రత్యయమునకు తృవర్ణకార్థమని సంకేతము.

[ఇచ్చట కర్త్రర్థ మని యన్నపుడు వాక్యమునం దుండు కర్త యని పొరపడ రాదు. ఇక్కడ కర్త యనగా 'చేయువాడు' అనియే యర్థము. ఈ కర్త్రర్థకరూపము అన్ని విభక్తులను బొందవచ్చును.]

'ప్రహరించు' అను ధాతువునకు 'ఎడి' అను ప్రత్యయము రాగా 'ప్రహరించెడి' అని యగును. అట్లే 'ఎడు' అను ప్రత్యయము రాగా 'ప్రహరించెడు' అని యగును. ఇక్కడి కీ రూపములు సమగ్రములు కావు. ఇది కర్త్రర్థమునం దగుటచే

'వాఁడు' అను శబ్దము పరమందు కలుగగా ప్రహరించెడివాఁడు - ప్రహరించెడువాఁడు అని యగును. సంస్కృతమునందలి 'ప్రహర్త'యను పదమునకున్న యర్థమే వీనికి కూడ నుండును.

**65. వానికి లోపంబు బహుళంబుగ నగు. (బా - ౪౫)**

ప్రహరించువాఁడు॥ ప్రహర్త యని యర్థము.

వ్యాఖ్య - పూర్వసూత్రమున విధించిన ఎడి, ఎడు- అను ప్రత్యయములకు లోపము బహుళముగా నగునని సూత్రార్థము.

'ప్రహరించు + ఎడి + వాఁడు' అని పూర్వ సూత్రముచే నేర్పడినది. ప్రస్తుత సూత్రముచే 'ఎడి' వర్ణకమునకు లోపము కాగా 'ప్రహరించువాఁడు' అని యగును.

[ప్రహరించు, ప్రహరించెడి, ప్రహరించెడు - అనునవి మూడును తద్ధర్మార్థమును దెలుపు ధాతుజ విశేషణములు. 'ప్రహరించువాడు' అని యనగా ప్రహరించుట స్వభావముగా కలవాడని యర్థము, కావున తాచ్ఛీల్యమునందు తద్ధర్మార్థకము వ్యవహరించుచున్నది. "ధాతుజ విశేషణంబులకు విభక్తి వివక్షించునపుడు తచ్ఛబ్దం బనుప్రయుక్తం బగు" అన్న (బా. సమాస - ౧) సూత్రమును బట్టి 'ప్రహరించు' మున్నగు వానిపై 'వాఁడు' అను తచ్ఛబ్దము కలుగును. స్త్రీ వాచ్యమగునపుడు 'అది' యని కలిగి 'ప్రహరించునది' మున్నగు విధముగా నుండును.]

సూత్రమునందు 'బహుళము' అని యనుటచేత వికల్పము మాత్రమేకాక, నిషేధము అన్యత్వము అనునవికూడ నుండుట కవకాశము కలదు. ప్రవహరించెడు, ప్రహరించు - అనుచోట 'ఎడు' వర్ణకమునకు లోపము వికల్పముగా నగుచున్నది. అస్త్యర్థకమైన 'కలుగు' నకు ఆదేశముగా 'కల' యను రూపము

విభాషగా (బా - 105) నేర్పడును. 'కల' యనురూపము మీది ఎడి యెడులకు లోపము నిత్యముగా నగును.

66. ఉన్న కలజీ న వర్ణకంబులు భవద్భావి శతృ క్తవదర్థం బులం దగు. (బా - ౪౬)

ఉన్న వర్ణకంబు వర్తమానార్థక శత్రర్థంబునం దగు కలజీ వర్ణకంబు భవిష్యదర్థక శత్రర్థంబునం దగు. న వర్ణకంబు క్తవదర్థం బునం దగు. ఇవి సత్త్వాభిధానంబునం దగునని యెఱుంగునది. సుబంత వాచ్యంబు సత్త్వంబు నాఁబడు॥ వండుచున్నవాఁడు - వండఁ గల వాఁడు - వండినవాఁడు.

వ్యాఖ్య - భవదర్థకము అని యనగా వర్తమానార్థకము అని భావర్థము. వర్తమానార్థకమైన శత్రర్థమునందు 'ఉన్న' అను ప్రత్యయము కలుగును భవిష్యదర్థకమైన శత్రర్థమునందు 'కలజీ' అను ప్రత్యయము కలుగును క్తవదర్థము అని యనగా భూతార్థక మందు 'న' ప్రత్యయము కలుగును-అని సూత్రార్థము.

సుబంత వాచ్యము అని యనగా సుబంతము చేత చెప్పబడు నది యని యర్థము. సుబంతము అని యనగా నామ విభక్తులను తుదియందు గలది, అనగా నామమని భావర్థము. నామముచే చెప్పబడు దానికి సత్త్వ మని పేరు. సత్త్వ మని యనగా ద్రవ్య మని యర్థము. సత్త్వాభిధానంబునందు అనగా ద్రవ్యమును గురించి చెప్పు నప్పుడని యభిప్రాయము. వ్యాపారబోధకములు క్రియలు; ద్రవ్యబోధకములు నామములు. పైని చెప్పిన ఉన్న, కల, న - అను ప్రత్యయములు క్రియాధాతువులపైనే చేరు

చున్నప్పటికిని, నామమునే బోధించు నని యర్థము. తచ్ఛబ్దము ను జేర్చుకొని విశేషణములుగా వ్యవహరించు నన్నది సారాంశము.

'వండు' అను భాతువునకు ప్రస్తుత సూత్రముచేత 'ఉన్న' అన్న ప్రత్యయము వర్తమానార్థమునందు పరముకాగా 'వండు + ఉన్న' అని యగును. "ఉన్న శబ్దంబు పరంబగునపుడు చువర్ణకంబగు" అను (బా - 14) సూత్రమునుబట్టి 'వండు + చు + ఉన్న = వండుచున్న' అని యగును. దానిపై తచ్ఛబ్దము చేరి 'వండుచున్నవాఁడు' అని యగును.

'వండు' అను ధాతువునకు భవిష్యదర్థమునందు 'కలజి' అను ప్రత్యయము పరముకాగా 'వండు + కలజి' అని యగును. అప్పుడు "కలజి పడుజులు పరంబులగునపుడు నుగాగమం బగు" నన్న (బా - 21) విధినిబట్టి 'వండు + నుజి + కలజి = వండ + ను + కల = వండఁగల' అని యగును. తచ్ఛబ్దము చేరి "వండఁగల వాఁడు" అని యగును.

'వండు' అను ధాతువునకు క్తవదర్థమునందు 'న' వర్ణకము కలుగును 'వండు + న' అని యుండగా, ఇది భూతార్థకమగుటచే ధాతువున కిగాగమము (బా - 17) కలిగి 'వండు + ఇ + న = వండిన' అని యగును. ఆ పిమ్మట తచ్ఛబ్దము కలిగి 'వండినవాఁడు' అనియగును.

**67. వ్యతిరేక తృవర్ణకార్థంబున నిజి యగు. (బా - ౪౭)**

వండనివాఁడు ॥ ఎడి ప్రభృతి వర్ణకాంతంబు లేడను ధాతుజ విశేషణంబులని ప్రాచీనులు వ్యవహరింతురు

వ్యాఖ్య - వ్యతిరేక విశిష్టమగు కర్త్రర్థమునందు ధాతువునకు 'నిజీ' యను ప్రత్యయము కలుగునని సూత్రార్థము. 'వండు' అను ధాతువునకు 'నిజీ' యను ప్రత్యయము రాగా 'వండు + నిజీ' అని యుండును. జీత్తు పరమందుండుటచే ధాతువుయొక్క ఉత్వమునకు అత్వము కలిగి 'వండ + ని = వండని' అని యగును. పైని తచ్ఛబ్దము చేరగా 'వండనివాఁడు' అని యగును.

ఎకి, ఎడు, తలోపము, ఉన్న, కల, న, ని - అను వానిని గల ధాతువులను ధాతుజవిశేషణము లని యందురు. వచ్చెడి, వచ్చు - అన్నవి తద్ధర్మార్థక ధాతుజ విశేషణములు. వచ్చుచున్న - అన్నది వర్తమానార్థక ధాతుజ విశేషణము. రాఁగల - అన్నది భవిష్యదర్థక ధాతుజ విశేషణము. రాని - అన్నది వ్యతిరేకార్థక ధాతుజ విశేషణము.

**68.** కంటె వర్ణకంబు పరంబగునపుడు విశేషణ నవర్ణకంబు మీఁది యమహత్తచ్ఛబ్దార్థమునకు లోపంబు విభాషనగు. (ప్రౌ - ౨౧)

లోకత్రయ రాజ్యము మును నిరమిత్రముగాఁ గనిన కంటె॥ లక్ష్మీ. ౩ఆ॥ విభుని పంచినకంటెను॥ హరి. ఉ. ౪ ఆ॥ శరణుఁ జొచ్చిన రక్షింపఁజాలియుండి, మనుపకుండినకంటెఁ గల్మషము గలదె॥ విక్ర. ౩ఆ॥ కుడిచిన కంటెను క్షేత్రము, పడసిన తెఱ వధికమంత్రుడు పాడికిఁ జనుచోన్ ॥ విజ్ఞానే॥ పకుము౫ - వినినదానికంటె॥ మొ.

వ్యాఖ్య - అమహత్తచ్ఛబ్దార్థకము అని యనగా 'అది' యను శబ్దమని యర్థము. 'కంటె' అను చతుర్థీ విభక్తి ప్రత్యయము పరమగునపుడు నవర్ణకాంతమైన ధాతుజ విశేషణము మీది 'అది' యను శబ్దమునకు విభాషగా లోపము కలుగునని సూత్రార్థము.

'కనిన' అన్నది భూతార్థకమయిన ధాతుజ విశేషణము. విభక్తిని వివక్షించునపుడు ధాతుజ విశేషణములకు తచ్ఛబ్దము (బా. సమాస - 9) అనుప్రయుక్త మగును. అప్పుడు 'కనిన+ అది+కంటె' అని యగును. ద్వితీయాది విభక్తి పరమగునపుడు 'అది' శబ్దమునకు 'దాని' యని యాదేశమగును. అప్పుడు'కనిన దానికంటె' అని యగును. ప్రస్తుత సూత్రముచేత తచ్ఛబ్దమునకు లోపము రాగా 'కనినకంటె' అనియుండును. ఇట్లే'పంచిన దానికంటె' అనునది 'పంచినకంటె' అనియు, మనుపకుండిన దాని కంటె అనునది మనుపకుండిన కంటె అనియు, కుడిచిన దాని కంటెను అనునది కుడిచినకుంటెను అనియు కావచ్చును. వీని యన్నింటి యందును అమహత్తచ్ఛబ్దమునకు లోపము కలిగినది.

అమహత్తచ్ఛబ్దము అని సవిశేషణముగా చెప్పుట గమనింపవలయును. అది అను దానికి మాత్రమే లోపము కలుగుచున్నది. ఎచ్చటను మహదర్థక తచ్ఛబ్దమయిన 'వాఁడు' అను దానికి ఇట్టి సందర్భమునందు లోపము కలుగదు.

**69.** కొన్నియెడలం ద్వరితార్థసూచకంబయి భావిని భూతంబు చూపబ్తెడి. (ప్రౌ - 8)

ఖా వచ్చె సుదర్శనాయుధుఁడు॥ భాగ. ౧౦ స్కం. పూ॥ మొ.

వ్యాఖ్య - త్వరితార్థసూచకము అని యనగా తొందర యను నర్థమును సూచించున దని యర్థము. కొన్నిచోట్ల వేగమును సూచించుచు భవిష్యత్కాల క్రియకు బదులుగా భూతకాలక్రియ యుపయోగపడుట కనిపించునని సూత్రార్థము.

'వచ్చు' అను ధాతువునకు ప్రథమ పురుషైకవచనమునందు 'ఎను' అను ప్రత్యయము కలుగగా 'వచ్చు + ఎను = వచ్చెను' అని యయ్యెను. ఇది లిఙ్రూపము; అనగా భూతకాలమునంగలి రూపము. 'తొందరలోనే వచ్చును' అని తెల్పుట విషయము. ఇది భవిష్యత్కాలమునందు 'కలజీ' అను ప్రత్యయము రాగా వచ్చు + కలజీ + డుఙ్ అని యుండగా 'రా' అను నాదేశము నొంది రా + కలజీ + డుఙ్ = రాఁగలఁడు అని యగును. 'రాఁగలఁడు' అను భవిష్యత్కాల క్రియకు బదులుగా 'వచ్చెను' అను భూతకాల క్రియ యుపయోగపడుట యిక్కడ విశేషము.

'కొన్ని యెడల' నని యనుటచే ఇట్టి ప్రయోగములు విరళముగానే కలవని తాత్పర్యము.

**70.** లకారాదులు సకర్మకంబునకుం గర్తృ కర్మంబులందును లాఁతికిఁ గర్తయందు నగు. (బా - ౪౮)

సకర్మకంబు నాఁ, గర్మాకాంక్షోత్థాపకంబు. అకర్మకంబు నాఁ గర్మాకాంక్షానుత్థాపకంబు.

వ్యాఖ్య - లకారము మున్నగునవి సకర్మకమైన ధాతువునకు కర్త్రర్థమునందును, కర్మార్థమునందును గూడ నగును. అక

ర్మకమగు ధాతువునకు (లాతికి = ఇతరమునకు) కర్త్రర్థము నందగును - అని సూత్రార్థము.

లకారాదులు అని యనగా లట్టు, లిట్టు, లృట్టు, లాట్టు, లూట్టు, లఙి - యను నాఱును లకారముచే గ్రాహ్యములు. ఆది శబ్దముచేత భావము, వ్యతిరేకభావము, శత్రర్థకము, భావ్యర్థకము, క్తవదర్థకము, తృవర్ణార్థకము - మున్నగునవి గ్రాహ్యములు.

కర్మ యొక్క ఆకాంక్షను గలిగించునది సకర్మకము. ధాత్వర్థఫలాశ్రయము కర్మము (బా. కా-2). దేవదత్తుడు వంటకమును వండెను - అనుచోట 'వండెను' అనునది సకర్మకక్రియ. కావున 'వండె' అన్న వెంటనే 'దేనిని' అన్న ప్రశ్న కలుగుచున్నది. 'వంటకమును' అన్నది సమాధానము. కావున 'వంటకము' అన్నది కర్మము. 'వండుట' అను ధాత్వర్థము యొక్క ఫలమునకు ఆశ్రయము వంటకము. కావుననే కర్మాపేక్ష కలిగిన 'వండు' ధాతువును సకర్మకము అని యందుము. పై యుదాహరణమునందు కర్త్రర్థమునందు (క్రియా పదముచేత ఉక్తమగునది కర్తయే) ధాతువునకు లిట్టు వర్ణకము కలిగెను. 'దేవదత్తునిచేత వంటకము వండఁబడియె' అన్న వాక్యమునందు క్రియచేత ఉక్తమగునది 'వంటకము' అన్న కర్మపదము కావున, ఇది కర్మార్థకము. కర్మార్థకమునందును సకర్మక ధాతువునకు లకారాదులు కలుగును. అందువలననే 'వండఁబడు + ఎను = వండఁబడెను' అను విధముగా లిడ్రూపము కలిగెను.

కర్మయొక్క అకాంక్షలేనిది అకర్మకము. రాముఁడు నిలుచుండెను - అన్న వాక్యమునందు 'నిలుచుండు' అన్నది ధాతువు. దేనిని నిలుచుండెను ? ఎవరిని నిలుచుండెను ? అని ప్రశ్నించుటకు ఆకాంక్ష కలుగదు. కావున 'నిలుచుండు' అన్నది అకర్మకధాతువు. క్రియచేత ఉక్తమగునది కర్తయే కావున నిది కర్త్రర్థకము. కర్త్రర్థకమునందే అకర్మమునకు లకారాదులు చేరును. 'నిలుచుండు' అను ధాతువునకు లిట్టు పరము కాగా, ప్రథమైకవచనమునందలి ణుజ్ఞునకు బదులుగా 'ఎను' వర్ణకము కలిగెను. 'నిలుచుండు + ఎను = నిలుచుండెను' అను రూపము ఏర్పడెను. కర్మయే లేనప్పుడు క్రియచేత కర్మ చెప్పబడుట యను ప్రసక్తియే యుండదు. కావునఅకర్మకమువలన కర్త్రర్థక వాక్యముమాత్రమే యేర్పడును.

**71.** పడుజ్యనుబంధంబు కర్మంబునం దగు. (బా - ౪౯)

కొట్టఁబడుచున్నాఁడు - కొట్టఁబడుచున్నది - కొట్టఁబడుట - కొట్టఁబడనివాఁడు.

వ్యాఖ్య - కర్మార్థమునందు ధాతువునకు 'పడుజి' అన్నది యనుబంధముగా నగునని సూత్రార్థము.

'కొట్టు' అను ధాతువునకు 'పడుజి' అన్నది పరముకాగా 'కొట్టు + పడుజి' అని యగును. పడుజియన్నది జిత్తు కావున ధాతువుయొక్క ఉత్వమునకు అత్వమగును. అప్పుడు కొట్ట + పడు' అను రూపమేర్పడును. అప్పుడు "కలజి పడుబులు పరములగునపుడు నుగాగమంబగు" అను సూత్రము (బా - 20) చేత 'కొట్ట + ను + పడు = కొట్టఁబడు' అని యగును.

పూర్వసూత్రముచేత నేర్పడిన 'కొట్టఁబడు' మున్నగురూపమే కర్మార్థమున ధాతువుగా పరిగణింపబడును. అట్లు పరిగణించుట చేతనే ధాతువునకు విధింపబడిన 'చు' వర్ణకము, టవర్ణకము మున్నగునవి కలుగుట కవకాశము కలుగుచున్నది. నిజీ, మిజీ మున్నగునవి పరమగునపుడు 'పడు' అన్న అనుబంధముయొక్క ఉత్వమునకు అత్వము కలుగుటకుకూడ ఈపరిగణనమే కారణము.

'కొట్టఁబడుచున్నాఁడు' అన్నది కర్మార్థకమునందలి మహదర్థకైకవచన వర్తమాన క్రియ. 'కొట్టఁబడుచున్నది' అన్నది అమహదర్థకైకవచన వర్తమాన క్రియ. కొట్టఁబడుట - కర్మార్థకమున కేర్పడిన భావార్థకరూపము. కొట్టఁబడనివాఁడు - కర్మార్థకమునందు వ్యతిరేక క్త్వదర్థక రూపము.

**72.** గురువిరహితంబులయ్యు యయాంతంబులయిన యేకస్వర ద్విస్వరంబుల కియుడాగమంబు విభాష నగు.

(బా - ౩౦)

ఏకస్వరధాతు ద్విస్వరధాతువుల మీఁది యించుగ్వ్రక్రంబుల కియుడాగమంబు విభాష నగు. గురుమంతంబగు ధాతువునకును యాంతంబగు ధాతువునకును మీఁది యించుగ్వ్రక్రంబుల కియుడాగమంబు రాదు॥ భుజ్ - ఇయ్ - ఇంచు భుజియించు; పక్షంబున భుజించు॥ గుణ - ఇయ్-ఇంచు గుణియించు; గుణించు॥ ఇంచుగ్వ్యవధానంబునం జేసి సంస్కృత ధాతువులు వక్రపరకంబులు లేవని యెఱుంగునది. యాచ్, అర్థ - ఇత్యాదులు గురుమంతంబులు. వ్యయ - ఇది యాంతము॥ యాచించు అర్థించు - వ్యయించు॥ జి - ఇంచు అనుచో

నిత్యం బగుటంజేసి యయుగాగమంబు రాఁగా యాంతంబగుటంజేసి యియుడాగమంబు లేదని యెఱుంగునది. కృతాకృతప్రసంగి నిత్యంబు గాఁబడు. నగు - ఇయ్ - ఇంచు నగియించు; నగించు ॥ నగు - ఇయ్ - ఎను నగియెను; నగెను ॥ పడు - ఇయ్ - ఎను పడియెను; పడెను.

వ్యాఖ్య - గురువులు లేని, యకారము కొనయందు లేని, ఒకటి కాని రెండు కాని అచ్చులను మాత్రమే కలిగి యున్న ధాతువునకు పరమందున్న 'ఇంచు' అనుదానికిని, ఎత్వ మునకును పూర్వమందు 'ఇయ్' అను నాగమము విభాషగా నగునని సూత్రార్థము.

దీర్ఘములును, జడ్డక్కరములకు గాని సంయుక్తాక్షరము లకు గాని ముందున్నవియు, పూర్ణబిందువును గాని విసర్గమును గాని కలిగి యున్నవియు గురువులని ఛందశ్శాస్త్ర నిర్ణయము.

[పొల్లక్షరములను గూడి యున్నవి కూడ గురువులుగానే పరిగణింప బడును. ప్రస్తుత సందర్భమున పొల్లక్షరము ఇత్వముతో కాని, ఎత్వముతో కాని సన్నికర్ష పొందును. కావున పొల్లక్షరముతోడి యక్షరమును గురు వుగా పరిగణించుట యిచ్చట తగదు.]

సూత్రమునందు రెండంశములు ప్రధానముగా కలవు. స్పష్టతకై సూరి వానిని వివరణమునందు వేరు వేరుగా నిరూ పించెను. ఒకటి కాని రెండు కాని యచ్చులు గల ధాతువుల మీది యించుక్కునకును, వక్రమునకును విభాషగా ఇయుడా గమమగును. యకారాంతములగు ధాతువులమీద, గురువులతో కూడియుండు ధాతువులమీద వచ్చు ఇంచుక్కునకును వక్రము నకును ఇయుడాగమము కలుగదు.

'భుజ్' అనునది ఏకస్వరధాతువు, యకారాంతము కాదు; గురువు లేదు. కావున 'ఇంచుక్కు' పరమగునపుడు 'ఇయ్' అని విభాషగా నగును. 'భుజ్ + ఇంచు' ప్రస్తుత సూత్రముచేత 'ఇయ్' అన్నది 'ఇంచు' కు ముందు చేరగా 'భుజ్ + ఇయ్ + ఇంచు = భుజియించు' అని యగును. విభాషయని యనుటచేత ఇయుడాగమము రానియెడల 'భుజ్ + ఇంచు = భుజించు' అనియే యుండును.

'గుణ' ధాతువునందు రెండు స్వరములు గలవు. యాంతము కాని గురుమంతము కాని కాదు. కావున 'ఇంచు' అన్నది పరమైనపుడు ఇయుడాగమముకూడ కలుగును. గుణ + ఇయ్ + ఇంచు = గుణియించు అని యగును. ఇది విభాషగా నగునని చెప్పుటచేత ఇయుడాగమము కలుగనియెడల 'గుణ + ఇంచు' అన్నది అపదాది సంధి కలిగి 'గుణించు' అని యగును.

"సంస్కృతంబున కంగలాదుల కించుక్కగు" అన్న (బా-63) సూత్రమును బట్టి సంస్కృత ధాతువు లన్నింటిమీద 'ఇంచు' అన్నది ఆగమముగా నగును. కావున సంస్కృత ధాతువులకు పరమందు వక్రము వచ్చుట జరుగదు. ఇదే విషయమును వ్యాకర్త "ఇంచుగ్వ్యవధానంబునం జేసి సంస్కృత ధాతువులు వక్ర పరకంబులు లేవని యెఱుంగునది" అను వివరణ వాక్యమున తెలుపుచున్నాడు.

'యాచ్' అను ధాతువునకు 'ఇంచు' పరమైనప్పుడు యాచ్ + ఇంచు = యాచించు అను రూపమొక్కటియే యేర్పడును. ధాతువునందు 'యా', అను గురువుండుటచేత

ఇక్కడ ఇయుడాగమము కలుగరాదు. అల్లే 'అర్థ' అను ధాతువునందు మొదటి వర్ణము సంయుక్తాక్షరమునకు ముందరిదగుటచే గురువగుచున్నది. కావున ఇక్కడసైతము 'ఇయ్' అను నాగమము కలుగరాదు. అందుచేత 'అర్థ + ఇంచు = అర్థించు' అను రూపము మాత్రమే యేర్పడును.

'వ్యయ' అను ధాతువు ద్విస్వరము. గురువిరహితము. ఐనప్పటికిని 'య' యను వర్ణము అంతమందుండుటచేత, దీని మీది 'ఇంచు' నకు ఇయ్' అను నాగమము కలుగదు. కాబట్టి 'వ్యయ + ఇంచు = వ్యయించు' అను రూపమొక్కటియే యేర్పడును.

'జి' అనునది ఏక స్వరధాతువు; గురు విరహితము; అయాంతము. ఐనప్పటికిని 'ఇంచు' పరమందున్నప్పుడు ధాతువు యొక్క ఇవర్ణమున కాదేశముగా 'అయ్' అను నాగమము రాబోవు (బా - 64) సూత్రమునుబట్టి కలుగును. అది నిత్యవిధి. దానివలన పరిణామరూపముగా 'జయ్ + ఇంచు' అను విధముగా యకారాంతత్వము సిద్ధించును. కాబట్టి ఇయుడాగమము కలుగదు 'జయించు' అను రూప మొక్కటియే యేర్పడును.

'కృతాకృతప్రసంగి నిత్యంబు నాఁబడు' నని వ్యాకర్త యీ సందర్భమున నిత్యవిధికి నిర్వచనమును దెలిపెను. సూత్ర విధిని పాటించిన సమయమందును, పాటింపని సమయమందును గూడ ప్రవర్తించు దానిని నిత్య సూత్రముగా పరిగణింతురు: సమాన బలము గల రెండు సూత్రములలో ఒక సూత్రము ప్రవ

ర్తించినప్పుడును ప్రవర్తింపనప్పుడును గూడ పసూత్రము ప్రవర్తించునో అది కృతాకృత ప్రసంగి. దానినే నిత్యవిధి యనియు నందురు. ప్రస్తుత లక్ష్యమున 'జి' ధాతువుపైని 'ఇంచు' చేరగా 'జి + ఇంచు' అని యుండును. దీనికి ఇయుడాగమము కలిగిన యెడల 'జి + ఇయ్ + ఇంచు' అని యుండును. 'ఇయ్' అనునది ఇంచునకు చేరునటువంటి ఆగమము కాన 'ఇంచు' శబ్దము చేతనే వ్యవహృతమగును. ఇప్పుడు 'జి' ధాతువు యొక్క ఇ వర్ణమునకు 'అయ్' కలుగగా 'జి + అయ్ + ఇయించు' అను విధముగానగును. అనగా 'ఇయించు' అన్నది పరమందున్నప్పటికిని 'అయ్' అను దానిని వారించు శక్తి దానికి లేదు. అటుకాక 'జి + ఇంచు' అని యుండగా 'అయుక్కు 'అయిన యెడల 'జయ్ + ఇంచు' అని యగును. ఇది యాంతమగుటచేత ఇయుడాగమమును వారింపగలిగి యున్నది. కావున 'అయుక్కు' అనునది 'ఇయుట్టు' కలిగి నప్పుడును, కలుగనప్పుడును గూడ ప్రవర్తించుచున్నది గావున 'నిత్యము' అగుచున్నది., కావున నిత్యవిధి కలుగునప్పుడు వికల్పవిధి తొలగిపోవునని యర్థము.

ఇంతవరకును సంస్కృత ధాతువులను గూర్చి చెప్పెను. ఇప్పుడింక తెలుగు ధాతువుల నుదాహరించుచున్నాడు.

'నగు' అన్నది ద్విస్వర ధాతువు; గురువిరహితము; అయాంతము. కావున 'ఇంచు' అన్నది పరమైనప్పుడు 'ఇయ్' అన్నది కలిగి నగు + ఇయ్ + ఇంచు = నగియించు అని యగును. విభాష యగుటచేత 'ఇయ్' రానిపక్షమున నగు + ఇంచు = నగించు అని యగును. లిట్టు పరమగునపుడు ప్రథమపురుషైక

వచనమునకు ఆదేశముగా 'ఎను' అని రాగా 'నగు + ఎను' అని యుండి ఇయుడాగమము కలిగినయెడల 'నగియెను' అనియు, కలుగనియెడల 'నగెను' అనియు నగును. ఇట్టివే నగియెదవు, నగెదవు - మున్నగు రూపములు. 'ఇంచు' పరమైనపుడును ఇయుడాగమము పాక్షికముగా నగుటచేత నగియించు, నగించు - అని రెండు విధములయిన రూపములును గలుగును. 'పడు' ధాతువునకు వక్రము పరమగునప్పుడును పడెను, పడియెను; పడెదవు, పడియెదవు; పడెడిని, పడియెడిని - మున్నగువిధముగా రూపము లేర్పడును.

[ఇచ్చట నింకను గొన్ని విశేషములు గలవు. వానిని గమనించుట యవసరము. వ్యాకర్త 'ధాతువునకు' అను పదమును సూత్రమునందుప యోగించుటచేతనే అవి సిద్ధించుచున్నవి. అయినను స్పష్టతకొరకును, భ్రమను తొలగించుకొనుటకును వానిని చెప్పుకొనుట యవసరము. సంస్కృతమున ధాతువునకు పూర్వమందు ఉపసర్గలు చేరుట కలదు. 'హృ' ధాతువునకు 'ప్ర' యను ఉపసర్గ చేరినచో 'ప్ర + హృ + ఇంచు' అని యుండును. 'హృ' అన్నది రాబోవు సూత్రముచే 'హర్' అని యగును. అప్పుడు ప్ర + హర్ + ఇంచు ప్రహరించు అని యగును ఇయుడాగమము కలుగగా ప్ర + హర్ + ఇయ్ + ఇంచు = ప్రహరియించు అని యగును. ఇంత వరకును ప్రస్తుతసూత్రమే సాధించును. 'సం' అను ఉపసర్గ చేరినచో సం + హర్ + ఇంచు = సంహరించు అని యగును ఇచ్చట ఇయుడాగమము కలుగునా? లేదా? అన్నది ప్రశ్న. 'సం' అన్నది గురువు కాబట్టి 'ఇయుట్టు' రాదని యనిపించును. కాని గురుమంతము అన్నది ధాతువునకు విశేషణము కాబట్టి ధాతువునందు గురువున్నచో నిషేధము కలుగును. ఉపసర్గయందు గురువుండుటనుబట్టి నిషేధము కలుగవలసిన యవసరము లేదు. కాబట్టి 'సంహరియించు' అన్న రూపము కూడ కలుగును. శ్రీనాథుడు ప్రతిఫలియించు, ప్రతిఘటియించు - అను రూపములను వాడియున్నాడు. చిన్నయ

సూరి నీతిచంద్రిక యవతారికయందు 'సన్నుతియించు' అను రూపమును వాడియున్నాడు. ఇట్లే తెలుగు ధాతువులపై కొను, పడు మున్నగు ధాతువు లనుప్రయుక్తము లగునపుడు లకారాదుల విషయమున గ్రహించి నట్లుగా మొత్తము రూపమును గ్రహింపవలసిన యవసరములేదు. ఏ ధాతువునకు ఇంచుగ్వక్రములు పరము లగుచున్నవో ఆ ధాతువు ఏకస్వరము కాని ద్విస్వరము కాని అయి యుండిన చాలును. గురువిరహితమై యుండిన చాలును. 'తీసికొను + ఎను' అని యున్నప్పుడు ఇయుడాగమము కలుగగా 'తీసికొనియెను' అని యగును. కలుగనియెడల 'తీసికొనెను' అని యగును. 'చూడఁబడు + ఎను' అని యున్నప్పుడు 'చూడఁబడియెను' అని ఆగమముతోడి రూపమును, 'చూడఁబడెను' అని ఆగమము రాని రూపమును గూడ నుండవచ్చును.]

**73. పడ్వాదుల నవర్ణకంబున కత్వంబును గడ హల్లునకు ద్విత్వంబును విభాష నగు. (బా - ३०)**

పడ్డ - పడిన; పడ్డను - పడినను॥ పడు - ఇడు - చెడు - తగు - ఎను - కను - కొను - తిను - మను - ఓను - చను ॥ ఇవి పడ్వాదుల.

వ్యాఖ్య - 'పడు' మున్నగు ధాతువులకు చేరు 'న' వర్ణకమునకు హ్రస్వమైన అకార మాదేశముగా నగును; అప్పుడు ధాతువు యొక్క తుది హల్లునకు ద్విత్వమగును. ఈ కార్యము విభాషగా నగును.

ధాతువులకు 'న' యను ప్రత్యయము క్తవదర్థకమునందును, చేదాద్యర్థకమునందును గలుగును.

'పడు' అను ధాతువునకు క్తవదర్థమున 'న' యని వచ్చును. 'పడు + న' యని యుండును. ఇది భూతార్థకమగు

టచే ధాతువున కిగాగమమై 'పడు + ఇ + న = పడిన' అని యగును. ప్రస్తుత సూత్రముచేత 'న' అనుదానికి 'అ' అని యగును. తత్పూర్వమున్న 'డి' అను నక్షరమునందలి హల్లు వకు ద్విత్వము కలుగును. అప్పుడు 'పడ్డి + అ' అనియుండి అపదాది సంధిచేత 'పడ్డ' అని యగును. ఇది విభాషగా నగున దగుటచే అత్వ ద్విత్వములు రాని పక్షమున 'పడిన' అనియే యుండును. ఇట్లే ఇడ్డ, చెడ్డ, తగ్గ, అన్న, కన్న, కొన్న, తిన్న, మన్న, విన్న, చన్న - అను క్తవదర్థక రూపము లేర్పడును.

పడు అను ధాతువునకు చేదాద్యర్థములయందు ద్రుతాంత మయిన 'న' యగును. 'చేదర్థయోగంబున లృట్టునకు లిట్టగు' నన్న (బా - 119) సూత్రమునుబట్టి భూతార్థమునం దిగాగ మము కలిగి పడు + ఇ + నను = పడినను అని యగును. ప్రస్తుత సూత్రముచేత 'న' వర్ణమునకు అత్వమును, ధాతువు కడహల్లునకు ద్విత్వమును కలుగగా పడ్డి + అ + ను = పడ్డను అని యగును. ఇట్లే ఇడ్డను, చెడ్డను, తగ్గను - మున్నగు రూప ములు చేదర్థమునందును, భావలక్షణమునందును గలుగును.

ఇంతవరకు వికల్పకార్యము మాత్రమే జరిగినది. విభాష యని యన్నప్పుడు సూరి ప్రణాళికనుబట్టి అన్యత్వము కాని నిషేధముకాని కూడియుండుట కలదు. ఈ విధి కేవలముగా నున్న పడ్వాదులకే జరుగవలసియున్నను, అనుబంధముగా నున్న 'పడుజీ' మున్నగువానికికూడ జరుగుచున్నది. చేయఁబడిన - చేయఁబడ్డ; తీసికొనిన - తీసికొన్న ॥ ఇట్టివి అన్యత్వమున కుదా హరణములు.

**74. క్రియాఫలంబు కర్తృగామి యగుచోఁ గొను ధాతు వనుప్రయుక్తం బగు. (బా - ౨౨)**

ఇట్టి యాత్మనేపదార్థం బని వ్యవహరింతురు॥ వండుకొను చున్నాడు.

వ్యాఖ్య - క్రియచేత సిద్ధించు ఫలము కర్తకే చెందిన యెడల ధాతువునకు 'కొను' అను ధాతువు అనుప్రయుక్త మగునని సూత్రార్థము.

'వండు' అను ధాతువునకు 'కొను' అను ధాతువును చేర్చినయెడల 'వండుకొను' అని యగును. 'వండు' ధాతువు యొక్క ఫలము 'వంటకము'. ఈ వంటకము కర్తకొఱకే యైన ప్పుడు ధాతువునకు 'కొను' అని వచ్చును. 'వండుకొనుట' అని యనగా తాను భుజించుటకై పచనము చేయుట యనియే యర్థము. వండుకొను మున్నగు రూపమును ఆత్మనేపదార్థ మని వ్యవహరింతురు.

ఇచ్చట లక్ష్యముగా 'వండుకొనుచున్నాఁడు' అను వర్త మానకాల ప్రథమైక వచనరూపమును చూపియున్నాడు. 'కొను' అన్నది పరమైనప్పటికిని లకారాదులు వచ్చుట తప్పదు. 'వండుకొను' అను ధాతువునకు లట్టు పరము కాగా "ఉదంతంబు నకు లట్టు పరంబగునపు డున్నానుబంధం బగు" అన్న (బా-13) సూత్రముచేతను "ఉన్న శబ్దంబు పరం బగునపుడు చువర్ణకం బగు" అన్న (బా-14) సూత్రముచేతను 'వండుకొను + చు + ఉన్న' అను విధముగా నుండును. ప్రథమైకవచన ప్రత్య యము డుఙ్. డుఙ్ పరమందుండుటచేత (బా-15) ఉన్నాను

బంధమునకు దీర్ఘము కలుగగా వండుకొను+చు+ఉన్నా+డుఁ వండుకొనుచున్నాఁడు అని యయ్యెను

[ ఇట్లు సమాపక క్రియా రూపమును చూపుటచేత వ్యాకర్త 'కొను' ధాతువనుప్రయుక్తమైనను పూర్వధాతువుతో కలసి యేక ధాతువుగానే వ్యవహరించునన్న విషయమును గుర్తు చేయుచున్నాడు. ఇది లకారాదులను విధించుకొనుటవరకే పరిమితము. ]

**75.** కొను ధాతువు పరంబగునపు డిగాగమంబు బహుళంబుగా నగు. (బా - ౩౪)

వండికొనియె - వండుకొనియె ॥ బహుళంబనుటచే యాంతంబునకు నిత్యంబు - చేసికొనియె.

వ్యాఖ్య - ధాతువునకు 'కొను' అను ధాతువు పరమగునపుడు 'ఇ' అను నాగమము బహుళముగా కలుగునని సూత్రార్థము.

'వండు' అను ధాతువునకు ఆత్మనేపదార్థమందు 'కొను' ధాతు వనుప్రయుక్తము కాగా 'వండు + కొను' అని యుండును. ప్రస్తుత సూత్రముచేత ఇగాగమము కలుగగా వండు + ఇ + కొను = వండికొను అని యగును. బహుళమని యనుటచేత, వికల్పవిధినిబట్టి ఇగాగమము కలుగనియెడల 'వండుకొను' అనియే యుండును. బహుళ శబ్దముచేత యకారాంతములయిన ధాతువులకు 'కొను' పరమైనపుడు ఇగాగమము నిత్యముగా వరును. చేయ్యు + [illegible] + కొను అని యుండును. రాఁబోవు ఇకారా[illegible]క్తంబులందలివి పరంబులగుచో యాకు సకారంబగు" అన్న (బా-54) సూత్రమునుబట్టి చేసు + ఇ + కొను

= చేసికొను గాక యగును. ఇట్లు వికల్పవిధిని, నిత్యవిధిని సూచించుటకై సూత్రమున 'బహుళ' శబ్దము వాడబడినది.

[ ఇచ్చటకూడ సూరి సమాపక రూపములను చూపుట గమనార్హము. పై సూత్రముకడ చెప్పికొన్నట్లు లకారవిధికి అనుబంధముతోడి ధాతువును అఖండ ధాతువుగా పరిగణించుట జరుగును. అనుబంధము కూడ ధాతువే యగుటచేత ఇతరవిధుల విషయమున నిది స్వతంత్రముగా వ్యవహరించును. దానిని సూచించుటకే ఏకస్వర, ద్విస్వర ధాతువులకు మాత్రమే కలుగు ఇయుడాగమముతోడి వండికొనియె, చేసికొనియె - అను రూపములను ప్రదర్శించుట జరిగినది. ఈ సూచననుబట్టియే 'వండుకొనుఁడు' మున్నగు చోట్ల 'కొను' నకు 'కో' అను నాదేశము కలిగినప్పుడు 'వండు + కో + డు' అని యగును. ముజ్జు పరమగునప్పుడు దీర్ఘమునకు హ్రస్వము కాగా (బా - 61) వండు + కొ + డుజ్జు అని యుండును. జిత్తు బిందుపూర్వం బగును. కావున అర్ధానుస్వార పూర్ణానుస్వారములలో నేదియైన డువర్ణము నకు ముందు రావచ్చును. కాని నుడి తొలి హ్రస్వము మీద ఖండబిందువు లేదన్న నియమమునుబట్టి 'వండుకొండు' అని చేయుట జరుగును. ఇచ్చట 'కొను' ధాతువు స్వతంత్రముగా వ్యవహరింపనియెడల 'కొ' అనుచోటి 'ఒ' నుడి తొలి హ్రస్వము కాదు. అప్పుడు 'వండుకొఁడు' మున్నగు ననిష్ట రూపము కలుగును. కావున ఇట్టియెడల 'కొను' ధాతువు స్వతంత్రముగానే వ్యవహరించుచున్నదనుట స్పష్టము. ఆ భేదమును గమనింపజేయుటకే వ్యాకర్త సమాపక రూపములను ప్రదర్శించుట జరిగెను. ]

**76. ఇకారవక్రీంబు లుక్తంబులందలివి పరంబు లగుచో యాకు సకారం బగు. (బా - ౨౪)**

చేయు॥ చేసిరి - చేసి - చేసికొను - చేసెను - చేసినాడు ఇత్యాదు లెఱుంగునది.

వ్యాఖ్య - ఉక్తంబులందలివి అని గిట్టిగా పూర్వ సూత్రము లందు చెప్పబడినవి యని యర్థము. పూర్వసూత్రము లందు చెప్పబడిన ఇకారము కాని, ఎత్వముకాని పరమైనపుడు యకారమునకు సకార మగునని సూత్ర భావము.

'చేయు' అను ధాతువు యకారాంతము. దీనికి పైని భూతార్థమునందు ఇగాగమము కలుగగా చేయు + ఇ + రుఅని యుండును. ప్రస్తుత సూత్రముచేత యాకు సకారము కలుగగా 'యు' స్థానమున 'సు' అని యగును. చేసు + ఇ + రు = చేసిరి అని యగును. "ఇకారంబుమీఁది" అని మొదలయిన (బా. తత్సమ - 26) సూత్రముచేత చివరి 'రు' వర్ణకము 'రి' గా మారును. 'చేసి' అనునది క్త్వార్థకమందు కలిగిన ఇత్వమున కుదాహరణము. 'చేసికొను' అన్నది 'కొను' అనుప్రయుక్తమైనపుడు కలిగిన ఇగాగమమున కుదాహరణము. 'చేసెను' అన్నది లిట్టు పరమైనపుడు డుబ్బునకు బదులుగా వచ్చిన 'ఎను' న కుదాహరణము. 'చేసెడిని' అన్నది లాట్టు పరమైనపుడు ప్రథమ ను వర్ణకంబునకు కలుగు ఎడిగాగమము తోడి రూపమున కుదాహరణము. చివరి రెండింటియందు వక్రము పరము కాగా యాకు సకారము కలుగుచున్నది. తక్కినవానియందు 'ఇ' వర్ణము పరము కాగా కలుగుచున్నది. పై వానినిబట్టి చేసెదను. చేసెదము, చేసెదవు, చేసెదరు - మున్నగు రూపములను గ్రహింపవచ్చును.

సూత్రమునందు "ఉక్తంబులందలివి" అని ప్రయోగిం చుట [illegible]. ప్రస్తుతసూత్రమునకు పూర్వమందు చెప్పిన ఇ, ఎ - అనునవి పరములగునప్పుడు మాత్రమే యాకు సకార

మగును. తక్కొ యెడల ఈ మార్పు జరుగదు. దానిని జరుగకుండ వారించుటకే యీ దశమును సూత్రమునందు చేర్చుట జరిగినది. ఈ తరువాత 'ఇంచు' అన్నది (బా - 70) విధింపబడును. అప్పుడు చేయు+ఇంచు=చేయించు అనియే యగును. అంతే కాని సకారము కలుగదు. అట్లే అరయు, అలయు - మున్నగు ధాతువులకు 'ఇక' యను కృత్ప్రత్యయము పరమైనపుడు అరయిక, అలయిక - అనియే యగును. సకారాదేశము కలుగదు. చేయు, వ్రాయు - అను ధాతువులకు 'ఇ' యను కృత్ప్రత్యయము కలిగి చేయి, వ్రాయి - అనియే యగును. ఇవన్నియు ప్రస్తుతసూత్రమునకు పిమ్మట వచ్చును. కావుననే 'ఉక్తంబులందలివి' అను విశేషణముచేత వానికి సకారాదేశము కలుగకుండ వారించుట జరిగినది.

[ ఇక్కడ నింకొక విషయమును ప్రస్తావించుకొనుట యవసరము. "అగు పోవుల కడ వ్రాల కిద్విక్రంబులు పరంబులగునపుడు యకారం బగు" అన్న (బా-89) సూత్రమునుబట్టి 'అగు' ధాతువునకు అయి, అయిరి, ఆయెను ఆయెడు - మున్నగు రూపము లేర్పడును. ఇట్టి యెడల 'అయు + ఇ' అనునవియే 'అయి' అని యగును. ఇచ్చటి 'ఇ' ఉక్తముల లోని క్త్వార్థక ప్రత్యయమే. అయినను ఇచ్చట సకారాదేశము కలుగుట లేదు. 'పోవు + ఇ' అని యున్నప్పుడు పోయు + ఇ = పోయి అనియే యగుచున్నది. పోయెను, పోయెడును, పోయిరి, పోయితిని - మున్నగునవి యిట్టివే. ఇచ్చట ప్రత్యేకముగా 'య' కారము అన్యవర్ణముల స్థానమున విధింపబడుచున్నది. కావున విధాన సామర్థ్యముచేతనే ఇచ్చటి యకారమునకు సకారాదేశము కలుగదన్న విషయమును గుర్తింపవలయును. ]

77. చవర్గకంబు పరంబగునపు [illegible] పర ణేవి సస్థానంబున బిందుపేని విభాష నగు. (బా-[illegible])

అన్చున్నాఁడు - అంచున్నాఁడు - అనుచున్నాఁడు ॥ అన్చును - అంచును - అనుచును ॥ అను - కను - కొను - తిను - మను - విను॥ ఇవి యన్వాదులు.

వ్యాఖ్య - 'చు' అను ప్రత్యయము పరమగునపుడు 'అను' మొదలయిన ధాతువులకు ఉత్వలోపము కాని, నుస్థానమున బిందువుకాని విభాషగా కలుగును. ఇక్కడ లోపవిధి యొక్కటి; ఆదేశ విధి యొక్కటి. ఒకటి వచ్చినప్పుడు రెండవది రాదు. కావుననే సూత్రమునందు 'పని' శబ్దమును వాడుట జరిగినది. ఈ రెండును రానియెడల, యథారూపముగ నుండుటయు జరుగుటకై 'విభాష' యను శబ్దము ప్రయోగింపబడినది.

'అను' అను ధాతువునకు లట్టు పరమైనపుడు ఉన్నానుబంధమును (కా-13), ఉన్న శబ్దము పరమగునపుడు చువర్ణమును (కా-14) కలుగగా అను + చు + ఉన్న - అని యగును. దీనికి డుజ్ఞు పరమైనపుడు 'ఉన్న' కు దీర్ఘము వచ్చి 'అనుచున్నాడు' అని యగును. ప్రస్తుత సూత్రముచేత 'అను' ధాతువుయొక్క ఉత్వమునకు లోపము రాగా అన్ + చున్నాఁడు = అన్చున్నాఁడు అని యగును. ను వర్ణకము స్థానమున బిందువు వచ్చునెడల అంచున్నాడు అని యగును.

'బిందువు' అని యన్నప్పటికిని 'ను' స్థానమున పూర్ణబిందువు మాత్రమే [illegible]ను. 'అను' మొదలయిన వానియందు [illegible] యొుఁక చుఁడు శబ్దంబులం దప్ప నుడి [illegible] హ్రస్వముమీఁది [illegible]డబిందువును ద్రుతంబునకు

లోపంబగు నాపు నన్న' నిర్ణయమునుబట్టి పూర్ణానుస్వారమే కలుగును.

'అన్చున్నాఁడు' అని ఉత్వలోపముకాని, 'అంచున్నాడు' అని బిందువుకాని కలుగని పక్షమున 'అనుచున్నాఁడు' అని యథారూపముగనే యుండిపోవును. ఈ రూపము లన్నియు వర్తమానకాల ప్రథమైక వచనమునందలివి. 'చు' వర్ణము శత్రర్థమునందు ద్రుతాంతముగా నుండును. 'అను' అను ధాతువుపై ద్రుతాంతమయిన చు వర్ణకము చేరగా 'అను + చును = అనుచును' అని యగును. ప్రస్తుత సూత్రమునుబట్టి ఉత్వలోపము జరుగగా 'అన్చును' అను రూపము కలుగును. ను స్థానమున బిందువు కలిగినయెడల 'అంచును' అని యగును. ఈ రెండింటిలో నేదియు రానిపక్షమున 'అనుచును' అని యుండిపోవును.

అను, కను, కొను, తిను, మను, విను-అను ఆఱు ధాతువులు మాత్రమే అన్వాదులుగా గ్రహింపబడినవి. వీనిలో 'కొను' అన్నది అనుబంధముగా వచ్చినప్పుడు కూడ నీ కార్యములు కలుగవచ్చును. తీసికొను - తీసికొన్చున్నాఁడు - తీసికొంచున్నాఁడు - తీసికొన్చును - తీసికొంచును - తీసికొనుచున్నాఁడు తీసికొనుచును ॥ అన్నవి యుదాహరణములు.

**78.** ఉన్న శబ్దంబు పరంబగునపు డుండు ధాతువునకు లోపం బగు. (బా - ౫౬)

ప్ర. [illegible] - ఉన్నాఁడు [illegible]
ఉన్నారు॥ ఉ. ఉన్నాను - ఉన్నా[illegible]

[illegible] 'ఉన్న' యన్న శబ్దము పరమగుటకు పూర్వ మున్న 'ఉండు' అను ధాతువున కంతటికిని లోపము కలుగునని సూత్రార్థము.

'ఉన్న' యన్నది వర్తమానకాలమునందు అనుబంధముగా ధాతువునకు చేరుచున్నది (బా - 13). వర్తమానార్థకమైన శత్రర్థమునందు ధాతువుపై 'ఉన్న' యన్న ప్రత్యయము చేరుచున్నది (బా - 46). ఉన్న యన్న యనుబంధమును, ఉన్న యను ప్రత్యయమును - రెండింటిని గ్రహించుటకు వీలుగా సూరి 'ఉన్న శబ్దము' అని వాడుచున్నాడు. ఇటుకాక, ఉన్న వర్ణకము అని యన్నచో అనుబంధమును విడువవలసి వచ్చెడిది. అనుబంధ మని యన్నచో ప్రత్యయమును విడువవలసి వచ్చెడిది. ఈ రెండింటిని కలుపుటకై 'ఉన్న శబ్దము' అని ప్రయోగించుట ఉచితముగా నున్నది.

'ఉండు' అను ధాతువునకు లట్టు పరమగునపుడు 'ఉన్న' అన్న యనుబంధము కలుగును. అప్పుడు ధాతువునకు చు వర్ణకము కలుగును. ఉండు + చు + ఉన్న' అని యుండును. డుజ్జు పరమగునప్పుడు దీర్ఘము కలుగును. ఉండు + చు + ఉన్నాడు అని యుండగా ప్రస్తుతసూత్రముచేత 'ఉండు' ధాతువునకు లోపము కలుగును. ధాతువునకు విధింపబడిన దగుటచేత 'చు' వర్ణకమునకును ధాతువుతోపాటుగా లోపము కలుగును. అప్పుడు 'ఉన్నా(డు)' [illegible] మాత్రమే మిగులును. ఇది 'ఉండు'

చెన్ను. 'నిన్న [illegible]' శబ్ద[illegible] [illegible]కవచనము. ఇట్లే వర్త
పూర్వసూత్రముచే ఉండున[illegible] [illegible]దానితోపాటు ఛువర్ణక
కము కాదని స్పష్టముగా తేల[illegible]

మును లోఫ్ఫ్ గా ఉన్నారు అని ప్రథమ బహువచనమునందు ఉన్నావు, ఉన్నారు - అని మధ్యమ పురుషమునందు; ఉన్నాను, ఉన్నాము - అని ఉత్తమ పురుషమునందు రూపములేర్పడును.

చిట్టచివరిదయిన 'ఉన్నవాఁడు' అన్నది శత్రర్థమునందలి రూపము. ఉండు + చున్ + ఉన్న + వాఁడు' అని యుండగా ప్రస్తుతసూత్రముచేత 'ఉండు' ధాతువునకును, దానితోపాటు ద్రుతాంతమైన చువర్ణకమునకును లోపముకలుగగా 'ఉన్నవాఁడు' అని యగును. ఉన్నవారు, ఉన్నది, ఉన్నవి - మున్నగునవి వర్తమానార్థమునందలి ధాతుజ విశేషణములతోడి రూపములు.

అనుబంధముగా నున్న 'ఉండు' ధాతువునకు కూడ ఉన్న శబ్దము పరమగునప్పుడు పైవిధముగా లోపము కలుగును. 'కూర్చుండు + చు + ఉన్నాఁడు' అన్నచోట 'ఉండు' ధాతువును దానితోపాటు మీది 'చు' ప్రత్యయమును లోపింపగా కూర్చు + ఉన్నాఁడు కూర్చున్నాడు అని యగును. ఇట్టివే నిల్చున్నాఁడు, పరున్నాఁడు - మున్నగునవి. ధాతుజ విశేషణములుగా వర్తమానార్థమునందు కూర్చున్న, నిల్చున్న, పరున్న - మున్నగు విధముగా నుండి తచ్ఛబ్దమును జేర్చుకొనును.

**79.** చేదాద్యర్థ నాంతంబయిన యుండున కున్నాదేశంబు విభాష నగు. (బా - ౨౭)

ఉన్నను - ఉండినను.

వ్యాఖ్య - చేదర్థమునప్పు [illegible]
నందును ద్రుతాంతమయిన ఉ[illegible]వాఁడు.

అట్టి న వర్ణకముతోడి ఉండు ధాతువున కంతటికీ బదులుగా 'ఉన్న' యన్నది ఆదేశముగా విభాషగా నగునని సూత్రార్థము.

'ఉండు' అను దానికి చేదర్థమునందు ద్రుతాంతమైన 'న' రాగా ఉండు + నను అని యగును. "చేదర్థయోగంబున ల్రృట్టునకు లిట్టగు" నన్న (బా - 119) నియనముచేత భూతార్థకమైన ఇగాగమము కలుగగా ఉండు+ఇ+నను=ఉండినను అని యగును. ప్రస్తుత సూత్రముచేత 'ఉండిన' అనుదాని కంతటికి బదులుగా 'ఉన్న' యని రాగా 'ఉన్నను' అని యగును. దీనికి ఉన్నట్లయిన నని యర్థము. నీ వున్న నేను వత్తును - అన్న చోట 'ఉన్నను' అని యనగా 'ఉండగా' అని యర్థము.

ఈ కార్యము విభాషగా నగును. కావున కానియెడల 'ఉండినను' అను రూపమే యుండిపోవును.

ధాతువునకు అనుప్రయుక్తమైన ఉండునకు సైత మీ కార్యము జరుగగా కూర్చున్నను, పరున్నను - మున్నగు విధముగా రూపము లేర్పడును.

[ఇంతవరకు వికల్పమున కుదాహరణములు మాత్రమే చూపబడినవి. అన్యత్వముకూడ నిచ్చట కలదు. నువర్ణకాంతమయిన ఉండు ధాతువు ధాతుజ విశేషణముగా 'ఉండిన' అని యగును. 'ఉండినవాఁడు' మున్నగు విధముగా ప్రయోగింపబడును. దీనికికూడ 'ఉన్న' అన్న యాదేశము కలుగుచున్నది. అప్పుడు 'ఉన్నవాఁడు' అని యగును. చిన్నయసూరియే నీతిచంద్రికయందు 'నిన్న యున్నవాఁడు నేఁడు లేఁడు' అని ప్రయోగించెను. 'నిన్న' అను శబ్ద[illegible] 'ఉన్న' అన్నది భూతార్థకమే కాని, పూర్వసూత్రముచే ఉండున[illegible]ముగగా నేర్పడిన వర్తమానార్థకము కాదని స్పష్టముగా తెల[illegible] కావున చేదర్థమునందును, వృత్తి

మయిన భావలక్షణమునందును విధింపబడిన కార్యము భూతార్థక ధాతుజ విశేషణమునకు కూడ జరుగుట అన్యత్వము. వికల్పముతోపాటు, అన్యత్వమును గూడ ఉద్దేశించియే సూరి 'విభాష' యను పదమును సూత్రమునందు ప్రయోగించెను.]

**80.** తి దు ట లు పరంబులగునపు డన్వాదుల ను స్థానంబున సున్నయు నుండు డు లోపంబును విభాష నగు

(బా - ౩౮)

అందురు - అంట॥ ఉందురు - ఉంట॥ పక్షంబున అనుదురు - అనుట - ఉండుదురు - ఉండుట॥ ఇత్యాది

వ్యాఖ్య - తి, దు, ట - అనునవి పరము లగునపుడు 'అను' మున్నగువాని 'ను' వర్ణమునకు బదులుగా సున్న వచ్చును; 'ఉండు' ధాతువుయొక్క డు వర్ణమునకు లోపము వచ్చును; ఇది విభాషగా నగును.

'అను' ధాతువునకు డుజ్జు పరమగునపుడు 'దు' ఆగమముగా నగును (బా-22). అను + దు + రు = అని యుండగా ప్రస్తుతసూత్రముచేత ను స్థానమున బిందువు రాగా 'అందురు' అని యగును. ఇది విభాష యగుటచే సున్న రాని పక్షమున 'అనుదురు' అని యుండును. అట్లే 'అను' ధాతువునకు భావమునందు ట వర్ణకము (బా-39) రాగా 'అను + ట' అనియగును. ప్రస్తుతసూత్రముచేత 'ను' స్థానమున బిందువు రాగా 'అంట' అని యగును. ఈ కార్యము [illegible]ను. కావున బిందువు రానిపక్షమున 'అనుట' అని [illegible]యుండును.

'ఉండు' ధాతువునకు 'రు' వర్ణకమును దుగాగమమును పరముకాగా ఉండు+దు+రు అని యుండును. ప్రస్తుత సూత్రముచేత 'డు' లోపింపగా 'ఉందురు' అని యగును. ఇట్లే 'ఉండు+ట' అని యుండగా 'డు' లోపించునెడల 'ఉంట' అని యును ప్రస్తుతకార్యము విభాషగా నగును. కావున 'డు' లోపింపనియెడల ఉండుదురు, ఉండుట-మున్నగు విధముగానే రూపము లుండును.

అనుప్రయుక్తమైన 'కొను' నకును పై కార్యము జరుగగా చేకొందురు, చేకొనుదురు, చేకొంట, చేకొనుట - అను విధముగా రూపము లుండును. 'ఉండు' ధాతువు పరుండుదురు, పరుండుదును, పరుంట, పరుండుట - మున్నగు విధముగా నగును.

సూత్రమున సున్న యని మాత్రమే యన్నప్పటికిని అన్వాదులలో తొలుత హ్రస్వమే యున్నది కావున, అన్నియెడల నిండు సున్నయే వచ్చును. అను, కను, కొను, తిను, మను, విను ॥ ఈ యాటింటిని అన్వాదులుగా పరిగణింతురు.

['తి' అనునది పరమైనప్పుడును పై కార్యములు జరుగును. అయినప్పటికిని కార్యాంతరము కూడ జరుగును. కావున, ఉదాహరణముల నిచ్చట చూపక తరువాత సూత్రముకడ చూపుట జరుగుచున్నది.]

**81.** ఇట బిందువుమీఁది తదలకు నిత్య వైకల్పికము లయి ట డ లగు. (బా - ౫౯)

అంటివి - అనితివి ... అందురు ॥ ఉంటివి - ఉండితివి ఉండురు - ఉందురు.

వ్యాఖ్య - ఇట నని యనగా పూర్వ సూత్రమున చెప్పి నట్లు అన్వాదుల 'ను' వర్ణమునకు బిందువైనప్పుడు, 'ఉండు' ధాతువు యొక్క 'డు' వర్ణము లోపించినప్పుడు నని యర్థము. అప్పుడు బిందువు మీద వచ్చిన తవర్ణమునకు నిత్యముగా టవర్ణ మును, దవర్ణమునకు వికల్పముగా డవర్ణము నాదేశమగునని సూత్రార్థము.

'అను' ధాతువునకు మధ్యమపురుషైకవచనమునందు వు ప్రత్యయము కలుగును. అప్పుడు "లిట్టు వుణ్ణు పరంబగు నపుడు తి వర్ణకం బగు" నన్న (బా - 18) సూత్రమునుబట్టి అను + తి + వు - అని యుండును. 'ఇకారంబు మీది' అని మొదలయిన (బా. తత్సమ - 26) సూత్రముచేత 'అను + తి + వి' అని యగును. పూర్వ సూత్రముచేత నుస్థానమున నిండుసున్న రాగా 'అం + తి + వి' అని యగును. ప్రస్తుత సూత్రముచేత సున్నమీది తకారమునకు టకారము రావలయును; కాన తి స్థాన మున టి వచ్చును. అప్పుడు 'అంటివి' అని యగును. 'ను' వర్ణము సున్నయైనయెడల 'తి' స్థానమున 'టి' యగుట నిత్యము. ను స్థానమున సున్నయగుట విభాషయగుటచే, అట్లు కానియెడల అను + తి + వి - అని యుండును. "ధాతంబునం దిగాగమంబగు" నన్న (బా - 17) సూత్రమువలన ధాతువున కిగాగమము కలు గగా 'అనితివి' అని యగును.

పూర్వసూత్రముచేత అందురు అను రూపమేర్పడినది. ప్రస్తుత సూత్రమువలన దకారమునకు వికల్పముగా డ వచ్చును. కావున దు స్థానమున డు వచ్చిన 'అండురు' అని యగును. రాని పక్షమున 'అందురు' అనియే యుండును.

'ఉండు' ధాతువునకును 'డు' లోపము జరిగి 'ఉం + తి + వి' అని యుండగా ప్రస్తుతసూత్రముచేత తి స్థానమున టి నిత్యముగా నగును. అప్పుడు 'ఉంటివి' అని యగును. డు లోపము కలుగనియెడల 'ఉండితివి' అని యగును. ఉండు + దురు అని యున్నప్పుడు డు లోపము కలుగగా 'ఉందురు' అన్న రూపము పూర్వసూత్రముచే నేర్పడును. ప్రస్తుతము దు స్థానమున 'డు' రాగా 'ఉండురు' అని యగును. ఇది వైకల్పిక మగుటచే డత్వము కలుగనియెడల 'ఉందురు' అన్నియే యుండును.

**82.** ముఙ్డు పరంబగునపుడు కో శబ్దంబు కొనునకు బహుళంబుగా నగు. (బా - ౬౦)

బహుళం బనుటచే దీనికి నొకానొకచో నతిచారం బని యెఱుంగునది.

వ్యాఖ్య - మధ్యమ పురుష యేకవచనమున నగు ము ప్రత్యయమును, బహువచనమున నగు డు ప్రత్యయమును పరము లగునపుడు 'కొను' ధాతువున కంతటికి 'కో' శబ్దము బహుళముగా నగునని సూత్రార్థము.

సూత్రమునందు ముఙ్డు పరమగునప్పుడనియే చెప్పినప్పటికిని, ఇతరస్థలములందు (జీత్తు పరమగునప్పుడు) కూడ కొన్ని యెడల 'కొను' నకు ఆదేశముగా 'కో' కలుగుచున్నది. సూత్రమునందలి బహుళ పదముచేత ఈ అతిచారము సూచింపబడుచున్నది. అతిచారము అనగా అతిక్రమించి సంచరిం

చుట యని యర్థము. ముజ్జు పరమందున్నప్పుడు మాత్రమే కావలసిన కార్యము జీత్తు పరమైనప్పుడు కూడ అగుట అతి చారము.

[ఉదాహరణములు తరువాతి సూత్రముకడ చూపబడును.]

**83.** ముజ్జు పరంబగునపుడు దీర్ఘంబునకు హ్రస్వంబును ము వర్ణకంబునకు మాముడియు నగు. (బా - ౬౧).

కొమ్ము - కొనుము - కొండు - కొనుఁడు

వ్యాఖ్య - మధ్యమ పురుషయందలి ముడుజ్జులు పరము లగునపుడు ధాతువుయొక్క దీర్ఘమునకు హ్రస్వమగును; ము వర్ణకమునకు మాముడి కలుగును - అని సూత్రార్థము.

[సూత్రమునందు హ్రస్వంబును, మాముడియు - అని రెండింటిని సముచ్చయార్థకములు చేర్చి చెప్పుటచేత రెండును గలిసియే వచ్చునని భావము. ధాతువుయొక్క దీర్ఘమునకు ముజ్జు పరమగుట యన్నది విషయము. కావున ఏకాక్షర ధాతువులు మాత్రమే యిచ్చట గ్రాహ్యములు.]

కొను + ము - అని యుండగా పూర్వసూత్రముచేత 'కొను' నకు 'కో' రాగా 'కో + ము' అని యగును. ప్రస్తుత సూత్రముచేత దీర్ఘమునకు హ్రస్వమును ము వర్ణకమునకు మాముడియు రాగా 'కొమ్ము' అని యగును. 'కొను' నకు 'కో' శబ్దము కలుగని యెడల 'కొనుము', అనియే యుండును. బహువచనమునందు 'డు' ప్రత్యయము పరము కాగా 'కో + డు' అని యుండును. దీర్ఘమునకు హ్రస్వము కలుగగా 'కొ + డు' అని యగును. ఇచ్చటి 'డు' [illegible] గావున ముందు బిందువు

వచ్చును. నుడి తొలి హ్రస్వముమీద ఖండబిందువు రాదు గావున నిండు సున్న రాగా 'కొండు' అని యగును. 'కో' అను నాదేశమే రానియెడల 'కొనుఁడు' అనియే యుండును.

పూర్వసూత్రమున అతిచారము అను ప్రసంగమునకు లక్ష్యములు అనుప్రయుక్తమగు 'కొను' ధాతువునకు మాత్రమే కనబడుచున్నవి. తీసికొనను - తీసికోను॥ తీసికొనక - తీసికోక॥ తీసికొనన్ - తీసికోన్ ॥ మున్నగు విధముగా నుండును.

**84. ఒకానొకచో రండు పొండులకు రాపొండనియు రూపంబు గానంబడియెడి. (ప్రౌ - ౧౧)**

నిండు దలంపునఁ దగరా। పొండను గౌరవములేని పొర పొచ్చెమునం। గొండంత పసిఁడి యిచ్చిన। నుండంగాఁ జనునె వారి యొద్దను దంద్రీ॥ య. ౩ ఆ॥

వ్యాఖ్య - 'వచ్చు' ధాతువునకు మధ్యమ బహువచనము నందు డుఙ్లు పరముకాగా 'రండు' అని యగును. 'పోవు' ధాతువునకు 'పొండు' అని యగును. ఈ రెండింటిని అవ్యవహితముగా నుచ్చరింపగా 'రాపొండు' అను రూపము నొకానొకచోట కనబడుచున్నదని సూత్రార్థము.

'రండు+పొండు' అని యున్నప్పుడు పూర్వక్రియ మీది డుఙ్లునకు లోపముకలిగి, రవర్ణమునకు దీర్ఘము కలుగవలయును. ఇట్టు లోపమును సాధించు సూత్రములేమియు లేవు. "ఆమ్రేడితంబు పరంబగునపుడు మధ్యమ ఘుడుఙ్లులకు లోపంబు విభాష నగు" అన్న (బా. సంధి-49) సూత్రముచేత ఆమ్రేడితము పరమగు

నప్పుడు మాత్రమే మధ్యమ పురుష 'డు' వర్ణకమునకు లోపము వచ్చు నవకాశము కలదు. 'రండు + రండు' అని యున్నచో 'రారండు' అని కాఁగలదు. కాని, యిచ్చట వేరువేరు ధాతువు లుండుటచేత లోపకార్యమునకు వీలులేదు. అయినను కవిప్రయోగమునందు కలదు. కావున ప్రౌఢవ్యాకరణకారుడు రూపవైచిత్రిని ప్రదర్శించుచున్నాడు.

**85. రువర్ణకంబు పరంబగునపుడు సున్నమీఁది త ద డ ల యుత్వంబునకు లోపంబు విభాష నగు. (బా - ఉ౨)**

పోషింత్రు - పోషింతురు ॥ కొంద్రు - కొందురు ॥ కొండ్రు - కొండురు.

వ్యాఖ్య - రు వర్ణకము పరమగునప్పుడు పూర్ణానుస్వారముమీది త ద డ ల యొక్క యుత్వమునకు విభాషగా లోపము కలుగునని సూత్రార్థము.

రు వర్ణకము ప్రథమ పురుషమునందు, మధ్యమ పురుషమునందు నగు బహువచన ప్రత్యయము. "లాట్టు రుణ్ణు పరంబగునపుడు దుగాగమం బగు" అన్న (బా - 22) సూత్రమునుబట్టి ధాతువునకు 'దు' చేరగా పోషించు +దు+రు అని యుండును. రాబోవు (బా - 108) సూత్రముచేత "చువర్ణంబుతోడ దుగ్ధకారంబు తకారంబగు". 'పోషింతురు' అని యగును. 'తు' వర్ణమునకు ముందు పూర్ణబిందువు, పరమందు 'రు' ప్రత్యయము నున్నవి. కావున ప్రస్తుత సూత్రముచేత 'తు' యొక్క ఉత్వమునకు విభాషగా లోపము కలిగి 'పోషింత్రు' అని యగును. లోపము రానిపక్షమున 'పోషింతురు' అనియే యుండును.

'కొను' ధాతువునకు దుగాగమము రువర్ణకము కలుగగా కొను + దురు - అని యుండును. ను స్థానమున బిందువు రాగా 'కొందురు' అని యగును. ప్రస్తుత సూత్రముచేత 'దు' యొక్క ఉత్వమునకు లోపము రాగా 'కొంద్రు' అని విభాషగా నగును. అట్లే సున్నమీది దకారము డకారమై 'కొండురు' అని యున్నప్పుడుకూడ 'డు' యొక్క ఉత్వము పాక్షికముగా లోపింపగా 'కొండ్రు' అని యగును. లోపము రాని పక్షమున 'కొండురు' అనియే యుండును.

[ఇచ్చట తు, దు, డు అను వానికి పూర్వమందు సున్నయు, పరమందు 'రు' వర్ణకముండుటయు ముఖ్యములు. అప్పుడు మాత్రమే యీ లోపము కలుగును. నడుమ వ్యవధాన మున్నచో ఈలోపము కలుగదు. 'చెందుదురు' మున్నగుచోటి దుగాగమమునకు పరమందు 'రు' వర్ణక మున్నది కాని పూర్వమందు బిందువు లేదు. కావున, ఇక్కడ ఉత్వలోపము కలుగదు. 'పరుండుదురు' మున్నగుచోట సున్నమీద 'డు' వర్ణ మున్నది కాని పరమందు 'రు' లేదు. కావున ఇచ్చటను సూత్రము వర్తింపదు.]

## 86. సంస్కృతంబున కంగలాదుల కించుక్కగు. (బా - ఉ౩)

సంస్కృత ధాతువుల కంగలాదుల కించుగాగమం బగు॥ పచించు - వచించు - త్యజించు - భజించు - అంగలించు ॥ అంగల - అడక - అరగ - అవుల - ఉంక - ఉగ్గడ - ఓసర - కార - గాల - జాడ - తిలక - తులక - పంక - పరిక - పలవ - అప్ప - ఒప్ప - అల ॥ ఇత్యాదు లంగలాదులు.

వ్యాఖ్య - సంస్కృతధాతువులకును, అంగల మున్నగు తెలుగు ధాతువులకును నిత్యముగా ఇం చు గాగ మ మగునని సూత్రార్థము.

పచ్, వచ్, త్యజ్, భజ్ - మున్నగునవి సంస్కృత క్రియాధాతువులు. వానిని తెనుగులో వాడవలయునన్న 'ఇంచు' అన్నది అదనముగా చేరవలయును. అప్పుడు మాత్రమే వానికి తెనుగున వాడబడు నర్హత కలుగును. పచించు, వచించు, త్యజించు, భజించు - అనురూపము లేర్పడిన పిమ్మటనే లకారాదులు చేరుట జరుగునని యర్థము.

అట్లే అంగల మున్నగు కొన్ని తెలుగు ధాతువులు గలవు. వానికి కూడ నిత్యముగా 'ఇంచు' అన్నది చేరును. అంగలించు మున్నగు రూపము లేర్పడిన పిమ్మటనే లకారాదులు చేరును.

[ఇంచుగాగమము లేని రూపములకు ప్రయోగము లేదు. కావున 'అంగల' మున్నగునవి యెన్నడును స్వస్వరూపముతో కానరావు. 'అంగలించు' మున్నగు విధముగానే యుండును.]

**87.** ఇ ఉ ఋల కించుక్కు పరంబగునపు డయుగవు గరుక్కులగు. (బా - ౬౪)

జి - జయించు ॥ నీ - నయించు ॥ ద్రు - ద్రవించు ॥ లూ - లవించు ॥ ధృ - ధరించు ॥ తౄ - తరించు॥

వ్యాఖ్య - ధాతువుయొక్క ఇకారమునకు ఇంచు అన్నది పరముకాగా అయుగాగమ మగును; ఉకారమునకు అవుగాగమము, ఋకారమునకు అరుగాగమము అగునని సూత్రార్థము.

ఇకారము అని యన్నప్పుడు ఇ ఈలను రెంటిని గ్రహింపవలయును. పూర్వసూత్రముచే సంస్కృతధాతువులకు 'ఇంచు' అన్న ఆగమము కలుగును. ప్రస్తుత సూత్రముచేత ధాతువుయొక్క చివర ఇ కారమున్న యెడల 'అయ్' అని ఆగమముగా నగును. జి+ఇంచు = జి + అయ్ + ఇంచు అని యుండును. అపదాది సంధివలన 'జయించు' అని యగును. ఇట్లే 'నీ' అను ధాతువునకు 'ఇంచు' పరమైనపుడు 'అయ్' అని రాగా 'నీ + అయ్ + ఇంచు = నయించు' అని యగును.

ఉకార మని యన్నప్పుడు ఉ ఊ లను రెంటిని గ్రహింపవలయును. 'ద్రు + ఇంచు' అని యున్నప్పుడు 'అవ్' అను నాగమను కలిగి "ద్రు + అవ్ + ఇంచు - ద్రవించు అని యగును. 'లూ' అను ధాతువుపై 'ఇంచు' చేరినప్పుడు కూడ 'అవ్' అను నాగమము కలుగును అప్పుడు 'లూ + అవ్ + ఇంచు = లవించు' అనురూపము కలుగును.

ఋకార మని యన్నప్పుడు ఋ ౠలను రెండింటిని గ్రహింపవలయును. 'ధృ + ఇంచు' అని యున్నప్పుడు 'అర్' అను నాగమము కలుగగా 'ధృ + అర్ + ఇంచు' అని యగును. అపదాది సంధి కాగా పూర్వపరస్వరంబులకు పరస్వరం బేకాదేశ మగును. అపుడు 'ధ్ + అర్ + ఇంచు = ధరించు' అని యగును. అట్లే 'తౄ + ఇంచు' అనియున్నప్పుడు 'అర్' అని ఆగమముకలిగి 'తౄ + అర్ + ఇంచు' అని యుండును. 'తౄ' లోని ౠ కారమునకు తరువాతి అకారమునకు బదులుగా అకారమే ఏకాదేశమై 'త్ + అర్ + ఇంచు = తరించు' అని యగును.

[సంస్కృతధాతువులకు 'ఇంచు' పరమగునపుడు మాత్రమే యీ కార్యము జరుగును. తెలుగు ధాతువులకు పరమగునపుడు గాని, సంస్కృత ధాతువులకు ఇంచుక్కు చేరగా ఏర్పడిన సంస్కృత జన్యధాతువులకు పరమగునప్పుడు గాని యీ కార్యము జరుగదు. 'వ్రాయు' అను తెలుగు ధాతువునకు 'ఇంచు' పరమగునపుడు 'వ్రాయించు' అనియే యగును. అవుగాగమము కలుగదు. 'ధరించు' అను సంస్కృతజన్య ధాతువుపై 'ఇంచు' చేరగా 'ధరింపించు' అని యగును. అవుగాగమము కలుగదు.]

## 88. నిర్జి నామంబుల కయుగాగమంబు గలుగదు. (బా-ఉజ)

నిర్జికి నామధాతువుల కయుగాగమంబు గలుగదు॥ నిర్జించు - నుతించు - స్తుతించు॥ ఈ జ్ఞాపకంబుచేత నే నామంబులకు ధాతుత్వ వివక్షయం దించుగాగమం బగునని యెఱుంగునది॥ శయనించు - పయనించు.

వ్యాఖ్య - 'నిర్' అను నుపసర్గతో కూడుకొనిన 'జి' అను ధాతువునకును, నామధాతువులకును 'ఇంచు' అను నాగమము కలుగునపుడు అయుగాగమము కలుగదు.

నిర్జి + ఇంచు - అని యున్నప్పుడు అపదాది సంధినిబట్టి 'నిర్జించి' అని యగును. పూర్వ సూత్రమునందు చెప్పిన అయుగాగమవిధికి ఇది అపవాదము.

తెలుగునందును, సంస్కృతమునందును గల నామముల పయిని 'ఇంచుక్కు' చేరునప్పుడు అయుగాగమము కలుగదు. 'ప్రయాణము' అను దానికి 'పయనము' వికృతిరూపము. దీనికి 'ఇంచు' అను నాగమము కలిగి 'పయనించు' అని యగును. 'శయనము' అన్నది తత్సమము. దానికి 'ఇంచు' చేరగా 'శయ

నించు' అని యగును. అట్లే ఇదంతములకు ఇంచుగాగమము కలుగునప్పుడు పూర్వసూత్రముచేత 'అయుక్కు' కావలసి యున్నను నామములకు ప్రస్తుత సూత్రముచేత వారింపబడు చున్నది. నుతి+ఇంచు అని యున్నప్పుడు 'నుతించు' అని యగును. అట్లే స్తుతించు అన్న రూపముకూడ నేర్పడును. ఇయుడాగమము (బా - 50) కలిగినయెడల నుతియించు, స్తుతియించు అనియు రూపము లగును.

"ఈ జ్ఞాపకంబుచేతనే నామంబులకు ధాతుత్వ వివక్షయం దించుగాగమం బగునని యెఱుంగునది" అని వ్యాకర్త వివరణమునందు తెల్పియున్నాడు. ఇంతకుముందు నామములకు 'ఇంచు' అన్నది ఆగమముగా నగునన్న విషయమును చెప్పక పోయినప్పటికి, నామంబున కయుగాగమము కలుగదని చెప్పుట చేత 'ఇంచు' చేరునని జ్ఞాపనము చేయుట జరుగుచున్నది. అప్పుడే అయుగాగమ ప్రసంగమునకు అవకాశముండును. కావున దీనిని బట్టి నామములకు సైతము ధాతుత్వమును కలిగింప దలచుకొన్నప్పుడు 'ఇంచు' చేర్చి వాడవచ్చు నన్న విషయము సూచింపబడుచున్నది.

**89.** సంస్కృతంబునకు లఘూపధంబున కించుక్కు పరం బగునపుడు గుణం బగు. (బా - ౬౬)

అ ఏ ఓ . ఈ మూఁడును గుణంబులు నాఁబడు. ఋ స్థానికం బగు గుణంబు రపరం బయి యుండు. సంస్కృత ధాతూపధలకు ఇ ఉ ఋ - అనువానికి నొందిని ఏ ఓ అర్ - అనునవి యించుక్కు పరంబగు నపు డగునని యెఱుంగునది ॥ ఛిద్ - ఛేదించు; భిద్ - భేదించు;

ఘుష్ - ఘోషించు; పుష్ - పోషించు; వృష్ - వర్షించు; హృష్ - హర్షించు.

వ్యాఖ్య - లఘువును ఉపధగా కలిగిన సంస్కృత ధాతువునకు ఇంచుక్కు పరమగునపుడు గుణము కలుగునని యర్థము. ఇ వర్ణమునకు గుణము ఏ. ఉవర్ణమునకు గుణము ఓ. ఋవర్ణమునకు గుణము అర్.

'ఛిద్' అను ధాతువునందు తుది వర్ణము 'ద్'. దానికి ముందు వర్ణము 'ఇ' హ్రస్వము కావున లఘువు. కాబట్టి దీనికి గుణమయిన ఏ వర్ణము రాగా ఛేద్ + ఇంచు = ఛేదించు అని యగును. అట్లే 'భిద్ + ఇంచు' అని యున్నపుడు ఇత్వము స్థానమున ఏ వర్ణము రాగా 'భేద్ + ఇంచు = భేదించు' అని యగును.

ఘుష్' అను ధాతువునందు ఉపధ 'ఉ' వర్ణము; లఘువు. ప్రస్తుత సూత్రముచేత దీని స్థానమున 'ఓ' రాగా 'ఘోష్ + ఇంచు = ఘోషించు' అని యగును. అట్లే 'పుష్' అను ధాతువు 'ఇంచు' ను జేర్చుకొని 'పోషించు' అని యగును.

'వృష్' అను ధాతువునందు ఉపధ ఋవర్ణము; లఘువు. ఋ స్థానమున అర్ అని రాగా వ్ + అర్ + ష్ + ఇంచు = వర్ష్ + ఇంచు = వర్షించు అని యగును. 'హర్షించు' అన్నది కూడ 'హృష్' అను ధాతువునుండి యేర్పడిన రూపమే.

**90.** స్పృశికి గుణంబు విభాష నగు. (బా - ౯౭)

స్పర్శించు - స్పృశించు.

వ్యాఖ్య - 'స్పృశ్' అను ధాతువుయొక్క ఋ వర్ణము నకు ఇంచుక్కు పరమగునపుడు గుణము విభాషగా నగునని సూత్రార్థము.

'స్పృశ్' అను ధాతువునందు ఉపధ 'ఋ' లఘువు. కావున పూర్వ సూత్రముచేత 'అర్' అనునది వచ్చి స్ప్+ అర్ + శ్ + ఇంచు = స్పర్శించు అని కావలయును. పూర్వసూత్ర మును బట్టి ఇదొక్కటే రూపము. దీనిని పాక్షికముగా వారిం చుచు ప్రస్తుతసూత్రము ప్రవర్తించుచున్నది. అందువలన స్పృశ్ + ఇంచు అని యుండగా అపదాదిసంధియై 'స్పృశించు' అని యగును. ఇయుడాగమును కలుగగా స్పృశ్ + ఇయ్ + ఇంచు స్పృశియించు అని యగును.

## 91. లిఖ భుజ రుచ కృశంబులకు గుణంబు లేదు (బా-ఉ-ా)

లిఖించు - భుజించు - రుచించు - కృశించు ॥ కుచధాతువునకు గుణ బు లేదని యొకండు వక్కాణించె నది గ్రాహ్యంబు కాదు.

వ్యాఖ్య - లిఖ్, భుజ్, రుచ్, కృశ్ - అను ధాతువు లకు ఇంచుక్కు పరమగునప్పుడు గుణము రాదని యర్థము. ఈ ధాతువు లన్నియు లఘూపధములే. పూర్వసూత్రమును (బా - 66) బట్టి గుణము రావలసియున్నను, ప్రస్తుతసూత్రము నివారించుచున్నది. కావున లిఖ్ + ఇంచు = లిఖించు అనువిధముగా నగును. తక్కిన రూపములు నట్లే యుండును. ఇయుడాగమము (బా - 50) కలిగినయెడల లిఖియించు, భుజియించు, రుచి యించు, కృశియించు - అను రూపము లేర్పడును.

'కుచ్' అను ధాతువునకు ఇంచుక్కు పరమగునప్పుడు గుణము రాదని అహోబలపండితుడు తెలిపెను. కాని అది ప్రయోగవిరుద్ధ మగుటచేత దానిని గ్రహింపరాదని సూరి తెలుపుచున్నాడు. అనగా వ్యాకోచించు, సంకోచించు-మున్నగు విధముగా 'కుచ్' ధాతువు గుణము నొందియే ప్రయోగింప బడునని వ్యాకర్త యభిప్రాయము.

[ కవికర్ణరసాయనమునందు "సుందరత్వమునకుఁ జోటిచ్చి తా సంకు చించెననఁగఁ గడుఁ గృశించె నడుము" అని ప్రయోగము కలదు. ఇచ్చట నున్న 'సంకుచించు' అను రూపము నాధారముగ చేసికొని వేటికాకారులు "కుచధాతువు సోపసర్గమగునపుడు గుణము వికల్పముగఁ గాదగు ననుట యుచితమని గ్రహింపఁదగు"నని వ్రాసిరి. సూరి యభిప్రాయమున 'సంకుచించు' అనునది సాధురూపము కాదు. దాని సట్లుంతము. 'కుచ్' ధాతువునకు నిరుపసర్గముగా తెలుగున ఉపయోగమే లేదు. 'కుచించు' అని కాని 'కోచించు' అని కాని యెక్కడను గనబడదు. కావున సోపసర్గమగు కుచధాతువునకు వికల్పముగా గుణమగు నన్న నవరణము సరియైనది కాదు. ఈ నవరణమువలన నిరుపసర్గమైనపుడు గుణము నిత్యమన్న భావము కలు గును. అది సరియైనది కాదు. కుచధాతువు కూడ రాబోవు (బా - 121) భ్వాదులలో చేరదగియున్నది ]

**92.** సృజికి నిర్మితిని గుణంబు లేదు. (బా - ౯౨)

చతుర్ముఖుండు ప్రజలను సృజించె- అతండు విషయంబుల విసర్జించె.

వ్యాఖ్య - 'సృజ్' ధాతువు నిర్మాణ మను నర్థము నిచ్చునప్పుడు గుణమును పొందదని సూత్రార్థము.

'సృజ్' అని యన్నప్పుడు పుట్టించుట యని యర్థము. దానిని తెలుగులోనికి తెచ్చుకొన్నపుడు సృజ్ + ఇంచు= సృజించు అని యగును.

ఈ ధాతువునకు 'వి' అన్న ఉపసర్గ చేరునప్పుడు విడిచి పెట్టుట అను నర్థము కలుగును. కావున ఉపధయైన 'ఋ' వర్ణమునకు గుణమైన 'అర్' కలుగగా వి+సృజ్+ఇంచు=వి+సర్జ్ + ఇంచు - విసర్జించు ను అరూపమేర్పడును.

**93.** సర్వంబునకుం బ్రేరణంబునం దించుక్కగు.

(బా - ౬౦)

పచింపించు-వచింపించు-అవులింపించు-వండించు-పండించు.

వ్యాఖ్య — సర్వవిధములయిన ధాతువులకును బ్రేరణా ర్థమునందు 'ఇంచు' అను నాగమము కలుగును. ధాత్వర్థ భూత మైన వ్యాపారమును గావించుట కొకరు వేరొకరిని బ్రేరేపించుట బ్రేరణము.

ఇచ్చట మొత్తము నాలుగువిధములయిన ధాతువులను చూచితిమి. పచ్, వచ్ — మున్నగునవి తత్సమధాతువులు. వానికి ఇంచుక్కు చేరగా పచించు, వచించు - అని తెనుగు నందు ధాతువులుగా వ్యవహరించుటకు యోగ్యములై యున్నవి. ప్రేరణార్థమున వీనికి 'ఇంచు' చేరగా పచించు+ ఇంచు అని యగును. ఇంచుక్కు పరమందుండగా 'చ' కారము నకు పకారము రాగా (బా - 87) 'పచింపించు' అని యగును. వచింపించు అను రూపముకూడ నిట్టిదే.

'అవుల' అనునది తెనుగు ధాతువు. దీనికి యథాతథముగా ప్రయోగము లేదు. దీనిపైని 'ఇంచు' అని చేరి 'అవులించు' అని యగును. దీనికి ప్రేరణమునందు 'ఇంచు' అన్నది మరల చేరగా 'అవులించు + ఇంచు' అనినయి చకారమునకు పకారము కాగా 'అవులింపించు' అని యగును. ఈ మూడులక్ష్యములందును గూడ ఇంచుగంతములయిన ధాతువులపై, ప్రేరణార్థమునందు ఇంచుక్కు చేరినది.

వండు, పండు - అన్నవి యథాతథముగా లకారాదుల నొంది ప్రయోగింపబడు తెనుగు ధాతువులు. వీనికి ప్రేరణమునందు ఇంచు చేరగా వండించు, పండించు - అను విధముగా నగును.

నామములపై 'ఇంచు' చేరుటవలన ధాతువులుగా వ్యవహరించు శయనించు, పయనించు—మున్నగు రూపములు కూడ కొన్ని కలవు. వ్యాకర్త వానికి ఉదాహరణములను చూపలేదు. వానికి కూడ ప్రేరణేంచుక్కు పరము కాగా 'చ' కారమునకు 'ప' కారమై శయనింపించు, పయనింపించు - అను విధముగా నగును. కాని యిట్టి రూపములు భాషలో చాల తక్కువగా నుండును. అందువలననే వ్యాకర్త వీనికి లక్ష్యములను చూపుట మాని యుండును.

**94.** రంజాదుల యించుక్చకారంబునకు సబిందుకంబున కప్రేరణంబున ద్విరుక్త లకారం బగు. (బా - ౭౧)

రంజిల్లు - భాసిల్లు - వర్ధిల్లు - విలసిల్లు - రాజిల్లు॥ ఈయాదేశయోగంబున భిదాదు లకర్మకంబులగు॥ భేదిల్లు - కంపిల్లు - సంధిల్లు.

వ్యాఖ్య - రంజ్ మున్నగు ధాతువులకు అప్రేరణము నందు వచ్చు ఇంచుగాగమముయొక్క బిందుపూర్వక చకార మునకు బదులుగా ద్విరుక్త లకారము వచ్చునని సూత్రార్థము.

'రంజించు' అని యుండగా సబిందుకమైన చువర్ణమునకు (ంచు) 'ల్లు' అని రాగా 'రంజిల్లు' అని యగును. ఇది స్వార్థము నందు కలుగు రూపము. ఇట్టివే భాసిల్లు, వర్ధిల్లు, విలసిల్లు, రాజిల్లు - అను రూపములు కూడ.

'ఈ యాదేశ యోగమున' నని యనగా బిందుపూర్వక చవర్ణమునకు ఆదేశముగా వచ్చిన ద్విరుక్త లకారముతో కూడి యున్నప్పుడు భిద్ మున్నగు ధాతువులు అకర్మకములు లగునని వివరణవాక్యమున కర్థము. భిద్ + ఇంచు—అనియుండి లఘూపధమగుటచే గుణము కలిగి భేద్ + ఇంచు = భేదించు అని యగును. ఇది సకర్మక రూపమే. ప్రస్తుత సూత్రముచేత 'ంచు' అనువానికి బదులుగా 'ల్లు' అనిరాగా 'భేదిల్లు' అని యగును. ఇది అకర్మకము. వాఁడు రహస్యమును భేదించెను - వాని గుండెలు భేదిల్లెను॥ అనువిధముగా ప్రయోగము లుండును. ఇట్లే కంపించు అన్నదానికి కంపిల్లు అనియు, సంధించు అన్నదానికి సంధిల్లు అనియు రూపములేర్పడును. ఒక లకారమునకు లోపము కలిగి కంపిలు, రంజిలు - అనియు నుండవచ్చును.

**95.** ఇంచుక్కు పరంబగునపుడు రంజాదుల యించుక్కునకు లోపం బగు (బా-౩౨)

లాదేశంబున కపవాదంబు॥ రంజించు - భేదించు - సంధించు.

వ్యాఖ్య - ప్రేరణార్థమునందు ఇంచుగాగమము కలుగు చుండగా 'రంజ్' మున్నగు ధాతువులమీద స్వార్థమునందున్న 'ఇంచు' లోపించునని తాత్పర్యము.

"సంస్కృతంబున కంగలాదుల కించుక్కగు" అను (బా-63) సూత్రముచేత రంజించు మున్నగు రూపము లేర్పడును. "రంజాదుల యించుక్చకారంబునకు" అని మొదలయిన సూత్రము (బా-71) చేత 'రంజిల్లు' మున్నగు రూపము లేర్పడును. ఇట్లేర్పడిన ద్విరుక్త లకారమునకు అపవాదముగా ప్రస్తుత సూత్రము పనిచేయును. అనగా ద్విరుక్త లకారముతో నున్న 'రంజిల్లు మున్నగు రూపములను బాధించి 'రంజించు' మున్నగు రూపము లేర్పడును.

'రంజిల్లు' అన్నది స్వార్థమునందగు రూపము; 'రంజించెను' ప్రేరణార్థమునం దగు రూపము. భేదిల్లు, సంధిల్లు - అనునవి అకర్మక రూపములు కాగా భేదించు, సంధించు - అనునవి సకర్మకరూపములు.

**96.** చుగాగమం బాచ్ఛికంబున కసంయుక్త నలడరాంతంబునకుం బ్రేరణంబున బహుళంబుగా నగు.

(బా - ౭౩)

పూను - పూనుచు - పూనించు॥ తేలు - తేలుచు - తేలించు॥ మగుడు - మగుడ్చు - మగిడించు ॥ కుదుప - కుదురుచు - కుదిరించు ॥ విను - వినుచు. వక్ష్యమాణంబు పుగాగమంబు. వినిపించు ॥ బాహుళకంబుచేఁ గొన్నింటికిఁ జుగాగమంబు లేదు. అను - అనిపించు ॥ తిను - తినిపించు ॥ కను - కనిపించు. దీని యత్వంబునకు దీర్ఘంబునగు. కానిపించు.

వ్యాఖ్య - అసంయుక్తములయిన న ల ళ ర అను వాని నంతమందు గలిగిన యాచ్ఛిక ధాతువులకు ప్రేరణార్థమునందు చుగాగమము బహుళముగా నగునని సూత్రార్థము.

'పూను' అనునది అసంయుక్తనకారాంతము; ఆచ్ఛికము. కావున ప్రేరణమునందు 'చు' అన్న యాగమము కలుగగా 'పూనుచు' అని యగును. ఇది బహుళవిధి యగుటచే చుగాగమము కలుగని పక్షమున "సర్వంబునకుం బ్రేరణంబునం దించుక్కగు" అన్న (బా-70) సూత్రమునుబట్టి 'పూను+ఇంచు = పూనించు' అని యగును. ఇట్లే తేలుచు, మగుడుచు, కుదురుచు - మున్నగు రూపములతోపాటుగా ఇంచుగాగమముతోడి తేలించు, మగిడించు, కుదిరించు - మున్నగు రూపములు కూడ నేర్పడును.

'విను' అను ధాతువునకు ప్రస్తుత సూత్రముచేత 'చు' రాగా 'వినుచు' అని యగును. రాని పక్షమున 'ఇంచు' కలిగి 'విను + ఇంచు' అని యుండును. అప్పుడు ఇకముందు చెప్పబోవు (వక్ష్యమాణము) సూత్రము (బా - 77) ను బట్టి 'వినిపించు' అని యగును. ఇంతవరకు చెప్పుకొన్న వానియందు సూత్రము వికల్పముగా వ్యవహరించినది. బహుళమని యన్నప్పుడు కొన్నియెడల నిషేధముకూడ నుండును.' అను, తిను, కను - అను ధాతువులకు చుగాగమము కలుగదు. ఇంచుగాగమము కలిగి, పుగాగమము కలుగగా అనిపించు, తినిపించు, కనిపించు - అను విధముగా రూపములగును. 'కనిపించు' అను రూపమునందు అత్వమునకు దీర్ఘముకూడ కొన్నియెడల కలుగును. అప్పుడు 'కానిపించు' అని యగును.

[ కొను అన్నది ' క్రయముచేయు ' అను నర్థమున అన్వాదులలోనే చేరి ' కొనిపించు ' అను విధముగా నగును. కొన్ని యెడల అనుప్రయుక్తమయిన ' కొను ' ధాతువునకు ప్రేరణార్థమునందు ' కొలుపు ' అను రూప మేర్పడును. స్వార్థమునందు 'పురిగొను' అని యుండగా, ప్రేరణమునందు 'పురిగొల్పు' అని యగును. ఈ విషయము రాబోవు (బా - 77) సూత్రము కడ ప్రసంగింపడును. ]

**97.** అట్లు పుగాగమంబును మాన్వాదుల కగు. (బా-౭౪)

మాను - మానుపు - మానుచు ॥ మను - మనుపు - మనుచు. బాహుళకంబున దీని కించుక్కు లేదు.

వ్యాఖ్య - అట్లు అని యనగా పూర్వ సూత్రమున నైనట్లని భావము మాను మున్నగు నాచ్ఛిక ధాతువులకు ప్రేరణార్థమునందు పుగాగమనుకూడ బహుళముగా నగునని సూత్ర తాత్పర్యము. సముచ్చయార్థకముచేత పూర్వసూత్రము నందు చెప్పిన చుగాగమమును కూడ గ్రహింపవలసి యుండును.

'మాను' ధాతువునకు ప్రేరణమునందు 'పు' వర్ణము రాగా 'మానుపు' అని యగును. పువర్ణము రాని యెడల 'చు' వచ్చును. అప్పుడు ' మానుచు ' అని ప్రేరణార్థక రూప మేర్పడును. సూత్రమున 'బహుళము' అని యుండుటచే సూత్రము ప్రవర్తింపని యెడల "సర్వంబునకుం బ్రేరణంబునం దించుక్కగు" అన్న (బా - 70) సూత్రమునుబట్టి మాను + ఇంచు = మానించు అని యగును.

'మను' ధాతువున కిట్లే 'పు' వర్ణము కలిగి ' మనుపు ' అనియు 'చు' వర్ణము కలిగి 'మనుచు' అనియు రూపములు

కలుగును. బహుళ మను దళముచేత 'మను' ధాతువునకు ఈ రెండింట నేదియో యొకటి తప్పక యాగమముగా వచ్చి తీరవలయును. అందువలన ఇంచుగాగమముతోడి ప్రేరణార్థక రూపము 'మను' ధాతువునకు కలుగదు.

**98.** చుక్పువర్ణంబులు పరంబులగునపు డిత్వంబున కుత్వం బగు. (బా - ౯౭)

వ్యాఖ్య - ప్రేరణార్థమునందు పైని చెప్పఁబోవు చు, పు - అనువర్ణములు చేరునపుడు ధాతువుయొక్క కడపటి యిత్వమున కుత్వమగునని సూత్రార్థము. 'తెలియు' అను ధాతువునకు రాబోవు సూత్రమునుబట్టి ప్రేరణార్థమునందు పుగాగమము కలుగును. అపుడు చివరి 'యు' లోపించును (బా-76). 'తెలి + పు' అనియుండగా ప్రస్తుత సూత్రమునుబట్టి ఇత్వమునకు ఆదేశముగా ఉత్వము రాగా తెలు + పు = తెలుపు అని యగును. ఇట్టివే కలుపు, తడుపు - మున్నగు రూపములు.

**99.** అట్లు చుక్పుగాగమంబు లడంగ్వాది మాయ్వాదుల కగు; నగుచో వాని కడవ్రాలు లోపించు. (బా-౯౮)

అడఁగు - అడఁచు - అడఁగించు ॥ మాయు - మాపు - మాయించు ॥ అడఁగు - కరఁగు - కలఁగు - నలఁగు ॥ ఇత్యాదు లడంగ్వాదులు. మాఁగు - ఉడుగు - కడచు - బిగియు ॥ ఇత్యాదులు మాయ్వాదులు. ఆఁగు ప్రభృతు లుభయగణంబులు. బాహుళకంబు వలనఁ జేసి కొన్నింటి కించుక్పుక్పుగాగమంబులు మూఁడను, గొన్నింటి కందు యథాసంభవముగా రెండను, గొన్నింటి కొక్కటియు నగు నని యెఱుంగునది. ఆఁగు - ఆఁచు - ఆఁపు - ఆఁగించు॥ రేఁగు - రేఁచు-

రేఁచు - రేఁగించు ॥ పాయు - పాచు - పాపు ॥ విఱుగు - విఱుచు॥ చూచు - చూపు॥ నేరుచు - నేరుపు॥ మేయు - మేపు॥ లేచు - లేపు॥ కలియు - కలుపు॥ తడియు - తడుపు॥ తెలియు - తెలుపు॥ ఇత్యాదు లెఱుంగునది.

వ్యాఖ్య - అడఁగు మున్నగువానికిని మాయు మున్నగు వానికిని ప్రేరణార్థమునందు చుగాగమ, పుగాగమములు బహుళముగా నగును; అట్టియెడ వాని తుది యక్షరములకు లోపము కలుగునని సూత్రార్థము.

అడఁగు, కరఁగు, కలఁగు, నలఁగు - మున్నగునవి అడంగ్వాదులు. వీనికి ప్రేరణమునందు 'చు' వర్ణము కలుగును. అప్పుడు తుది యక్షరమునకు లోపము కలుగును. ' అడఁగు+ చు' అని యుండి తుదియక్షరమునకు లోపమురాగా ' అడఁచు ' అని యగును. చు వర్ణము రానిపక్షమున 'ఇంచు' కలిగి అడఁగు + ఇంచు = అడఁగించు అని యగును. ఇట్లే కరఁచు, కరఁగించు; కలఁచు, కలఁగించు; నలఁచు, నలఁగించు - అను విధముగా ప్రేరణరూపములు రెండేసి యేర్పడును. అనగా సూత్ర విధి యిక్కడ వికల్పముగా జరిగెనని యర్థము.

మాయు, ఉడుగు, కడచు, కుడుచు - మున్నగునవి మాయ్వాదులు. వీనికి ప్రేరణమునందు 'పు' వర్ణము కలుగును. అప్పుడు తుదియక్షరమునకు లోపము కలుగును. 'మాయు' అను ధాతువునకు పువర్ణము పరముకాగా తుదిర్వాయి లోపించి 'మాపు' అని యగును. అట్లే ఉడుపు, కడపు, కుడుపు - అను రూపములు ప్రేరణార్థమునం దేర్పడును. పువర్ణము రానిపక్ష

మున ఇంచుగాగమము కలుగును. అప్పుడు కడ్రవ్రాయికి లోపము రాదు. మాయించు, ఉడిగించు, కడపించు, కుడిపించు - అను రూపము లేర్పడును.

[ కడపించు - మున్నగుచోట్ల 'కడపు' అను 'పు' గాగమ రూపము కలదేమో యనిపించును. కాని యిది యట్టిది కాదు. కడచు + ఇంచు - అనియుండగా "ప్రేరణేంచుక్కు పరంబగునపుడు పకారంబు చకారంబున కగు" నన్న (బా-87) విధిని బట్టి 'కడపించు' అని యగును. మరొక విష యము. చిన్నయసూరి మాయ్వాదులలో చేర్చి 'బిగియు' అను ధాతువును తెలిపెను. అట్లుండుటవలన 'బిగుపు' అన్న ప్రేరణార్థక రూపమేర్పడ వలసి యున్నది. కాని, యట్టి రూపము లేదు. నిజమునకు 'బిగియు' ధాతువును అడంగ్వాదులలో చేర్చుకొనవలయును. అప్పుడు ప్రేరణార్థము నందు చుగాగమము కలుగును. బిగియు + చు - అని యుండగా ధాతువు కడ ఁ్రవాయి లోపించును. అప్పుడు ధాతువు నుత్వమునకు ఉత్వము కలిగి 'బిగుచు' అను రూపమేర్పడును. చువర్ణము రానిపక్షమున ఇంచుగాగమము కలిగి 'బిగియించు' అని యగును. పువర్ణము పరమగు నప్పుడు మాత్రమే ఇత్వము ఉత్వమగుటకు లక్ష్యములు గలవు. 'బిగియు' అను ధాతువు నడం గ్వాదులలోనే పరిగణించినయెడల 'చు' వర్ణము పరమగునపుడు ఇత్వము నకు ఉతంము కలుగు లక్ష్యము లభించును కానియెడల (బా-75) సూత్రము నందు "చుక్పు వర్ణంబులు" అని వాడుట నిరర్థక మనవలసివచ్చును. ]

ఆఁగు, రేఁగు - మున్నగువానిని నుభయగణము లని వ్యాకర్త వివరించెను. ఉభయగణము లనగా చుగా గమమును, పుగాగమమును గూడ పొందు ధాతువులని యర్థము. 'ఆఁగు' ధాతువునకు చువర్ణము వచ్చి ఆఁచు అనియు పువర్ణము వచ్చి ఆఁపు అనియు ప్రేరణ రూపములు కలుగును. ఈ రెండును రానియెడల ఇంచుగాగమము కలిగి 'ఆఁగించు' అని యగును. రేఁగు ధాతువుకూడ ప్రేరణమునందు మూడు

రూపములను పొందును. పాయు ధాతువు పాచు, పాపు - అను రెండు రూపములను పొందును. దీనికి ప్రేరణేంచుక్కు తోడి రూపము లేదు. విఱుగు ధాతువు ప్రేరణమునందు చుగాగమము నొంది 'విఱుచు' అని మాత్రమే యగును. చూచు, నేఱుచు - మున్నగు ధాతువులకు పుగాగమము మాత్ర మే కలుగును. అప్పుడు చూపు, నేరుపు - మున్నగు రూపములు మాత్రమే యేర్పడును.

**100.** ఇంచుక్పుక్పుగాగమంబులు పరంబులగునపు డాగమాదేశ లోపంబులు పెక్కు దెఱంగులం గానంబడియెడి. (బా - ౭౩)

అగు - కావించు॥ వచ్చు - రావించు - రప్పించు॥ విన్నపము-విన్నవించు॥ మోఁకాలు - మోఁకరించు॥ కేక - కేకరించు॥ పలవ - పలవరించు- పలవించు॥ అల-అలకించు-అలించు॥ ప్రక్క-ప్రక్కలించు॥ నొచ్చు - నొంచు - నొప్పించు॥ ఉండు - ఉనుచు - ఉంచు ॥ డిగు - డించు - డిగించు ॥ పెరుగు - పెనుచు - పెంచు॥ తునుఁగు - త్రుంచు॥ మునుఁగు - ముంచు - మునుచు॥ మొగుడు - మొగుడుచు - మొగుచు-మోడుచు - మొగిడించు॥ చొచ్చు - చొనుపు - చొప్పించు॥ చినుఁగు-చించు - చింపు॥ త్రెగు - త్రెంచు - త్రెంపు॥ తిరుగు - త్రిప్పు॥ చచ్చు-చంపు॥ నిలుచు - నిలువరించు - నిలుపు ॥ కొను - కొలుపు ॥ పోవు-పుచ్చు - పనుచు - పంచు - పనుపు - పంపు - అనుచు - అంచు - అనుపు - అంపు॥ అనుప్రయుక్తంబగు పోవునకుం బుచ్చు మాత్రంబగు. మోసపోవు - మోసపుచ్చు॥ ఇత్యాదు లెఱుంగునది.

వ్యాఖ్య - ధాతువునకు నాగమములయిన ఇంచు, చు, పు- అన్నవి చేరునప్పుడు ఆగమాదేశ లోపములు పెక్కు విధములుగా కనబడుచున్నవని సూత్రార్థము.

[ పేటికాకారులు తమ టీకయందు "ప్రేరణమున నగు నించుక్పు క్పుగాగమవులు పరములగుచుండ ధాతువులకుఁ గొన్ని వర్ణము లధికముగ గల్గుటయుఁ గొన్ని వర్ణములకు గొన్ని వర్ణము లాదేశముగ నగుటయు గొన్ని వర్ణములు లోపించుటయు నగునని సూత్రార్థము" అని వ్రాసిరి. ఇంచుగాఁగమము ప్రేరణార్థము నందేకాక, స్వార్థమునందు సైతము కలుగును. అప్పుడుకూడ ఈ మార్పులు రావచ్చును. ఉదాహరణమునకు - విన్నవించు, మోఁకరించు, ఆలకించు, వ్రక్కలించు అన్నవి ప్రేరణార్థకములు కావు. అంగలాదుల కించుక్కు కాఁగా ఏర్పడవలసిన రూపములే. కాని అవి యేర్పడుటకు ముందు ఆగమాదేశ లోపములు కలుగవలసి యుండుటచేత, ఇక్కడ చేర్పవలసి వచ్చినది. కావున ఇంచుగాదుల ను ప్రేరణార్థమునందు మాత్రమే యగుచున్నట్లు తలచుట సరికాదు. ]

'అగు' ధాతువునకు ప్రేరణార్థమునందు 'కావించు' అను రూపమేర్పడును. వచ్చు ధాతువునకు రావించు, రప్పించు - అని రెండు రూపము లేర్పడును. ఇట్లే లక్ష్యముల నన్నింటిని గ్రహింపవలయును.

'విన్నపము' అను నామమునకు ధాతుత్వ వివక్ష చేయునపుడు 'ఇంచు' పరము కాగా 'విన్నపము + ఇంచు' అని యుండును. వృత్తియందు 'ము' వర్ణకమునకు లోపము కలుగును. ప కారమున కాదేశముగా 'వ' కారము రాగా 'విన్నవించు' అని యగును. ఇది స్వార్థమునం దయిన రూపమే. ఇట్లే స్వార్థము నందే 'ఇంచు' రాగా మోఁకరించు - మున్నగు రూపము లేర్పడును.

'నొచ్చు' ధాతువునకు నొంచు, నొప్పించు - అని రెండు ప్రేరణార్థకరూపములు కలుగును. 'పోవు' ధాతువునకు ప్రేరణ రూపములు పెక్కులు గలవు. అనుప్రయుక్తమయిన 'పోవు' ధాతువునకు ప్రేరణమునందు 'పుచ్చు' అన్నది యాదేశముగా నగును.

**101.** అన్వాదుల కించుక్కు పరంబగునపుడు పుగాగమం బగు; మానునకు విభాష నగు. (బా - ౩౮)

అనిపించు ॥ కను - కొను - తిను - విను ॥ మానిపించు-మానించు.

వ్యాఖ్య - ఇంచు పరమగునప్పుడు 'అను' మున్నగు ధాతువులకు పువర్ణము ఆగమముగా చేరును ; మాను ధాతువునకు విభాషగా చేరును - అని సూత్రార్థము.

అన్వాదు లనగా అను, కను, కొను, తిను, మను, విను - అనునవి. వీనికి ఇంచుక్కు పరమగునప్పుడు పుగాగమము కూడ కలుగును. 'అను + ఇంచు' అని యుండగా 'పు' గాగమము కలుగును. అను + పు + ఇంచు = అను + పించు అని యగును. ఇద్వ్రక్రంబులు పరంబులగునపుడు ఉత్వమునకు ఇత్వము కావలయును. అందువలన 'అనిపించు' అని యగును. ఇట్లే కనిపించు, తినిపించు, వినిపించు అను రూపము లేర్పడును.

[ 'కనిపించు' అను రూపమే కాక అత్వమునకు దీర్ఘము రాగా (బా-78) కానిపించు • అను రూపము కూడ కలుగును. 'కొను' ధాతువునకు ప్రస్తుతసూత్రముచేత 'కొనిపించు' అను రూపము కలుగును. పూర్వ సూత్రముచేత 'కొలుపు' అను రూపము కలుగును. అనగా రెండు రూపములు గలవని యర్థము. మను ధాతువునకు మనుచు, మనుపు - అనురూపములు (బా-74) కలుగును. దీనికి ఇంచుగాగమముతోడి రూపము లేదు. ]

**102. అడ్డాదుల కించుక్కు పరంబగునపుడు గుగాగమం బగు; నప్పాదులకు విభాష నగు. (బా - ౭౯)**

అడ్డము - అడ్డగించు॥ అడ్డము - ఓర - చిత్తము - పంతము - పెల్ల - బోర - మట్టము - మేళము॥ ఇత్యాదు లడ్డాదులు. అప్ప - అప్పగించు - అప్పించు॥ అప్ప - ఒప్ప - పల్లము - కోపము॥ ఇవి యప్పాదులు.

వ్యాఖ్య - ఇంచు పరమగునపుడు అడ్డము మున్నగు వానికి నిత్యముగాను, అప్ప మున్నగువానికి విభాషగాను 'గు' వర్ణము అదనముగా చేరునది సూత్రతాత్పర్యము.

అడ్డము + ఇంచు - అని యుండగా వృత్తియందు ము వర్ణకమునకు లోపము కలిగి 'అడ్డ + ఇంచు' అని యగును. ప్రస్తుత సూత్రముచేత గుగాగమము కలిగి అడ్డ + గు + ఇంచు = అడ్డగించు అని యగును. ఇట్లే ఓరగించు, చిత్తగించు, పంతగించు, పెల్లగించు, బోరగించు, మట్టగించు, మేళగించు - అను విధముగా రూపము లుండును. వీనియందు అంగలాదులు కొన్ని. నామధాతువులు కొన్ని. కావున గుగాగమము తెనుగులపై వచ్చినట్లే తత్సమములకు కూడ వచ్చుచున్నది. పై నున్న వానిలో చిత్తము, మేళము అన్నవి తత్సమ నామములు. ఇత్యాదులని యనుటచేత 'ఆర' మున్నగువానికి 'ఆరగించు' అనియు 'పూరము' మున్నగు తత్సమ నామమునకు 'పూరగించు' అనియు రూపము లుండును. ఇట్టి వింకను గలవని భావము.

అప్పు 'మున్నగువానికి 'గు' వర్ణము విభాషగా నగును. కావున 'అప్పగించు' అని గు వర్ణ మయిన రూపముతోపాటు 'అప్పించు' అను గు వర్ణములేని రూపము కూడ కలుగును. ఒప్పగించు, ఒప్పించు; పల్లగించు, పల్లించు; కోపగించు, కోపించు - అన్నవి తక్కినవానికి రూపములు. ఇవి యప్వాదు లని యనుటచేత గుగాగమము విభాషగా కలుగు రూపములింక లేవనియే సూరి నిర్ణయము.

పై ప్రయోగము లన్నింటియందును ఇంచుగాగమము 'స్వార్థమునందే (బా - 63) కలిగెను.

**103.** ఆడోడు, కూడుల డకారంబునకుం జుక్కు పరంబగు నపుడు రేఫం బగు. (బా - ౭౦)

ఆడు - ఆరుచు - ఆడించు॥ ఓడు - ఓరుచు - ఒడించు॥ కూడు - కూరుచు - కూడించు.

వ్యాఖ్య - చువర్ణము ప్రేరణార్థమునందు ఆడు, ఓడు, కూడు అనుధాతువులకు కలుగునపుడు డవర్ణమునకు ఆదేశముగా రేఫము కలుగునని సూత్రార్థము.

'ఆడు + చు' అనియుండగా ప్రస్తుతసూత్రముచేత డకారమునకు రకారమురాగా 'ఆరు + చు' అనియగును, ఇట్లే ఓడు ధాతువునకు ఓరుచు అనియు కూడు ధాతువునకు కూరుచు అనియు రూపములు గలుగును. చువర్ణము కలుగనియెడల రేఫముకూడ కలుగదు. కావున ఆడు మున్నగువానికి ప్రేరణేంచుక్కు కలిగి ఆడించు, ఓడించు, కూడించు - అను రూపము లేర్పడును.

['కూరు' అను రేఫాంతధాతువుండగా 'కూడు' ధాతువును గ్రహించుటయు దానికి రేఫాదేశము గలిగించుటయు నిష్ప్రయోజనమని వ్యాఖ్యాతలవారు తెల్పిరి. 'కూరు' ధాతువునకును 'కూడు' ధాతువునకును అర్థమునందుగల భేదమును పరిగణించినచో సూరి నిర్ణయము సమంజసముగానే తోచును. 'కూరు' ధాతువునకు 'కలుగు' అను నర్థముగలదు. 'కూరుచు' అని యన్నప్పుడు 'కలుగఁజేయు' అన్న యర్థము కలుగును. కాని 'కూఱుచు' అని యన్నప్పుడు 'ఒక చోటికి చేర్చు' మున్నగు విధముగానున్న యర్థము 'కూడు' ధాతువు వలననే కలుగును. 'కూడించు' అను రూపమునకేయేయర్థములున్నవో ఆయాయర్థములన్నియు 'కూఱుచు' అను రూపమునకు కూడ నుండుటచేత 'కూడు' ధాతువును గ్రహించుట సమంజసమే. 'కూరు' ధాతువు మరొకటి యుండుట దీనికి అవరోధము కాదు.]

## 104. చెడునకుం జుక్పుగాగమంబులును డాకలఘు రేఫంబు నగు. (బా - ౮౧)

చెఱుచు - చెఱుపు

వ్యాఖ్య - ప్రేరణార్థమునందు 'చెడు' అను ధాతువునకు చు వర్ణమును, పు వర్ణమును గలుగును. అప్పుడు డ వర్ణమునకు శకటరేఫ మాదేశముగా నగును - అని సూత్ర తాత్పర్యము.

'చెడు + చు' అని యుండగా డ కారమునకు అలఘు రేఫము కలిగి డు స్థానమున ఱు నిల్చును. అప్పుడు 'చెఱుచు' అని యగును. 'పు' వర్ణము కలిగినప్పుడుకూడ ఇట్లే శకట రేఫము కలుగగా 'చెఱుపు' అని యగును.

[కొందరు 'చెఱచు' మున్నగు విధముగా అసమర్థ్యముగా వాడెడి రూపము సాధువు కాదు.]

**105.** పడునకుం జుక్కునఁ డా కలఘురేఫంబు నగు.

(బా - రా౨)

పఱుచు.

వ్యాఖ్య - ప్రేరణార్థమునందు 'చు' వర్ణము పరమగు నప్పుడు పడు ధాతువుయొక్క డకారమునకు అలఘురేఫ మాదేశముగా నగునని సూత్రార్థము.

'పడు + చు' అని యుండగా ప్రస్తుత సూత్రమునుబట్టి డు స్థానమున ఱు రాగా 'పఱుచు' అని యగును.

[పడఁజేయు అను నర్థమున 'పఱుచు' అని ఉకారమధ్యముగానే యుండవలయును. 'పఱచు' అను నకారమధ్యమైన ధాతువు మరొకటి కలదు. దానికి 'పరుగెత్తు' అని యర్థము.]

**106.** శబ్దపల్లవంబగు పడున కించుక్కు విభాష నగు ; నగుచోఁ డాకు లఘురేఫం బగు. (బా-రా౩)

వెలువడు - వెలువరించు - వెలువఱుచు॥ చొప్పడు - చొప్పరించు - చొప్పఱుచు.

వ్యాఖ్య - శబ్దపల్లవమునందు ఉత్తరభాగముగా నున్న పడునకు విభాషగా ఇంచుగాగమము కలుగును. అప్పుడు డకారమున కాదేశముగా అలఘురేఫము కలుగునని సూత్రార్థము.

'వెలువడు' అన్నది శబ్దపల్లవము. దీనికి 'ఇంచు' అన్నది ప్రేరణార్థమునందు కలుగగా 'వెలువడు + ఇంచు' అని యుండును. డకారమునకు రేఫము రాగా వెలువరు + ఇంచు=

వెలువరించు అని యగును. ఇది పూర్వసూత్రమునకు పాక్షిక ముగా బాధకము. కావుననే సూత్రమునందు 'విభాష' యను దళము చేర్పబడినది. 'ఇంచు' చేరనియెడల పూర్వ సూత్రమును బట్టి చుగాగమము కాగా 'వెలువడు + చు' అని యున్నపుడు డాకు శకటరేఫము కలిగి 'వెలువఱుచు' అని యగును.

ఇట్లే 'చొప్పడు' అను శబ్ద పల్లవమునకు ఇంచు పరము కాగా 'చొప్పరించు' అని యగును. ఇంచుగాగమము దాని పక్షమున 'చొప్పఱుచు' అని చుగాగమమును, డాకు శకటరేఫ· మును గలిగిన రూప మేర్పడును.

## 107. ప్రేరణంబునం దించుక్కుమీఁద నించుక్కు లేదు. (బా - రాళ)

ఇట్లనుటం జేసి ప్రేరణార్థంబయిన యితరాగమంబు మీఁదం బ్రేరణార్థేంచుగాగమం బగు నని యెఱుంగునది॥ నొచ్చు - నొంచు - నొప్పించు॥ చచ్చు - చంపు - చంపించు.

వ్యాఖ్య - ప్రేరణార్థమునందు ధాతువున కొకమారు ఇంచుగాగమము కలుగగా, మరల దానిపై 'ఇంచు' చేరదని యర్థము.

దీనినిబట్టి ప్రేరణార్థమునందు ఇంచుగాగమము కాక, చుగాగమ పుగాగమాదులు కలిగినప్పటికిని మరల ఇంచుక్కు చేరవచ్చునని భావము. ఈ విషయమును వ్యాకర్తయే వివరణ మునందు తెలిపెను. అట్లే స్వార్థమునందు 'ఇంచు' పరమై

నప్పుడు, దానిపై ప్రేరణేంచుక్కు పరమగుటకు నభ్యంతరము లేదు. 'వచించు' అను రూపమునందు 'వచ్' అను సంస్కృత ధాతువునకు స్వార్థమునందు 'ఇంచు' పరమైనది. కావున ప్రేరణార్థమునందు మరల దీనిపై 'ఇంచు' చేరి 'వచించు + ఇంచు' అని యుండి చకారమునకు బదులుగా పకారము రాగా 'వచింపించు' అని యగును. ఇట్లుండుట కాక్షేపము లేదు. అట్లే 'అంగలించు' మున్నగువానిపై ఇంచు చేరి 'అంగలింపించు' అని ప్రేరణార్థమునం దగును. ప్రస్తుత సూత్రము అట్టివాని కభ్యంతరము తెలుపుట లేదు.

'నొచ్చు', అను ధాతువునకు ప్రేరణార్థమునందు 'నొంచు' అను రూపము (బా - 77) కలుగును. 'నొచ్చు' ధాతువునకు 'చు' పరము కాగా ధాతువు కడవ్రాయి కాదేశముగా పూర్ణ బిందువు కలుగును. నొచ్చు + చు = నొం + చు = నొంచు అని యగును. ఇది ప్రేరణరూపమే యైనను చుగాగమాంతము కావున దీనికి మరల ఇంచుగాగమము కలుగవచ్చును. అట్లు కలుగగా నొంచు + ఇంచు అని యగును. ఇంచుక్కు పరమందుండుటచేత పకారము చకారమునకు రాగా (బా - 87) నొంపు + ఇంచు అని యుండును. ఇక్కడ పూర్ణబిందువునకు లోపము రాగా పు వర్ణమునకు ద్విత్వము కలుగును. అప్పుడు నొప్పు + ఇంచు = నొప్పించు అని యగును - ఇది సూరి యభిప్రాయమున కనుగుణముగా చూపవలసిన ప్రక్రియ.

[ఇచ్చట సూరి నొచ్చు ధాతువును లక్ష్యముగా చూపకుండిన బాగుండెడిది. తానే 77వ సూత్రము కడ నొంచు, నొప్పించు - అను రెండింటిని ప్రేరణ రూపములుగా చూపెను. 'నొచ్చు' అని యున్నప్పుడు 'చు'

వర్ణము చేర్పగా తుదివ్రాయికి లోపమును, పూర్ణబిందువును కలిగెనని యను కొనవచ్చును. అప్పుడు 'నొంచు' అను రూప మేర్పడును. దీనికి మరల ఇంచుక్కును జేర్చుట, దానివలన మరల లేనిపోని వానిని విధించుకొనుట ప్రక్రియా భారమును మాత్రమే సంపాదించి పెట్టును. ప్రయోజనము లేదు. 'నొచ్చు' అను ధాతువునకు ప్రేరణార్థమునందు 'ఇంచు' చేరును. అప్పుడు ప్రేరణేంచుక్కు పరమగుటచేత చకారమునకు పకారము వచ్చును. అనగా 'చ్చు' స్థానమున 'ప్పు' వచ్చును. అప్పుడు నొప్పు + ఇంచు = నొప్పించు అని యగును. ఇట్టి సక్రమమైన మార్గమునువీడి ప్రక్రియాభారమును తెచ్చి పెట్టుకొనుట యవసరము కాదు. ఈ మార్గమునే యనుసరించిన యెడల ఇప్పుడిది ప్రస్తుతసూత్రమునకు లక్ష్యము కాజాలదు. 'నిండు' ధాతువునకు ప్రేరణమునందు చుగాగమము కలుగగా తుదివ్రాయికి లోపము వచ్చి 'నించు' అని యగును. ఇది ప్రేరణార్థకమే. అయినను దీనికి మరల ఇంచు గాగమము కాగా నించు + ఇంచు = నింపించు అని యగును. కావున మొదటి లక్ష్యమునకు బదులుగా 'నిండు - నించు - నింపించు' అని యుండిన యోగ్యతరముగా నుండును.]

'చచ్చు' అను ధాతువునకు ప్రేరణార్థమునందు పుగాగమము కలుగగా ధాతువు తుది యక్షరము స్థానమున పూర్ణబిందువు కలిగి 'చంపు' అని యగును. ఇది ప్రేరణార్థకమే.. అయినను, పుగాగమాంత మగుటవలన మరల నించుగాగమమై చంపు + ఇంచు = చంపించు అని కావచ్చును.

## 108. అన్నంతక్రియ చేయు యోగంబునం బ్రేరణార్థకం బగు. (ప్రౌ - ౧౮)

చొక్కుచుఁ జొక్కఁజేయుచు ॥ కళా. ౨ ఆ ॥ కేళవుఁ డవ్వి రాట్టనువుఁ గృష్ణసమాఖ్య వహింపఁజేసెనో ॥ కళా. ౮ ఆ ॥ మొ. (చొక్కఁజేయు = చొక్కించు. ఇట్లంతట నెఱుంగునది.)

వ్యాఖ్య - ధాతువుయొక్క నుజ్యంత రూపముపై 'చేయు' ధాతువుచేరి ప్రేరణార్థము నొసగునని సూత్రార్థము.

'చొక్కు' ధాతువుయొక్క నుజ్యంతరూపము 'చొక్కను' అనునది. దీనికి 'చేయు' అను ధాతువు చేరగా చొక్కను + చేయు అని యుండును. ద్రుతకార్యము జరుగగా చొక్కఁ జేయు, చొక్కం జేయు - అను విధముగా రూపము లుండును. 'చొక్కించు' అను రూపమున కేమి యర్థమో దీనికి నదియే యర్థము.

'వహ్' అను సంస్కృత ధాతువుపై స్వార్థమున ఇంచు చేరగా 'వహించు' అని యగును. దీనికి నుజ్యంత రూపము 'వహించు + నుఙ్' అనియుండి రాబోవు (బా - 88) సూత్రము చేత చు స్థానమున 'పు' రాగా 'వహింపను' అని యగును. దీనికి 'చేయు' అను ధాతువుచేరి 'వహింపఁ జేయు' అని యగును. 'వహింపించు' అను ప్రేరణార్థక రూపమున కేమి యర్థమో దీనికి నదియే యర్థము. ఇది బాలవ్యాకరణమునకు పూరకము.

**109.** ఇత్వంబుగాని యెత్వంబుగాని కూడుచో ననాద్యం బయిన యుత్వంబున కిత్వం బగు. (బా - రాజ)

నిగుడు - నిగిడి - నిగిడె॥ మగుడు - మగిడి - మగిడె॥ ఉడుగు - ఉడిగి - ఉడిగె॥ మునుఁగు - మునిఁగి - మునిఁగె॥

వ్యాఖ్య - ఇ కాని, ఎ కాని కూడినప్పుడు ధాతువు యొక్క అనాద్యమైన ఉత్వమునకు ఇత్వమాదేశముగా నగునని సూత్రార్థము.

'నిగుడు' అను ధాతువునకు క్త్వార్థమునందు ఇ వర్ణము కలుగగా నిగుడు + ఇ అని యగును. సంధికాగా 'నిగుడి' అని యగును. ప్రస్తుత సూత్రముచేత ధాతువుయొక్క రెండవ యక్షరమునందున్న ఉత్వమునకు నిత్వము వచ్చి 'నిగిడి' అని యగును. అట్లే లిట్టు పరమైనపుడు 'ఎ' పరము కాగా 'నిగుడు + ఎ' అని యుండి పైని చూపిన ప్రక్రియనుబట్టి 'నిగిడె' అని యగును. ఇట్లే నిగిడించు, నిగిడెదవు, నిగిడితివి, నిగిడిరి - మున్నగు రూపములయందలి ప్రక్రియను గుర్తింప వలయును.

'ఉడుగు' అను ధాతువునందు మూడుచోట్ల ఉత్వము గలదు. పై సూత్ర విధినిబట్టి ఆద్యమైన ఉత్వమునకు ఇత్వము కలుగదు. రెండవదైన 'డు' అను నక్షరముయొక్క ఉత్వమున కిత్వము కలుగును. అప్పుడు 'ఉడిగి' మున్నగు విధముగా రూపము లేర్పడును. 'మునుఁగు' ధాతువుకూడ నిట్టిదే.

## 110. ముజ్జీత్తులు ముత్తునాఁ బడు. (బా - రాఽ)

వ్యాఖ్య - ముజ్జు అను సంజ్ఞచేత పిలువబడునవియు, జీ వర్ణము నిత్తుగా కలవియు సామూహికముగా 'ముత్తు' అను సంజ్ఞ చేత గ్రహింపబడునని యర్థము.

ప్రార్థనాద్యర్థములందు మధ్యమ పురుష ఏకవచనమున నగు ము వర్ణకమును బహువచనమున నగు డుజ్వర్ణకమును గలిసి 'ముజ్జు' అగును. (బా - 31)

లజీ, కలజీ, పడుజీ, కుజీ, వుజీ, రుజీ, కజీ, మిజీ, నుజీ అనువవి జీతులు.

పైని చెప్పిన ముడుఙ్గులకును, జీత్తులకును సామూహిక మైన సంజ్ఞ 'ముత్తు' అనునది.

**111.** ప్రేరణేంచుక్కు పరంబగునపుడు పకారంబు చకారంబున కగు. (బా - ౧౭౭)

పచించు - పచింపించు ॥ వచించు - వచింపించు ॥ పిలుచు - పిలిపించు ॥ వలచు - వలపించు. పత్వంబు మెచ్చునకుం గలుగదు; మెచ్చునకు విభాష నగు॥ మెచ్చించు - మెప్పించు - మెచ్చించు.

వ్యాఖ్య - ప్రేరణార్థమునందలి 'ఇంచు' పరమందుండగా ధాతువుయొక్క చకారమునకు పకార మాదేశముగా నగునని సూత్రార్థము.

'పచ్' అను ధాతువునకు 'ఇంచు' పరమై 'పచించు' అని యగును. దీనికి ప్రేరణమునందు 'ఇంచు' పరముకాగా పచించు + ఇంచు అని యుండి ధాతువుయొక్క చు స్థానమున పు రాగా పచింపు + ఇంచు = పచింపించు అని యగును. వచింపించు, పిలిపించు, వలపించు - అను రూపములు కూడ నిట్టివే.

ఇవన్నియు ఇంచుపైని ఇంచు చేరిన రూపములే. ఇచ్చట ధాతువు స్వార్థమునందున్నది. ప్రేరణార్థక ధాతువులయొక్క చకారమునకుకూడ ఈ పత్వము కలుగును. దంచు + ఇంచు = దంపించు; చూచు + ఇంచు = చూపించు ॥ మున్నగునవి యుదాహరణములు.

మెచ్చు అను ధాతువుయొక్క చకారమునకు ప్రేరణేంచుక్కు పరమగునపుడు పకారము రాదు. మెచ్చు + ఇంచు =

హెచ్చించు అనియే యుండును. మెచ్చు అను ధాతువు యొక్క చకారమునకు పత్వము విభాషగా నగును. మెచ్చు + ఇంచు - అని యుండగా పత్వము గలిగినచో మెప్పు + ఇంచు = మెప్పించు అని యగును. పత్వము కలుగనియెడల మెచ్చించు అనియే యుండును.

**112.** ఆగమాన్య చకారంబుల కద్విరుక్తంబులకు ముత్తు పరంబగునపుడు పవ లగు. (బా - లా)

ఆగమంబు॥ పచింపఁడు - పచింపుము - అడఁపఁడు - అడఁపుము. అన్యము॥ పిలువఁడు - పిలువుము.

వ్యాఖ్య - ముత్తు పరమగునప్పుడు అద్విరుక్తమైన ఆగమ చకారమునకు పకారమును, అన్య చకారమునకు వకారమును ఆదేశమగునని సూత్రార్థము. అన్యమని యనగా ధాతుగతముగా నున్నదని యర్థము.

'పచించు' అనుచోటిది ఇంచుగాగమ చకారము. కావున దీనికి ముత్తు పరమగునపుడు పత్వము కావలయును. పచించు + లజీ + డుజు. వ్యతిరేకార్థమునందు లజీ యగును. జీత్తు పరమగునప్పుడు ఉత్వమునకు అత్వము కలుగును. ప్రస్తుత సూత్రము చేత 'చ' వర్ణమునకు ప వర్ణము కలుగును. అప్పుడు పచింపఁడు అని యగును. మధ్యమ ముపర్ణకము పరమగునపుడు కూడ పత్వము కలుగగా పచించు + ము = పచింపుము అని యగును. 'అడఁచు' ధాతువునందలి 'చు' ఆగమముగా విధింపబడినదే.

కావున దీనికికూడ పత్వము కలిగి అడఁపఁడు, అడఁపుము - అను విధముగా రూపము లగును.

'పిలుచు' ధాతువునందలి చు వర్ణ మావయవికము. కావున దీనికి 'వు' అని యాదేశమగును. పిలుచు+లజి+డుజ్జు=పిలువఁడు అని యగును. ము వర్ణకము పరమగునపుడు పిలువుము అని యగును.

ము డుజ్జులలో ము వర్ణకమును, జీత్తులలో లజి వర్ణకమును పరమైనపుడు కలుగు రూపము లుదాహరింపబడినవి. తక్కినవాని నిట్లే యూహించుకొన వలయును.

**113.** కవిత్రయేతర ప్రయోగంబులం గొన్నియెడల నిప్రత్యయాదులు పరంబు లగునపుడు పకారం బించుకృకారంబున కేనిఁ గానఁబడదు. (ప్రౌ - ౧౬)

ఎవ్వారిగిఁబో। రించని క్షణ మొక్కటియుఁ దరింపఁగ వశ మే॥ క శా. ౨ ఆ॥ ఊ। హించ నొక నాల్గు గడియల। సంచారము వలయు॥ క శా. ౩ ఆ॥ అపి శబ్దార్థముచే - అంగన భీతుల కెల్ల భీతి దీ। ర్చుము వెసఁబొమ్ము నమ్ము మనుచుం గదలెన్॥ క శా. ౬ ఆ॥ మొ.

వ్యాఖ్య - కవిత్రయము కాక, తరువాతి కవుల ప్రయోగములందు ని ప్రత్యయము మున్నగునవి పరమైనపుడు ఇంచుకృకారమునకు సైతము పకారము కానవచ్చుట లేదని సూత్రార్థము. నిప్రత్యయాదులు అని యనగా ముత్తనియే భావము.

'పోరించు' అనుచోటి 'చ' కారము ఇంచుగాగమము లోనిది. బాలవ్యాకరణ విధినిబట్టి నిజీ పరమైనపుడు పత్వము

ఆదేశముగా నగుచో 'పోరింపని' అని కావలయును. కాని యిచ్చట 'పోరించని' అనియే యున్నది. ఇది ప్రాసగతమగుటచే సమర్థమై యున్నది. 'ఊహించు' అనుచోటిది కూడ ఆగమ చకారమే. దీనికి నుజీ పరమైనపుడు 'ఊహింపను' అని కావలసియుండగా 'ఊహించను' అనియే యున్నది. ఇదియు ప్రాసగతమగు ప్రయోగమే.

'అపి' అనగా ఏని యని యర్థము. 'ఇంచుక్ప్రకారంబున కేని' అని సూత్రమునందు కలదు. ఇచ్చట ఏని ప్రయోగముచే "ఇంచుగాగమ చకారమునకును వచ్చుట లేదు. చుగాగమమున కెట్లును రాదు" అన్న స్ఫురణ మున్నది చుగాగమమునకు లక్ష్యముగా మధ్యమ ము వర్ణకముతోడి 'తీర్చు' ధాతువును చూపుచున్నాడు. 'తీరు' ధాతువునకు ప్రేరణార్థమున చుగాగమము కలుగగా 'తీరుచు' అని యగును. అదియే ఉత్వ లోపముచేత 'తీర్చు' అని యగును. తీర్చు + ము అని యున్నప్పుడు 'తీర్పుము' అని కావలసి యుండగా ప్రస్తుత ప్రయోగము నందు 'తీర్చుము' అనియే యున్నది. ఇదియు యతి నిబద్ధమై యున్న ప్రయోగము.

[కవిత్రయ ప్రయోగములు బాలవ్యాకరణానుకూలముగానే యున్నవని యంగీకరించుచు, తరువాతి కవుల ప్రయోగములు తద్భిన్నముగా నుండుటచే వానిని ప్రౌఢవ్యాకరణకారుడు ప్రదర్శించుట జరిగినది.]

**114. ఖండబిందువు మీఁది సిద్ధ చకారంబునకు ముత్తు పరంబగునపుడు పకారంబు ప్రాయికంబుగ నగు.**

(బా. - రా.)

తలఁపక - త్రేఁపక - తోఁపక ॥ ఏఁచునకు వైభాషికంబు।
ఏఁపక - ఏఁచక ॥ నోఁచునకుఁ గలుగదు - నోఁచక.

వ్యాఖ్య - ముత్తు పరమగునపుడు అరసున్నమీది సిద్ధ చకారమునకు తఱుచుగా పకార మగునని యర్థము. ఇది "ఆగమాన్య" అని మొదలయిన సూత్రమునకు అపవాద సూత్రము.

'తలఁచు' అను ధాతువునకు కజీ పరమైనపుడు తలఁచు + కజీ అని యుండును. ప్రస్తుత సూత్రమునుబట్టి 'చు' స్థానమున పు రాగా తలఁపు + కజీ అని యగును. జీత్తు పరమగునపుడుత్వమున కత్వము రాగా తలఁపక అని యగును. ఇట్లే త్రేఁచు, తోఁచు అను ధాతువులు త్రేఁపక, తోఁపక - అని యగును.

'ఏఁచు' ధాతువుయొక్క 'చ' కారమునకు పత్వము విభాషగా రాగా 'ఏఁపక' అనియు, రానియెడల 'ఏఁచక' అనియు నగును. 'నోఁచు' అను ధాతువునందలి బిందువుమీది చకారమునకు పత్వమురాదు. 'నోఁచక' అని యొక్క రూపమే యుండును. ప్రాయికముగా నని యనుటచే 'ఏఁచు' ధాతువు విషయమున విభాషయు, నోఁచు ధాతువు విషయమున నిషేధము నంగీకృతములు లయినవి.

[సూత్రమునందు 'బిందువుమీఁది' అని యనక 'ఖండబిందువుమీఁది' అని యనుటచేత పూర్ణబిందువు మీది సిద్ధ చకారమునకు పత్వము కలుగ రాదని తెలుచున్నది. 'మించు' అని యున్నప్పుడు 'మించక' అను రూపము మాత్రమే కలుగును. దీనిదగ్గర సందేహము లేదు. సూరి చూపిన లక్ష్యము లలో మొదటిది 'తలఁపక' యన్నది. ఇది 'తలఁచు' అను ధాతువునకు 'కజీ' పరము కాగా 'చ' వర్ణమునకు పత్వము కలిగి యేర్పడినది. ఇక్కడి

ఖండ బిందువునకు పూర్ణబిందువై 'తలంచు' అని యైనప్పుడు 'తలంపక' అను రూపము సిద్ధింపదా ? అన్న ప్రశ్న కలుగును. ఉన్న స్థితిని బట్టి 'తలంచు' అను ధాతువు వలన 'తలంపక' అను రూపము కలుగుటకు వీలు లేదు. కలుగదనియే నిశ్చయము. మరి, 'తలంపక' యను ప్రయోగము కలదు కదా ? అని యన్నచో కలదన్నమాట వాస్తవము. అది 'తలంచు' అను ధాతువునుండి నిష్పన్నము కాలేదు. 'తలఁచు' అను అర్ధబిందువు తోడి ధాతువునుండియే 'తలఁపక' అని యేర్పడి, "హ్రస్వముమీఁది ఖండ బిందువునకుఁ బూర్ణబిందువు వైకల్పికముగ నగు" నన్న (బా. సంజ్ఞ - 14) సూత్రమునుబట్టి యేర్పడును. ఈ క్రమము ననుసరించుట యవసరము.]

**115.** ఆగమ చకారంబునకు నెఱసున్న మీఁది దానికి దుక్కు పరంబగునపుడు పకారంబు విభాష నగు. (బా - కాం)

ఆకర్ణింపుదురు - దంపుదురు - చింపుదురు ॥ పత్వంబు రాని పక్షమున వక్ష్యమాణ తాదేశంబు. ఆకర్ణింతురు-దంతురు - చింతురు.

వ్యాఖ్య - దుగాగమము పరమగునప్పుడు పూర్ణబిందువుమీది ఆగమ చకారమునకు పకారము విభాషగా నగునని సూత్రార్థము. "లాట్టు రుజ్ఞు పరంబగునపుడు దుగాగమంబగు" అన్న (బా - 22) సూత్రమునుబట్టి తద్ధర్మార్థకమునందు ప్రథమపురుషైకవచనము కాక మిగిలిన ప్రత్యయములు పరములగునపుడు దుగాగమము కలుగును.

'ఆకర్ణించు' అన్నది సంస్కృత ధాతువుపై 'ఇంచు' చేరగా ఏర్పడిన ధాతువు. కావున నిచ్చటిది ఆగమ చకారము; నెఱసున్న మీదిది. కావున ప్రస్తుత సూత్రముచేత 'చ' కారమునకు పకారము రాగా 'ఆకర్ణింపుదురు' అని యగును. అట్లే దంచు + దు + రు = దంపుదురు అనియు చించు + దు + రు =

చింపుదురు 'అనియు నగును. ఈ కార్యము విభాషగా నగును. కావున పత్వము రాని పక్షమున ఆకర్ణించు + దురు అనియే యుండును. రాబోవు (బా - 108) సూత్రమువలన చు వర్ణముతో పాటు దుగ్గకారము తకారము కాగా 'ఆకర్ణింతురు' అని యగును. ఇట్లే దంతురు, చింతురు - అను రూపములుకూడ నేర్పడును.

[ఇచ్చట దంపుదురు, చింపుదురు అను ప్రయోగములనుగాక ప్రేరణమునందు చుగాగమము తోడి రూపము మాత్రమే కలవానిని జూపిన సమంజసముగా నుండెడిది. 'దంగు' ధాతువునకు దంచు, దంపు - అన్నవి రెండును ప్రేరణ రూపములే. 'చినుఁగు' ధాతువునకు చించు. చింపు - అను రెండును ప్రేరణ రూపములే. కావున దంపు, చింపు-అనువానికి దుగాగమము కలిగెననిపించుట కవకాశమున్నది. అప్పుడవి యీ సూత్రమునకు లక్ష్యములు కాజాలవు. కావున పెంచు, ముంచు - అను విధముగా 'చు' వర్ణము మాత్రమే గల ప్రేరణార్థకముల నుదాహరణములుగా గ్రహింపవచ్చును. అప్పుడు పెంపుదురు, ముంపుదురు - అనియు పెంతురు, ముంతురు - అనియు రూపము లగును.]

**116.** పకారంబు కొన్నియెడల శత్రర్థ పరక చు వర్ణంబునకుం గానంబడెడి. (ప్రౌ - ౧౩)

మోవి మెఁవిఁ జేర వుచును ॥కళా. ౨ ఆ॥ గర్జింపుచు ॥జై. ౨ఆ॥ మొ.

వ్యాఖ్య - శత్రర్థకమైన చువర్ణము పరమందున్నప్పుడు కూడ ధాతువుయొక్క చువర్ణమునకు బదులుగా పువర్ణము కొన్నిచోట్ల నగునని సూత్రార్థము.

'చేరు' అను ధాతువునకు ప్రేరణార్థక రూపము 'చేరుచు' అన్నది. దీనికి శత్రర్థమునందు చువర్ణకము (బా-43) కలుగగా 'చేరుచు + చును' అని యుండును. ప్రస్తుత సూత్రమును బట్టి చు స్థానమున 'పు' రాగా 'చేరుపుచును' అని యగును. కొన్ని యెడల నని యనుటచేత ఈ కార్యమునకు వైకల్యము గలదన్న సూచన వ్యాకర్తయే చేయుచున్నాడు.

[ సూత్రమునందు "పకారంబు . చు వర్ణంబునకు" అని యనుట సమంజసముగా లేదు. 'పువర్ణంబు చువర్ణంబునకు' అనికాని 'పకారంబు చకారంబునకు' అనికాని అనుట యోగ్యముగా నుండును. ]

**117.** అగు వచ్చు చొచ్చు చూచులకు ముత్తు పరం బగు నపుడు కా రా చొరు చూడు లగు. (బా - ౬౧)

అగు - కాఁడు ॥ వచ్చు - రాఁడు - రమ్ము ॥ చొచ్చు - చొరఁడు - చొరుము ॥ చూచు - చూడఁడు - చూడుము

వ్యాఖ్య - ముత్తు పరమగునపుడు 'అగు' నకు 'కా' అనియు 'వచ్చు' నకు 'రా' అనియు 'చొచ్చు' నకు 'చొరు' అనియు 'చూచు' నకు 'చూడు' అనియు ఆదేశమగునని సూత్రార్థము.

అగు' ధాతువునకు వ్యతిరేకార్థమునందు లజీయై ప్రథమ పురుషైక వచనమున డుఞు రాగా అగు+లజీ+డుఞు = కాఁడు అని యగును.

అట్లె 'వచ్చు' ధాతువునకు వ్యతిరేకార్థమునందు ఆదేశముగా 'రా' యనియై 'రాఁడు' అని యగును. మధ్యమ

మువర్ణకము పరమైనపుడు 'వచ్చు+ము' అనియుండి ప్రస్తుత సూత్రముచేత 'రా+ము' అనియగును. ముజ్లు పరమందుండగా దీర్ఘమునకు హ్రస్వమును మువర్ణకమునకు మాముడియు రాగా (బా-61) 'రమ్ము' అని యగును. అట్లె 'చొచ్చు' ధాతువునకు 'చొరు' అనియు, 'చూచు' ధాతువునకు 'చూడు' అనియు నాదేశముగా నగును.

[సూరి యిచ్చట జీత్తుతోడి రూప మొకటియు, మధ్యమ మువర్ణకముతోడి రూపమొకటియు ప్రతి లక్ష్యమునకు చూపెను. కాని మొదటి లక్ష్యమగు 'అగు' ధాతువునకు జీత్తుతోడి రూపమును మాత్రమే చూపి యూరకుండెను. మువర్ణకముతోడి రూపమును చూపలేదు. వ్యాకర్త దానిని సకారణముగానే విడిచిపెట్టెను. తక్కినచోట్ల ఆయా రూపములు మాత్రమే యగును. 'అగు' ధాతువునకు ప్రస్తుత సూత్రమునుబట్టి 'కమ్ము' అను రూప మగును. రాబోవు (బా - 96) సూత్రమునుబట్టి 'అగుము' అను రూపముకూడ నగును. కావున ద్వైరూప్యమును చూపవలయును. రెండవ రూపమునకుకూడ నిష్పత్తిని చూపిన పిమ్మటనే యుదాహరించుట యుచిత మన్న యభిప్రాయముతో దాని నిక్కడ మానియుండును.]

## 118. ఇచ్చునకు సర్వంబున కీ యగు. (బా - 94)

ఇచ్చు - ఈఁడు - ఇమ్ము॥ ఈయ యను నాదేశంబు నొకానొకచోఁ గానంబడియెడి - బలిమినీయని భూమివలయపతుల.

వ్యాఖ్య - 'ఇచ్చు' ధాతువున కంతటికి బదులుగా ముత్తు పరంబగునపుడు 'ఈ' యను నాదేశము కలుగునని సూత్రార్థము.

'ఇచ్చు' అను దానికి వ్యతిరేకమున లజీ స్థానమున ప్రథమపురుషైకవచన ప్రత్యయమగు డుజ్లురాగా 'ఈఁడు' అనియగును. మధ్యమ మువర్ణకము పరముకాగా 'ఈ+ము' అని యుండి

దీర్ఘమునకు హ్రస్వమై ము వర్ణకమునకు మూముడి రాగా 'ఇమ్ము' అని యగును.

కొన్నిచోట్ల 'ఇచ్చు' నకు ఆదేశముగా 'ఈయ' అనియు వచ్చుట కలదు. 'ఇచ్చు' ధాతువునకు నిజీ పరమందుండగా 'ఈయ + ని' = ఈయని అని యయ్యెను. "బలిమి నీయని" యన్నది నన్నపార్యుల ప్రయోగము. ప్రయోగబలమునుబట్టి సూరి దానినిగూడ అంగీకరించుచున్నాడు. అయినను 'ఈయ' అని చెప్పుటచేత జీత్తు పరమగునప్పుడు మాత్రమే యీ యాదేశము కలుగునన్న నిశ్చయము కనిపించును. ఈయఁడు, ఈయక - మున్నగు విధముగానే ప్రయోగ ఘుండును గాని ముజ్జు పరమైనపుడు ఈ 'ఈయ' తోడి రూపము కానరాదు.

**119.** తే తేరులు తెచ్చున కగు. (బా - కా౩)

తెచ్చు - తేఁడు - తేరఁడు - తెమ్ము - తేరుము.

వ్యాఖ్య - తెచ్చు ధాతువునకు ముత్తు పరమగునపుడు 'తే' అనియు 'తేరు' అనియు నాదేశముగా నగునని సూత్రార్థము.

'తెచ్చు' ధాతువునకు వ్యతిరేకార్థమునందు లజీయై ప్రథమ పురుషైకవచన ప్రత్యయమగు డుజ్జు కలుగగా 'తేఁడు' అని యగును. 'తేరు' అన్నది యాదేశమైన యెడల 'తేరు + డుజ్జు' అని యుండి లజీ పరముందుండుటచేత ధాతువుయొక్క ఉత్వమున కత్వము కాగా 'తేరఁడు' అని యగును.

మధ్యమ ము వర్ణకము పరమగునపుడు నిత్లే 'తే' యను నాదేశము కాగా 'తే + ము' అని యుండును. ఇప్పుడు ధాతువ

యొక్క దీర్ఘమునకు హ్రస్వమును, ము వర్ణకమునకు మాము డియు రాగా 'తెమ్ము' అని యగును. 'తేరు' అన్న యాదే శము కలుగగా 'తేరు+ము=తేరుము' అని యగును.

తేరక, తేరని, తేరమి మున్నగు జీత్తు తోడి రూపము లను, తెండు అను డుజ్ఞు తోడి రూపము నిట్లే యూహించు కొనవచ్చును.

[ కొనితెచ్చు మున్నగు శబ్ద పల్లవములకు నైత మీ కార్యము జరు గును. కొనితేఁడు, కొనితేరఁడు, కొనితెమ్ము, కొనితేరుము - అను విధ ముగా రూపము లుండును. 'ఏతెంచు' మున్నగు విధముగా శబ్దపల్లవగత మైన 'తెంచు' ధాతువునకు నివే యాదేశము లిట్లే యగును. ఏతెంచు - ఏతేరుము, ఏతెమ్ము, ఏతేరఁడు, ఏతేఁడు. ]

## 120. చావు నోవులు చచ్చు నొచ్చుల కగు. (బా - కా)

చచ్చు - చావఁడు - చావుము ॥ నొచ్చు - నోవఁడు - నోవుము ॥ వక్ష్యమాణంబు ద్విత్వంబు - నొవ్వఁడు.

వ్యాఖ్య - ముత్తు పరమగునపుడు చచ్చు ధాతువునకు 'చావు' అనియు నొచ్చు ధాతువునకు 'నోవు' అనియు నాదేశ ముగా నగునని సూత్రార్థము.

'చచ్చు' అనుదానికి లజి యందు డుజ్ఞు పరము కాగా 'చావు' అన్న యాదేశము కలుగును. జీత్తు పరముండుటచేత ఉత్వమునకు అత్వమురాగా 'చాఁవడు' అని యగును. ము వర్ణ కము పరమగునపుడు 'చావుము'అని యగును. నొచ్చు ధాతు వున కిట్లే 'నోవు' అన్న యాదేశము కలిగి 'నోవఁడు' అని వ్యతి

రేకార్థమునందు 'నోవుము' అని ప్రార్థనాద్యర్థమునందు రూపము లగును

వక్ష్యమాణంబు ద్విత్వంబు అని యనగా ద్విత్వము ముందు చెప్పబడనున్నది యని యర్థము. "ఊ యేలాదులం దొలియచ్చు మీఁది హల్లునకు ద్విర్వచనం బొండె నగు" నన్న (బా. ప్ర-6) సూత్రమునుబట్టి 'నోవు' అన్నది 'నొవ్వు' అని కావచ్చును. అప్పుడు నొవ్వఁడు, నొవ్వుము - అను విధమగు రూపములుకూడ సిద్ధించును.

**121.** జీత్తు పరంబగునపుడు వాని వు వర్ణంబు విభాషను లోపించు. (బా - కా౫)

చాక - చావక - చాకుము - చావకుము ॥ నోక - నోవక - నోకుము - నోవకుము.

వ్యాఖ్య - వాని వువర్ణము అని యనగా పూర్వసూత్రము చేత కలిగిన చావు నోవులయొక్క వు వర్ణమని యర్థము. జీత్తు పరముగా నున్నప్పుడు చావు నోవులయొక్క వువర్ణమునకు విభాషగా లోప మగునని సూత్రార్థము.

చావు+క అనియున్నపుడు 'వు' లోపింపగా, 'చాక' అని యగును. 'వు' లోపము కలుగనియెడల ఉత్వమున కత్వము కలిగి 'చావక' అని యగును. ఇట్లే తక్కిన వానికిని రెండేసి రూపము లేర్పడును,

సూత్రమునందు జీత్తును మాత్రమే పేర్కొనుటచేత మధ్యమ ము డు జ్జులు పరమగుచున్నప్పుడు వు లోపము లేదని

నిశ్చయము. కావున చావుము, చావుఁడు-అనియే రూపము లుండును.

**122.** అగున కను కనులకు ముజ్జీత్తులు పరంబు లగునపుడు కా నా కానలు విభాష నగు. (బా - ౭౬)

అపదాద్య సూత్రముచే గాకు వకారంబు. వక్ష్యమాణం బౌత్వంబు. కమ్ము - అగుము - అవుము - ఔము॥ కండు - అగుఁడు - అవుఁడు - ఔఁడు॥ నాఁడు - అనఁడు॥ కానఁడు - కనఁడు.

వ్యాఖ్య - ముజ్జు పరమగునపుడు 'అగు' ధాతువునకు 'కా' యని, జీత్తు పరమగునపుడు 'అను' ధాతువునకు 'నా' యని 'కను' ధాతువునకు 'కాన' యని విభాషగా నాదేశము లగునని సూత్రార్థము.

'అగు' అను ధాతువునకు 'ము' పరముకాగా 'కా' యను నాదేశము కలిగి 'కా + ము' అని యగును. "ముజ్జు పరంబగు నపుడు దీర్ఘంబునకు హ్రస్వంబును ము వర్ణకంబునకు మాము డియు నగు" నన్న (బా - 61) సూత్రమునుబట్టి 'కమ్ము' అని యగును. బహువచనమునందు డుజ్జు పరముకాగా 'కా + డుజ్జు' అని యుండి దీర్ఘము హ్రస్వమై 'క + డుజ్జు' అని యగును. జీత్తు బిందుపూర్వం బగును. కావున 'కండు' అని యగును. 'కా' యను నాదేశము వైభాషికము. కావున ఆదేశము రాని పక్షమున అగుము, అగుఁడు అనియే యుండును.

'అను' ధాతువునకు ముజ్జు పరమగునపుడు అనుము, అనుఁడు - అను రూపములు మాత్రమే యుండును; మార్పే

మియు నుండదు. జీత్తు పరమగునపుడు విభాషగా 'నా' యను నాదేశము కలుగును. అను+లజీ+డుజ్జు = నా+డుజ్జు = నాఁడు అనియగును. ఆదేశము కలుగని పక్షమున జీత్తు పరమందుండుట చేత ధాతువుయొక్క ఉత్వమున కత్వము కలిగి 'అనఁడు' అని యగును. ఇట్లే 'కను' ధాతువునకు ఆదేశము కలుగగా 'కానఁడు' అని యగుమ. ఆదేశము కలుగనియెడల 'కనఁడు' అని యుండును.

అపదాద్య సూత్రముచే గాకు వకారంబు. "అపదాద్యం బయి యసంయుక్తంబయిన గకారంబునకు వకారంబు విభాష నగు" నన్న (బా . ఆచ్ఛిక - 27) సూత్రమునుబట్టి అగుఁడు, అగుము - మున్నగుచోట్లగల గాకు వకారము రాగా అవుఁడు, అవుము అని యగును.

"ఆచ్ఛికంబులం దయి యవులకు వక్రతమంబులు బహుళంబుగా నగు" నన్న (బా - 103) సూత్రమునుబట్టి అవునకు ఔ రాగా ఔఁడు, ఔము - అన్న రూపములు కూడ నగును.

[ఔ అన్నది దీర్ఘాక్షరము. కావున "ముజ్జు పరంబగునపుడు దీర్ఘంబునకు హ్రస్వంబును ముపర్ణకంబునకు మామువియు నగు" నన్న నియమమును బట్టి హ్రస్వము రావలయును. 'ఔ' కారమునకు హ్రస్వరూపము లేదు. కావున ఆ సూత్ర మిచ్చట వర్తించుట కవకాశము లేదు.]

**123.** **నేరుచునకు లిడ్లాట్టులు ముత్తుం బరంబులగునపుడు రు చు లకు లోపంబు బహుళంబుగా నగు.**

**(బా - ౫౭౬)**

నేచెను - నేరిచెను॥ నేచును - నేరుచును - నేరఁడు - నేరువఁడు

వ్యాఖ్య - లిట్టును లాట్టును పరంబగునపుడు నేరుచు ధాతువుయొక్క రు వర్ణంబునకును, ముత్తు పరంబగునపుడు నేరుచు ధాతువుయొక్క చు వర్ణంబునకును లోపము బహుళ ముగా నగునని సూత్రార్థము.

'నేరుచు' ధాతువునకు లిట్టు పరమగునపుడు డుజ్ఞున కాదేశముగా 'ఎను' అని యగును. ప్రస్తుత సూత్రముచేత రు వర్ణమునకు లోపము రాగా నేరుచు + ఎను = నేచు + ఎను = నేచెను అని యగును. రు వర్ణమునకు లోపము రానిచో 'నేరిచెను' అని యగును. 'నేరుచు' ధాతువునకు లాట్టు పరమగునపుడు 'ను' వర్ణము కలుగును. అప్పుడును రు వర్ణమునకు లోపము రాగా 'నేచును' అని, రాకున్న 'నేరుచును' అని రూపము లుండును.

ముత్తు పరమగునపుడు నేరుచు ధాతువుయొక్క చు వర్ణమునకు లోపము బహుళముగా కలుగును. 'నేరుచు' నకు లజీ పరమై డుజ్ఞు చేరగా 'నేరుచు + లజీ + డు' అని యుండి చు లోపము కలుగగా నేరు + లజీ + డు అని యగును. జీత్తు పరమందుండుటచే ఉత్వమున కత్వము వచ్చి 'నేరఁడు' అని యగును. చు లోపము కలుగని యెడల 'నేరుచు + లజీ + డు' అని యుండి ఉత్వమున కత్వము కలిగి, పిమ్మట ఆగమాన్య చకారంబులకు పవలగును గావున వత్వము రాగా 'నేరువఁడు' అని యగును.

[ఇంతవరకు నీ లోపములు వికల్పముగానే కలుగుచున్నవి. సూత్రము నందు బహుళమని యనుటచే అన్యములకు నీ కార్యములు క్వాచిత్కముగా కలుగు నన్న సూచనను గ్రహింపవలసి యుండును. 'నేరుచు' నకు లిట్టు పర

మగునపుడు వచ్చు రు వర్ణలోపము భూతార్థకమైన ఇగాగమము పరమగు నపుడును కలుగును. 'నేరుచు' ధాతువునకు క్తవదర్థమునందు 'న' వర్ణకము కలుగగా 'నేరుచు + న' అని యుండును. ఇది భూతార్థక మగుటచే ఇగాగమ మగుము, అప్పుడు రు వర్ణమునకు లోపము కలుగగా నేచు + ఇ + న = నేచిన అని యగును. అట్లే క్త్వార్థమునందును ఇత్వము పరమైనప్పుడు 'నేచి' యని రు వర్ణలోపము కలుగవచ్చును. బహుళపదముచేతనే వీనికి నవకాశము గలుగుచున్నది.]

**124.** పోవునకు దుజ్మ్మత్తులు ముఙ్ఞం బరంబు లగునపుడు వు లోపంబుం బొదపదలును విభాష నగు. (బా - కాం)

పోదురు - పోవుదురు - పోఁడు - పోవఁడు। పోవుము - పొదము - పదము - పొమ్మ్న.

వ్యాఖ్య - పోవునకు దుగాగమము గాని, ముత్తుగాని పరమగునపుడు 'వు' వర్ణమునకు లోపము, ముఙ్ఞ పరమగు నపుడు పొద, పద యను నాదేశములు విభాషగా నగునని సూత్రార్థము.

'పోవు'నకు లాట్టునందు 'రు' వర్ణకము పరము కాగా దుగాగమ మగును. 'పోవు + దు + రు' అని యుండగా ప్రస్తుత సూత్రముచేత వు లోపము కలిగి 'పోదురు' అని యగును. కలుగని పక్షమున 'పోవుదురు' అనియే యుండును. వ్యతిరేకార్థము నందు 'పోవు + లజి + డు' అని యుండి వు లోపము కలుగగా 'పోఁడు' అని యగును. కలుగని పక్షమున జీత్తు పరమగునపుడుత్వమున కత్వ మగుటచేత 'పోవఁడు' అని యగును.

'పోవు' ధాతువునకు మధ్యమ ము వర్ణకము పరము కాగా 'పోవు + ము' అని యుండి వు లోపము కలిగినచో 'పో + ము' అని యుండును. ఇప్పుడు దీర్ఘమునకు హ్రస్వమును ము వర్ణకమునకు మాముడియు కలుగగా 'పొమ్ము' అని యగును. వు లోపము కలుగని యెడల 'పోవుము' అనియే యుండును. ముఱ్ఱు పరమగునపుడు పోవునకు 'పొద' యాదేశము కాగా 'పొదము' అనియు, 'పద' యని యాదేశము కాగా 'పదము' అనియు నగుసు. బహుత్వమునందు డుఱ్ఱు పరము కాగా పోవుఁడు, పొండు, పొదఁడు, పదఁడు - అని యగును.

**125.** అగు పోవుల కడవ్రాల కిద్వ్రక్రంబులు పరంబు లగు నపుడు యకారంబగు. (బా - కా)

వక్ష్యమాణం బైత్వంబు. అయి - ఐ॥ అయిరి - ఐరి॥ పోయి- పోయిరి - పోయెను - పోయెడు.

వ్యాఖ్య - ఇత్వమును, ఎత్వమును పరమగునపుడు అగు, పోవు అను ధాతువులయొక్క తుది యక్షరములకు యకార మాదేశముగా నగునని సూత్రార్థము.

'అగు' ధాతువునకు క్త్వార్థమునందు ఇ వర్ణము కలుగగా అగు + ఇ = అయ్ + ఇ = అయి అని యగును. 'అగు' నకు లిట్టు నందు 'రు' వర్ణకము రాగా 'అగు + రు' అనియుండి "భూతంబునం దిగాగమం బగు" నన్న సూత్రముచేత 'అగు + ఇ + రు' అని యుం డును. ప్రస్తుత సూత్రముచేత గు స్థానమున 'య్' రాగా అయ్ + ఇ + రు = అయి + రు అని యుండి "ఇకారంబుమీఁది

కు ను వు క్రియా విభక్తుల యుత్వంబున కిత్వరి బగు" నన్న (బా. తత్సమ-26) సూత్రమునుబట్టి 'అయిరి' అని యగును.

"అచ్చికంబులం దయి యవులకు వక్రతమంబులు బహుళంబుగా నగు" నన్న రాబోవు (బా - 103) సూత్రముచేత అయి' యన్నది 'ఐ' యనియు, 'అయిరి'యన్నది 'ఐరి'యనియు కావచ్చును.

'పోవు'ధాతువునకును క్త్వార్థకమయిన ఇకారము పరము కాగా పోవు + ఇ = పోయ్ + ఇ = పోయి అని యగును. అట్లే లిట్టునందు రువర్ణము పరమగునపుడు పోవు + ఇ + రు = పోయ్ + ఇ + రు = పోయిరి అని యగును డుజ్ఞున కాదేశముగానైన 'ఎను' పరముకాగా పోవు + ఎను = పోయ్ + ఎను అని యగును. అట్లే తృవర్ణకార్థమునందు ఎడు, ఎడి అన్నవి పరము లగునప్పుడును పై కార్యము జరిగి పోయెడు, పోయెడి అని యగును.

[ఉదాహరణములందు 'అగు' నకు ఎత్వము పరమైన రూపములను చూపలేదు. ఎత్వము పరమైనపుడు ప్రస్తుత సూత్రముచేత యకారము కలుగును; అంతటితో ప్రక్రియ సమాప్తము కాదు. కావున తరువాతి సూత్రముకడ అట్టి లక్ష్యములు చూపబడును. మఱొక విషయము. సూత్రమునందు 'వక్రము' అని ప్రయోగించినను ఎత్వమే మాత్రమే యిచ్చు గ్రహింపబడుచున్నది. ఎ, ఒ, ఓ అను మిగిలిన వక్రములు ధాతువు యొక్క కడ్రవాయికి పరమగుట యెచ్చటను లేదు. కావున వాని ప్రసక్తి లేదు. పోవు + ఏమి మున్నగుచోట్ల 'పోవు' అన్నది వ్యతిరేక మధ్యమ పురుషరూపము. చివరి 'వు' ప్రత్యయము. దానికీకార్యము రాదు. ఇట్లు ఒ ఓలు ను పరము కావచ్చును. కాని ధాతుగతమయిన 'వు' వర్ణము కానందువలన యడాగమము కలుగదు.]

**126** అగునకు వక్రంబు గూడుచో దీర్ఘం బగు.

(బా - ౧౦౦)

వక్ష్యమాణంబు ద్విత్వంబు. ఆయెను - అయ్యెను - ఆయెడు - అయ్యెడు.

వ్యాఖ్య - అగు ధాతువునకు వక్రము పరమగునపుడు దీర్ఘము కలుగునని సూత్రార్థము.

పూర్వ సూత్రమునుబట్టి 'అగు+ఎను' అని యున్నపుడు గు స్థానమున యకారము వచ్చును. 'అయ్+ఎను' అని యగును.

[సూత్రమునందు 'అగు' ధాతువునకు దీర్ఘ మగునని విడిచి పెట్టెను గాని అగు ధాతువుయొక్క తొలి వర్ణమున కని వ్యాకర్త చెప్పలేదు. చెప్ప వలసిన యవసరము లేదు. 'అగు' ధాతువునకు యకారాదేశము కలిగిన పిమ్మట 'అ' యన్నది ఒక్కటే అచ్చు. హ్రస్వదీర్ఘ విభాగము అచ్చులకే యుండును. కావున 'దీర్ఘంబగు' నని యనుటచేతనే అత్వంబునకు దీర్ఘం బగు నన్న భావము కలుగును.]

'అయ్+ఎను' అని కాగా ప్రస్తుతసూత్రము చేత 'అ' వర్ణమునకు దీర్ఘము కలిగి ఆయ్+ఎను=ఆయెను అని యగును. తృవర్ణకార్థమునందు ఎడు, ఎడి అన్నవి పరమైనపుడును అగు+ఎడు=అయ్+ఎడు=ఆయెడు అని యగును. ఇట్లే ఆయెడి అనియు నగును.

వక్ష్యమాణంబు ద్విత్వంబు. ద్విత్వము ఇకముందు చెప్ప బడు నని యర్థము. "ఊయేలాదులం దొలియచ్చు మీఁది వల్లునకు ద్విర్వచనం బొండె నగు" అన్న (బా. ప్ర - ౯) సూత్ర

మును బట్టి 'అయ్యెను' అని యగును. "ద్విరుక్తటం బగు హల్లు పరంబగునపు డాచ్ఛికం బగు దీర్ఘంబునకు హ్రస్వంబగు." నన్న (బా. సమాస - 13) సూత్రమునుబట్టి 'అయ్యెను' అని యగును. ఇట్లే ఆయెదు, ఆయెడి, అయ్యెదు, అయ్యెడి - అను రూపములు కలుగును.

**127. పిలుచు మొదలగువానికి ముత్తు పరంబగునపుడు కడ వ్రాయి బహుళంబుగ లోపించు. (బా - ౧౨౧)**

పిలఁడు- పిలువఁడు- పిలుము- పిలువుము. లేచునకు ముజ్ఞు పరంబగునపుడు చు లోపం బగు. లెమ్ము- లెండు॥ పిలుచు- నిలుచు- తలఁగు॥ ఇత్యాదులు.

వ్యాఖ్య - ముత్తు పరమగునపుడు 'పిలుచు' మున్నగు ధాతువులయొక్క చివరి యక్షరమునకు లోపము బహుళముగా నగునని సూత్రార్థము.

'పిలుచు' నకు లజీ పరమై ప్రథమైక వచనమున డుప్రత్యయము కలుగగా 'చు' లోపమగును. అపుడు 'పిలు + లజీ + డు' అని యుండును. జీత్తు పరమందుండుటచే ఉత్వమున కత్వము కలిగి 'పిలఁడు' అని యగును. చు లోపము రాని పక్షమున 'చ' కారమునకు వకారము కలిగి (బా - 88) 'పిలువఁడు' అని యగును.

మధ్యమ ము వర్ణకము పరమైనపుడు 'పిలుచు + ము' అని యుండి 'చు' లోపింపగా 'పిలుము' అని యగును. లోపము రానియెడల 'పిలువుము' అని వత్వముతోడి రూపము కలుగును.

ఇట్లే 'నిలుచు' ధాతువునకు నిలఁడు, నిలువఁడు, నిలుము, నిలువుము అనియు 'తలఁగు' ధాతువునకు తలఁడు, తలఁగఁడు, తలము, తలఁగుము అనియు రూపను లుండును. పిలుచు, నిలుచు, తలఁగు - మున్నగు వానికి ముజ్జు పరమగునప్పుడును, జీత్తు పరమగునప్పుడును గూడ కడ్రాయికి లోపము వికల్పముగా నగును.

'లేచు' ధాతువునకు ముజ్జు పరమగునపుడు మాత్రమే కడ్రాయికి లోపము కలుగును; నిత్యముగా కలుగును. లేచు + ము - అని యున్నప్పుడు చు లోపము కలిగి 'లే + ము' అని యుండును. ము వర్ణకము పరమందుండుటచేత దీర్ఘమునకు హ్రస్వము కలిగి ము వర్ణకమునకు మూముడి కలుగగా 'లెమ్ము' అని యగును. ఇట్లే బహుత్వమునందు 'లేచు + డుజ్జు' అని యుండి చు లోపము కలిగి 'లే + డుజ్జు' అని యుండును. దీర్ఘమునకు హ్రస్వము కలిగి, జీత్తు పరమందుండుటచేత పూర్ణబిందువు రాగా 'లెండు' అని యగును.

'లేచు' ధాతువునకు జీత్తు పరమగునప్పుడు చు లోపము కలుగదు.

[రమణీయ సమీక్షాకారులు భారత మౌసల పర్వమునందు కజీ పరమగునపుడు 'లేచు' నకు 'చు' లోపము కల ప్రయోగ మున్నదని క్రింది పద్యమును చూపిరి. "ఘనతర బాహుశక్తియును గాండివశక్తియు నస్త్రశక్తియు। న్మనమున నచ్చి యప్డు మునినాథ, కడంగితి నెట్ట కేల క। ధ్ధనువు గుణంబుఁ గూర్చితి నుదగ్రత 'బాహుల 'లేక' యుండె న। స్త్ర నికర మంత్రతంత్రములు సంస్మృతిఁ బొందవ యేమి చెప్పుదున్' అని. ఆ

పిమ్మట "ఇట లేచు ధాతువునకు కజ పరత్వమున చు లోపము రాకున్నచో 'లేక' యను రూపము సిద్ధింపదు. ఇది కలుగు ధాతు వ్యతిరేక రూప మను కొందమన్న పద్యభావము కుదురు పడదు. ఇచట చేతులు లేవలే దనుట పొసఁగును గాని చేతులు లేనే లేవనుట బొత్తిగా పొసంగదు" మున్నగు విధముగా వ్రాసిరి. పై పద్యమునందు 'లేక' యన్నది 'కలుగు' నకు కజ కలుగగా ఏర్పడిన రూపమే. 'లేచు' ధాతువుతో దానిని ముడి పెట్టవలసిన యవసరము లేదు. 'లేక యుండె' అను క్రియకు కర్తృపదము 'బాహులు' కాదు. పూర్వమున్న 'ఉదగ్రత'. ఎట్టకేల కని యన్నప్పుడే 'ఎట్లో కష్ట పడి' యని యర్థము కలుగుచుండగా, మరల 'ఉద్రగత' యన్నది యట నన్వయించుట కుదురదు. విరుద్ధార్థకము. "కష్ట పడి గుణము కూర్చితిని, చేతులలో బలము లేదు; అందువలన శస్త్రములను ప్రయోగింపజాలనైతిని. పోనీ! అస్త్రముల నైనను ప్రయోగింప రాదా! యన్నచో ఆ మంత్ర తంత్ర ములు గుర్తునకు రాలేదు" అన్నది అక్కడి తాత్పర్యము. కావున చేతులు లేనేలేవని కాక, చేతులయందు ఉదగ్రత లేదని యన్వయించుకొనుట సమంజ సము. అప్పుడు కజ పరమగునపుడు లేచు ధాతు చు వర్ణమునకు లోపము కలదని యనుమానింప నక్కరలేదు.]

## 128. లాతిచో సహితము కాదేశాదులు కానంబడియెడి.

(బా - ౧౦౨)

కావుతను - కాతను ॥ అగుట - కావుట ॥ అగుదును ॥ కావు దును ॥ కానను - కావునను ॥ అనదును - అనవుదును - నావుదును ॥ ఇత్యాదు లెఱుంగునది.

వ్యాఖ్య - ముత్తు పరమగునప్పుడే కాక, ఇతరములు పరములగునప్పుడు కూడ 'అగు' మున్నగు ధాతువులకు 'కా' మున్నగు ఆదేశములు ప్రయోగములందు గలవని తాత్పర్యము.

'అగు' ధాతువునకు ద్రుతాంతమయిన తవర్ణము పరము కాగా (బా - 26) 'కావు' అని 'కా' యని యాదేశములు కలిగి 'కావుతను' అని 'కాతను' అని యగును. భావార్థమునందగు టి పరమైనపుడు కూడ ఈ యాగమము కలిగి 'కావుట' అని యగును. టవర్ణము పరమందున్నప్పుడు ఆదేశము కలుగని యెడల 'అగుట' యని యుండును.

ఆనంతర్యార్థకమైన 'డును' పరమగుచో 'అగు' నకు వికల్పముగా 'కావు' అన్న యాదేశము కలిగి 'కావుడును' అని యగును. ఆదేశము రానియెడల 'అగుడును' అని యుండును. 'అను' ధాతువునకు 'డును' పరమైనప్పుడు 'ఆనవు' అన్న యాదేశము కలిగి 'అనవుడును' అను రూపమొకటియు, 'నావు' అన్న యాదేశము కలిగి 'నావుడును' అను రూపమొకటియు నగును. ఆదేశములు కలుగని యెడల 'అనుడును' అనియే యుండును.

[పై లక్ష్యములనుబట్టి చూడగా సూరికి 'తను' అన్నది పరమైనపుడు 'అగు' నకు నిత్యముగా 'కా' యని కాని 'కావు' అని కాని ఆదేశము కలిగితీరవలయునన్న యభిప్రాయము గలదు. 'అగు' ధాతువునకు 'తను' పరమైనపుడు అగుతను, అవుతను, ఔతను - మున్నగు విధముగా ప్రయోగములు ప్రచురముగా కలవు. 'చేయును' మున్నగు లాడ్రూపము పైని ఆశీరాదులందు అనుప్రయుక్తమగునప్పుడు మాత్రము కావుతను, కాతను - అను విధముగానే యుండును. సూరి వాని కట్టి ప్రయోగమునే భావించి యుండును. ఆశీరాద్యర్థములందు అగునకు 'కాక' యను రూపము కూడ ఆదేశముగానై లాడ్రూపమున కనుప్రయుక్తమై 'చేయుంగాక' మున్నగు విధముగా నగును.]

**129.** ఆచ్ఛికంబులం దయి యవులకు వక్రతమంబులు బహు ళంబుగా నగు. (బా - ౧౦౩)

అయిదు - ఐదు ॥ అయిరేని - ఐరేని ॥ అవుడు - ఔవుడు ॥ గవుసెన - గౌసెన ॥

వ్యాఖ్య - ఆచ్ఛిక శబ్దములందలి 'అయి' కి 'ఐ' అనియు 'అవు' నకు 'ఔ' అనియు బహుళముగా నగునని సూత్రార్థము.

'అయిదు' అను పదమునందలి 'అయి' కి బదులుగా 'ఐ' రాగా 'ఐదు' అని యగును. 'అవుడు' అను పదమునందలి 'అవు' నకు బదులుగా 'ఔ' రాగా 'ఔడు' అని యగును. ఇట్లే 'అయిరేని' అనుచోట 'ఐ' అనియు 'గవుసెన' అనుచోట 'గౌ' యనియు మొదట నిల్చును. ఇవి వైకల్ప విధికి ఉదాహరణములు.

బయలు అన్నది 'బైలు' అగుటయు, చవలము 'చౌలము' అగుటయు అన్యత్వమునకు లక్ష్యములు. ఇట్టివింకను గలవు. కావుననే సూత్రమునందు 'బహుళము' అను శబ్దము ప్రయుక్త మైనది.

**130.** కలుగున కర్త్ర్యర్థంబునందు లట్టు పరంబగునపుడు కల యగు. (బా - ౧౦౪)

ప్ర. కలఁడు - కలరు - కలదు - కలవు ॥ మ. కలవు - కలరు ॥ ఉ. కలను - కలము.

వ్యాఖ్య - కలుగు ధాతువునకు అగు, ఉండు, ఓపు, ప్రాప్తించు మున్నగు నర్థములు గలవు. సంస్కృతమునందు అస్తి

అన్నపుడు అయినది, ఉన్నది యని యర్థములు. కావున, 'అగు' అనికాని 'ఉండు' అనికాని అర్థమైనపుడు కలుగు ధాతువునకు 'కల' యను నాదేశము కలుగునని సూత్రార్థము. ఇది వర్తమానార్థమునందగు లట్టు పరమైనపుడు మాత్రమే యగును.

'కలుగు' ధాతువునకు ప్రథమపురుషైకవచన ప్రత్యయమగు డుఙ్జు పరమగునపుడు 'కల' యను నాదేశము కలిగి 'కల + డుఙ్జు' అని యుండి 'కలఁడు' అని యగును. ఇట్లే రు వర్ణము పరమగునప్పుడు 'కలరు' అని, అమహదేకవచనమందు 'కలదు' అని, దానికి బహుత్వమునందు 'కలవు' అని రూపములుండును. ఇట్లే యితర పురుషములందును రూపనిష్పత్తి నూహించుకొన వచ్చును.

ప్రస్తుత సూత్రము 'కలుగు' నకు రావలసిన ఉన్నానుబంధమును, చువర్ణకమును వారించుచున్నది. 'కల' యను నాదేశము కలుగుటచే ఉదంతత్వము తొలగిపోయినది. కావున ఉన్నానుబంధప్రాప్తి లేదు. అందువలన చువర్ణకమును లేకపోయినది. 'కలుగు' నకు 'ప్రాప్తించు' అను నర్థమే యున్నచో కలుగుచున్నాఁడు, కలుగుచున్నారు; కలుగుచున్నది, కలుగుచున్నవి - నున్నగు విధముగానే రూపములుండును.

**131.** తర్థంబునం గలాదేశంబు విభాష నగు. (బా - ౧౦౩)

ఎడి యెడలకు లోపంబిట నిత్యంబు కలవాఁడు-కలుగువాఁడు.

వ్యాఖ్య - అస్త్యర్థకమైన కలుగునకు తృవర్ణకార్థమునందు 'కల' యను నాదేశము విభాషగా నగునని సూత్రార్థము.

'కలుగు' నకు తృవర్ణకార్థమునందు 'కల' యను నాదేశము కలుగగా కలుగు + వాఁడు = కలవాఁడు అని యగును. ఆదేశము కలుగనియెడల 'కలుగువాఁడు' అనియే యుండును. ఆదేశము కలిగినప్పుడు పూర్వసూత్రము (బా - 44) చేత రావలసిన ఎడి, ఎడు అను ప్రత్యయములకు నిత్యముగా లోపము కలుగును. ఆదేశము రానియెడల 'ఎడి' యని ప్రత్యయము కలిగి 'కలిగెడివాఁడు' అని 'ఎడు' అను ప్రత్యయము కలిగి 'కలిగెడు వాఁడు' అనియు కూడు రూపములుండును.

**132.** అస్త్యర్థంబునకు లజీ మి క ని వడి వర్ణకంబులు పరంబులగునపుడు లే యగు. (బా - ౧౦౬)

ప్ర. లేఁడు - లేరు - లేదు - లేవు ॥ మ. లేవు - లేరు ॥ ఉ. లేను - లేము ॥ లేమి - లేక - లేని - లేవడి.

వ్యాఖ్య - అస్త్యర్థము అని యనగా కలుగు ధాతువని భావము. కలుగు ధాతువునకు వ్యతిరేకార్థమునందగు లజీ, మి, క, ని, వడి యను ప్రత్యయములు పరములగునపుడు 'లే' యను నాదేశము కలుగునవి సూత్రార్థము.

వ్యతిరేకంబున లజీ యగు (బా - 7). కలుగు ధాతువునకు వ్యతిరేకార్థమున ప్రథమపురుషయందు డుజ్ఞు పరము కాగా కలుగు + లజీ + డుజ్ఞు అని యుండును. ప్రస్తుత సూత్రముచేత 'లే' యను నాదేశము కలుగగా 'లేఁడు' అని యగును. ఇట్లే రు పరమైనపుడు 'లేరు' అనియు అమహదర్థమునందు దు వులు పరమైనపుడు 'లేదు' 'లేవు' అనియు నగును. మధ్యమ పురుష

మున ఏకవచన ప్రత్యయము 'వు'. కలుగు + లజీ + వు - అని యుండగా ప్రస్తుత సూత్రముచేత 'లే' యన్న యాదేశము కలిగి 'లేవు' అని యగును. బహువచన ప్రత్యయమగు రు పరమై నపుడు 'లేరు' అని యగును. ఉత్తమపురుషమున ఏకవచన ప్రత్యయమగు ను పరమైనవుడు 'లేను' అని బహువచన ప్రత్యయమైన ము పరమైనపుడు 'లేము' అనియు రూపము లగును.

[కలుగు అన్నది ప్రాప్త్యర్థమైనపుడు కలుగఁడు, కలుగరు, కలుగవు, కలుగరు, కలుగను, కలుగము అను విధముగానే యుండును.]

వ్యతిరేక భావంబున మిజీ యగు (బా - 32). కలుగుట యను దానికి వ్యతిరేకరూపముగా 'కలుగు + మి' అని యుండి 'లే' యను నాదేశము కలిగి 'లేమి' అని యగును.

[ప్రాప్త్యర్థమునందు కలుగమి అనియే యుండును.]

కజీ వ్యతిరేకక్త్వార్థంబునం దగు (బా - 39). కలిగి యన్నది క్త్వార్థకము. దీనికి వ్యతిరేకరూపముగా 'కలుగు + క' అని యుండి 'లే' యను నాదేశము కలుగగా 'లేక' యని యగును.

[ప్రాప్త్యర్థమునందు కలుగక అనియే యుండును.]

వ్యతిరేక తృవర్ణకార్థంబున నిజీ యగు (బా - 47). తృవర్ణకార్థమునందు కలవాఁడు, కలుగువాఁడు - మున్నగు రూపము లుండును. వీనికి వ్యతిరేకరూపముగా 'కలుగు + ని అనియుండి 'లే' యను నాదేశము కలుగగా 'లేని' అని యగును.

[ప్రాప్తిని చెప్పునపుడు 'కలుగని' అనియే యగును.]

వడి యన్నది వ్యతిరేకమునం దగు కృదంత ప్రత్యయము. ఇది 'కలుగు'నకు పరమైనపుడు కలుగు + వడి = లేవడి అని యగును.

[ప్రాప్తిని చెప్పునప్పుడు కలుగు ధాతువునకు వ్యతిరేకార్థమునందు కృదంత ప్రత్యయమైన 'వడి' కలుగదు. సూత్రమునందు మిజి, కజి, నిజి యను ప్రత్యయములకు బదులుగా మి, క, ని - అని వాడుట జరిగెను. నిజమున కివియే ప్రత్యయములు. 'జి' యన్నది ఇత్సంజ్ఞ మాత్రమే. 'కలుగు' నకు 'లే' యను రూపము కలిగినపిమ్మట 'జిత్తు' యొక్క పని తీరి నట్లే. కావుననే సూరి కేవల ప్రత్యయములనే సూత్రమునందు నిరూపించెను. ఇంకొక విషయము. ఇవన్నియు వ్యతిరేకమునం దగు ప్రత్యయములే. కావున సూత్రమున 'వ్యతిరేకమునందు' అని చెప్పి యున్నింటిని తొలగించిన బాగుండునని యనిపించును. కాని అట్లు చెప్పినయెడల నొక చిక్కు తటస్థించును. వ్యతిరేకార్థమున మధ్యమ ముడుజ్జులు పరమగునపుడు 'లే' యను నాదేశము కలుగరాదు. కలుగకుము, కలుగకుఁడు - అనియే రూపము లుండవలయును. అట్టియెడల సైతము అనిష్టరూపప్రాప్తి కలుగును. కావున సూరి స్పష్టప్రతిపత్తికై యిట్లు రచించెను. అట్టి చిక్కులేని చోట 'వ్యతిరేకంబునందు' అని సామూహికముగానే వాడును. రామన్న సూత్రమే నిదర్శనము.]

## 133. వ్యతిరేకంబునందు వలచున కొల్ల విభాష నగు.

(బా - ౧౦౭)

ప్ర. ఒల్లఁడు - ఒల్లరు - ఒల్లదు - ఒల్లవు॥ మ. ఒల్లవు - ఒల్లరు॥ ఉ. ఒల్లను - ఒల్లము॥ ఒల్లమి - ఒల్లక - ఒల్లని॥ పక్షంబున వలవఁడిత్యాది. ఒల్లమి కొల్లఁబాటని ప్రయోగంబులం గానంబడియెడి.

వ్యాఖ్య - వ్యతిరేకార్థమునందు 'వలచు' అను ధాతువునకు ఆదేశముగా 'ఒల్ల' యనునది విభాషగా నగునని సూత్రార్థము.

వ్యతిరేక క్రియలకు అన్ని పురుషల యందును 'ఒల్ల' యను నాదేశము కలుగగా ఒల్లఁడు, ఒల్లరు - మున్నగు రూపము లగును. మిఱి మున్నగునవి పరమగునప్పుడుకూడ ఆదేశము వచ్చి ఒల్లమి, ఒల్లక, ఒల్లని మున్నగు విధముగా నగును. ఇది విభాషగా నగునని యనుట చేత 'ఒల్ల' యను నాదేశము రాని పక్షమున వలవఁడు, వలవరు, వలవదు, వలవవు॥ వలవవు, వలవరు॥ వలవను, వలవము॥ వలవమి, వలవక, వలవని - అనియు రూపము లుండును.

'ఒల్లమి' అను రూపమునకు అదే యర్థమున పాటు పర మగునపుడు 'మి' వర్ణమునకు లోపమును, నుగాగమమును గలిగి 'ఒల్లఁబాటు' అని యగును. ఇక్కడ 'ఒల్ల' యనునది నిత్య ముగా నగును.

మధ్యమ ముడుఙ్లులు పరమగునప్పుడును 'ఒల్ల' యను నాదేశము వికల్పముగా కలుగును. అప్పుడు ఒల్లకుము, వలవ కుము; ఒల్లకుఁడు, వలవకుఁడు - అను రూపములు కలుగును.

**134.** చువర్ణంబుతోడ దుగ్ధకారంబు తకారం బగు.

(బా - ౧౦౮)

నిలుతురు - పిలుతురు - అడఁతురు - కడతురు - చింతురు - పెంతురు - ఎచింతురు - పచింతురు॥ చేతురు కోతు రిత్యాదు లసాధువు లని యెఱుంగునది.

వ్యాఖ్య - ధాతువునకు పరమందున్న చు వర్ణముతో కలిసి దుగాగమముయొక్క దకారము తకారముగా మారునని సూత్రార్థము.

నిలుచు + దురు - ఇచ్చట లాట్టు రుణ్ణు పరమగునపుడు దుగాగమము (బా - 22) కలుగగా, ప్రస్తుత సూత్రముచేత 'త' కారము కలుగవలయును. 'దు' అనగా 'ద్ + ఉ' అని విభాగము. 'చు + ద్' అన్నవి 'త్' అనినై 'దు' అను నక్షర మున శేషించియున్న 'ఉ' ను కలుపుకొని 'తు' అని యగును.

అప్పుడు 'నిలుతురు' అని యగును ఇట్టే తక్కిన రూప ములు నేర్పడును.

['ఆగమ చకారంబునకు' అని మొదలయిన (బా - 90, సూత్రము చేత అడఁపుదురు, కడపుదురు, చింపుదురు, పెంపుదురు, పచింపుదురు, వచిం పుదురు - అను పాదేశముతోడి రూపములు కలుగును. అట్టు పాదేశము రాని సమయములందు తకారాదేశము నిత్యముగా నగును. నిలుచు పిలుచు అనుచోటి చకారము ఆంగికము: కావున దీనికి పాదేశము లేదు. అందువలన నిలుతురు పిలుతురు - అని నిత్యముగా నగును.]

చేయు, కోయు మున్నగు యకారాంత ధాతువులకు దుగాగమము కలుగగా చేయుదురు, కోయుదురు అను విధ ముగా రూపము లుండును. కొందరు చేతురు, కోతురు అని ప్రయోగించి యుండుటచేత, వాని నసాధువులని సూరి తిరస్క రించుచున్నాడు. యు వర్ణముతోడి దకారమునకు తకారమగుట యంగీకార్యము కాదు.

**135. పడుజీ కొను లొకానొకచో స్వార్థంబునం దనుప్రయుక్తంబు లగు. (బా - ౧౦౫)**

చొచ్చు - చొరఁబడు ॥ నిలుచు - నిలువఁబడు ॥ కూడు - కూడఁబడు ॥ పండు - పండుకొను.

వ్యాఖ్య - పడు, కొను అన్న యనుబంధ ధాతువులు ధాతువులకు స్వార్థమునందే కొన్ని యెడల చేరునని సూత్రార్థము. 'పడుజీ' యన్నది కర్మార్థమునందు వచ్చునని (బా - 49), 'కొను' అన్నది ఆత్మనేపదార్థమునందు వచ్చునని (బా - 52) పూర్వము ప్రసక్తమైనవి. అవి సాధారణ నియమములు. విశేషముగా కొన్ని ధాతువులకు స్వార్థమునందే పడుజీ కొనులు పరము లగుచున్నవి. కావున, వాని నిక్కడ ప్రదర్శించుచున్నాడు.

చొచ్చు + పడుజీ - అని యుండగా జీత్తు పరమందుండుట చేత (బా - 91) 'చొరు' అని యాదేశము కలుగును; ధాతువు యొక్క ఉత్వమునకు అత్వము (బా - 20) కలుగును.

"కలజీ పడుజ్జులు పరంబులగు నపుడు నుగాగమం బగు" నన్న (బా - 21) సూత్రముచేత చొర + ను + పడు = చొరఁబడు అని యగును. 'చొచ్చు' అనుదాని కేయర్థము గలదో 'చొరఁబడు' అను దానికి నదియే యర్థము.

'నిలుచు' ధాతువునకు 'పడుజీ' పరము కాగా, చకారమునకు వకారము (భా - 88) కాగా నిలువు + పడుజీ అని యుండును. పైని చెప్పిన రీతిగా అత్వము కలిగి నుగాగమము కలు

గగా 'నిలువఁబడు' అని యగును. 'నిలుచు' అన్నప్పు డున్న యర్థమే 'నిలువఁబడు' అని యున్నప్పుడును కలదు.

["పిలుచు మొదలగు వానికి" అని మొదలయిన (బా - 101) సూత్రముమబట్టి ముత్తు పరమగునప్పుడు 'చు' లోపింపగా నిలు + పడుజీ అని యుండి అత్వమును, నుగాగమమును బొంది 'నిలఁబడు' అనియు నగును.]

'కూడు' ధాతువునకు పడుజీ పరమైనపు డత్వమును, నుగాగమమును కలుగగా 'కూడఁబడు' అని యగును. 'కూడు' అని యనగా 'సమావేశమగు' అని యర్థము. 'కూడఁబడు' అని యన్నప్పుడు నిదే యర్థము. "ఇత్తెఱఁగున సభలోపలఁ దత్తఱమునఁ గూడఁబడిన దర్పితసామంతోత్తములలోన వివదుఁడు మత్తద్విపలీల మనసు మండ నిటు లనున్." అని ఉత్తర హరివంశమందలి ప్రయోగము. 'కూడఁబడిన' అని యనగా 'కూడిన' అనియే యర్థము.

[కూడు అని యనగా తగు, పొందు అని యర్థములైనప్పుడు పయి కార్యము జరుగదు. ఈపని కూడును - మున్నగు విధముగా నుండును. అంకెలు కూడఁబడవు - మున్నగుచోట కర్మార్థమే కలదు.]

'పండు' ధాతువునకు 'కొను' అనుప్రయుక్తమై 'పండుకొను' అని యగును. రెండింటికి నొకటే యర్థము.

సూత్రమున 'నొకా నొకచో' నని యనుటచేత ప్రయోగములనుబట్టి యిట్టివానిని గ్రహింపవలయును.

**136. తెంచు ధాతు వగ్వాదుల కనుప్రయుక్తం బగు; నగుచో నుత్వంబు పయిని దాని తకారంబు దకారం బగు.**

**(బా - ౧౧౦)**

అగుదెంచు - నెగయుదెంచు - పోవుదెంచు॥ అగు - నెగయు - పోవు - చొచ్చు - పుచ్చు - తోఁచు - నడచు - పఱచు - మొలచు - వీచు॥ ఇత్యాదులు.

వ్యాఖ్య - అగు మున్నగు ధాతువులకు తెంచు ధాతువను ప్రయుక్తమగును. అప్పుడు ఉకారమునకు పరమందున్న తెంచు ధాతువుయొక్క తకారమునకు దకార మగును.

[సూత్రమునందు 'తెంచు' అన్నది యేయర్థమునందు వచ్చునో తెలుపబడలేదు. అయినను ప్రసంగమునుబట్టి పూర్వసూత్రమునందలి 'స్వార్థంబునందు' అను దానినే యన్వయించుకొనవలయును.]

'అగు + తెంచు' అని యుండగా ఉత్వము మీది దగుటచేత 'తె' యన్నది 'దె' యని మారును. అప్పుడు 'అగుదెంచు' అని యగును. నెగయుదెంచు, పోవుదెంచు - అన్నవి కూడ ఇట్టివే.

['చొచ్చు' మున్నగువానికి 'తెంచు' పరమగునప్పుడు ప్రక్రియా విశేషము కలదు. అది తరువాతి (బా - 112) సూత్రమునందు చూపబడును. కావుననే లక్ష్యముల నిట చూపుట లేదు.]

**137. అభ్యాగతి నరుగ్వాదుల కయ్యది యనుప్రయుక్తంబగు; నగుచో గువర్ణంబు విభాషను లోపించు. (బా - ౧౧౧)**

అరుదెంచు - అరుగుదెంచు ॥ ఏతెంచు - ఏగుదెంచు ॥ చనుదెంచు.

వ్యాఖ్య - 'వచ్చు' అను నర్థమున 'అరుగు' మున్నగువానికి 'తెంచు' ధాతు వనుప్రయుక్త మగును. అప్పుడు గు వర్ణము విభాషగా లోపించును - అని సూత్రార్థము.

'అరుగు' అని యనగా 'పోవు' అని యర్థము. 'తెంచు' ధాతు వనుప్రయుక్తమైనపుడు 'వచ్చు' అన్న యర్థము కలుగును. 'అరుగు + తెంచు' అని యుండగా 'గు' వర్ణము వికల్పముగా లోపించును. అప్పుడు అరు + తెంచు అని యుండును. ఉత్వముమీది తకారమునకు దకారము కలిగి 'అరుదెంచు' అని యగును. గులోపము కలుగని పక్షమున 'అరుగుదెంచు' అని యుండును.

'ఏగు' అని యనగా 'పోవు' అని యర్థము. 'వచ్చు' అను నర్థమున 'తెంచు' పరమగును. అప్పుడు గు వర్ణమునకు లోపమురాగా ఏ + తెంచు = ఏతెంచు అని యగును. 'తె' వర్ణమునకు పూర్వము ఉత్వము లేనందువలన దకారాదేశము కలుగలేదు. గువర్ణము లోపింపని పక్షమున 'ఏగు + తెంచు' అని యుండి తకారము దకారమై 'ఏగుదెంచు' అని యగును.

'చను' ధాతువునకును 'వెళ్లు' అనియే యర్థము. 'తెంచు' అనుప్రయుక్తము కాగా 'వచ్చు' అను నర్థమును పొందును. అప్పుడు చను + తెంచు అనియుండి ఉత్వముమీది తకారము దకారము కాగా 'చనుదెంచు' అని యగును.

**138. అయ్యాది పరంబగునపుడు చువర్ణంబు లోపించు.**

**(బా - ౧౧౨)**

చొచ్చు - చొత్తెంచు॥ పుచ్చు - పుత్తెంచు॥ తోఁచు - తోఁతెంచు.

వ్యాఖ్య - 'తెంచు' ధాతువనుప్రయుక్తమగునపుడు ధాతువు తుదనున్న 'చు' వరమునకు లోపము కలుగునని సూత్రార్థము.

[ నడుమ అర్థవిశేషముగల అరుగ్వాదులను గూర్చి చెప్పి మరల అగ్వాదులోనివే యయిన 'చొచ్చు' మున్నగు వానినిగూర్చి వ్యాకర్త తెలుపుచున్నాడు. కావున ఇచ్చట 'తెంచు' స్వార్థమునందే యగుచున్నదని గ్రహింపవలయును. ]

చొచ్చు + తెంచు అని యున్నప్పుడు చు వర్ణము లోపింపగా చొచ్ + తెంచు అని యుండును. చకారము తకార సన్నికర్ష వలన తకారముగా మారును. అపుడు 'చొత్తెంచు' అని యగును.

పుచ్చు ధాతువునకు తెంచు పరమగునపుడు చులోపము కలుగగా పుచ్ + తెంచు = పుత్తెంచు అని యగును. ఇచ్చట 'పు' అని ఉత్వమే యున్నది. కావున 'తెంచు' అన్నది 'దెంచు' కావలసి యుండునన్న భ్రాంతి కలుగును. సూత్రము నందు 'ఉత్వముపయిని దాని తకారంబు' అని వాడుట గుర్తింప వలయును. ఉత్వము పయిని తెంచు ధాతువు తకారమున్నప్పుడే యీ మార్పు జరుగును. ఇచ్చట పువర్ణమునకును తెంచు ధాతువునకును నడుమ చకారదేశమయిన తకారమున్నది. కావున దకారము రాదు.

తోఁచు + తెంచు అని యున్నపుడు చు వర్ణము లోపింపగా తోఁతెంచు అని యగును. ఇట్లే నడతెంచు, పఱతెంచు, మొలతెంచు, వీతెంచు - మున్నగు రూపము లేర్పడును.

**139.** అద్దానికి ముత్తు పరంబగునపుడు తే తేరు లగు.
(బా - ౧౧౩)

అగుదేఁడు - అగుదేరఁడు - అగుదెమ్ము - అగుదేరుము.

వ్యాఖ్య - అనుప్రయుక్త మయిన తెంచు ధాతువునకు ముత్తు పరమగునపు డాదేశముగా 'తే' యని 'తేరు' అని యగు నని సూత్రార్థము.

అగుదెంచు + కజీ + డుఙ్లు - అని యున్నపుడు తెంచు స్థానమున 'తే' యని రాగా 'అగుదేఁడు' అని యగును; 'తేరు' అని రాగా 'అగుదేరఁడు' అని యగును. మధ్యమ ము వర్ణకము పరమగునపుడు 'తే' యను నాదేశము రాగా అగుదే + ము అని యుండి దీర్ఘమునకు హ్రస్వమును, ము వర్ణకమునకు మాముడియు రాగా 'అగుదెమ్ము' అని యగును. 'తేరు' అను నాదేశము రాగా 'అగుదేరుము' అని యగును.

ఇట్లే పుత్తెంచు మున్నగు వానికి పుత్తేఁడు, పుత్తేరఁడు, పుత్తెమ్ము, పుత్తేరుము - మున్నగు విధముగా రూపము లగును.

**140.** భూతంబున లజీకి లిడంతం బగు నగు ధాతువనుప్రయుక్తం బగు. (బా - ౧౧౪)

వాఁడు రాఁడయ్యెను - వారు రారయిరి - అది రాదయ్యెను - అవి రావయ్యెను॥ నీవు రావయితివి - మీరు రారయితిరి॥ నేను రానయితిని - మేము రామయితిమి.

వ్యాఖ్య - భూతకాలమునందు వ్యతిరేకార్థమునకు లిట్టు వర్ణక మంతమందుగల అగుధాతు వనుప్రయుక్తమగునని సూత్రార్థము.

'వచ్చు' ధాతువునకు లజీ పరమగునపుడు ప్రథమైక వచనమునందు డుజ్జగును. వచ్చు + లజీ + డుజ్జు అని యుండగా వచ్చునకు 'రా' ఆదేశమై 'రాఁడు' అని యగును. ఇది ప్రత్యేకముగా ఏయొక్క కాలమును బోధింపదు. దీనికి భూతకాలమునందు నిశ్చితమైన ప్రయోగము కలుగుటకు లిడంతమైన అగు ధాతువు నను ప్రయుక్తము గావింపవలయును.

లిట్ ప్రథమపురుషైకవచనము నందు 'ఎను' అని యగును (బా - 16). అగు + ఎను - అని యుండగా కడ వ్రాయికి యకారము (బా - 99) కలిగి అయ్ + ఎను అని యగును. అపుడు వక్రము కూడుటచేత అత్వమునకు దీర్ఘము (బా - 100) కలిగి 'ఆయెను' అని యగును. దీని యకారమునకు ద్విత్వము (బా. ప్ర - 6) కలిగి దీర్ఘమునకు హ్రస్వము కలుగగా (బా. సమాస - 13) అయ్యెను అని యగును. ప్రథమైకవచన వ్యతిరేకరూపమగు 'రాఁడు' అనుదానికి 'అయ్యెను' అనుప్రయుక్తమై 'రాఁడయ్యెను' అని యగును. ఇది భూతకాలిక వ్యతిరేకక్రియ.

బహువచనమునందు 'రారు' అన్నది వ్యతిరేకక్రియ. దీనికి 'అగు' ధాతువుయొక్క ప్రథమపురుష బహువచన లిడంతక్రియ యగు 'అయిరి' అనుప్రయుక్తమై 'రారయిరి' అని యగును.

ఇట్లే మధ్యమపురుషయందు రావయితివి, రారయితిరి అనియు ఉత్తమపురుషయందు రానయితిని, రామయితిమి అనియు రూపములగును.

[ ఇచ్చట 'అయి' కి వక్రతమము కలిగి రారైరి, రావైతివి, రావైతిరి, రానైతిని, రామైతిమి అనియు రూపము లుండవచ్చును. ]

**141.** నుఙ్యంతంబగు నగు ధాతువు క్రియావిశేషణంబుల కనుప్రయుక్తం బగు; నుఙికి విభాష నగు.

(బా - ౧౧౫)

కాను - అనునది నుఙ్యంతంబగు నగు ధాతుపురూపంబు.

వ్యాఖ్య - అగు ధాతువుయొక్క నుఙ్యంతరూపమగు 'కాను' అన్నది క్రియావిశేషణముల కనుప్రయుక్త మగును; నుఙ్యంతములకు విభాషగా ననుప్రయుక్త మగును. అని సూత్రార్థము.

[ ఉదాహరణములు తరువాతి సూత్రముకడ చూపబడును. ]

**142.** దానికి హ్రస్వంబు విభాష నగు. (బా - ౧౧౬)

లెస్సగాను - లెస్సగను॥ న్యాయ్యముగాను - న్యాయ్యముగను॥ ఇట సరళంబు నిత్యంబు. చూడఁగాను - చూడఁగను - చూడను ॥ ఇట స్వత్వంబు లేదు

వ్యాఖ్య - క్రియావిశేషణములకును, నుఙ్యంతము లయిన క్రియలకును అనుప్రయుక్త మగు 'కాను' యొక్క దీర్ఘమునకు హ్రాసము విభాషగా నగునని సూత్రార్థము.

లెస్స యనునది క్రియావిశేషణము; దీనికి 'కాను' అన్నది అనుప్రయుక్తమై 'లెస్స + కాను' అని యగును. క కారమునకు గకారము నిత్యముగా నగు ననుటచేత 'లెస్సగాను' అని యగును. ప్రస్తుత సూత్రముచేత దీర్ఘమునకు హ్రస్వము కలుగగా 'లెస్సగను' అని యగును. ఈ కార్యము విభాషగా నగును. కావున హ్రస్వము రానియెడల 'లెస్సగాను' అనియు నుండవచ్చును ఇట్లే 'న్యాయ్యము' అను క్రియా విశేషణమునకు 'కాను' అన్నది అనుప్రయుక్తమై సరళాదేశము వలన'న్యాయ్యము గాను' అని యగును. హ్రస్వము వచ్చిన పక్షమున 'న్యాయ్యము గను' అని యగును.

'చూడను' అన్నది నుజ్యంత రూపము. 'చూచు' ధాతువునకు తుమర్థమునందును, భావలక్షణమునందును నుజీ (బా - 40) యగును. చూచు + నుజీ - అని యుండగా జీత్తు పరమందుండుటచే 'చూడు' అను నాదేశమును, ఉత్వమున కత్వమును రాగా 'చూడను' అని యగును. దీనికి 'కాను' అన్నది అనుప్రయుక్తము కాగా చూడను + కాను చూడఁగాను; చూడంగాను అని యగును. ఇచ్చట ద్రుతమునకు స్వత్వము కలుగరాదు. ప్రస్తుత సూత్రముచేత 'కాను' యొక్క దీర్ఘమునకు హ్రస్వము కలుగగా చూడఁగను; చూడంగను - అనియు నుండును. విభాష యని యనుటచేత 'కాను' అన్నది లేకుండ నుజ్యంతము ప్రయోగింపబడ వచ్చును. 'చూడను' అని యున్నను తుమర్థ భావ లక్షణములు బోధింపబడును.

**143. అప్రత్యయాంతమగు నగు ధాతువు కొన్నియెడలఁ బెక్కుచోట్ల కొక్కటియు నగు. (ప్రౌ - ౩౦)**

ధర్మజుఁడు తూర్పు భీముఁడు దక్షిణంబు। నర్జునుఁడు పడమరఁ గవ లర్థి నుత్తరంబుగా వేటఁబోయిరి రాజముఖ్యు। లనఘు లింతకు వత్తురు వినుతబలులు॥ భార. ఆర. ౬౫॥ పక్షమునఁ దూర్పుగ, దక్షిణంబుగ, పడమరగ ననియు నుండవచ్చును.

వ్యాఖ్య - 'కాను' అను నుజ్యంతమగు నగు ధాతువు కొన్నిచోట్ల పెక్కుచోట్లకు బదులుగా ఒక్కచోటనే యగునని సూత్రార్థము.

ధర్మజుఁడు తూర్పుగా, భీముఁడు దక్షిణంబుగా, అర్జునుఁడు పడమరగా, కవ లుత్తరంబుగా వేట వోయిరి - అని యుండవలసి యుండగా, కడపటి విశేషణమునకు మాత్రమే 'కాను' అన్నది అనుప్రయుక్తమైనది. 'కొన్నియెడల' నని యనుటచేత నిట్టిప్రయోగములు విరళముగా నుండునని వ్యాకర్తయే తెలుపుచున్నాడు.

[ వ్యాకర్త 'ఒక్కటియు' అని యనుటయే కాని స్థాననిర్దేశము చేయలేదు. ఇట్లు ఒక్కచోటనే 'కాను' అన్నది అనుప్రయుక్తమగుచో కడపటి విశేషణమున కనుప్రయుక్తమగును. ఆసంగతిని సూత్రమునందు చెప్పియుండిన సమంజసముగా నుండెడిది. ]

నుజ్యంతములయిన ధాతువులను ప్రౌఢవ్యాకరణ కారుడు అన్నంత క్రియలుగా పేర్కొనును. 'చేయన్' మున్నగు నుజ్యంతములకు చివర 'అన్' అనునదియే ధాతువునకు చివర నుండుటచే అదియు సమంజసముగానే తోచును.

## 144. క్రియా విధేయవిశేషణంబులమీఁది యగు ధాతువున కన్నంతమునకు లోపంబు విభాష నగు. (ప్రౌ - ౨౨)

క్రియావిశేషణములకు - పెల్లు దొరఁగు నెత్తురునై॥ భా.ర. భీష్మ ౧ఆ॥ సౌందర్యవిలాసాదుల। యందునె తగులువడి యితర మర యని మగవాఁరుందఱచుగఁ గలర॥ కళా. ౭ఆ॥ తెల్లము నాకెఱిగింపుము॥ వి. పు. ౨ఆ॥

విధేయవిశేషణములకు - లవణంబు కప్ప మడుగుము॥ ఉ. హరి. ౪ఆ॥ తగువస్తువు లప్పన మంపువారు॥ కళా. ౮ఆ॥ వరుని ప్రేమనడుమఁ దెరవాటు గొల్పె॥ కళా. ౭ఆ॥ భవజ్జనకుఁ బరీక్షితున్ భుజగజాల్మఁ డసహ్య విషోగ్ర ధూమకేతన హతిఁ జేసె నతిదాంతుఁ గృతాంతని కేతనాతిథిన్॥ భార. ఆది. ౧ఆ॥ పక్షమున - పెల్లుగ దొరఁగు; కప్పముగ నడుగుము; కృతాంత నికేతనాతిథిగ॥ మొ॥ మంత్రులఁగా నొనరించితె॥ భార. సభా. ౧ఆ॥ మొ.

వ్యాఖ్య - క్రియావిశేషణములమీదను, విధేయ విశేషణ ముల మీదను వచ్చు 'కాను' నకు విభాషగా లోప మగునని సూత్రార్థము.

'పెల్లు' అన్నది తొరగు అన్న క్రియకు విశేషణము. కావున 'కాను'అన్నది అనుప్రయుక్తమై పరుషము సరళము కాఁగా (శా - 115) పెల్లుగాను అని యగును. ప్రస్తుత సూత్రము చేత 'కాను'నకు విభాషగా లోపము కలిగి 'పెల్లు' అనియే యగు చున్నది. ఇట్లే 'తఱచుగా' ననుటకు 'తఱచు' అనియు, తెల్ల ముగా ననుటకు తెల్లము అనియు ప్రయోగములు గలవు. ఇవి యన్నియు క్రియా విశేషణముల కనుప్రయుక్తమైన కానునకు

లోపము గలిగిన రూపములు. లోపము రానియెడల 'పెల్లుగా' మున్నగు విధముగానే యుండును.

లవణంబు కప్ప మడుగుము - అన్నచోట అడుగుము అను క్రియయొక్క ప్రకారమును దెల్పునది 'కప్పము' అన్నది. కావున, ఇది క్రియావిశేషణమే. కాని 'లవణము' అను విశేష్యమునకు విధేయమగు విశేషణముగాకూడ వ్యవహరించు చున్నది. ఇది విధేయ విశేషణమే యైనను క్రియాన్వయమును గూడ కలిగియుండుటచేత 'కాను' అన్నది అనుప్రయుక్తమగును. 'కప్పముగాను' అన్న రూపము సిద్ధించును. ప్రస్తుత సూత్రముచేత 'కాను'నకు లోపము కలిగి 'కప్ప మడుగుము' అనియే యైనది. ఇట్లే 'అప్పనముగా, తెరవాటుగా - అను చోట్ల 'కాను' అను నుజ్యంతమునకు లోపము కలిగినది.

'కృతాంత నికేతనాతిథింగా' అన్నది విశేషరూపము. 'కాను' అన్నది పైనన్నిచోట్ల ప్రథమాంతమునకే యనుప్రయుక్తమయినది. ఇచ్చట మాత్రము విశేష్యమున కనుగుణముగా నేర్పడిన ద్వితీయాంత రూపమున కనుప్రయుక్తమయ్యెను. అట్టిదే చివర నిచ్చిన 'మంత్రులఁగా నొనగించితె' అన్న యుదాహరణము కూడ. ఇచ్చటను 'కాను' నకు లోపము కలుగవచ్చును.

బాలవ్యాకరణమునందు "... క్రియావిశేషణంబుల కనుప్రయుక్తంబగు ..." అని (బా - 115) యున్నది. దానినిబట్టి సాధారణముగా ననుప్రయుక్తమగుచుండు నని, కాని చోట్లు కూడ కొలదిగా నుండుననియు స్పష్టమగుచున్నది. "నుజీకి విభాష

నగు" అని వికల్పమును గాక విభాషను దెలుపుటచేత, నుజ్యంత ములకే కాక యితరములకు కొన్నింటికి కావచ్చునన్న స్ఫురణము కూడ కలుగుచున్నది. కావున ప్రస్తుత సూత్రమును బాల వ్యాకరణమునకు వివరణముగా గ్రహింపవలయును.

**145.** ఒకానొకచో నన్నంతమగు నగుధాతువు దీర్ఘంబునకు భావ్యర్థంబున నున్న పరంబగునపుడు హ్రస్వమును గానంబడియెడి. (ప్రౌ - ౨౭)

తరుణీ ! యేరికిఁ జెల్లునె, యరయ్యఁగ నేమింతవార మన కొన నిదిగో। పిరువీఁకుగనున్నది తాఁగర మన్నుత మైన సవతి కయ్యముచేతన్ (కనున్నది = కానున్నది యని యర్థము. పిరువీఁకు కర్త)॥ కళా. ౧౭॥ నీకు నాథుఁడుగనున్న మహామహు నాన్నపాలు నాకెప్పుడు చూడఁగాఁ గలుగు (నాథుఁడు గనున్న = నాథుఁడు కానున్న యని యర్థము)॥ కళా ౫౭॥ మొ.

వ్యాఖ్య - కొన్నియెడల 'ఉన్న' పరమగునపుడు భావ్యర్థమునందలి కానుయొక్క దీర్ఘమునకు హ్రస్వము గనబడునని యర్థము.

పిరువీకు కానున్నది అనుచోట కానున్నది అన్నది భవిష్యత్కాలమును సూచించును. ఇందు 'కాను' అన్నది అగు ధాతువుయొక్క అన్నంతరూపము. దీని దీర్ఘమునకు హ్రస్వము కలిగి 'పిరువీకు గనున్నది' యని ప్రయుక్త మయినది. ఇట్టిదే 'నాథుఁడు గానున్న' యని యనుటకు 'నాథుఁడుగనున్న' యని యనుట కూడ. 'ఒకచో' అని సూత్రమునందు నిబంధించుటచేత,

ఇట్టి ప్రయోగములు మిక్కిలి యరుదని యభిప్రాయము. 'కనం బడియెడి' నని యనుటచేత ప్రయోగముల యథాస్థితిని ప్రదర్శించుటయే సూత్రప్రయోజనము.

బాలవ్యాకరణము క్రియావిశేషణములకును నుజ్యంతములకును అనుప్రయుక్తమగు 'కాను' నకు హ్రస్వము విభాషగా నంగీకరించినది. ప్రస్తుత సూత్రమునందలిది అనుప్రయుక్తమగు రూపము కాదు. కావున, నిది విశేష ప్రయోగమును సూచించుచున్నది.

[ భవిష్యదర్థమునందు,ధాతువునకు 'కలజి' వర్ణకమును మాత్రమే బాలవ్యాకరణము (46) విధించుచున్నది. 'ఉన్న' వర్ణకమును వర్తమానార్థమునందు విధించుచున్నది. ప్రస్తుత లక్ష్యమునుబట్టి "నుజ్యంతమునకు ఉన్నశబ్ద మనుప్రయుక్తమై భావ్యర్థబోధక మగు" నన్న విషయము తేలుచున్నది. అగు + నుజి + ఉన్న = కానున్న అని యనగా 'కాఁగల' యనియే యర్థము. అట్లే రాఁగల, చేయఁగల, చదువఁగల - మున్నగు వానికి బదులుగా రానున్న, చేయనున్న, చదువనున్న - మున్నగు విధముగా ప్రయోగింప వచ్చును. ]

**146.** ఉన్న కల న వర్ణకంబులమీఁది తచ్ఛబ్దవకారంబునకు లోపంబు విభాష నగు. (బా - ౧౧౭)

బాహుళకంబుచే నిట సంధి నిత్యంబు. వండుచున్నవాఁడు - వండుచున్నాఁడు - వండుచున్నవారు - వండుచున్నారు॥ వండుచున్నవాఁడవు - వండుచున్నాఁడవు - వండుచున్నవారరు - వండుచున్నారరు॥ వండుచున్నవాఁడను - వండుచున్నాఁడను - వండుచున్నవారము - వండుచున్నారము, ఇట్లు వండఁగలవాఁడు - వండఁగల్వాఁడు॥ వండినవాఁడు - వండినాఁడిత్యాదు లెఱుఁగునది.

వ్యాఖ్య - శత్రర్థమునం దగు 'ఉన్న' వర్ణకమునకును, భవిష్యదర్థమునం దగు కల వర్ణకమునకును, క్త్వవదర్థమునందగు న వర్ణకమునకును వాఁడు, వారు అనునవి పరమగునపుడు విభాషగా వకారము లోపించునని యర్థము.

పై ప్రత్యయములను గలవి ధాతుజవిశేషణములు. వానికి విభక్తి వివక్షించునపుడు (బా. సమాస-9) తచ్ఛబ్ద మనుప్రయుక్త మగును. ఇప్పు డా తచ్ఛబ్దముయొక్క వకారమునకు విభాషగా లోపము విధింపబడుచున్నది.

వండుచున్న + వాఁడు అని యున్నప్పుడు 'వ' కారమునకు లోపము కలుగగా వండుచున్న + అఁడు = వండుచున్నాఁడు అని యగును.

"అత్తునకు సంధి బహుళముగానగు" నన్న (బా. సంధి-4) సూత్రము ప్రకారము ఇచ్చట సంధి నిత్యముగా నగును. ఆవిషయమునే వ్యాకర్త యిచ్చట జ్ఞాపనము చేయుచున్నాడు.

వండుచున్నాఁడు - అన్నది అన్యార్థక విశేషణము. బహువచనమునందు వండుచున్నారు అని యగును. వండుచున్నాఁడవు మున్నగునవి యుష్మదర్థక విశేషణములు. వండుచున్నాఁడను మున్నగునవి అస్మదర్థక విశేషణములు; యుష్మదస్మద్విశేషణములకు ఏకత్వమున వునులును, బహుత్వమున రుములును (బా. కా - 33) పరమై పై రూపము లేర్పడును.

[ వండుచున్నాఁడు, వండుచున్నారు - అన్న క్రియలుకూడ నున్నవి. అచ్చటి ప్రక్రియకు 'వాఁడు' శబ్దముతో సంబంధము లేదు. అక్కడనున్న 'ఉన్న' యన్నది అనుబంధమే కాని ప్రత్యయము కాదు. డురు మున్నగు

పురుషప్రత్యయములు పరమగునపుడు దీర్ఘము వచ్చి ఉన్నాఁడు మున్నగు విధముగా నగును. ]

కల + వాఁడు అని యున్నప్పుడు 'వ' కారమునకు లోపము వచ్చి, అత్వసంధి కలుగగా 'కలాఁడు' అని యగును. బహుత్వమునందు వారు పరమగునప్పుడు పైలోపాదులు రాగా 'కలారు' అని యగును. యుష్మద్విశేషణము లయినప్పుడు కలాఁడవు, కలారరు అని యగును. అస్మద్విశేషణము లయినప్పుడు కలాఁడను, కలారము అని యగును. వకారలోపము కలుగనియెడల కలవాఁడు, కలవారు, కలవాఁడవు - మున్నగు విధముగా నుండును.

వండిన + వాఁడు అనియున్నపుడు వకారము లోపింపగా వండినాఁడు అని యగును. యుష్మద్విశేషణమైనపుడు వండినాఁడవు అని, అస్మద్విశేషణమైనపుడు వండినాఁడను అని యగును. బహుత్వమునందు వండినారు, వండినారరు, వండినారము అను రూపములగును. వకారలోపము రానిపక్షమున వండినవారు మున్నగువిధముగా నుండును.

**147.** ధాత్వాదులకు ధాతువు లనుప్రయుక్తంబులయి విలక్షణార్థాభిధాయకంబు లగు నీయవి శబ్దపల్లవంబులు నాఁబడు. (బా - ౧౧౮)

కూరుచుండు - నిలుచుండు - పరుండు - పన్నుండు - ఆఁకొను - ఈఁకొను - ఈయకొను - ఇయ్యకొను - రక్కొను - త్రెక్కొను - మేకొను - మయికొను - మేలుకొను - మేల్కను - మేలుకాంచు - అలవడు - ఏరుపడు - చొప్పడు - వెలువడు - తలపోయు - వాస

పోవు - అపోవు - కొంపోవు కొనిపోవు - విజయంచేయు - కయి
వ్రాలు - తూపొడుచు॥ ఇత్యాదులు శబ్దపల్లవంబులు.

వ్యాఖ్య - ధాతువు మున్నగు వానిమీద క్రియాధాతువులు చేరి విలక్షణార్థము నొసగును. అప్పుడు ఆజంటలను శబ్దపల్లవము లని యందురని సూత్ర తాత్పర్యము.

కూరుచు + ఉండు అని యన్నపుడు 'కూరుచుండు' అనినై 'ఆసీనుడగు' అను నర్థము నిచ్చును. 'కూరుచు' అని యనగా 'కూడునట్లుచేయు' అనియు, 'ఉండు' అని యనగా 'వర్తించు' అనియు నర్థములు. శబ్దపల్లవము దీని యర్థముల కంటె విశిష్టమయిన యర్థము నొసగుచున్నది.

నిలుచుండు, పరుండు, పన్నుండు మున్నగునవి యిట్టివే.

నామములమీద కూడ ధాతువులు చేరవచ్చును. ఆది శబ్దముచేత నామములను గ్రహింపవలయును. 'ఆఁకలి + కొను' అని యున్నపుడు 'కలి' కి లోపము కలిగి 'ఆఁకొను' అని యగును.

ఇట్లే శబ్దపల్లవములయందు లోపము, ఆదేశము మున్నగునవి కలుగును. వానిని ప్రయోగములనుబట్టి గ్రహింపవలయును.

**148.** శబ్దపల్లవ క్రియలు కొన్ని ద్విరుక్తంబులగుచో నుత్తర పదంబు పూర్వావయవంబునకు లోపంబు విభాష నగు.
(ప్రౌ - ౨౪)

చటులఖురోద్ధృటాశ్వ్రశేఁకి బోదివి రయంబునఁ దునిమి తూఁటాడి యాడి॥ భార. విరా ౫౭॥ ఇందురా రావయ్య విందులు

విందులం చర్ధిc బిల్వcగ నడయాడి యాడి॥ హరి. పూ. ౫ అ॥ పోరాడి యాడి చెన్నొంద వెనేని హరి పూ ౭అ॥ పరస్పర జయార్థులగుచు వాదడిచి యాడిచి॥ కాశీ ౫అ॥ ఎడపను గవళ్ళc దడcబడకుండంగ గుఱుతులు మదిc బాదుకొలిపి కొలిపి॥ కళా ౪అ॥ తదీయరూపమున్ మదిc దలపోసి పోసి॥ పర. ౨అ॥ మొ. పక్షమున - తూcటాడి తూcటాడి॥ మొ.

వ్యాఖ్య - ద్విరుక్తములయినపుడు శబ్దపల్లవ క్రియల యొక్క పరరూపముయొక్క పూర్వభాగమునకు విభాషగా లోపమగునని సూత్రార్థము.

'తూcటు' అని యనగా రంధ్రమని యర్థము. 'తూcటాడు' అని యనగా 'వేధించు' అని యర్థము. 'తూcటాడి తూcటాడి' యని రెండుమారులు వెంటవెంట నుచ్చరింప బడినపుడు రెండవసారి యుచ్చరింపబడిన శబ్దపల్లవము యొక్క పూర్వావయవమైన 'తూcటు' లోపింపగా 'తూcటాడి యాడి' అని యగును. లోపము రానియెడల 'తూcటాడి తూcటాడి' అని యుండవచ్చును.

నడచు + ఆడి అన్నవి నడయాడి అని యగును. ఇది పునరుక్తమైనపుడు పరరూపముయొక్క పూర్వభాగమునకు లోపము కల్గుగగా 'నడయాడి యాడి' అని, లోపము కలుగనిచో 'నడయాడి నడయాడి అని యగును.

తక్కిన పోరాడి, వాదడిచి, పాదుకొలిపి, తలపోసి - యను శబ్దపల్లవముల విషయముకూడ నిట్టిదే. ఈసూత్రము బాల వ్యాకరణమునకు పూరకము.

**149.** **శబ్దపల్లవక్రియలును ద్వ్యవయవక్రియలును సమాప్తంబులయి పునర్గృహీతంబులగుచోఁ దత్పూర్వావయవములకు లోపంబు విభాష నగు. (ప్రౌ - ౧౫౫)**

అలతాంగిఁ దోడ్కొని చనుదెమ్ము తే ననువుగూడని పక్షము నందు॥ భోజ. ౩ఆ॥ ఇలకుం దివికిం జననిచ్చు నిచ్చియే నని వెసనార్చు॥ రా. ఆర. ౨ఆ॥ మొ. పక్షమున - చనఁదే, చననిచ్చి॥ మొ.

వ్యాఖ్య - విలక్షణార్థము నొసగుచు ధాత్వాదులకు ధాతువు లనుప్రయుక్తము కాగా నేర్పడునవి శబ్దపల్లవములు. నుజ్యంతములు, క్త్వార్థకములు మున్నగువానికి పైని ధాతువులు చేరి స్వార్థమునే యొసగునెడల నవి ద్వ్యవయవక్రియలు.

చను + తెంచు = చనుదెంచు. దీనికి మధ్యమ మునర్ణకము పరమగునపుడు 'చనుదెమ్ము' అని యగును. ఇది శబ్దపల్లవము. 'చను' అను దానియొక్క నుజ్యంతముపై 'ఇచ్చు' చేరి 'చననిచ్చు' అని యగును. ఇది ద్వ్యవయవక్రియ.

శబ్దపల్లవక్రియలును, ద్వ్యవయవక్రియలును వాక్యమున చెప్పబడి మరల గ్రహింపబడిన యెడల, వానియొక్క పూర్వావయవములకు విభాషగా లోపము కలుగునని సూత్రార్థము.

'చనుదెమ్ము' అనుదానితో భావము సమాప్తమైనది. అది మరల గ్రహింపబడునపుడు చనుదేన్, చనుదేరన్ - మున్నగు విధముగా నుండును. ప్రస్తుత సూత్రమువలన పూర్వావయవమునకు లోపముగాగా తేన్, తేరన్ - మున్నగు విధముగా పునరాత్తము కావచ్చును. ఇట్లే 'చననిచ్చు' అను ద్వ్యవయవక్రియ

కూడ పునరావృత్తమగునపుడు పూర్వావయవమునకు లోపము రాగా 'ఇచ్చి' యని యగును ఈలోపము విభాషగా నగును. కావున, లోపము రాని యెడల చనుదేన్, చనుదేరన్, చననిచ్చి మున్నగు విధముగానే యుండును.

ద్వ్యవయవక్రియ యనుటచేతనే 'నమ్మనేరనయ్యెదను' మున్నగు త్ర్యవయవక్రియలకు నీసూత్రము వర్తించును.

**150.** చేదర్థయోగంబున లృట్టునకు లిట్టగు. (బా - ౧౯౯)

ఆ ఋషీశ్వరుండు వచ్చెనా ఫలించుఁ గార్యముల్ - వాఁడే పు వచ్చెనేని నీవు కార్యంబు దొరఁకొనుము.

వ్యాఖ్య - చేదర్థముతో కూడి యున్నప్పుడు ధాతువు యొక్క లృట్టునకు బదులుగా లిట్టగునని సూత్రార్థము.

చేదర్థమునందు ఆ, ఏని, న - యను మూడు ప్రత్యయములు గలవు. అవి పరమగునపుడు ధాతువునకు భవిష్యత్కాల ప్రత్యయములకు బదులుగా భూతకాల ప్రత్యయములు కలుగునని యర్థము.

'వచ్చు' ధాతువునకు భవిష్యద్రూపము 'రాఁగలఁడు' అనునది. దీనికిపైని చేదర్థమునందు 'ఆ' యనునది చేరగా 'రాఁగలఁడు + ఆ', అని యుండి ప్రస్తుతసూత్రముచేత భూతకాలికరూపము ఆదేశముకాగా వచ్చెను + ఆ = వచ్చెనా అని యగును. అట్లే 'ఏని' పరమగునపుడును వచ్చెను + ఏని = వచ్చెనేని అని యగును.

[ 'అగుటు' అని యగగా సూరిప్రణాళిక ననుసరించి సాధారణముగా నగునని యర్థము. అట్లు కానివి క్వాచిత్కముగా నుండవచ్చును. కావున తద్ధర్మార్థక రూపముపై చేదర్థకములు చేరగా వచ్చునా, వచ్చునేని మున్నగు రీతిగను కావచ్చును. ]

చేదర్థమునందు ద్రుతాంతమగు నవర్ణకము (బా - 4) కలుగును. అప్పుడును 'వచ్చు + నను' అని యుండగా ప్రస్తుతసూత్రముచేత లిట్టయి "భూతంబునం దిగాగమంబగు", నన్న సూత్రముచేత వచ్చు + ఇ + నను = వచ్చినను అని యగును.

## 151. ఆత్మార్థం బభిహితం బగుచోఁ దల్లింగ సంఖ్యాభిధాయి వచనంబు ధాతుజవిశేషణంబుల కగు. (బా - ౧౨౦)

రాముఁడు రావణుం బరిమార్చి సీతయుం దాను సౌమిత్రి సహితంబుగం బుష్పకారూఢుండయి సాకేతంబున కేతెంచె.

వ్యాఖ్య - వాక్యమునందు ఆత్మార్థమును ప్రయోగించినచో, దాని కనుగుణముగానే విశేషణములును క్రియయు లింగ వచనములను గలిగి యుండునని సూత్రార్థము.

తాను, తాము - అనునవి ఆత్మార్థములు.

ఉదాహృత వాక్యమునందు రాముఁడు, సీత - అను రెండు పదములు కర్తృస్థానమున నున్నవి. కావున విశేషణము బహువచనమున నుండవలయును; క్రియయు బహువచనమున నుండవలయును. కాని వాక్యమునందు 'రాముఁడు' అనుటకు బదులుగా 'తాను' అని ఆత్మార్థము వాడబడుటచే 'పుష్ప

కారూఢుఁడయి' అని మహదేకవచనమునందు' విశేషణము ప్రయుక్తమయినది. అట్లే క్రియయు 'ఏతెంచెను' అని యేక వచనముననే యున్నది.

'తాను' శబ్దము అభిహితము కానిచో "రాముఁడును సీతయు సౌమిత్రిసహితంబుగం బుష్పకారూఢులయి సాకేతంబున కేతెంచిరి" అను రీతిగా నుండవలయును.

**152. ఒకానొకచో సహార్థంబున యుష్మదస్మదర్థంబు లభిహితంబు లగునపుడు క్రియలు తత్కర్తృకంబులు విభాష నగు.** (ప్రౌ - ౨౬)

విప్రకులుండ! వెల్వడుము వేగమ నీవును నీనిషాదియున్॥ భార. ఆది. ౨౫॥ మన కాప్తుఁడు సంజయుఁడీ తని యుపదేశంబుఁబట్టి ధర్మమున ముకుందుని నాశ్రయింపవయ్య! యాతనిఁబొందిన బ్రదుకు నీవుఁ దమ్ములు సుతులన్॥ భార. ఉద్యో. ౨౫॥ నేను నా సేనయు దాడివెట్టి విశృంఖలతన్। హరి ఉ ౩౮॥ ఎలుఁగు రాలుపడఁగ నిట్లనుఁ బదులొల్లి గేండ్లు రాఘవుండు నీవు నన్నరణ్యభూములందు రక్షించి నేఁడు కానడవి చెట్టు లోంటి విడిచెదనిన॥ జై. ౬౭ ॥ మో. వకమున - మోహాంధుండు భీష్ముండుఁ గేశవ! నీవుం గడఁగుంటు॥ భార. సభా. ౨౭॥ మొ

వ్యాఖ్య - నీవు, మీరు - అను యుష్మదర్థకములును, నేను, మేము - అను నస్మదర్థకములును చెప్పబడినపుడు సహార్థమునందు క్రియలు యుష్మదస్మదర్థకములతోనే కొన్ని యెడల నన్వయమును గలిగి యుండునని సూత్రార్థము.

'విప్రకులుండ... నిషాదియున్' అను ప్రయోగము నందు 'నిషాదితో' అని సహార్థము గలదు. 'నీవు నీనిషాదితో వెల్వడుము' అని యుండవలసి యుండగా 'తోడ' ప్రత్యయమ్ము కాక 'ఉను' అను సముచ్చయార్థక మున్నది. కావున నీవును, నీనిషాదియును-రెండుపదములు కర్తృస్థానీయములై యున్నవి. కావున 'వెల్వడుఁడు' అని బహువచన క్రియయే యుండవల యును. కాని, ప్రస్తుత సూత్రముచేత సహార్థమునే గ్రహించి, యుష్మదర్థమునకే ప్రాధాన్యము నొసగుటచేత, క్రియ దాని తోనే యన్వయించుచున్నది. అందువలననే 'విప్రకులుండ! వెల్వడుము వేగమ నీవును నీనిషాదియఱన్' అను రీతిని ప్రయో గించుట జరిగినది.

'అతనిఁ బొందిన బ్రదుకు దీవుఁ దమ్ములు సుతులున్' అనుచోట ఈవు తమ్ములతో సుతులతో బ్రదుకుదువు - అనురీతి సహార్థము గలదు. సహార్థమునందు 'తో' ప్రత్యయమున్నప్పుడు క్రియ ఈవు తోనే యన్వయించును. కాని 'తో' లోపించి సముచ్చయార్థకము చేరినపుడు క్రియ బహుకర్తృకము కావల యును. అయినను ప్రస్తుతసూత్రమునుబట్టి యుష్మదర్థకమునకు ప్రాధాన్యమునిచ్చి క్రియను దాని కనుగుణముగా ప్రయో గించుట జరిగినది.

'నేనును నాసేనయు ధాడి పెట్టెదను' అన్నచోట 'సేనయు' నని యనగా 'సేనతో' నని యర్థము. 'రాఘ వుండు నీవు' ననుచోట 'రాఘవునితో నీవు' అని యర్థము.

[ సూత్రరచనము సరిగాలేదు. ఇప్పుడున్నట్లే యైనచో 'తోడ అను ప్రత్యయ మున్నప్పుడే పై కార్యము జరుగునని యనిపించును. కావున

"యుష్మదస్మదర్థంబు లభిహితంబు లగునపుడ సహార్థంబున కొకానొకచో సముచ్చయార్థంబగు; అగుచోఁ గ్రియలు విభాష దత్కర్తృకంబు లగు" అనియుండిన యోగ్యతరముగా నుండెడిది. ]

## 153. అగతికంబులగు భ్వాదుల కిందు యోగంబు లేదు. (బా - ౧౨౧)

భూ - సృ - కృ - రేక్కృ - లోక్కృ - లోచ - పచి - లప॥ ఇత్యాదులకు గతివిరహంబులగు ధాతువులకీభాషం బ్రయోగంబు లేదు. ప్ర - పరా - అప - సమ్ - అను - అవ - నిస్ - నిర్ - దుస్ - దుర్ - వి - ఆజ్ - ని - అధి - అపి - అతి - సు - ఉద్ - అభి - ప్రతి - పరి - ఉప - ఊరీ ప్రభృతులును సాక్షాత్ప్రభృతులును గతి సంజ్ఞకంబులు. ప్రాదు లిరువదిరెండు నుపసర్గంబులు నాఁబడు. ప్రభవించు - ఆవిర్భవించు - ప్రసరించు - సంస్కరించు - భస్మీకరించు - సాక్షాత్కరించు - అతిరేకించు - ఆలోకించు - ఆలోచించు - ప్రపంచించు - ప్రలపించు॥ ఇత్యాదు లార్యప్రయోగంబుల నెఱుంగునది

వ్యాఖ్య - ఉపసర్గములు మొదలగు నుపపదములతో కూడని 'భూ' మున్నగు (భూ + ఆదులు) ధాతువులకు తెలుగు భాషయందు ప్రయోగము లేదని సూత్రార్థము.

"సంస్కృతంబున కంగలాదుల కించుకగు" అను (బా - ౯౩) సూత్రమునుబట్టి సంస్కృతధాతువుల 'కించు' అను నాగమము కలుగఁగా నేర్పడిన రూపములు తెలుగున ధాతువులుగా నుపయోగపడును. అది సాధారణ విషయము. తత్సూత్ర ప్రవృత్తిని వారించుటకై యీసూత్రము ప్రవర్తించుచున్నది. 'భూ' మున్నగు ధాతువులకు ముందు 'ప్ర' మున్నగు ఉప

సర్గలు చేరునపుడు తెలుగున నుపయోగపడును. కేవలధాతువులు తెలుగున నుపయోగపడవని యర్థము.

ప్ర నుండి ఉప వరకు గల వానిని ఉపసర్గములని యందురు. ఇవి ధాతువులకు ముందు వేరువేరర్థములందు చేరుచుండును. అట్టివి చేరునపుడు ధాతువునకు ఇంచు చేర్చి తెలుగున నుపయోగించుకొనవచ్చును. 'భూ' ధాతువునకు ముందు 'ప్ర' అను ఉపసర్గ చేరగా 'ప్ర + భూ + ఇంచు' అని యుండును. "ఇ ఉ ఋ ల కించుక్కు పరంబగునపు డయుగవు గరుక్కు లగు" నన్న (బా - 64) సూత్రమునుబట్టి 'ప్రభవించు' అని యగును. అట్లే పరాభవించు, సంభవించు, అనుభవించు - మున్నగు విధముగా ఉపసర్గ సహితమై యుపయోగపడును.

'సృ' ధాతువున కిట్లే ఉపసర్గలు చేరగా ప్రసరించు, అపసరించు మున్నగు విధముగా నుపయోగపడును. 'కృ' ధాతువునకు ఉపకరించు, సంస్కరించు మున్నగు విధముగా రూపము లగును. 'రేకృ' ధాతువునకు అతిరేకించు మున్నగు విధముగా, లోకృ ధాతువునకు ఆలోకించు మున్నగువిధముగా, లోచ ధాతువునకు ఆలోచించు మున్నగువిధముగా, పచిధాతువునకు ప్రపంచించు మున్నగువిధముగా, లప ధాతువునకు ప్రలపించు మున్నగు విధముగా రూపము లుండును.

ఊరీ, సాక్షాత్ మున్నగు నుపపదములు చేరినప్పుడును పై ధాతువులు తెనుగున ప్రయోగార్హములగును. ఊరీకరించు, భస్మీకరించు, సాక్షాత్కరించు, ఆవిష్కరించు, ప్రాదుర్భవించు, ఆవిర్భవించు మున్నగునవి యట్టివాని కుదాహరణములు.

ప్రాదులను ఇరువది రెండింటిని, సాక్షాత్ మున్నగు నుప పదములను కలిపి "గతిసంజ్ఞ" లని వ్యవహరింతురు.

**154.** కరఁగు తలఁగు మెఱయ్యాదు లంతర్భావిత ప్రేరణంబులు. (ప్రౌ - ౩౪)

వ్యాఖ్య - కరఁగు, తలఁగు, మెఱయు మున్నగు ధాతువులు ఇంచుగాదులు చేరకయే ప్రేరణార్థకము లగునని యర్థము. ఇవి సందర్భమునుబట్టి స్వార్థమును, ప్రేరణార్థమ్మును గూడ నొసగునని తాత్పర్యము.

బంగారము కరఁగెను అని యనగా '.ద్రవమయ్యెను అని యర్థము; ఇది స్వార్థము. 'స్వర్ణకారుఁడు బంగారమును గరఁగెను' అని యన్నప్పుడు కరగించెనని యర్థము. ఇది ప్రేరణార్థము. అట్లే తలఁగు, మెఱయు మున్నగునవియు వ్యవహరించును.

ఆది శబ్దముచేత ఆఁగు, కురియు మున్నగుధాతువులను గ్రహింపవలయును.

**155.** అడుగ్వాదులు ద్వికర్మకంబులు. (ప్రౌ - ౩౫)

వ్యాఖ్య - అడుగు మున్నగు క్రియా ధాతువులు రెండు కర్మములతో అన్వయమును గలిగియుండునని యర్థము

'నేను వానిని పుస్తకము నడిగితిని' అనుచోట 'అడిగితిని' అను క్రియకు 'వానిని' అనియు 'పుస్తకమును' అనియు రెండు కర్మములు గలవు. ఆదిశబ్దముచేత అను, చెప్పు, పలుకు

మున్నగు వానిని గూడ గ్రహింపవలయును. వీని యన్నింటికి ఎల్లప్పుడు రెండు కర్మములతో నన్వయ ముండునని యర్థము కాదు. తక్కిన ధాతువులకు ఒకే కర్మముతో నన్వయము కలుగు చుండగా, అడుగ్వాదులకు రెండు కర్మలతో అన్వయ్యమును గలిగియుండు నవకాశము గలదని తెల్పుటయే పరమార్థము.

బాలవ్యాకరణము "వచ్యర్థాముఖ్యకర్మంబునకుఁ దోడకు వర్ణకంబులు ప్రాయికంబుగా నగు" నని (కారక - 6) తెలి పెను. వచ్యర్థములే అడుగ్వాదులు. కావున ముఖ్యకర్మము, అముఖ్యకర్మము - రెండు కర్మములుండునని సూరియు భంగ్యంతరముగ ఈ విషయమును దెలిపియే యున్నాడు.

**156.** వలయ్వాది క్రియలకుం గ ర్త యగు భావంబునందు నుజీ యగు. (బా - ౧౨౨)

వలయ్వాది క్రియలకుం గర్తృభూత క్రియావృత్తియగు ధాతువునకు నుజీ వర్ణకం బగు. వాఁడు చూడవలయు - వారలు చూఁడగా వలయు - నీవు చూడవలయు - మీరు చూడవలయు - నేను జూడ వలయు - మేము చూడవలయు - మనము చూడవలయు॥ వలయును - వలదు - కూడును - కూడదు - చెల్లును - చెల్లదు - తగును - తగదు॥ ఇత్యాదులు వలయ్వాదులు.

సకర్మకంబులకు స్వరూపప్రేరణార్థంబులు రెండును, గొను వడ్వనుబంధంబులం దొక్కొక్కటితోడ రెంటితోడం గూడుచో నగు నవి యాఱుం గూడ రూపంబు లెఱిమిదయ్యె; వాని సొరిది నుదాహ రించెద.

కర్త్రర్థకము

మైత్రుఁడు వంటకమును వండెను.

ఆత్మనేపద కర్త్రర్థకము

మైత్రుఁడు వంటకమును వండుకొనియెను.

కర్మార్థకము

మైత్రునిచేత వంటకము వండఁబడియెను.

ఆత్మనేపద కర్మార్థకము

మైత్రునిచేత వంటకము వండుకొనఁబడియెను.

ప్రేరణ కర్త్రర్థకము

చైత్రుఁడు మైత్రునిచేత వంటకమును వండించెను.

ప్రేరణాత్మనేపద కర్త్రర్థకము

చైత్రుఁడు మైత్రునిచేత వంటకమును వండించుకొనియెను.

ప్రేరణ కర్మార్థకము

చైత్రునిచేత మైత్రునిచేత వంటకము వండింపఁబడయెను.

ప్రేరణాత్మనేపద కర్మార్థకము

చైత్రునిచేత మైత్రునిచేత వంటకము వండించుకొనఁబడియెను.

వ్యాఖ్య - 'వలయు మున్నగు క్రియలకు కర్తగా వ్యవహరించు క్రియాధాతువునకు నుజీ యగునని యర్థము.

నుజీ వర్ణకమును సూరి యీవరకు తుమర్థమునందును, భావలక్షణమునందును విధించెను.

వాక్యమునందు ఒక క్రియచే నొక వ్యాపారము బోధింప బడుచుండగా వ్యాపారాంతరమును బోధించు క్రియాధాతువు దానికి కర్తగా వ్యవహరించును. అట్టియెడల కర్తృభూత ధాతువు నుజ్యంతమై యుండును, కావున కర్త్రర్థమున సైతము ధాతువు నకు నుజీ యగునని భావము.

వాఁడు చూడవలయు - ఇచ్చట 'వలయు' అన్నది ప్రధానక్రియ. 'చూచు' ధాతువు కర్తృభూతమైన వ్యాపా రమును బోధించుచున్నది. కావున 'నుజీ' కలుగగా 'చూచు' నకు 'చూడు' అను నాదేశము కలిగి 'చూడను' అని యగును. 'చూడను' అను రూపమే కర్తయగుటచే 'వలయును' అన్న సమాపకక్రియ దానితోనే అన్వయము కలిగి యుండును. వాక్యమునందు కర్తయైన 'వాఁడు' అను దానితో నేవిధమైన యన్వయమును గలిగి యుండదు; అనగా కర్త తదర్థకమయినను, యుష్మదర్థకమయినను, అస్మదర్థక మయినను గూడ 'వలయును' అనియే ఏకత్వబహుత్వములందు రెండింటను ప్రయోగింపబడు నని యర్థము. కావున, వాఁడు చూడవలయు - వారు చూడ వలయు - నీవు చూడవలయు - మీరు చూడవలయు - నేను జూడవలయు - మేము చూడవలయు మనము చూడవలయు॥ అను రీతిగానే ప్రయోగము లుండును.

"నుజ్యంతంబగు నగుధాతువు... నుజీకి విభాష నగు" నన్న (బా - 115) సూత్రముచేత 'చూడను' అనుదానికి 'కాను' అని అనుప్రయుక్తమై 'చూడఁగా' అనియు దానికి హ్రస్వము కలిగి 'చూడఁగ' అనియు కావచ్చును. అప్పుడు

నీవు చూడవలయును, నీవు చూడఁగావలయును, నీవు చూడఁగ వలయును - అను రీతిగా నుండును.

ఇట్లే వలదు, కూడును, కూడదు, చెల్లును, చెల్లదు, తగును, తగదు - మున్నగునవి క్రియలుగా వ్యవహరించునపుడును జరుగును.

[ "సకర్మకంబునకు" అని మొదలయిను భాగమునకును, సూత్రమునకు నేమియు సంబంధము లేదు. ఇంతవరకు చూపిన సకర్మకధాతువు యొక్క ప్రయోగవైవిధ్యము నొకసారి సమీకరింపదలచి యిక్కడ ఆప్రస్తుతమును దీసికొని వచ్చెను. "అనభిహితకర్తృకు" అని మొదలయిన చివరి సూత్రముకడ అకర్మక ధాతువుయొక్క ప్రయోగవైవిధ్యమును ప్రదర్శించును. ]

సకర్మకధాతువు ఎనిమిదిరూపములతో క్రియగా వ్యవహరించును. ప్రధానముగా స్వార్థము, ప్రేరణార్థము అన్నవి రెండు రూపములు. 1. వండెను అన్నది స్వార్థమునకు 2. వండఁబడెను అన్నది ప్రేరణార్థమునకు నుదాహరణములు. స్వార్థమునందును ప్రేరణార్థమునందును కొను పరమగుటచే ఆత్మనేపదార్థము, పడు పరమగుటచే కర్మార్థము, కొనఁబడు పరమగుటచే ఆత్మనేపద కర్మార్థము నగును. 3. స్వార్థమునందలి ఆత్మనేపదార్థమునకు వండుకొనెను, 4. కర్మార్థకమునకు వండఁబడెను, 5. ఆత్మనేపద కర్మార్థకమునకు వండుకొనఁబడెను - అన్నవి యుదాహరణములు. 6. ప్రేరణార్థమునందలి ఆత్మనేపదార్థమునకు వండించుకొనియెను, 7. కర్మార్థకమునకు వండింపఁబడియెను, 8. ఆత్మనేపద కర్మార్థకమునకు వండించుకొనఁబడియెను - అన్నవి యుదాహరణములు.

సంపూర్ణ వాక్య స్వరూపముతో బాలవ్యాకరణకారుడు పై యెనిమిది రూపములను ప్రదర్శించెను.

**157.** కర్తృభూతక్రియతోడం దత్కర్తకన్వయం బగు. (ప్రౌ - ౨౬)

నీవు రావచ్చును బోవచ్చును॥ మొ. ఇందు రాఁబోనను కర్తృభూత క్రియలతో వానికిఁ గర్త యగు నీ వనుదాని కన్వయం బని యెఱుంగవలయు.

వ్యాఖ్య 'వలయును' మున్నగు క్రియలకు కర్తయై వ్యవహరించు నుఙ్యంత ధాతువుతోనే వాక్యగతమైన కర్త అన్వయించునని సూత్రార్థము. అనగా, వాక్యగతమైన కర్తతో సమాపక క్రియకు అన్వయము కలుగదని, అసమాపకక్రియయైన నుఙ్యంతముతోనే అన్వయము కలుగునని యర్థము.

'నీవు రావచ్చును' అని యన్నప్పుడు 'వచ్చును' అన్న క్రియకు కర్త 'రాన్' అన్నది. దీనికి 'వచ్చుట' యని యర్థము. దీనికి కర్త 'నీవు' అన్నది. నిజమునకు అర్థమును చెప్పుకొనుటకే యీ వివేచనము పనికి వచ్చును గాని శబ్దస్వరూపనిరూపణము విషయమున పనికిరాదు. 'రాన్' మున్నగునవి అవ్యయములు. కావున దేనితో అన్వయించినను రూప మొక్కరీతినే యుండును నీవు రావచ్చును అని యన్నట్లే మీరు రావచ్చును, వాఁడు రావచ్చును, నేను రావచ్చును, మేము రావచ్చును, మనము రావచ్చును - అని యనవచ్చును. ఇంతయును పూర్వసిద్ధమే. ఈసూత్రము ప్రత్యేకప్రయోజనము నేమియు సాధించుటలేదు; అనావశ్యకము.

**158.** గతి బుద్ధి ప్రత్యవసానార్థ శబ్దకర్మాకర్మకంబుల కప్రేరణంబునం గర్త యగునది ప్రేరణంబునం గర్మం బగు. (బా - ౧౨౩)

పొందు మొదలయినవి గత్యర్థకంబులు. తెలియు మొదలయినవి బుద్ధ్యర్థకంబులు. తిను మొదలయినవి ప్రత్యవసానార్థకంబులు విను, చెప్పు, చదువు - మొదలయినవి శబ్దకర్మంబులు. అకర్మకంబులు ప్రసిద్ధంబులు. మైత్రుండు గ్రామంబుం బొందెను - చైత్రుండు మైత్రుని గ్రామంబుం బొందించెను॥ లాఁతిచో సహితమిక్కార్యంబు గానంబడియెడి. మైత్రుండు పుడమి నేలెను - చైత్రుండు మైత్రునిం బుడమి నేలించెను.

వ్యాఖ్య - గతి, బుద్ధి, ప్రత్యవసానము - అను నర్థము గల ధాతువులకును, శబ్దకర్మమును బోధించు ధాతువులకును, అకర్మకధాతువులకును స్వార్థమందు కర్తయగు పదము ప్రేరణార్థమునందు కర్మమగును. కర్మమగుట యనగా ద్వితీయా విభక్తి ప్రత్యయమగు నువర్ణమును పొందుట యని తాత్పర్యము.

గత్యాది శబ్దములకు అర్థమును వ్యాకర్తయే వృత్తి యందు తెలిపియున్నాడు.

మైత్రుండు గ్రామంబుం బొందెను - అనుచోట 'పొందెను' అన్నది క్రియ; గత్యర్థకము. గ్రామము అన్నది కర్మము. మైత్రుఁడు కర్త. ఇది స్వార్థమునం దున్నది. ప్రేరణార్థమునందు ప్రస్తుతసూత్రమునుబట్టి కర్తకు కర్మత్వము కలుగవలయును. 'పొందు' ధాతువునకు 'ఇంచు' చేరి 'పొందించు'

అని ప్రేరణార్థకధాతువై లకారాదులను పొందును. అప్పుడు 'చైత్రుండు మైత్రుని గ్రామంబుం బొందించెను' అను విధముగా నగును. 'మైత్రుఁడు' అను కర్త కర్మత్వమునందు నువర్ణము నొందగా ప్రథమావిభక్తి లోపించును. 'మైత్రు + ను' అని యగును. అది డుమంతమగుటచేత ద్వితీయాద్యేకవచనము పరమగునపుడు నిగాగమము కాగా 'మైత్రుని + ను' అని యగును. ఆతరువాత ఇకారము మీది 'ను' వర్ణము 'ని' కాగా 'మైత్రునిని' అని యగును. నిగాగమము కలుగనియెడల డుమంతముమీది 'ను' వర్ణమున కిత్వము కలిగి 'ని'గా (బా. తత్సమ - 25) మారును. 'మైత్రుని' అన్నది అట్టిరూపమే తక్కిన బుద్ధ్యాది ధాతువుల కట్లే యుదాహరణముల నూహించు కొనవచ్చును.

'నేను నిలిచితిని' అని యున్నప్పుడు 'నేను' కర్త. 'నిలిచితిని' అకర్మకము. ప్రేరణార్థమునందు కర్తకు 'ను' వర్ణకము కలుగగా "వాఁడు నన్ను నిలిపెను" అను విధముగా రూపముండును.

పైని చెప్పిన పొందు మున్నగు ధాతువులకు చెందని 'ఏలు' ధాతువునకు కర్తయైనది కూడ ప్రేరణార్థమునందు కర్మముగా నగుచుండుట ప్రయోగములందు కలదు. ఇది విశేషము. 'మైత్రుండు పుడమి నేలెను' అని యున్నప్పుడు కర్తయైన 'మైత్రుండు' ప్రేరణమునందు కర్మకాగా 'చైత్రుండు మైత్రునిం బుడమి నేలించెను' అని యగును.

[ఇచ్చట సర్వస్వపేటికాకారులు "ఈనియమముంజేసి శిష్యుఁడు శబ్దమును బలికె ననుదానికిఁ బ్రేరణమున గురువు శిష్యునిచే శబ్దమును బలికించె ననియు, మైత్రుండు పుడమినేలె ననుదానికిఁ జైత్రుఁడు మైత్రునిచేఁ

బీడమి నేలించె ననియు వాక్యములు గలుగవని తేలుచున్నదిం కాని పై రీతిని దృతీయ తోడి వాక్యము లాంధ్రభాషాశైలిం జేసి సాధువులు గాఁదగునని తోఁచెడి" నని వ్రాసిరి. సాధువులనుటయే సమ్మతము. సూరి 'ఇగు'నని సూత్రమునందు ప్రయోగించినపుడు 'నిత్యము' అని చెప్పినట్లు తలచుటచేత ఇన్ని భ్రమల కవకాశము కలుగుచున్నది. అగు ననగా నిత్యమని యర్థము కాదు. ప్రస్తుతసూత్రమునందు విధించిన కార్యము జరుగును. దీనికి భిన్నముగా మఱొక కార్యము విధింపబడినయెడల నదియును గావచ్చును. అది కాని సమయములం దెల్ల నిది కావలయును. కావున తృతీయావిభక్తి యగు 'చేత' వచ్చుట కాక్షేపము లేదు. ]

## 159. అనభిహితకర్త కొకానొకచో షష్ఠి బహుళంబుగా నగు. (బా - ౧౨౪)

రాముఁడు మిథిలం గనియె - రామునకు మిథిల గనంబడియె - రామునిచే మిథిల గనంబడియె॥ మైత్రుండు తత్త్వంబుం దెలిసెను - చైత్రుండు మైత్రునకుం దత్త్వంబు దెలిపెను॥ కన్వాదియోగంబునం బ్రయోజ్యకర్తకు షష్ఠి నిత్యంబుగా నగు. విశ్వామిత్రుండు రామునకు మిథిలం గానిపించెను॥ కృష్ణుం డర్జునునకు విశ్వరూపంబుం జూపెను.

అకర్మకంబున కప్రేరణంబునం దాత్మనేపదకర్మానుబంధంబులు లేమిం జేసి రూపభేదంబు లయిదని యెఱుంగునది.

కర్త్రర్థకము
మైత్రుండు మనియెను
ప్రేరణ కర్త్రర్థకము
చైత్రుండు మైత్రుని మనిచెను
ప్రేరణాత్మనేపద కర్త్రర్థకము
చైత్రుండు మైత్రుని మనుచుకొనియె

ప్రేరణ కర్మార్థకము
చైత్రునిచేత మైత్రుండు మనుపఁబడియె.
ప్రేరణాత్మనేపద కర్మార్థకము
చైత్రునిచేత మైత్రుండు మనుచుకొనఁబడియె.

వెండియుం బ్రేరణంబునం దించుకాగమంబు గలిగినచో సకర్మకంబునకుం బండ్రెండు, నకర్మకంబునకుం దొమ్మిదియు భేదంబు లని యూహించునది.

వ్యాఖ్య - అభిహితమగుట యనగా క్రియచేత చెప్పబడుట యని యర్థము. క్రియచేత అభిహితము కాని కర్తకు షష్ఠి బహుళముగా కొన్నియెడల నగునని సూత్రార్థము.

"చేత వర్ణకంబు కర్త కగు" అన్న (బా. కారక - 3) సూత్రము ననుసరించి అనభిహితకర్తకు 'చేత' రావలయును. ఆ సూత్రవిధిని పాక్షికముగా వారించుచు నీ సూత్రము ప్రవర్తించును.

రాముఁడు మిథిలం గనియె - ఇచ్చట 'కనియె' అను క్రియచేత ఉక్తమగునది 'రాముఁడు'. కావుననే ప్రథమావిభక్తి కలిగినది. ఇది కర్త్రర్థకవాక్యమగుటచే ఉక్తార్థమును, కర్తయు నొక్కటే. రామునకు మిథిల గనంబడియె - అనుచోట క్రియచేత ఉక్తమగునది మిథిల. కనుట యను వ్యాపారమును చేసినది రాముడే కావున రాముడు అనభిహిత కర్త. కాబట్టి ప్రస్తుత సూత్రము ననుసరించి షష్ఠీ ప్రత్యయమగు 'కు' రాగా 'రామునకు' అని యగును. ఈవిధి పాక్షికమగుటచే, కు వర్ణము రాని

యెడల 'చేత' వర్ణకము వచ్చి 'రాముని చేత మిథిల కనంబడియె' నని యగును.

మైత్రుండు తత్త్వంబుం దెలిసెను - ఇచ్చట తెలియుటకు కర్త మైత్రుడు. ఇది కర్త్రర్థక వాక్యము, కావున ఉక్తము కూడ 'మైత్రుఁడు' అనునదే. కాబట్టి ప్రథమ వచ్చెను. చైత్రుండు మైత్రునకుఁ దత్త్వంబు దెలిపెను - అనుచోట 'తెలిపెను' అను క్రియచేత చైత్రుడు చెప్పబడుటచే ప్రథమ నొందెను. కాని తెలియుటకు కర్త మైత్రుడు. కాబట్టి 'కు' వర్ణకము కలిగి 'మైత్రునకు' అని యయ్యెను.

కను, విను, తిను మున్నగునవి కన్వాదులు. ప్రయోజ్య కర్త యనగా ప్రేరణార్థమునందు క్రియచేత అనభిహితమైన కర్త యని యర్థము. ప్రేరణకర్తచేత ప్రేరేపింపబడు కర్తయని భావము. కను మున్నగు ధాతువులతోడ సంబంధమున్నప్పుడు ప్రయోజ్యకర్తకు నిత్యముగా షష్ఠీప్రత్యయము కలుగును. విశ్వామిత్రుఁడు రామునకు మిథిలం గానిపించెను - ఇచ్చట కానిపించుట అను ప్రేరణక్రియకు కర్త విశ్వామిత్రుడు. కనుటకు కర్త రాముడు; అనగా రాముడు ప్రయోజ్యకర్త. కాబట్టి షష్ఠి వచ్చి 'రామునకు' అని యయ్యెను. ఇట్లే 'అర్జునుడు విశ్వరూపమును జూచెను' అని యన్నప్పుడు చూచుటకు కర్త 'అర్జునుడు'. ప్రేరణార్థమునందు 'కృష్ణుం డర్జునునకు విశ్వరూపంబుం జూపెను' అను విధముగా కృష్ణుడు కర్త యగును. కర్త్రర్థమునందలి కర్త యిప్పుడు ప్రయోజ్యకర్త. కావున 'కు' వర్ణకము కలిగి 'అర్జునునకు' అని యగును. ఇక్కడ కువర్ణకవిధి నిత్యము.

[ ఈ సూత్రముతో సంబంధము లేకపోయినను, పూర్వసూత్రముకడ సకర్మక క్రియారూప వైవిధ్యమును ప్రదర్శించినట్లే, యిక్కడ అకర్మక క్రియారూప వైవిధ్యమును బ్రదర్శించుచున్నాడు. ]

అకర్మక ధాతువు ఐదు రూపములను మాత్రమే పొందును. స్వార్థమునందు కొను ధాతువుతోడి ఆత్మనేపదార్థమును, పడు ధాతువుతోడి కర్మార్థము నుండవు. కావున స్వార్థమునందు కర్త్రర్థమున 'మనియెను' అని యొక్కటే రూపముండును. ప్రేరణార్థమునందు కర్త్రర్థమున 'మనిచెను' అని, ఆత్మనేపద కర్త్రర్థమున 'మనుచుకొనియె' నని, కర్మార్థమున 'మనుపఁబడియె' నని, ఆత్మనేపద కర్మార్థమున 'మనుచు కొనఁబడియె'నని రూపనిష్పత్తి యుండును.

సకర్మక ధాతువునకు పూర్వ (122) సూత్రముకడ ఎనిమిది రూపములు ప్రదర్శింపబడెను. ప్రేరణార్థమునందు మరల ఇంచుగాగమము కలిగినయెడల నాలుగు రూపము లదనముగా కలుగును. అకర్మకమునకు ఐదు రూపములు చూపబడినవి. ప్రేరణార్థమునందు ఇంచుగాగమము కలిగినయెడల అదనముగా నాలుగురూపము లేర్పడును. మొత్తముమీద సకర్మకమునకు పండ్రెండు రూపములు కలుగవచ్చును; అకర్మకమునకు తొమ్మిది రూపములు కలుగవచ్చును.

[ఇచ్చట సకర్మకముల కుదాహరణముల జూపుచు 'సర్వస్వవేటికా కారులును, బులుసువారును అపమార్గము పట్టిరి. వారు చూపిన యుదాహరణములు; దేవదత్తుఁడు చైత్రునకు మైత్రునిచేత వంటకమును వండింపించెను; దేవదత్తుఁడు చైత్రునకు మైత్రునిచేత వంటకమును వండింపించుకొనెను - మున్నగు విధముగా నున్నవి. 'వండు' ధాతువునకు ప్రేరణమునందు ఇంచుగాగమము కలిగి 'వండించు' అని యగును. ఆతరువాత

దీని కింక ప్రేరణేంచుకు్క చేరు నవకాశము లేదు. "ప్రేరణంబునం దించుకు్క మీఁద నించుకు్క లేదు" అన్న (బా - 84) సూత్రమునకు పై కల్పనము విరుద్ధము. కావున ఆ యుదాహరణములు గ్రాహ్యములు కావు.]

సకర్మకమున కుదాహరణములు - 1. చూచెను 2. చూచుకొనియెను 3. చూడఁబడెను 4. చూచుకొనఁబడియెను 5. చూపెను 6. చూపుకొనియెను 7. చూపఁబడియెను 8. చూపుకొనఁబడియెను 9. చూపించెను 10. చూపించుకొనియెను 11. చూపింపఁబడియెను 12 చూపించుకొనఁబడియెను.

అకర్మకమున కుదాహరణములు - 1. మనియెను 2. మనిచెను 3. మనుచుకొనియె 4. మనుపఁబడియెను 5. మనుచుకొనఁబడియెను 6. మనిపించెను 7. మనిపించుకొనియెను 8. మనిపింపఁబడియెను 9. మనిపించుకొనఁబడియెను.

# కృదంత పరిచ్ఛేదము

**1.** కృత్తుల కర్థంబులు యథావ్యవహారంబుగ గ్రాహ్యంబులు. (ఔ - ౧)

ధాతువునకు విహితంబగు డు ఙ్భిన్న ప్రత్యయంబు కృత్తునాఁబడు. కృత్తులకు వక్ష్యమాణంబులగు భావ కర్తృకర్మాద్యర్థంబులు మహాజన వ్యవహారానుసారిగా నెఱుంగునది॥ అఁక = బంధనము; మొలక = నవోద్భిదము; ఏలిక = పాలకుఁడు; కోరిక = వాంఛయు, వాంఛితంబును; మూఁక = సంఘము; ఆడిక = నింద: ఓడిక = స్రోతస్సు.

వ్యాఖ్య - ఏయర్థమున నేకృత్ప్రత్యయము కలుగునో వ్యవహారము ననుసరించియే గ్రహింప వలయునని సూత్రార్థము.

ధాతువునకు పూర్వపరిచ్ఛేదమునందు అనేక ప్రత్యయములు విధింపబడినవి. అందు డురు వురు నుము - అనునవి పురుష ప్రత్యయములు. డు స్థానమున నగు ఎను, ను వర్ణకములును - డురుల స్థానమున నగు ది, వి వర్ణకములును గూడ పురుషప్రత్యయములే. ఇవికాక మిగిలిన ప్రత్యయములను (డుఙ్భిన్న ప్రత్యయములను) 'కృత్తులు' అని యందురు.

[ట, మిఁ అను ప్రత్యయములు చేరుటవలన వండుట• వండమి అను విశేష్యము లేర్పడును. ఎడి, ఎడు, ఉన్న, కలఁ, న, నిఁ - అను ప్రత్యయములు చేరుటవలన వండెడి, వండెడు, వండుచున్న, వండఁగల, వండిన, వండని - అను విశేషణము లేర్పడును. ఇవియేకాక ఇ, కఁ, నుఁ, నను, ఢును, చును అను ప్రత్యయములు చేరుటవలన వండి, వండక, వండను, వండినను, వండుడును, వండుచును - అన్న అసమాపక క్రియారూపము లేర్పడును.

ఇవి యవ్యయములలో కూడ చేరును. పైని చెప్పిన యీ ప్రత్యయములతో నున్నవికూడ కృదంతములే. పూర్వసూత్రమునందు విధింపబడిన ప్రత్యయములే కాక, ఈపరిచ్ఛేదమునందు కొన్ని ప్రత్యయములు విధింపబడనున్నవి. ఈ ప్రత్యయములు పరము లగునపుడు ధాతువుయొక్క అంత్యవర్ణమునకు లోపముకూడ కలుగుచుండును. పూర్వప్రత్యయములు ధాతుసామాన్యమునకు విధింపబడినవి. కాని, యీ ప్రకరణమునందలి ప్రత్యయములు కొన్ని నిర్దిష్టధాతువులకు, నిర్దిష్టములయిన కొన్ని యర్థములందు మాత్రమే కలుగును. పూర్వప్రత్యయములు ధాతువులకుచేరి విశేష్యవిశేషణ రూపములతో పాటుగా, అవ్యయములను కూడ నేర్పరుచుచున్నవి. ప్రస్తుత ప్రత్యయములు విశేష్యవిశేషణములను మాత్రమే యేర్పరుచును. ఈమూడు విధములయిన భేదము లుండుటచేతనే ట, ఖిజీ మున్నగు వానికి పూర్వపరిచ్ఛేదమునందు స్థానము కల్పించి, వక్ష్యమాణములగు కవర్ణకాదులకు ప్రస్తుత పరిచ్ఛేదమున స్థానమును కల్పించుట జరిగినది. ]

ఇకముందు చెప్పబోవు కృత్ప్రత్యయములు భావార్థము, కర్త్రర్థము, కర్మార్థము మున్నగువానిని బోధించును. ఏది యే యర్థమును బోధించునో వ్యవహారమునుబట్టియే గ్రహింపవలయును.

'అఁగు' ధాతువునకు 'క' ప్రత్యయము కలుగగా 'గు' లోపమువలన 'అఁక' అని యగును. దీనికి బంధనము అని యర్థము. ఇచ్చట క వర్ణకము భావార్థమునందు కలుగును. 'మొలచు' ధాతువునకు క ప్రత్యయము కర్త్రర్థమునందు చేరగా 'మొలక' అని యగును. దీనికి నవోద్భిదము (క్రొత్తగా మొలచినది) అని యర్థము. 'ఏలు' ధాతువునకు 'ఇక' వర్ణకము కలిగి 'ఏలిక' అని యగును; దీనికి పాలకుఁడు అని యర్థము. ఇచ్చట 'ఇక' కర్త్రర్థమునందు కలుగును. 'ఇక' వర్ణకము

'కోరు' ధాతువుపై చేరగా 'కోరిక' అని యగును. ఇచ్చటి ప్రత్యయము భావార్థమును బోధించునపుడు 'వాంఛ' యను నర్థమును, కర్మార్థమును బోధించునపుడు వాంఛితము (కోర బడునది) అను నర్థమును దెలుపును. మూఁగు ధాతువునకు క వర్ణకము కర్త్రర్థమున చేరి 'మూఁక' అని యగును. దీనికి సంఘము (మూగిన జన సమూహము) అని యర్థము. ఆడు ధాతువునకు కర్మార్థమున ఇక వర్ణకము కలుగగా 'ఆడిక' అని యగును. దీనికి నింద (పలుకబడునది) అని యర్థము ఓడు ధాతువునకు కర్త్రర్థమున 'ఇక' కలిగి 'ఓడిక' అని యగును. దీనికి స్రోతస్సు (ప్రవహించునది) అని యర్థము.

**2.** ఇటం గృత్కగతపవేములు పరంబులగునపుడు క గ చ య వ లకు లోపం బగు. (బా - ౨)

కృత్సంబంధులగు కాదులు పరంబులగునపుడు ధాతువునంతంబు లగు క గ చ య వ లకు లోపంబగు మీఁది లక్ష్యంబులం జూడంబడు.

వ్యాఖ్య - 'ఇట' ననగా ఈ కృదంత పరిచ్ఛేదమునం దని యర్థము. ఈ సూత్రముచేత చెప్పబడు కార్యము కృత్సామాన్యము పరమగునప్పుడు కాక, ఈ పరిచ్ఛేదమునందలి కృత్తులకు మాత్రమే నియతము చేయుటకై 'ఇట' నను మాట స్వప్రయోజనముగా వాడబడినది. కృత్ప్రత్యయములకు సంబంధించిన క, గ, త, ప, వ, ఇమి అన్నవి పరములగునపుడు ధాతువు యొక్క కొననున్న క, గ, చ, య, వ అను వర్ణములకు లోపము కలుగు నని సూత్రార్థము.

ఉదాహరణములు ముందు ముందు ప్రదర్శింపబడును.

[ఇచట క గ త ప వే ము లు అని యున్నప్పుడు ఆయావర్ణములతో ప్రారంభములగు ప్రత్యయములు అని సూరి తాత్పర్యము. క యనుటచేత కు,కు వ యను ప్రత్యయములను-గ యనుటచేత గడి యను ప్రత్యయమును-త యనుటచేత త, తజ్ అను ప్రత్యయములను - ప, యనుటచేత ప, పు అను ప్రత్యయములను - వడి యనుటచేత వడి, వి, వు అను ప్రత్యయములను సూరి సంగ్రహించుకొన గలిగెను, అట్లే 'ఇమి' అనుటకు బదులుగా 'ఇ' అని యుండవలసినది. కాని అట్లయినచో ఇ, ఇక, ఇకి అను ప్రత్యయములు కూడ గ్రహింపబడవలసివచ్చును. అవి పరమగునప్పుడు లోపము కలుగదు. కావుననే స్పష్టముగా 'ఇమి' అని పూర్తి ప్రత్యయమునే సూత్రమునందు నిబద్ధము చేసెను. ఇంకొక్క విషయము. క గ చ య వ లకు అని కేవల హల్లులనే గ్రహించినను, వాని మీది యచ్చులతో పాటుగానే వానికి లోపము వచ్చును. దీనిని గుర్తుంచుకొనుట యవసరము.]

'ఆఁగు' నకు కవర్ణకము రాగా గు వర్ణము లోపించి 'ఆఁక' అని యగును. పూర్వపరిచ్ఛేదమునందు 'కజి' యను కృత్ప్రత్యయము కలదు. అది పరమగునప్పు డీలోపము కలుగదు. 'ఆఁగక' అనియే యగును. 'ఇట' నని యనుటచేత ఈ ప్రయోజనమును గమనింపవలయును.

### 3. క వర్ణకం బలుగ్వాదుల కగు. (బా - ౩)

అలుగు - అలుక॥ ఆఁగు - ఆఁక॥ ఎఱుఁగు - ఎఱుక॥ ఇట బిందులోపంబు. ఇట్లు కొన్నింటి గ్రహించునది॥ కడఁచు - కడఁక॥ కలఁగు - కలఁక॥ కాఁగు - కాఁక॥ తునుఁగు - తునుక॥ నడచు - నడక॥ నలఁగు - నలఁక॥ పోవు - పోక॥ మడఁగు - మడఁక॥ మలఁగు - మలఁక॥ మునుఁగు - మునుక॥ మూఁగు - మూఁక॥ మొలచు - మొలక। వచ్చునకు రా-

రాక॥ వంగు - వంక॥ వీఁగు - వీఁక॥ ఇక క పు లు పరంబులగునపుడు కనునకు దీర్ఘంబగు - కానుక॥ కినియు ముదియుల కుత్వంబు నగు. కినియు - కినుక॥ ముదియు - ముదుక॥ ఇత్యాదు లలుగ్వాదులు.

వ్యాఖ్య - అలుగు మున్నగుధాతువులకు 'క' యను ప్రత్యయము కలుగునని సూత్రార్థము. వెనుకటి సూత్రముచేత 'గు' వర్ణమునకు లోపము కలుగగా అలుక అని యగును. ఆఁక, కడఁక, కలఁక, కాఁక మున్నగునవి యిట్టి రూపములే. కొన్ని యెడల వెనుకటి బిందువునకు లోపము కలుగును. 'ఎఱుఁగు' అను ధాతువునకు 'క' వర్ణకము కలుగును. బిందువునకును లోపమగును. అప్పుడు 'ఎఱుక' అని యగును. తునుక, మునుక మున్నగునవి యిట్లు బిందులోపము కలిగిన వానికి ఉదాహరణములు.

'వచ్చు' అను ధాతువునకు కప్రత్యయము పరమగునపుడు 'రా' యని యాదేశమగును, అప్పుడు 'రాక' యని యగును.

ఇక, క, పు - అను మూడు ప్రత్యయములును పరములగునపుడు 'కను' ధాతువుయొక్క తొలియచ్చునకు దీర్ఘమగును. ప్రస్తుతసూత్రముచేత 'క' వర్ణకము విధింపబడుచున్నది. అప్పుడు కను + క = కానుక యని యగును.

[ 'ఇక' ప్రత్యయము అంజు మున్నగువానికి నగును. వానియందు 'కను' ధాతువు కలదు. కనుక + ఇక అని యుండగా ప్రస్తుత సూచనమువలన దీర్ఘము రాగా 'కానిక' అని యగును. 'పు' అను ప్రత్యయము మాయు మున్నగు వానికి నగును. అందు నైతము 'కను' ధాతువు కలదు. కను + పు అని యుండగా తొలియచ్చునకు దీర్ఘము కలిగి 'కానుపు' అని యగును. ]

కినియు, ముదియు, అను ధాతువులకు యవర్ణము లోపించుటయే కాక, వెనుకటి ఇత్వమునకు ఉత్వముకూడ నగును. అప్పుడు కినుక, ముదుక - అను రూపము లేర్పడును. ఇత్యాద్యు లలుగ్వాదులని యనుటచేత ఇట్టి వింకను గలవని యర్థము.

4. ఇమి వర్ణకంబు కలుగ్వాదుల కగు. (బా - ౪)

కలుగు - కలిమి॥ ఓరుచు - ఓరిమి॥ కూరుచు - కూరిమి॥ నేరుచు - నేరిమి॥ ప్రేలుచు - ప్రేలిమి॥ బడియు - బడిమి॥ బ్రదుకు - బ్రదిమి॥ ఒడ్డు - ఒడ్డిమి॥ తాలు - తాలిమి.

వ్యాఖ్య - కలుగు మున్నగు ధాతువులకు 'ఇమి' యను ప్రత్యయము కలుగునని సూత్రార్థము. ఇమి పరమగుచుండగా ధాతువు చివరనున్న క గ చ య వ లకు లోపము కలుగును. 'కలుగు' ధాతువునకు 'ఇమి' పరమందుండగా 'గు' వర్ణము లోపించును. అప్పుడు కలు + ఇమి కలిమి అని యగును. ఒడ్డు, తాలు - అను ధాతువులకు చివర కగచయవ లలో నేదియు లేదు. అందుచేత, లోపప్రసక్తి కలుగదు. ఒడ్డు + ఇమి = ఒడ్డిమి అని యగును. తాలిమి అను కృదంతముకూడ నిట్లే యేర్పడును.

5. తజ్వర్ణకంబు చేయ్యాదుల కగు. (బా - ౫)

చేయు - చేంత॥ అలయు - అలంత॥ కూయు - కూంత॥ గీయు - గీంత॥ నేయు - నేంత॥ పూయు - పూంత॥ పోయు - పోంత॥ మూయు - మూంత॥ మేయు - మేంత॥ మ్రోయు - మ్రోంత॥ రోయు - రోంత॥ లాయు - లాంత॥ వ్రాయు - వ్రాంత॥ వ్రేయు - వ్రేంత.

వ్యాఖ్య - చేయు మున్నగు ధాతువులకు తజ్ ప్రత్యయము కలుగునని సూత్రార్థము. 'తజ్' అని 'జ' యను ఇత్సంజ్ఞను వాడియుండుటచేత "జిత్తు బిందుపూర్వం బగు" నన్న నియమమునుబట్టి 'త' అను ప్రత్యయమునకు ముందు బిందువు కూడ నుండును. ఈధాతువు లన్నింటియందును'. చివర య వర్ణమే కలదు. అది పూర్వసూత్రము (బా - 2) చేత లోపింపగా చేయు + తజు - చే + తజు - చేఁత అని యగును. తక్కిన వాని ప్రక్రియకూడ ఇట్లే యుండును.

[ఇత్యాదులు చేయ్యాదులు అని యనకపోవుటచే నిట్టి వింకలేవనియే సూరి తాత్పర్యము కావలయును. యకారాంతములై తజ్వర్ణకమును పొందు ధాతువులింక లేవనియే యనిపించును. కాని తజ్వర్ణకమును పొందు ధాతువు 'ఈను' అన్నది కనిపించుచున్నది. ఇది ను వర్ణాంతము. కావున తజ్ పరమగునపుడు దీని 'ను' వర్ణమునకు లోపమును విధించుకొనవలయును. అప్పుడు 'ఈఁత' అని యగును. దీనికి 'కానుపు' అని యర్థము.]

## 6. కువవర్ణకం బడంగ్వాదుల కగు. (బా - ౬)

అడఁగు - అడఁకువ॥ ఎఱుఁగు - ఎఱుఁకువ॥ కలఁగు - కలఁకువ॥ నలఁగు - నలఁకువ॥ పెనఁగు - పెనఁకువ॥ పొలయు - పొలకువ॥ మఱచు - మఱకువ॥ మెలఁగు - మెలఁకువ॥ లోఁగు - లోఁకువ॥ వేగు - వేకువ.

వ్యాఖ్య - అడఁగు మున్నగు ధాతువులకు 'కువ' యను ప్రత్యయము కలుగునని సూత్రార్థము. అడఁగు + కవ అని యుండగా గువర్ణమునకు లోపము కలిగి 'అడఁకువ' అని యగును. తక్కినవానికిని రూపనిష్పత్తి యిట్లే యుండును.

## 7. ట వర్ణకం బాడ్వాదుల కగు; నగుచో నంతలోపం బగు. (బా - ౭)

ఆడు - ఆట॥ ఊరు - ఊట॥ ఊఅడు - ఊఅట॥ ఏఁకరు -ఏఁకట ఓడు - ఓట ॥ తివురు - తివుట॥ తేరు - తేట॥ త్రిమ్మరు - త్రిమ్మట॥ పండు - పంట॥ పాఱు - పాట ॥ మండు - మంట॥ వండు - వంట॥ వేసరు- వేసట॥ అనుప్రయుక్తం బయిన యాటశబ్దంబు ప్రాయికంబుగాఁ గ్లీబసమం బగు. కోలాటము -పోరాటము - మంద్రాటము॥ ఇత్యాదులు.

వ్యాఖ్య - ఆడు మున్నగు ధాతువులకు 'ట' యను ప్రత్యయము కలుగును. అప్పుడు ధాతువుయొక్క అంతమున నున్న యక్షరమునకు లోపము కలుగును - అనిసూత్రార్థము.

[ "ఇటం గృత్కృగతపవేములు" అని మొదలయిన సూత్రమున 'ట' వర్ణము పేర్కొనబడలేదు. ఆసూత్రమునుబట్టి యిచ్చట లోపము రాదు. కావున టవర్ణము పరమగునప్పుడు ధాతువుయొక్క అంత్యాక్షరమునకు లోపమును విధించుకొనుట యావశ్యక మయ్యెను. ]

ఆడు + ట అని యుండగా 'డు' లోపించు 'ఆట' అని యగును. తక్కినరూపములు నిట్లే యేర్పడును. ఆడుధాతువు అనుప్రయుక్తముకాగా ఏర్పడు కోలాడు, పోరాడు, మంద్రాడు మున్నగు వానికిని టవర్ణకము పరమగును. అప్పుడు ప్రాయికముగా నపుంసకత్వము కలుగును. అనగా ముువర్ణకము చేరి కోలాటము, పోరాటము, మంద్రాటము - అని యగును. ప్రాయికముగా నని యనుటచే పోరాట, నీరాట - మున్నగు రూపములు కూడ సమ్మతములే యగును.

[ భావమునందు విధించిన ట వర్ణకము కూడ (క్రియ - 35) కృత్ప్రత్యయమే. అనగా రెండు విధములయిన టవర్ణకములు గలవని యర్థము. వండుట మున్నగుచోట 'డు' లోపము కలుగదు. ఇది భావమునందలిది. వంట మున్నగుచోట్ల డు లోపము కలుగును. ఇది కర్మార్థకము. ]

## 8. టు వర్ణకంబు పడ్వాదుల కగు; నగుచో నవి యాద్యక్షర శేషంబులయి దీర్ఘంబు నొందు. (బా - లా)

పడు - పాటు॥ చెడు - చేటు॥ అడుచు - ఆటు॥ కఱచు - కాటు॥ పొడుచు - పోటు॥ వయిచు - వాటు॥ ఏయు - ఏటు॥ ఓడు - ఓటు॥ వ్రేయు - వ్రేటు.

వ్యాఖ్య - పడు మున్నగు ధాతువులకు టువర్ణకము కలుగును. అప్పుడా ధాతువులయొక్క మొదటి యక్షరములు మాత్రమే మిగిలి, తక్కినవి లోపించును. మిగిలియున్నట్టి ఆ యక్షరములు దీర్ఘమునొందును - అని సూత్రార్థము.

పడుధాతువునకు టువర్ణకము పరముకాగా ప్రస్తుత సూత్రముచేత ఆద్యక్షరము శేషించును. అనగా 'ప' యన్నది మాత్రమే మిగులును. అప్పుడు దానికి దీర్ఘము కలుగగా 'పాటు' అని యగును. 'చేటు' అన్నది కూడ ఇట్టిదే. అడుచు, కఱచు మున్నగుధాతువులందు మొదటి యక్షరము శేషింపగా, రెండేసి యక్షరములు లోపించుచున్నవి. అప్పుడు శేషించిన ఆ యక్షరములకు దీర్ఘము కలిగి ఆటు, కాటు మున్నగు రూపము లేర్పడును. పోటు, వాటు అన్నవికూడ ఇట్లే యేర్పడును.

చివరనున్న ఏయు, ఓడు, వ్రేయు - అన్నవి రెండేసి యక్షరములు గల ధాతువులు. వీనికి సహజముగానే తొలుత

దీర్ఘమున్నది. టు వర్ణకము పరమగునపుడు ఆద్యేతరము శేషింపగా ఏటు, ఓటు, వ్రేటు అని యగును.

[ బాలవ్యాకరణమున సంధి పరిచ్ఛేదమున నొకమారు 'పడ్వాదులు' వచ్చును. అక్కడ పడు, పట్టు, పెట్టు - మున్నగునవి గ్రహింపబడును. ఇక్కడి 'పడ్వాదులు' అవికావు. పడు, చెడు, అడుచు మున్నగువాని నిక్కడ గ్రహింపవలయును. కావున వీనిని వేరువేరుగా గుర్తించుకొనుట యవసరము. ]

## 9. ప వర్ణకంబు తిరియ్యాదుల కగు. (బా - కా)

తిరియు - తిరిపము॥ కలియున కత్వంబు నగు - కలపము॥ పొలయు - పొలపము॥ మురియు - మురిపము॥ సొలయు - సొలపము॥ వలియు - వలిపము.

వ్యాఖ్య - తిరియు మున్నగు ధాతువులకు ప వర్ణకము కలుగునని సూత్రార్థము. ఇచ్చట గ్రహింపబడున వన్నియును నపుంసకతుల్యము లగుటచేత, ము వర్ణాంతములై యుండునని యుదాహరణములనుబట్టి గ్రహింపవలసి యున్నది.

'తిరియు' నకు 'ప' వర్ణము రాగా 'యు' లోపించును. అప్పుడు ము వర్ణకము చేరి 'తిరిపము' అని యగును. పొలపము, మురిపము - మున్నగు కృదంతము లిట్లే యేర్పడినవి. 'కలియు' ధాతువునకు పవర్ణకము కలుగగా 'యు' లోపించును. అప్పుడు 'కలి + ప + ము' అని యుండును. ఇప్పుడు ఇత్వమునకు అత్వము కలిగి 'కలపము' అని యగును.

**10. డయ్యు దయ్యు నొచ్చు పుచ్చుల కివర్ణకం బగు; అగుచో వానికడ హల్లులు పకారంబు లగు.**

(ప్రౌ - ౧)

డప్పి - దప్పి - నొప్పి - పుప్పి

వ్యాఖ్య-డయ్యు, దయ్యు, నొచ్చు, పుచ్చు-అను నాలుగు ధాతువులకును ఇ అను కృత్ప్రత్యయము కలుగును. అప్పుడు వాని చివరి హల్లులు పకారములగును - అని సూత్రార్థము.

డయ్యు + ఇ - అని యుండగా 'య' కారమునకు 'ప' కారము కలిగి డప్పు + ఇ = డప్పి అని యగును. ఇట్లే 'దయ్యు' నకు కృదంతరూపము దప్పి అని యేర్పడును. నొచ్చు ధాతువు నకు ఇవర్ణకను కలుగగా 'చ్చు' స్థానమున 'పు' నిల్చును. అప్పుడు 'నొప్పి' అని యగును. 'పుచ్చు' ధాతువునకు 'పుప్పి' అన్నదియు నిట్లే యేర్పడును. ఇది బాలవ్యాకరణమునకు పూరకము.

[ క్త్వార్థమునందగు ఇవర్ణకము కూడ కృత్ప్రత్యయమే. కాని, అది పరమగునప్పుడు పాదేశము కలుగదు. ]

**11. తవర్ణకం బావులించు లోనగువాని కగు. (బా - ౧౦)**

ఆవులించు - ఆవులింత॥ ఇగిలించు - ఇగిలింత॥ ఓకిలించు - ఓకిలింత॥ కుళ్లగించు - కుళ్లగింత॥ కుసిలించు - కుసిలింత॥ కొక్కరించు - కొక్కరింత॥ కొప్పరించు - కొప్పరింత॥ గిలిగించు - గిలిగింత॥ ఇత్యాదు లెఱుంగునది.

వ్యాఖ్య - ఆవులించు మున్నగు ధాతువులకు 'త' అను ప్రత్యయము వచ్చునని సూత్రార్థము. ఆవులించు + త - అని యున్నపుడు 'చ' కారమునకు లోపము రాగా ఆవులింత అని యగును. ఇట్లే తక్కినవానికిని రూపనిష్పత్తి యుండును.

[ఉదాహరణము లన్నియు ఇంచుగాగమముతోడి ధాతువులై యున్నవి. వీనినిబట్టి చూడగా, ఇట్టి వానికి మాత్రమే త వర్ణక మగునని సూరి నిశ్చయ మేమో యనిపించును. కాని యీ త వర్ణకము అన్యధాతువులకు సైతము వచ్చుచున్నది. కలఁగు అన్నది 'త' వర్ణకము రాగా గు లోపము పొంది కలఁత అని యగును. ఇట్లే నలఁగు - నలఁత; మడఁగు - మడఁత అను రూపముల నొందును. 'ఈఁదు' ధాతువునకు 'త' పరమైనపుడు 'ఈఁత' అనియగును. అనగా కగచయవలలో లేని దు వర్ణమునకును లోపము కలుగుచున్నది.]

## 12. పు వర్ణకంబు మాయ్వాదుల కగు. (బా - ౧౧)

మాయు - మాపు॥ మేయు - మేపు॥ అడుచు - అడుపు॥ ఇంచు - ఇంపు॥ ఏఁచు - ఏఁపు॥ ఏచు - ఏపు॥ కను - కానుపు॥ కాచు - కాపు॥ చూచు - చూపు॥ తేఁచు - తేఁపు॥ తోఁచు - తోఁపు॥ త్రేఁచు - త్రేఁపు॥ త్రోచు - త్రోపు॥ పూఁచు - పూఁపు॥ పెనుచు - పెనుపు॥ పొలుచు - పొలుపు॥ ప్రోచు - ప్రోపు॥ మెచ్చు - మెప్పు॥ మోచు - మోపు॥ వలచు - వలపు॥ వాచు - వాపు॥ ఇత్యాదులు మాయ్వాదులు.

వ్యాఖ్య - మాయు మున్నగు ధాతువులకు 'పు' అను ప్రత్యయము కలుగునని సూత్రార్థము. మాయు+పు - అని యుండగా యకారమునకు లోపము కలిగి 'మాపు' అని యగును.

'కను' ధాతువుసకు 'పు' పరమైనపుడు తొలి హ్రస్వమునకు దీర్ఘమై 'కానువు' అని యగును.

మెచ్చు ధాతువునకు పు వర్ణము పరమగునపుడు ద్విత్వము కూడ కలుగుచున్నది. మెచ్చు + పు అని యున్నపుడు చు లోపము కలుగగా 'మె + పు' అనియుండి, ద్విత్వము కలుగగా 'మెప్పు' అని యగును.

ఇత్యాదులు మాయ్యాదు లని యనుటచే నిట్టివింకను గలవని భావము.

**13.** రాయున కిడి వర్ణకంబు నగు. (ప్రౌ - ౨)

రాయిడి - రాపు

వ్యాఖ్య - 'రాయు' అను ధాతువునకు ఇడి యను ప్రత్యయముకూడ నగునని సూత్రార్థము. సముచ్చయార్థకము చేత చేయ్యాదులలోనిదై పు వర్ణమును గూడ పొందవచ్చును. అప్పుడు 'రాపు' అని యగును. అది బాలవ్యాకరణముచేతనే సిద్ధించును. ప్రస్తుత సూత్రముచేత రాయు + ఇడి అనియుండి రాయిడి అని యగును.

**14.** ఇక వర్ణకం బంజ్వాదుల కగు. (బా - ౧౨)

అంజు - అంజిక ॥ అమరు - అమరిక ॥ అరయు - అరయిక ॥ అలయు - అలయిక ॥ ఆడు - ఆడిక ॥ ఓడు - ఓడిక ॥ ఓపు - ఓపిక ॥ కను - కానిక ॥ కూడు - కూడిక ॥ కోరు - కోరిక ॥ పొందు - పొందిక ॥ పోలు - పోలిక ॥ తూఁగు తూఁగున కగు - తూనిక ॥ ఇత్యాదు లంజ్వాదులు.

వ్యాఖ్య - అంజు మున్నగు ధాతువులకు 'ఇక' యను ప్రత్యయము కలుగునని సూత్రార్థము. అంజు+ఇక=అంజిక అని యగును; తక్కినవియు నిట్లే యేర్పడును. కనుక ధాతువు యొక్క తొలి యచ్చునకు దీర్ఘము కలుగగా కను+ఇక= కానిక అని యగును. తూఁగు+ఇక అని యున్నప్పుడు తూఁగు నకు 'తూను' అన్న యాదేశము కలుగగా 'తూనిక' అని యగును. ఇత్యాదులని యనుటచేత ఇట్టి వింకను గలవని తాత్పర్యము.

**15.** అప్పాదులకు నజీ యగు. (బా - ౧౩)

అప్పు - అప్పన ॥ ఒజ్జ - ఒజ్జన ॥ ఒప్పు - ఒప్పన ॥ గట్టు - గట్టన ॥ గడ - గడన ॥ దట్టు - దట్టన ॥ పాట - పాటన ॥ మన్ను - మన్నన ॥ పీచు - పీవన.

వ్యాఖ్య - అప్పు మున్నగు ధాతువులకు 'న' అను ప్రత్యయము కలుగును. అప్పు+న=అప్పన. తక్కినవన్నియు నట్టివే. 'నజీ' యని జిత్తును వాడుటచే 'పీచు' ధాతువుయొక్క ఉత్వమునకు అత్వము కలుగును. "ఆగమాన్య చకారంబుల కద్విరుక్తంబులకు మత్తు పరంబగునపుడు పవ లగు" నన్న (బా. క్రి. ౭౭) సూత్రమునుబట్టి చకారము వకారమై 'పీవన' అని యగును.

**16.** ఈర్చుబ్బు కందు దువ్వు వడ్డించుల కైన వర్ణకం బగు; అగుచో ఈర్చు ఉబ్బుల చకార బకారంబులు పకారంబు లగు: వడ్డించు నించు లుప్తం బగు. (ప్రౌ - ౩)

ఈర్పెన - ఉప్పెన - కందెన - దువ్వెన - వడ్డెన.

వ్యాఖ్య - ఎన యను ప్రత్యయము ఊర్చు, ఉబ్బు, కందు, దువ్వు, వడ్డించు అను ధాతువులకు కలుగును. అప్పుడు ఊర్చు, ఉబ్బు అను ధాతువుల చబలకు పత్వము కలుగును; వడ్డించు యొక్క ఇంచునకు లోపము కలుగును - అని సూత్రార్థము.

కందు + ఎన = కందెన. ఇట్టిదే దువ్వెన. 'ఊర్చు' నకు ఎన పరమైనపుడు చకారమునకు పకార మాదేశమై ఊర్పు + ఎన = ఊర్పెన అని యగును. 'ఉబ్బు' యొక్క బకారమునకు పకారాదేశము కలుగగా ఉప్పు + ఎన = ఉప్పెన అని యగును. వడ్డించు + ఎన అని యుండగా 'ఇంచు' లోపించును. అప్పుడు వడ్డ + ఎన = వడ్డెన అని యగును. [దీనికి వడ్డన యను రూపాంతరము కూడ కలదు. బాలవ్యాకరణమునందలి అప్వాదులలో 'వడ్డ' అన్నది చేరినయెడల 'వడ్డన' అన్న కృదంత మేర్పడును.]

**17. పుర వర్ణకంబు కాఁచు, దాఁచు, దాయ్యాదుల కగు. (ప్రౌ - ౪)**

కాఁపురము - దాఁపురము - దాపురము॥ మొ.

వ్యాఖ్య - కాఁచు, దాఁచు, దాయు మున్నగు ధాతువులకు 'పుర' యను ప్రత్యయము కలుగునని సూత్రార్థము. "ఇటం కృత్కగతపవేములు" అని మొదలయిన సూత్రమునుబట్టి ఇచ్చటి చయలకు లోపము వచ్చును. ఇవన్నియు నపుంసకతుల్యము లగుటచే మువర్ణకమును కూడ నొందును అప్పుడు 'కాఁచు + పుర + ము = కాఁ + పురము = కాఁపురము అని యగును. ఇట్టివే తక్కిన రూపములుకూడ

## 18. బడి యేల్వాదుల కగు. (బా - ౧౪)

ఏలుబడి - కట్టుబడి - కనుబడి - కొనుబడి - గిట్టుబడి - చెల్లుబడి - చేరుబడి - తగులుబడి - తీయుబడి - పెట్టుబడి - పోబడి - మ్రొక్కుబడి - వచ్చుబడి - సాగుబడి.

వ్యాఖ్య - ఏలు మున్నగు ధాతువులకు బడి యను ప్రత్యయము కలుగునని సూత్రార్థము. ఏలు + బడి = ఏలుబడి కట్టుబడి మున్నగునవి యిట్టివే. 'పోవు' ధాతువునకు 'బడి' పరమగునపుడు వువర్ణమునకు లోపము కలిగి 'పోబడి' యను రూపము కలుగుచున్నది.

[ వచ్చుధాతువునకు బడి పరమగునపుడు 'వచ్చుబడి' యన్నరూపము మాత్రమే చూపబడినది. వచ్చునకు 'రా' యను నాదేశము కలిగి 'రాబడి' అనియు నగును ఇత్యాదులు మున్నగు విధముగా లేకపోయినను దిగుబడి, జరుగుబడి మున్నగు కృదంతము లిట్టి వింకను గలవు.]

## 19. గడ చేర్వాదుల కగు. (బా - ౧౫)

చేరుగడ - తిరుగడ - తీయుగడ - తేగడ - తేయుగడ - మనుగడ - విడుగడ - వీడుగడ.

వ్యాఖ్య - చేరు మున్నగు ధాతువులకు గడ వర్ణకము కలుగునని యర్థము. చేరు + గడ = చేరుగడ. 'తిరుగు' ధాతువునకు 'గడ' పరమగునపుడు (బా 2) గువర్ణము లోపించి 'తిరుగడ' అని యగును. తేయు + గడ అని యుండగా యువర్ణ లోపమై 'తేగడ' అని యగును.

**20.** ఎక్కు దిగులకుం బ్రేరణార్థంబున మతివత్యయం బగు; అగుచో నెగు ఎక్కున కాదేశం బగు. (ప్రౌ - ౫)

ఎగమతి - దిగుమతి॥ ఇట్లు ఎగువ.

వ్యాఖ్య - ఎక్కు, దిగు అనురెండు ధాతువులకు ప్రేరణార్థమునందు 'మతి' యను ప్రత్యయము కలుగును; అప్పుడు 'ఎక్కు'నకు బదులుగా 'ఎగు' అని యగును-అని సూత్రార్థము

[బాలవ్యాకరణమునందు మొదటి సూత్రము వృత్తియందు "భావ కర్తృ కర్మాద్యర్థంబులు" కృత్తులకు కలవని తెలుపబడినది. ఆది శబ్దము చేత ప్రేరణార్థకమును సైతము స్వీకరింపవచ్చును. ప్రస్తుత లక్ష్యములు ప్రేరణార్థమును దెలుపును.]

ఎక్కు + మతి అని యుండగా 'ఎగు' అను నాదేశము కలిగి 'ఎగుమతి' అని యగును. దిగు + మతి = దిగుమతి యని యగును. 'ఇట్లు ఎగువ' యని యనుటచే 'ఎగువ' యనుచోట కూడ నాదేశ మిట్లే కలుగునని యర్థము.

['వ' యను కృత్ప్రత్యయమును విధించుట యెచ్చటను జరుగలేదు. ఇచ్చట ప్రౌఢవ్యాకరణకారుడు స్మరించియు, విధించుట మరచెను ఎగువ, దిగువ, నడవ - మున్నగు వానియందు 'వ' యను ప్రత్యయమే కలదు.]

**21.** ఇకి కోర్వాదుల కగు. (బా - ౧౬)

కోరికి - పూనికి - పోలికి - మనికి - వినికి, చూడు చూచున కగు - చూడికి.

వ్యాఖ్య. - కోరు మున్నగువానికి 'ఇకి' యను ప్రత్యయము కలుగునని సూత్రార్థము. కోరు + ఇకి = కోరికి. 'చూచు'

ధాతువునకు ఇకి పరమైనపుడు 'చూడు' అన్న యాదేశము కలిగి 'చూడికి' అని యగును.

**22.** వు వర్ణకంబు మన్వాదుల కగు. (బా - ౧౬)

మను - మనువు ॥ కాచు - కావు ॥ కొలుచు - కొలవు ॥ చచ్చు - చావు ॥ తడయు - తడవు ॥ నిలుచు - నిలువు ॥ నొచ్చు - నోవు ॥ పూచు - పూవు ॥ ప్రుచ్చు - ప్రువ్వు.

వ్యాఖ్య - మను మున్నగు ధాతువులకు 'వు' అను ప్రత్యయము కలుగునని సూత్రార్థము. మను + వు - మనువు. కాచు మున్నగు ధాతువులయొక్క చ య లకు లోపము (బా - 2) కలుగును. అప్పుడు కాచు + వు = కా + వు = కావు అను విధముగా నేర్పడును.

'చచ్చు'నకు 'వు' వర్ణకము పరమైనపుడు 'చా' యన్న యాదేశము కలిగి 'చావు' అని యగును. అట్లే 'నొచ్చు'నకు 'నో' యన్న యాదేశము కలిగి 'నోవు' అని యగును. ప్రుచ్చునకు వు పరమైనప్పుడు చ్చు వర్ణము లోపించును; వకారమునకు ద్విత్వము కలిగి 'ప్రువ్వు' అని యగును.

**23.** వు వర్ణం బులియ్యాదుల కగు. (ప్రౌ - ౬)

ఉలివు మొ.

వ్యాఖ్య - ఉలియు మున్నగు ధాతువులకు 'వు' అను ప్రత్యయము కలుగునని సూత్రార్థము. ఉలియు + వు అని యుండగా యుకారమునకు లోపము కలిగి 'ఉలివు' అని యగును.

బాలవ్యాకరణము మన్వాద్యులకు వు వర్ణకమును విధించి నది. 'ఉలియు' ధాతువుకూడ మన్వాదులలో చేరి 'ఉలివు' అను కృదంతరూపము నొందవచ్చును. కావున ఈ సూత్రము ఆవశ్య కము కాదు.

**24.** అ వర్ణకంబు గిఱ్ఱాదుల కగు. (బా - ౧౮)

గిఱ - ఊఁద - ఎండ్ - కాయు - చదియ - తునియ - పరియ - పాయ - పిసుచ - మీట - ముడియ - వదర - వ్రయ్య.

వ్యాఖ్య - గిఱు మున్నగు ధాతువులకు 'అ' యను ప్రత్యయము కలుగును. గిఱు + అ = గిఱ. తక్కినవియు నట్టివే.

**25.** అక వర్ణకంబు మాఱ్ఱాదుల కగు. (బా - ౧౯)

మాఱు - మాఱకము ॥ అమ్ము - అమ్మకము ॥ అంపు - అంపకము ॥ పంచు - పంపు - పంపకము ॥ వండు డ కారంబు ట కారం బగు - వంటకము ॥ తోము - తోమకము ॥ అద్దు - అద్దకము.

వ్యాఖ్య - మాఱు మున్నగువానికి 'అక' అను ప్రత్యయము కలుగునని యర్థము. ఆపిమ్మట 'ము' వర్ణకము కూడ కలుగుచుండుట ప్రయోగములనుబట్టి తెలియుచున్నది. మాఱు + అక + ము - మాఱకము. 'పంచు' ధాతువుయొక్క చకారమునకు పత్వము కలుగగా 'పంపకము' అని యగును. వండు ధాతువుయొక్క 'డు' వర్ణమునకు బదులుగా టు వర్ణము కలుగగా వండు + అకము = వంటు + అకము = వంటకము అని యగును.

[సూరి ఉదాహరణములయందు క్రమము ననుసరించుట పరిపాటి. కాని ప్రస్తుత సందర్భముకడ అంతగా పాటింపలేదు. పాటించువెడల: అంపకము, అద్దకము, అమ్మకము, తోమకము, పంపకము, వంటకము - అన్న క్రమములో నుండును.]

26. డు వర్ణకం బాఱ్వాదుల కగు; నగునపుడు పకారంబు చయల కగు. (బా - ౨౦)

ఆఱు - ఆఱుడు॥ అమ్ము - అమ్ముడు॥ అల్లు - అల్లుడు॥ ఎక్కు - ఎక్కుడు॥ క్రమ్ము - క్రుమ్ముడు॥ చోపు - చోపుడు॥ త్రొక్కు - త్రొక్కుడు॥ త్రోచు - త్రోపుడు॥ దంచు - దంపుడు॥ దాఁచు - దాఁపుడు॥ దిగు - దిగుడు॥ దోఁచు - దోఁపుడు॥ పెంచు - పెంపుడు- (వ్రేఁపుడు)॥ ప్రాఁకు - ప్రాఁకుడు॥ మాయు - మాపుడు॥ రాచు - రాపుడు॥ (వ్రేఁచు - వ్రేఁపుడు)॥ ఇత్యాదులు.

వ్యాఖ్య - ఆఱు మున్నగు ధాతువులకు డు వర్ణకమగును. అప్పుడు ధాతువుయొక్క కొననున్న చకార యకారములకు పకారము కలుగును - అని సూత్రార్థము. ఆఱు + డు = ఆఱుడు.

'త్రోఁచు' ధాతువుయొక్క చకారమునకు పకారము రాఁగా త్రోచు + డు - త్రోపు + డు = త్రోపుడు అని యగును. దంపుడు, దాఁపుడు, దోఁపుడు, పెంపుడు, రాపుడు అన్నవి యిట్టివే. 'మాయు' ధాతువుయొక్క యకారమునకు పకారము రాఁగా 'మాపుడు' అని యగును.

[పై లక్ష్యములలో పెంచు ధాతువునకు 'పెంపుడు' అనియే కాక 'వ్రేఁపుడు' అన్నదికూడ కృదంతముగా చూపబడినది. 'వ్రేఁపుడు' అను

మాటకు 'అధికుఁడు' అని యర్థము. ఇది 'పెంచు' ధాతువునుండి వచ్చిన దనుట సమర్థనీయము కాదు. సూరికూడ అట్లు వ్రాసియుండడు. ఎక్కడనో యుండవలసిన యేదోమాట మారుపాటు నొంది ఇక్కడికి వచ్చియుండును. రమణీయ సమీక్షా కారులు 'వ్రేఁగు'నకు ప్రేరణరూపమైన 'వ్రేఁచు' లక్ష్యముగా చూపబడియుండునని, ఎందువలననో అది జారిపోగా, దాని కృదంత రూపమగు 'వ్రేఁపుడు' మాత్రము మిగిలిపోగా, దాని స్వరూపము తెలియక 'వ్రేఁపుడు'గా మ్మార్చి 'పెంపుడు' అను దానియొక్క ప్రక్కకు చేర్చియుందురని యభిప్రాయపడిరి. అదియే జరిగియుండుననుట సమంజసము. పై సూత్రముకడ సైతము ఉదాహరణముల క్రమము మారినది. దానికిని దీనికిని గూడ నడుమ నేదో కారణ ముండి యుండును. కాగా వ్రేఁచు - వ్రేఁపుడు అనియే సూరికి సమ్మతిమగు లక్ష్య మనుకొన్నచో, క్రమమునుబట్టి చివరనుండవలయును. ఇంకొక్క విషయము. 'ఎక్కు' ధాతువునకు డు వర్ణకము పరమైనపుడు 'ఎక్కు' అన్న రూపము మాత్రమే చూపబడినది. 'ఎక్కు' నకు ఆదేశముగా 'ఎగు' వచ్చి 'ఎగుడు' అని కూడ అగును.]

**27.** ఉ వర్ణకం బడుక్వాదుల కగు. (బా - ౨౧)

అడుకు - అంటు . ఒప్పు - ఒలుగు — ఒసఁగు.

వ్యాఖ్య - అడుకు మొదలయిన ధాతువులకు 'ఉ' అన్న ప్రత్యయము కలుగునని సూత్రార్థము. అడుకు + ఉ = అడుకు. తక్కినరూపములు నిట్టివే.

**28.** కాచు . వీచులకు వలివర్ణకం బగు. (ప్రౌ - ౩)

కావలి - వీవలి

వ్యాఖ్య - కాచు, వీచు అను ధాతువులకు 'వలి' యను ప్రత్యయము కలుగునని సూత్రార్థము. ఇక్కడి చకారమునకు

(బా - 2) లోపము రాగా కాచు+వలి=కావలి అని యగును. పీవలి అన్నదికూడ ఇట్లే యేర్పడును.

**29. వడి ప్రభృతు లిట్లెఱుంగునది. (బా - ౨౨)**

వడి. కొలువడి - గెలువడి - నడవడి॥ వ్యతిరేకంబున లేవడి ॥ వి. తనివి - తెలివి - విరివి॥ అవు తగవు - నగవు - ఉఱవు॥ ఇ చేయి - వ్రాయి॥ కలి. కనుకలి - వినుకలి॥ ఇత్యాద్యులు మహాజన వ్యవహారంబుల నెఱుంగునది.

వ్యాఖ్య - వడి మున్నగు ప్రత్యయములు వేని కేయర్థము లందు ప్రయోగింపబడునో చూపిన పద్ధతి ననుసరించి గ్రహింప వలయునని సూత్రార్థము.

కొలుచు, గెలుచు, నడచు - అను ధాతువులకు వడి పరము కాగా చ్చకారమునకు లోపము కలిగి కొలువడి మున్నగు రూపము లేర్పడుచున్నవి. వ్యతిరేకార్థమునందు 'కలుగు' ధాతువు నకు 'లే' యన్న యాదేశము కలిగి లే+వడి=లేవడి యగు చున్నది.

తనియు, తెలియు, విరియు - అను ధాతువులకు 'వి' అను ప్రత్యయము కలుగగా యవర్ణములోపించి తనివి మున్నగు కృదంతము లేర్పడుచున్నవి. తగు, నగు, ఉఱు - అను ధాతువు లకు 'అవు' వర్ణకము పరముకాగా తగవు మున్నగు రూపములు కలుగుచున్నవి. చేయు, వ్రాయు - అను ధాతువులకు ఇవర్ణకము కలిగి చేయి, వ్రాయి అని యగును. కను, విను ధాతువులకు 'కలి' వర్ణకము కలిగి కనుకలి, వినుకలి అని యగును.

కృత్తు లింకను గలవనియు, వానిని పెద్దల వ్యవహార మునుబట్టి గ్రహింపవలయుననియు వ్యాకర్త నిర్దేశము.

# ప్రకీర్ణక పరిచ్ఛేదము:

## 1. పదాద్యంబులు ఋ ౡ వర్ణంబులు రలతుల్యంబులు. (బా - ౧)

అతఁడు ఋషి - ఇట సంధి లేదు॥ ఆ ఋషి - ఇట యడాగమము లేదు॥ వచ్చె ఋషి - వచ్చెన్ ఋషి - వచ్చెను ఋషి - ఇట ద్రుతమునకు లోప సంశ్లేష స్వత్వములు.

వ్యాఖ్య - పదమునకు మొదటనుండు ఋవర్ణము రకారముతోను, ౡ వర్ణము లకారముతోను సమానము లని యర్థము. ఋ ౡ అనునవి అచ్చులు. ర ల లు హల్లులు. అచ్చులయినట్టి ఋ ౡ వర్ణములు వ్యాకరణకార్యవిషయమున తమ ధర్మమును విడనాడి ర, ల అను హల్లుల ధర్మమును చేపట్టునని భావము.

అతఁడు+ఋషి - అని యున్నప్పుడు 'అతఁడు' లోని చివరి ఉత్వమునకు అచ్చు పరమందున్నది. కావున "ఉత్తునకచ్చు పరమగునపుడు సంధి యగు" (బా. సంధి - 1) అను నియమము ప్రకారము సంధి కావలసియుండును. కాని ప్రస్తుతసూత్రము దానిని వారించుచున్నది. ఋ వర్ణమునకు రతుల్యత్వము గలుగుటచేత అచ్చునకు హల్లు పరమగునపుడు సంధి యను ప్రసంగము కలుగదు. పూర్వమందును, పరమందునుగూడ స్వరములే యున్నప్పుడు సంధియను ప్రసంగము కలుగును. కావున ఇచ్చట యథాతథముగా 'అతఁడు ఋషి' యని మాత్రమే యుండిపోవును.

ఆ+ఋషి - అని యున్నప్పుడు దీర్ఘమునకు సంధి లేదు. కావున "సంధిలేనిచోట స్వరంబుకంటెం బరంబయిన స్వరంబునకు

యడాగమంబగు" అన్న (బా. సంధి - 3) నియమము ప్రకారము యడాగమము కావలసియుండగా, ప్రస్తుతసూత్రము దానినిగూడ వారించుచున్నది. ఋ రవర్ణతుల్య మగుటవలన యడాగమమునకు అవకాశమే లేదు. కావున యథాతథముగా 'ఆ ఋషి' అనియే యుండిపోవును.

[ ఈ రెండు లక్ష్యములును అచ్చునకు రావలసిన కార్యములు రాకుండుటకు చూపబడినవి. రల తుల్యములుగా భావింపబడుటచేత వచ్చు హల్సంబంధి కార్యములు తరువాతి లక్ష్యమునందు చూపబడుచున్నవి. ]

వచ్చెను + ఋషి - అని యున్నప్పుడు ప్రస్తుత సూత్రము చేత ఋవర్ణమునకు రివర్ణతుల్యత్వము కలుగును. అప్పుడు "ద్రుతంబునకు సరళ స్థిరంబులు పరంబు లగునపుడు లోపసంశ్లేషంబులు విభాష నగు" అన్న (బా. సంధి-18) సూత్రము ననుసరించి ద్రుతమునకు లోపము కలుగగా 'వచ్చె ఋషి' యనియు ద్రుతమునకు మీది హల్లుతో సంశ్లేషము కలుగగా 'వచ్చేన్ ఋషి' యనియు నగును. పై కార్యము జరుగని పక్షమున ద్రుతమునకు స్వత్వము కలిగి 'వచ్చెను ఋషి' అని యథాతథముగా నుండిపోవును.

[ పై లక్ష్యములనుబట్టి యీ సూత్రము ఉత్వసంధి సందర్భమున నుండుట బాగుండునని యనిపించును. చివరి లక్ష్యములను బట్టి చూడగా ద్రుతకార్య సందర్భమునను దీని యావశ్యకము కలదు. కావున, ప్రత్యేకముగా ఆ రెండు తావులయందును దీనిని నిల్పవలసి యుండును. సంధి సూత్రములను మొదలుపెట్టియు, మొదలుపెట్టకముందే అపదేశములను చెప్పుట అంత సమంజసము కాదన్న దృష్టితో కావచ్చును - సూరి సంధి పరిచ్ఛేదమున విడిచిపెట్టి యిక్కడ చెప్పుట జరిగినది. ]

'పదాద్యములు' అన్న విశేషణము చాల ముఖ్యము. ఋ ౠ వర్ణములు పదాద్యములు కానియెడల వానికి ర ల తుల్యత్వము లేదు. తృణము అని యున్నప్పుడు 'ఋ' రెండవ వర్ణముగా నున్నది. కావున అది స్వరధర్మమునే కలిగి యుండును. అందువలన త, తి మున్నగు వాని వంటిదే 'తృ' అన్నదికూడ. ఆ + తృణము అని యున్నప్పుడు "త్రికంబుమీఁది యసంయుక్త హల్లునకు ద్విత్వంబు బహుళంబుగా నగు" నన్న (బా. సమాస-14)నియమమునుబట్టి 'అత్తృణము' అను రూపముకూడ నేర్పడు చున్నది. అట్లే 'ప్రవృత్తి' యను పదము ఛందస్సునందు జగణ మగును. 'వృ' అన్నది సంయుక్తాక్షరమే అయినయెడల 'ప్ర' అన్నది గురువై అది తగణము కావలసి వచ్చెడిది. ఇట్లే పెక్కు ఛందోవ్యాకరణ కార్యములకు ప్రస్తుత సూత్రము సాధకము.

ఇచ్చట ౠ వర్ణముతోడి యుదాహరణములు చూపబడ లేదు. ఆ ౠ కారము - విక్ౣప్తి॥ వ్రాసె ౠ కారము - వ్రాసెన్ ౠ కారము - వ్రాసెను ౠ కారము ॥ అన్నవానిని గ్రహింప నగును.

[ ప్రకీర్ణకము అని యనగా 'విస్తృతమైనది' యని యర్థము. కేవల మే యొక్క పరిచ్ఛేదమునకో కాక, పూర్వపరిచ్ఛేదము లన్నింటితోడను సంబంధము గలదగుటచే దీనికి 'ప్రకీర్ణక పరిచ్ఛేదము' అని పేరు పెట్టుట తగి యున్నది. ప్రౌఢవ్యాకరణము 'ముక్తలక్షణ వివేచనము' అను పేర నయిదు సూత్రములను చూపెను. ముక్తలక్షణ వివేచనము అని యనగా విడువబడిన లక్షణములను విమర్శించుట యని యర్థము. ఇవియు వేరువేరు ప్రకరణము లకు సంబంధించినవే. కావున, అవియు నిక్కడనే స్థానము పొందినవి.]

**2. ఆచ్ఛికపదంబులం దుత్తమంబులగు రు లు డు ల ముందఱి యేత్వంబునకు హ్రస్వంబు విభాష నగు.**

**(బా - ౨)**

నల్లేరు - నల్లెరు॥ పల్లేరు - పల్లెరు॥ పెన్నేరు - పెన్నెరు॥ మానేరు - మానెరు॥ అడేలు - అడెలు॥ కుందేలు - కుందెలు॥ తోఁడేలు-తోఁడెలు॥ నాఁగేలు - నాఁగెలు॥ నేరేడు - నేరెడు॥ మారేడు-మారెడు॥ పూరేడు - పూరెడు॥ తంగేడు - తంగెడు.

వ్యాఖ్య - మూడక్షరములకు తక్కువకాని పదమునందలి తుది యక్షరమునకు ఉత్తమము అనిపేరు. ఆచ్ఛికపదములందు రు, లు, డు - అను నక్షరము లుత్తమములై యున్నపుడు, వానికి పూర్వమందున్న ఏత్వమునకు హ్రస్వము విభాషగా నగు నని సూత్రార్థము.

'నల్లేరు' అన్నది మూడక్షరముల తెలుగు పదము. రు మూఁడవ యక్షరమై యున్నది. కావున, ప్రస్తుతసూత్రమునుబట్టి, దానికి పూర్వమందున్న ఏవర్ణమునకు హ్రస్వము రాగా 'నల్లెరు' అని యగును. ఈవిధి వైభాషికము. కావున హ్రస్వము రాని పక్షమున 'నల్లేరు' అనియే యుండును.

'ఉత్తమంబులగు' అను విశేషణముచేత పేరు, కేలు, పేడు - మున్నగుచోటి ఏవర్ణమునకు హ్రస్వము రాదు. విభాష యని యనుటచే సమానపదమునకే యీసూత్రము వర్తించును; సమాసములకు వర్తింపదు. అందువలననే మిన్నేఱు, పెడగేలు, మ్రుప్పేరు, ముఖ్యేడు - మున్నగుచోట్ల హ్రస్వము గలుగదు.

3. ఊయేల పయ్యెద తాయెతులం ద్రిక్క నామంబులందు యాకుం దాలవ్య వక్రయోగంబు లేదు. (బా - ३)

స్పష్టము.

వ్యాఖ్య - తెలుగున ఊయేల, పయ్యెద, తాయెతు - అను మూడుచోట్ల తప్ప నామములందు మరెక్కడను ఎ ఏ లతో కూడిన యకారము లేదని సూత్రార్థము. ఎ, ఏ అను రెండు వర్ణములును తాలవ్య వక్రములు.

ఆయెను, పోయెను - మున్నగునవి క్రియలు గావున నచ్చట నుండుట కాక్షేపము లేదు.

4. ఊయేల యూయాలల చాఁపుల నొండింటికిం గుఱుచ యొండె నగు. (బా - ४)

ఉయేల - ఊయెల - ఊయేల॥ ఉయాల - ఊయల - ఊయాల॥ వక్ష్యమాణంబు యద్విత్వంబు. ఉయ్యేల - ఉయ్యెల - ఉయ్యాల - ఉయ్యల.

వ్యాఖ్య-ఊయేల అను పదము యొక్క, దాని రూపాంతర మైన ఊయాల అను పదముయొక్క దీర్ఘములకు (చాఁపులకు) హ్రస్వము పర్యాయక్రమమున వికల్పముగా నగునని యర్థము. అనగా ఒకమారు ఒకదీర్ఘమునకు మాత్రమే హ్రస్వము కలుగు నని భావము. ఉన్న రెండుదీర్ఘములకు నొక్కమారుగా హ్రస్వము కలుగరాదని వారించుట యిచ్చటి ప్రయోజనము.

'ఊయేల' అను పదముయొక్క తొలిదీర్ఘమునకు హ్రస్వము కాగా 'ఉయేల' అని యగుచు; రెండవ దీర్ఘమునకు హ్రస్వము

రాగా 'ఊరెయెల' అని యగును: అట్లే 'ఊయాల' అను పదము యొక్క తొలి దీర్ఘమునకు హ్రస్వము రాగా 'ఉయాల' అనియు, మలిదీర్ఘమునకు హ్రస్వమురాగా 'ఊయల' అనియు నగును.

వక్ష్యమాణంబు యద్విత్వంబు • అని యనగా యకారమునకు ద్విత్వము ఇకముందు చెప్పబడునని యర్థము "ఊయే లాదుల" అని మొదలయిన (బా - 6) సూత్రమునుబట్టి ఊయేల పదమునకు ఉయ్యేల, ఉయ్యేల - అని రెండు రూపములును, ఊయాల పదమునకు ఉయ్యాల, ఉయ్యల - అని రెండు రూప ములును గలుగ వచ్చును.

[ ఊయేల అని యున్నపుడు యకారమునకు ద్విత్వము కలుగగా ఊయ్యేల అని యగును. కాని "ద్విరుక్తంబగు హల్లుపరంబగునపు డాచ్ఛికం బగు, దీర్ఘంబునకు హ్రస్వం బగు" అన్న (బా, సమాస-13) సూత్రమును బట్టి 'ఉయ్యేల' అని యగును. అపుడు ఊయేల అను దానికిని, ఉయేల అను దానికినిగూడ 'ఉయ్యేల' అన్న రూపమే కలుగును. కావున ద్విత్వయకార ముతో రెండురూపములే కలుగుచున్నవి. 'ఊయాల' అను పదమునకు నిట్లే రెండురూపములు మాత్రమే కలుగును. ]

**5. పయ్యెద పయ్యద.** •(బా - ౫)

వ్యాఖ్య - పయ్యెద అను పదమునకు పయ్యద అనియు రూపాంతరము గలదని యర్థము.

**6. ఊయేలాదులం దొలియచ్చుమీఁది హల్లునకు ద్విర్వచ నంబొండె నగు:** (బా - ౬)

ఉయ్యేల - ఊయేల॥ ఊయ్యె - ఊయేల - ఊయాల - ఊయల - ఆయె - ఏలిదము - ఓయ - ఓయారము - కోపు (ధను ర్గ్రము) - జాజర - తీనియ - తీయము - తేప (ప్లవము) - తేమ - తోయలి - దీవియ - నూవు - నోవి - నోవు - పూవు - పేయ - మోక (అంకురము) - మోటిక - మోవు - వీయము॥' ఇత్యాదు లూయేలాదులు.

వ్యాఖ్య - ఊయేల మున్నగువానియొక్క తొలియచ్చు మీది హల్లునకు ద్విత్వము వికల్పముగా నగునని సూత్రార్థము. ఊయేలాదులందు నామములతో పాటుగా క్రియలు కూడ చేర్పబడినవని గుర్తించుకొనుట యవసరము.

ఆయె - అన్నది 'అగు' అను ధాతువునకు 'ఎను' పరమై నపుడు యత్వము కలుగగా ఏర్పడిన రూపము. అగు + ఎను = ఆయెను. ప్రస్తుతసూత్రముచేత యకారము ద్విత్వమునొందగా దీర్ఘమునకు హ్రస్వము కలిగి (బా. సమాస-13) అయ్యెను అని యగును. 'నోవు' అన్నది క్రియాధాతువుగను, నామముగను కూడ కలదు. రెండు చోట్లనుగూడ 'నొవ్వు' అను రూపము కలుగవచ్చును.

'కోపు' అను మాటకు అందము, నమస్కారము, నాట్యమునందలి విధము, సమయము, మద్యము, మిష మున్నగు నర్థములు పెక్కులు గలవు. వీనికి 'కొప్పు' అను రూపము ధను ర్గ్రము (వింటికొన) యను నర్థమున మాత్రమే కలుగును.

'తేప' యను పదమునకు 'తెప్ప' యను రూపము ప్లవము అను నర్థమున మాత్రమే కలుగును. దానికి 'పర్యాయము' అను నర్థముకూడ కలదు. అప్పుడీకార్యము జరుగదు.

'మోక' అన్నది అంకురము అన్న యర్థమునందు మాత్రమే 'మొక్క' యను రూపము నొందును.

ఎల్లిదము, ఒయ్య, ఒయ్యారము, జజ్జర, తిన్నియ, తియ్యము, తెమ్మ, తొయ్యలి, దివ్వియ, నువ్వ, నొవ్వి, పువ్వ, వెయ్య, మొట్టిక, మొవ్వ, వియ్యము - అన్నవితక్కిన వానికి రూపములు.

7. అకారంబు క్రింది అకారంబునకుం దుది నులులక్రింది నలలకు లోపంబు బహుళంబుగ నగు. (బా - ౭)

అట్టు - అటు॥ గొట్టియ - గొటియ॥ కన్ను - కను॥ నన్ను - నను॥ పల్లు - పలు॥ విల్లు - విలు.

వ్యాఖ్య - అకారమునకు పూర్వమందున్న అకారమునకును, చివరనున్నను, లు- అను వర్ణములకు పూర్వమందున్న నకారలకారములకును లోపము బహుళముగా నగునని యర్థము.

అట్టు - అనుచోట చివరిది 'టు'. దానికి పూర్వమందు అకారము గలదు. దానికి లోపము రాగా 'అటు' అని యగును. 'గొట్టియ' అనుచోట (ట్ + టి) ట్టి పదమధ్యమున గలదు. కావున పూర్వమందున్న అకారమునకు లోపము రాగా 'గొటియ' అని యగును.

కన్ను - అనుచోట చివరిది 'ను'. దానికి పూర్వమందు నకారము కలదు (క + న్ + ను). ప్రస్తుతసూత్రముచేత నకారమునకు లోపము రాగా 'కను' అని యగును. 'నన్ను' అన్నది 'నను' అని యిట్లే యగును. 'పల్లు' శబ్దము తుదనున్నది 'లు';

దానికి పూర్వమందున్న లకారమునకు లోపము రాగా 'పలు అని యగును. 'విల్లు' అన్నది 'విలు' అని యిట్లే యగును. ఈ నులు వర్ణములు పదాంతములైనపుడే యీకార్యము జరుగును.

బహుళమని యనుటచేత కన్ను మున్నగు రూపములును యథాతథముగా నుండవచ్చును. అవి వికల్పవిధిని నిరూపించును. 'అట్టు' మున్నగువానికి 'తి' వర్ణము పరమగునపుడు రేఫలోపము నిత్యము - అటితి॥ విల్లు శబ్దమునకు బహువ్రీహిని తువర్ణము పరమగునపుడు లలోపము నిత్యము - పూవిలుతుఁడు॥ రావోవు (బా-9) సూత్రముచేత అచ్చు పరమగునపుడు ఈలోపము కలుగదు - అట్టిత్తె.

ఈప్రయోగవైవిధ్యమును భావించియే వ్యాకర్త బహుళ పదమును సూత్రమునందు నిబద్ధము చేసెను.

**8. అక్కటాదుల జడ్డకు లోపంబు విభాష నగు.**

**(బా - ౮)**

అకట - అక్కట॥ అక్కట - అట్టిక - అట్టుక - అట్టె - అయ్యారె — అయ్యో - అవ్వారి - ఇట్టిక - ఉప్పవడము - ఉమ్మి - ఎక్కసక్కియము - ఎక్కిరింత - ఎడ్డ - ఎన్నిక - ఎమ్ముక - కజ్జాయము - కట్టా - కట్టిక - కప్పురము - కమ్మటము - కమ్మతము - కువ్వాడము - కొట్టిక - కొమ్మ - కొయ్యగూర - గయ్యాళము - గిజిగాఁడు - గుజ్జరాతి - చిట్టి - చిన్న - చిమ్మట - చెన్నటి - చెప్పము - చెప్పుఁడు - చెమ్మట - చెల్లియలు - జవ్వాజి - జాబిల్లి - తమ్మటము - తమ్ములము - తల్లి - తుమ్మిక - తువ్వర - తెల్ల -

దవ్వు - దివ్వియ - నవ్వు - నిద్దుర - నివ్వెరి - నివ్వాళి - నువ్వు - నెట్టిక - నెమ్మలి - పవ్వళించు - పిన్న - పుల్లియ - పువ్వు - పెద్ద - పొట్టి - ప్రాకెన్న - ప్రెగ్గడ - బెగ్గడు - బొమ్మికము - బొమ్మిడికము - బొమ్మిడికము - మజ్జ - మత్తాబు - మల్లారము - ముక్కు - ముద్దియ - మెట్టియ - మొక్కరము - మొగ్గరము - మొల్లాము - రడ్డి - లొట్టిపిట్ట - వట్టి - వయ్యాళి - సన్నియ - సవ్వడి - సివ్వంగి॥ అట్టు - ఇట్టు - ఎట్టు - అప్పుడు - ఇప్పుడు - ఎప్పుడు - అన్ని - ఇన్ని - ఎన్ని - కొన్ని - మమ్ము - మిమ్ము - తమ్ము - అమ్మ - అక్క - అవ్వ - అయ్య - అప్ప - అచ్చొటు - ఇచ్చొటు - ఎచ్చొటు - అచ్చటు - ఇచ్చటు - ఎచ్చటు ॥ ఇత్యాదు లక్కటాదులు.

వ్యాఖ్య - అక్కట మున్నగు శబ్దములయొక్క జడ్డకు (ద్విత్వమునకు) విభాషగా లోప మగునని సూత్రార్థము. అక్కటాదులయందు విశేష్యములు, విశేషణములు, సర్వనామములు, అవ్యయములు, క్రియాధాతువులు, క్రియలు గూడ చేరి యున్నవన్న విషయమును గమనింపవలయును.

'అక్కట' అన్న శబ్దముయొక్క జడ్డకు లోపము రాగా 'అకట' అని యగును. అటిక, అటుక, అటె - మున్నగు విధముగా తక్కినవానికి రూపము లుండును.

విభాష యని యనుటచేత దవ్వు, నవ్వు, నువ్వు, పువ్వు, ముక్కు, మమ్ము, మిమ్ము, తమ్ము - మున్నగు ఉదంతములకు అచ్చు పరమగునపుడు జడ్డకు లోపము కలుగదు. అమ్మ, అక్క మున్నగువానికిని పదాదిస్వరముతో సంధి యగునెడల జడ్డకు లోపము కలుగదు.

**9. జడ్డక్కారంబుతోఁ బదాదిస్వరంబు గూడుచో జడ్డకు లోపంబు లేదు. (బా - కా)**

అట్టెత్తె - కన్నదరె - నన్నడిగె - పల్లొత్తె - విల్లందె.

వ్యాఖ్య - పూర్వసూత్రములలో జడ్డకు లోపము విధింపబడినది. కాని, పరపదముయొక్క ఆదిమస్వరముతో సంధియగు నెడల జడ్డకు లోపము కలుగదు.

అట్టు + ఎత్తె అని యున్నప్పుడు అకారంబుక్రింది అకారంబునకు (బా-7) లోపము వచ్చినయెడల 'అటు' అని యగును. కాని పరమందు స్వరముండుటచే సంధి కావలసియున్నది. కాబట్టి ప్రస్తుతసూత్రముచేత అలోపము వారింపబడుచున్నది. అందువలన 'అట్టెత్తె' యని మాత్రమే యుండును. కన్నదరె, పల్లొత్తె, విల్లందె - అన్నవికూడ ఇట్టిరూపములే.

నడుమనున్న 'నన్నడిగె' అన్నది భిన్నమయిన రూపము. 'నేను' అనుదాని ద్వితీయాంతరూపము 'నన్ను' అన్నది. దీనికి "ప్రథమేతర విభక్తి శత్రర్థ చువర్ణంబులందున్న యుకారంబునకు సంధి వైకల్పికముగా నగు" నన్న (బా. సంధి - 2) సూత్రమునుబట్టి నన్ను + అడిగె = నన్నడిగె; నన్నునడిగె అని రెండు రూపము లేర్పడును. పూర్వసూత్రమునుబట్టి 'నన్ను' యొక్క ద్విత్వమునకు లోపము రాగా 'నను' అని యగును. 'నను + అడిగె' అని యున్నప్పుడు "ప్రథమేతర.." అని మొదలయిన సూత్రముచేత 'ననడిగె' అన్న యనిష్టరూపము కావలసివచ్చును. ప్రస్తుతసూత్రము దానిని వారించుచున్నది. సంధి కానియెడల 'నను[illegible]గె' అని ద్విత్వరహితముగా నుండవచ్చునే.

సంధియైన యెడల నన్నడిగె ' అని ద్విత్వముతోకూడియే యుండవలయును.

[ సరసు + ఉండెను = సరసుండెను; వృశము + ఎక్కెను = వృశ మెక్కెను. మున్నగుచోట్ల ద్విత్వరహితములయిన రూపములే తరువాతి యచ్చులతో కలిసియున్నవి. పైగా సరస్సు, వృశమ్ము - మున్నగు రూపములుకూడ ప్రసిద్ధములే. కావున చూచుటతోడనే, ఇచ్చట సంధియగునప్పుడు సైతము జడ్డకు లోపము కలుగుచున్నదని యనిపించును. కాని అది భ్రాంతి మాత్రమే. ఎందువలన ననగా 'సరసు' అనునదే ప్రాథమికరూపము. దానికి విభాషగా ద్విత్వము (బా. తత్సమ - 83) విధింపబడుచున్నది. కావున ద్విత్వము వచ్చుట, రాకుండుట యను ప్రసంగమే కాని లోపించుట యను ప్రసంగ మచ్చుట లేదు. అట్లే 'వృశము' అన్నదియే పూర్వరూపము. దీనికి (బా. తత్సమ-24) అదనముగా మాముడిని విధించినది. కాబట్టి మాముడి కలుగకుండుట, కలుగుట యను ప్రసంగమునకే కాని లోపప్రసంగమున కచ్చుట తావు లేదు. కావున ప్రస్తుతసూత్ర మట్టియెడల ప్రవర్తింపదు. ]

**10.** ద్విత్వరహితం బగు ద్వితీయావిభక్తి యుకారమున కచ్చు పరంబగుచో సంధి రాదు. (ప్రౌ - 8)

నను నెఱిఁగె - నిను నెఱిఁగె॥ మొ.

వ్యాఖ్య - జడ్డతో కూడని ద్వితీయావిభక్తియొక్క ఉకారమునకు అచ్చు పరమైనయెడల సంధిరాదని సూత్రార్థము.

నను నెఱిఁగె, నిను నెఱిఁగె - యని సూత్రకర్త లక్ష్యములను జూపెను. మము నెఱిఁగె, మిము నెఱిఁగె, తను నెఱిఁగె, తము నెఱిఁగె - అన్నవానినిగూడ నుదాహరించు కొనవచ్చును.

"జడ్డక్కరంబుతో..." అని మొదలయిన బాల వ్యాక రణసూత్రము (9) చేతనే యీ కార్యము సిద్ధించుచున్నది. ఇంతేకాక, ఇంతకంటె విస్తృతముగా కూడ ఆ సూత్రము వ్యవహరించుచున్నది. కావున ఈ రూపములను సాధించుటకు ప్రస్తుత సూత్ర మవసరము కాదు.

[వనమును, ధనమును - మున్నగుచోట్ల నున్న నువర్ణము ద్వితీయా విభక్తి ప్రత్యయమే; ఇది ద్విత్వరహితమే. కావున 'వనమును + అరసెను' అని యున్నప్పుడు 'వనము నరసెను' అని కావలయును. 'ధనమును + ఇచ్చెను' అని యున్నప్పుడు 'ధనము నిచ్చెను' అని కావలయును. ఇచ్చట సంధి యగుట లేదు., దీని నుద్దేశించియే వ్యాకర్త యీ సూత్రమును ప్రారంభించెనేమో యనుకొందమన్నచో ఉదాహరణములలో, ఇట్టిది లేదు. అంతే కాక "ప్రథమేతర విభక్తి..." అని మొదలయిన సూత్రముచేత వైకల్పికముగా సంధియై వనమరసెను, ధనమిచ్చెను - అనియు కావచ్చును. లక్ష్యములం దిట్టిది చూపలేదు. కావున కాదనుకొనవలయునా? అనుకొనవలసిన దొడల "జడంబు ద్వితీయకుం బ్రథమ బహుళంబుగ నగు" నని యనుటచేత వనము + అరసెను = వనమరసెను; ధనము + ఇచ్చెను = ధనమిచ్చెను — అను రూపము లెట్లును సిద్ధించును. కావున ఈ సూత్రము నిరర్థకము. దేనిని గాని క్రొత్తగా వారించుటకుగాని, సాధించుటకుగాని సమర్థము కాదు.]

## 11. హా ధు ల యు నీలుగు లోనగువాని తొలిహల్లునకు లోపంబు బహుళంబుగ నగు. (బా - ౧౦)

హాడపము - అడపము॥ హారిదళము - అరిదళము॥ హాలంది - అలంది॥ నీలుగు - ఈలుగు॥ నీలుగు - నెగయు - పొందు - పొనరు॥ పుంను పొదవుల కాదిలోపం బొకండు వచియించె నది యవిచారమూలకంబు.

వ్యాఖ్య - హ కా ర ము తో ప్రారంభమగు మాటల యొక్కయు, నీలుగు మొదలగు మాటలయొక్కయు తొలి హల్లునకు బహుళముగా లోపమగునని సూత్రార్థము.

'హ్రాడపము' అను పదమున తొలిహల్లు లోపింపగా అడ పము' అని యగును. అరిదళము, అలంది - యన్నవి యిట్లు హాకారలోపము కలిగిన రూపములు.

'నీలుగు' అను మాటయందు తొలిహల్లగు నవర్ణము లోపింపగా 'ఈలుగు' అని యగును. అట్లే 'నెగయు' అన్నది నలోపమునొంది 'ఎగయు' అని యగును. పొందు, పొనరు - అని వానికి పలోపము కలుగగా ఒందు, ఒనరు అను రూపము లేర్పడును.

పూను, పొదవు అను రెంటికి కూడ అప్పకవి తొలిహల్లు లోపించునని చెప్పియుండెను. సూరి అట్లు చెప్పుట అవిచార మూలకమని నిరసించుచున్నాడు. ఊను, ఒదవు అని రెండు ధాతువు లున్నవి. వీనికి పూను, పొదవు అన్నవే మూలములని. రూపసామ్యమును చూచి భ్రాంతి చెందెననియు, తక్కిన యర్థాదు లను గూర్చి విచారము (ఆలోచన) చేయలేదనియు, అందువల నసే అట్లు చెప్పుట జరిగెననియు 'అవిచారమూలకము' అన్న దానికి తాత్పర్యము. పూను అని యనగా కడగు అని యర్థము. ఊను అని యనగా ఆను, నాటు, మోపు అని యర్థములు. కావున అర్థమునుబట్టి రెండింటికిని మిక్కిలి దూరము కలదు. పొదవు అని యనగా వ్యాపించు, ఆక్రమించు. అని యర్థములు. ఒదవు అని యనగా లభించు, జనించు, ఉపయోగపడు అని

యర్థములు. కావున ఒదవు పొదవులకును మిక్కిలి భేదము గలదు. ఈ భేదమునుగుఱించి యోజింపకపోవుటచేత అప్పకవి యట్లు చెప్పెను. కాని యింతగా భేదమున్నది కావున పూను, పొదవులే తొలిహల్లులు లోపించుటచేత ఊను, ఒదవులు అయ్యె నన్న, సూరి యంగీకరించుట లేదు. అవి భిన్నభిన్న ధాతువులు. వానియర్థములు వేరు; వాని ప్రయోగరీతులు వేరు.

12. ఆరాటాదులం బ్రథమేతర దీర్ఘంబునకు హ్రస్వంబు విభాష నగు. (బా - ౧౧)

ఆరాటము - ఆరటము॥ ఆరాటము - కక్కూఱితి - కేళాకూళి- కోమారుఁడు - కోమారిత - గంబూరము - పెండారము - బంగారము- బేహారము - ఫీటతాటము - సంతోసము.

వ్యాఖ్య - ఆరాటము మున్నగు శబ్దములయొక్క ప్రథ మాక్షరము కాక, తక్కిన యక్షరములమీద నున్న దీర్ఘమునకు విభాషగా హ్రస్వము కలుగునని సూత్రార్థము.

'ఆరాటము' అను శబ్దమునందు మొదటి యక్షరము 'ఆ' రెండవ యక్షరము 'రా'. దీని దీర్ఘమునకు హ్రస్వముకాగా 'ఆరటము' అని యగును. తక్కినవి కక్కుఱితి, కోమరుఁడు, కోమరిత, గంబురము, బంగరము, బేహరము, ఫీటతటము, సంతొసము - అన్న రూపముల నొందును.

'కేళాకూళి' యన్న పదమునందు రెండవ యక్షరము నందును, మూఁడవ యక్షరమునందును గూడ దీర్ఘములు గలవు. వానికి పర్యాయ క్రమమున హ్రస్వము కలుగగా కేళాకుళి,

కేళకూళి - అని రెండు రూపములు కలుగును: రెండింటికి నొక్కమారుగా హ్రస్వము కలుగగా కేళకుళి అని యగును. తరువాతి సూత్రముచేత తొలి దీర్ఘమునకు హ్రస్వము రాగా కెళాకూళి, కెళాకుళి, కెళకూళి, కెళకుళి అని మరియు నాలుగు రూపములు కలుగును.

**13.** ఓయారాదులం దొలిదీర్ఘంబునకు హ్రస్వంబు విభాష నగు. (బా - ౧౩)

ఓయారము - ఒయారము॥ ఓయారము - కేళాకూళి - కోలె-గూడారము - గోరువంక (పక్షి) - నీలుగు - వేఁడ - బేహారము (దీర్ఘ మధ్యము) - మాఱు - మూలుగు - మోఱకు - వీటతాటము - వీడియము॥ ఇత్యాదులు.

వ్యాఖ్య - ఓయారము మొదలయిన శబ్దముల తొలి యక్షరముయొక్క దీర్ఘమునకు హ్రస్వమగునని సూత్రార్థము.

'ఓయారము' అను పదమునందలి తొలియక్షరమైన 'ఓ' హ్రస్వము నొందగా 'ఒయారము' అని యగును.

[పూర్వసూత్రము (బా - ౧౨) చేత ఒయ్యారము అన్నరూపము కలిగినట్లు చూచితిమి. ఓయారము, ఒయారము, ఒయ్యారము - అని మొత్తము మూడు రూపములు గలవు.]

'కేళాకూళి' ప్రస్తుత సూత్రముచేత 'కెళాకూళి' యని యగును.

[ఇతర రూపములను పూర్వసూత్రముకడ చూచితిమి.]

కొలె, గుడారము, గొరువంక, జొహారు, మఱు, ములుగు, మొఱకు, విడియము - అన్నవి తక్కినవానికి రూపములు.

'నీలుగు' అన్నది ప్రస్తుత సూత్రముచేత 'నిలుగు' అని యగును. "హాదులయు..." అని మొదలైన (బా - 10) సూత్రమునుబట్టి తొలి హల్లు లోపింపగా 'ఈలుగు' అను రూపము కలుగును. ప్రస్తుతసూత్రముచేత తొలి దీర్ఘమునకు హ్రస్వము కలిగి 'ఇలుగు' అన్న రూపముకూడ కలుగును. 'బేహారము' అన్నది ప్రస్తుత సూత్రమునుబట్టి 'బెహారము' అని యగును. పూర్వసూత్రముచేత 'బేహరము' అన్న రూపము వచ్చినది. వ్యాకర్త 'దీర్ఘమధ్యంబు' అని కుండలీకరించి చెప్పుటచేత 'బేహారము' అను రూపము మాత్రమే ఓయారాదులలో చేరుననియు, బేహరము అన్నది యిందలిది కాదనియు గ్రహింపవలయును. కావున 'బేహరము' అను శబ్దముయొక్క తొలి దీర్ఘమునకు హ్రస్వము రాదు.

'వీటతాటము' అన్నది ప్రస్తుత సూత్రముచేత 'విటతాటము' అని యగును. ఆరాటాది గణములోని దగుటవలన 'వీటతటము' కూడ నైనది. ఆ 'వీటతటము' కూడ తొలి దీర్ఘము హ్రస్వమై 'విటతటము' అని యగును.

'పేఁడ' అను శబ్దముయొక్క తొలి దీర్ఘమునకు హ్రస్వము రాగా అరసున్న తొలి హ్రస్వముమీదిది కావలసివచ్చును. "అఁటయుఁక చుఁడు శబ్దంబులం దప్ప నుడి తొలి హ్రస్వంబుమీఁద ఖండబిందువును ద్రుతంబునకు లోపంబును లేవు" అన్న (బా - సంధి - 22) సూత్రమునుబట్టి యిట్లుండుటకు వీలులేదు. కావున "హ్రస్వము మీఁది ఖండబిందువునకుఁ బూర్ణబిందువు వైకల్పికముగ నగు" నన్న (బా. సంజ్ఞ-14) నియమమునుబట్టి పూర్ణానుస్వారము చేయగా 'పెండ' అని యగును.

**14. అడంగ్వాదుల డాక ణకారంబు విభాష నగు.**

**(బా - ౧౩)**

అడఁగు - అణఁగు॥ అడఁగు - కడఁగు - చిల్లాడము - తడ గము - నాఁడెము - పోఁడి - మిడుఁగు - వడఁకు - మిడుఁగురు॥ ఇత్యాదు లడంగ్వాదులు.

వ్యాఖ్య - అడఁగు మున్నగువాని డ వర్ణమునకు విభాషగా ణకార మగునని సూత్రార్థము.

'అడఁగు' అనుచోటి డ వర్ణమునకు ణత్వము కలుగగా 'అణఁగు' అని యగును. కణఁగు, చిల్లాణము, తణగము, మిణుఁగు, వణఁకు, మిణుఁగురు-అన్నవి తక్కినవానికి రూపములు.

'నాఁడెము' అని యన్నప్పుడు డాకు ణకారము రాగా ముందున్న అరసున్న తొలగిపోయి 'నాణెము' అని యగును. సంస్కృత సమేతరములయిన తెలుఁగు శబ్దములయందుఁ "బరుష సరళంబులకు ముందే బిందువు కానంబడుచున్నది" అని (బా. సంజ్ఞ - 16) యనుటచేత స్థిరవర్ణమయిన ణకారమునకు పూర్వ మందున్న బిందువు తొలఁగిపోవలయును. 'పోఁడి' అన్నది యిట్లే 'పోణి' అని యగును.

విభాష యని యనుటచేత కృత్తులు మున్నగునవి పరము లగునపుడు సైతము అడంగ్వాదుల డాకు ణత్వము కలుగ వచ్చును - అణఁకువ, కణఁక, పోణిమి మున్నగునవి యుదాహరణములు.

**15. దక్కు లోనగువాని దాకు తకారంబు విభాష నగు.**

**(బా - ౧౪)**

నున్న ఉత్వమునకును లోపము కలుగ వచ్చును. అట్లు కలుగు నప్పుడు శకటరేఫము సాధురేఫ మగునని భావము.

'ఓడుచు' అను ధాతువునందలి రు వర్ణము యొక్క ఉత్వము నకు లోపము కలుగగా 'ఓర్చు' అని యగును. ఇక్కడ తొలుత నున్నదియు సాధురేఫమే; సంయోగము చెందునప్పు డున్నదియు సాధురేఫమే. 'తీఱు' ధాతువునందు శకటరేఫము గలదు. ప్రేర ణార్థమునందు చువర్ణము రాగా 'తీఱుచు' అని యగును. ఉత్వ లోపము కలిగినయెడల 'తీఱ్ + చు' అని యుండి సాధురేఫ మాదేశము కాగా తీర్ + చు = తీర్చు అని యగును.

దీనికి ప్రమాణముగా 'ఓర్చి భంగపాటు తీర్చుకొనుము' అను పంక్తిని వ్యాకర్త లక్ష్యముగా చూపియున్నాడు. 'ఓర్చి' అను దానికిని 'తీర్చి' అను దానికిని ప్రాసమైత్రి నైతము కూర్ప బడిన ప్రయోగమిది. శకటరేఫ సాధురేఫములకు యతిప్రాస మైత్రి నంగీకరింపరు. కావున శకటరేఫముకూడ మీది యక్షరము తోడి సంయోగమువలన సాధురేఫమైనప్పుడే ప్రాసమైత్రి వీలగును; కాకున్న వీలుకాదు. ఈయభిప్రాయమునకు ప్రోద్బ లకముగా అథర్వణాచార్యుల "లఘుర్భవేత్...సద్వచః" అను వాక్యమును చూపుచున్నాడు. దీనికి "ఉచ్చారణమునుబట్టి కొన్ని యెడల లఘువు గురువగును; కొన్నియెడల గురువు లఘు వగును. పెద్దల ప్రయోగమే నిదానము" అని యర్థము. "ఇత రములయిన లఘువులకు నలఘువులకు వైధర్మ్యము లేదు; ర ఱ లకు నిత్యము" అని ప్రథమాచార్యులగు నన్నయభట్టు 'అన్యేషాం.. నిత్యంస్యాత్'' అను వాక్యమునందు చెప్పెను. ద్వితీయాచార్యు లగు అథర్వణులు "కవితాకృతియందు రఱలకు మైత్రిని గూర్చుట

అత్యంత దోషము. కావున, అట్లు కూర్చినవాడు దుష్కవి యన బడును'' అని ''అనయోః...కథ్యతే'' అన్న వాక్యము వలన తెలిపెను. కాబట్టి యిక్కడ నున్నవి రెండును సాధురేఫములే యని నిర్ణయము.

[ చేకూరు - లఘురేఫము; తీఱు - అలఘురేఫము అని కుండలీకరణముల యందు వ్యాకర్త తెలిపెను. లఘురేఫ మననేమో, అలఘురేఫ మననేమో యిక్కడ చూపవలసిన యవసరము లేదు. పూర్వసూత్రమునందే ఈ ప్రసంగము కలదు. అందులకై కాదనుకొన్న తాను లక్ష్యమునందు చూపిన ఓరుచు, తీఱుచు అను వానిని స్వస్వరూపముతో ప్రదర్శించుట స్పష్టతకు సహకరించును. అంతేకాని పై లక్ష్యమునకు సంబంధములేని యీ ప్రదర్శనము ప్రయోజనవంతము కాదు. ]

ఈ సూత్రము బాలవ్యాకరణమునకు పూరకము.

18. ఏతాదులకు ము వర్ణకంబు పరంబగునపుడు దీర్ఘంబు విభాష నగు. (బా - ౧౩)

ఏతము - ఏతాము॥ ఏతము - కళ్లము - గాలము - గుడ్డము -, గోణము - గోతము - జాజము - ఱుంజము - జోతము - తణగము - బొండ్లము - మండము - లాతము - వీణము॥ ఇత్యాదులు.

వ్యాఖ్య - 'ఏతము' మొదలయిన శబ్దములందు మువర్ణమునకు ముందున్న వర్ణమునకు వి భా ష గా దీర్ఘము వచ్చునని సూత్రార్థము. 'ఏతము' అన్న శబ్దమున ము వర్ణమునకు ముందరిది 'త'. దీనియందున్న అత్వమునకు దీర్ఘము రాగా 'ఏతాము' అని యగును. అట్లే కళ్లాము, గాలాము, గుడ్డాము - మున్నగు రూపము లేర్పడును.

**19. పదాంతంబులయి యసంయుక్తంబులయిన నులురుల యుత్వంబునకు లోపంబు బహుళంబుగ నగు.**

(బా - ౧౯)

ఇందు నులుల కుత్వలోపంబు ప్రాయికంబుగ హల్పరకంబులకుఁ జూపట్టెడు॥ మ్రాన్పడె॥ మినువడె - మిన్వడె॥ వత్తురువారు - వత్తుర్వారు॥ కారుకొనియె - కార్కొనియె॥ రాములు - రాముల్॥ వనములు - వనముల్॥

వ్యాఖ్య - వేరొక వర్ణముతో సంయోగము నొందక, పదముల చివరనున్న నులురు అనువాని ఉత్వమునకు బహుళముగా లోపమగునని సూత్రార్థము. సాధారణముగ ఈలోపము హల్లులకు ముందున్న వర్ణములకు కలుగునని వృత్తియందు వ్యాకర్త వివరించెను.

మ్రాను + పడు అనునపుడు 'ను' యొక్క ఉత్వమునకు లోపమురాగా 'మ్రాన్పడె' అని యగును. 'మినువడె' అన్నది 'మిన్వడె' అని యిట్లే యగును. తక్కిన వానినిగూడ నిట్లే యూహించుకొన వచ్చును.

'వత్తుర్వారు' మున్నగు లక్ష్యములనుబట్టి క్రియలమీది నులురుల యుత్వమునకును లోపము కలుగునని యూహింప వచ్చును. మొదటనున్న 'మ్రాన్పడె' అన్నదానికి తప్ప తక్కిన యన్నింటికి రెండేసి రూపములు చూపబడినవి. అనగా వాని యెడ సూత్రము వికల్పముగా ప్రవర్తించెనని యర్థము. 'మ్రాన్పడె' అనుచోట ఉత్వలోపము నిత్యము. 'చేర్చు' మున్నగు చోట్ల ధాతువుమీది రు వర్ణము యొక్క ఉత్వమునకు లోపము

కలుగును - ఇది అన్యత్వము: కావుననే సూత్రమునందు 'బహుళము' అను దళము చేర్పబడినది.

**20. అచ్చికంబులం బదమధ్యంబుల నలడరల యుత్వంబునకు లోపంబు బహుళంబుగ నగు (బా - ౧౩)**

కినుక - కిన్క॥ కానుక - కాన్క॥ చిలుక - చిల్క॥ కాలువ - కాల్వ॥ అడుగు - అడ్గు॥ కడుపు - కడ్పు॥ పెరుగు - పెర్గు॥ కూరుకు - కూర్కు.

వ్యాఖ్య - అచ్చ తెలుగు పదములందు పదముల నడుమనున్న న ల డ ర అనువాని యొక్క ఉత్వమునకును బహుళముగా లోపమగునని సూత్రార్థము. 'కినుక' అనుచోట 'ను' పద మధ్యమున నున్నది. దీని ఉత్వమునకు లోపము రాగా 'కిన్క' అని యగును. ఇట్లే తక్కినవానినిగూడ నూహింపవచ్చును.

**21. లాఁతి యచ్చునకు సహిత మొకానొకచో నుడి నడుమ లోపంబు గానంబడియెడి. (బా - ౧౫)**

కలికి - కల్కి॥ ములికి - ముల్కి॥ బుడిపి - బుడ్పి॥ పొలఁతి - పొల్తి.

వ్యాఖ్య - పదమధ్యమున నున్న యితరములయిన యచ్చులకును కొన్నియెడల లోపము కలుగుచున్నదని సూత్రార్థము. 'కలికి' అన్న పదమునందు 'లి' నడుమనున్నది. దీని ఇత్వమునకు లోపము రాగా 'కల్కి' అని యగును. ఇట్టివే ముల్కి, బుడ్పి - అన్నవికూడ. 'పొలఁతి' అనుచోట నడుమనున్న 'ల' యొక్క

అత్వమునకు లోపము రాగా 'పొ ల్తి' అని యగును. సంయోగము చెందినపుడు అర్ధానుస్వారము తొలగిపోవును.

**22. అబ్బురాదులం దుత్వంబునకు లోపంబు విభాష నగు. (బా - ౧౫)**

అబ్బురము - అబ్రము॥ అబ్బురము - కప్పురము - అప్పుడు - ఇప్పుడు - ఎప్పుడు - చప్పుడు - నెత్తురు॥ ఇత్యాదులు.

వ్యాఖ్య - అబ్బురము మున్నగువానియొక్క నడిమి ఉత్వమునకు విభాషగా లోపమగునని సూత్రార్థము.

[ ఇంతకుముందే నడినడుమనున్న ఉత్వమునకు లోపము కలుగునన్న ప్రసంగము వచ్చినది. కావున, ఇది యింతమాత్రమునకే అయినయెడల సిద్ధ సాధకమే యగును. అనగా వ్యర్థమని భావము. 'అబ్బురము' మున్నగువాని చోట్ల నున్న ఉత్వలోపము ద్విత్వము పైనగుచున్నది. వెనుక చెప్పినది అసంయుక్తముల విషయము. కావున, ఆభేదమొకటి కలదు. అంతేకాక ఇంకొక విషయమున్నది. తెలుగునందు ద్విత్వముతో వేరొక హల్లు సంయోగము చెందునెడల మొదటిదాని జడ్డకు లోపము కలుగును. అది బాలవ్యాకరణము నందు చెప్పకపోయినను సూరకి అట్టినిశ్చయమున్నది 'హల్మధ్యగంబున కన్యతర సవర్ణంబునకు హల్లునకు లుక్కగు" అని శబ్దలక్షణ సంగ్రహము నందు సూత్రించి యున్నాడు. ఇక్కడ ఆ కార్యము కూడ జరుగును. కావుననే, దీనిని వేరుగా చెప్పుట యావశ్యకమయ్యెను. ]

అబ్బురము - అని యున్నప్పుడు ఉత్వమునకు లోపము రాగా అబ్బ్ + రము అని యుండును. రేఫసంయోగము నొందునప్పుడు ఒక బకారమునకు లోపము రాగా అబ్రము అని యగును. కప్రము, అప్డు, ఇప్డు, ఎప్డు, చప్డు, నెత్రు - అన్నవి తక్కినవానికి రూపములు.

**23.** చుక్పరక రువర్ణంబునకు ముందఱి దువర్ణంబు నుత్వంబు నకు లోపంబు విభాష నగు; నగుచోఁ దత్పూర్వంబు గురువు గాదు. (బా - ౨౦)

అదురుచు - అద్రుచు॥ ఎదురుచు ఎద్రుచు॥ పదురుచు - పద్రుచు.

వ్యాఖ్య - చుగాగమమును పరమందుగల రు వర్ణమునకు ముందున్న దువర్ణము యొక్క ఉత్వమునకు విభాషగా లోపమగును; దానికి ముందున్న యక్షరము గురువు కాదు - అని సూత్రార్థము.

'అదురుచు' అనుచోట రు వర్ణమునకు పరమందు 'చు' ఉన్నది; పూర్వమందు 'దు' ఉన్నది. ఇప్పుడు 'దు' యొక్క ఉత్వమునకు లోపము రాగా అద్ + రుచు = అద్రుచు అని యగును. 'ద్రు' అను సంయుక్తాక్షరమునకు పూర్వమునున్న 'అ' గురువగుట ఛందస్సంప్రదాయము. ఇట్టియెడల గురువు కాదని వ్యాకర్త నిషేధించుచున్నాడు. అనగా తేల్చి ఉచ్చరించుట యవసరము. ఎద్రుచు, పద్రుచు - అన్నవికూడ ఇట్లే యేర్పడును.

**24.** జూదాదుల దాకు జకారంబు విభాష నగు. (బా - ౨౧)

జూదము - జూఝము॥ అవుదు - జవాది - జాడ - జాదు - విరవాది.

వ్యాఖ్య - జూదము మున్నగుశబ్దముల యొక్క జకారమునకు విభాషగా ఝకార మగునని సూత్రార్థము. 'జూదము'

నందలి దస్థానమున జవర్ణము రాగా 'జూజము' అని యగును. అవుజు, జవాజి, జాజి, జాజు, విరవాజి - అన్నవి తక్కినవానికి రూపములు.

**25.** నిందయం దామ్రేడితంబు నాద్యక్షరములకు హ్రస్వ దీర్ఘంబులకు గిగీలగు. (బా - ౨౨)

కుంభకర్ణుఁడు గింభకర్ణుఁడు॥ రావణుఁడు గీవణుఁడు.

వ్యాఖ్య - నిందార్థమునందు ఆమ్రేడితము యొక్క ఆద్యక్షరము హ్రస్వమైనచో 'గి' యనియు, దీర్ఘమైనచో 'గీ' యనియు ఆదేశమునొందునని సూత్రార్థము. 'కుంభకర్ణుఁడు కుంభకర్ణుఁడు' అనియుండగా రెండవసారి యుచ్చరింపబడినది యామ్రేడితము. దాని యాద్యక్షరమైన కుస్థానమున గివర్ణము రాగా 'గింభకర్ణుఁడు' అని యగును. 'రావణుఁడు రావణుఁడు' అని యున్నప్పుడు ఆమ్రేడితముయొక్క ఆద్యక్షరము దీర్ఘము కావున 'గీ' యన్న యాదేశము కలిగి 'గీవణుఁడు' అని యగును.

నిందయందని యనుటచే 'రాముఁడు రాముఁడు' మున్నగువిధముగా ప్రశంసాద్యర్థములందు ఈకార్యము జరుగదు.

**26.** తఱచుగ సర్వనామంబుతోడం గర్మధారయంబు చూపట్టదు. (ప్రౌ - ౪)

వ్యాఖ్య - సర్వనామమును గల్గిన కర్మధారయము తఱుచుగా ప్రయోగము లందు కనబడదని సూత్రార్థము.

"కర్మధారయంబు త్రిక స్త్రీసమే ముగంత ధాతుజవిశేషణ పూర్వపదంబయి యుండు" అన్న (బా. సమాస-౪)

సూత్రమునుబట్టి కర్మధారయమునందు పూర్వపదములుగా నుండుటకు వీలయిన శబ్దములు తెలియుచున్నవి. ఇందు త్రికము, ధాతుజ విశేషణములును సర్వనామములే. కావున వ్యాకర్త పూర్వపదమునుగూర్చి చెప్పుట లేదని భావింపవలసి వచ్చుచున్నది. 'అచ్చికశబ్దంబుతోడ' అనియు 'తచ్ఛబ్దంబుతోడ' అనియు తోడప్రత్యయముతో ప్రయుక్తములైనవి ఉత్తరపదములగుటచే, ఆ సంప్రదాయమునుబట్టి యిచ్చట సైత ముత్తరశబ్ద ముద్దిష్టమైన దనుకొనవచ్చును. అట్లయినప్పటికిని వచ్చినవాఁడు, వచ్చినది మున్నగుచోట ఉత్తరశబ్దముగా సర్వనామము (బా. సమాస-9) విధింపబడుచున్నది. కావున ఈరెండు విధములుగా సూత్రము సమర్థనీయము కాకున్నది.

ఇంక నొక్కటి కావచ్చును. వాఁడు, అది, నేను, మేము, మనము, నీవు, మీరు మున్నగు సర్వనామములు పూర్వశబ్దములుగా నున్నప్పుడు కర్మధారయము కలుఁగదని భావము కావచ్చును. ఈశబ్దములు పూర్వమున్నప్పుడు తత్పురుష పేర్పడ వచ్చును; కాని కర్మధారయ మేర్పడదు. దీనినే యుద్దేశించిన యెడల సూత్రమునందు 'తఱచుగ' నన్నమాట నిరర్థక మగును. ఇంతకును కర్మధారయమునకు పూర్వపదముగా పైవి యుండ వచ్చునన్న యనుమానమునకైన నవకాశము లేనప్పుడు నిషేధము నిష్ప్రయోజనము. కావున, ఈసూత్ర మనావశ్యకము.

**27.** ద్విగువు మహదర్థఘటితం బదృష్టంబు. (ప్రౌ - ౩)

వ్యాఖ్య - మహద్వాచక మగు ద్విగుసమాసము కానరాదని సూత్రార్థము. ముల్లోకములు, ముప్పిరి మున్నగువిధ

ముగా అనుహాదర్థబోధకములే కాని, మహత్తులను బోధించు ద్విగు సమాసములు తెలుగునందు లేవు సంస్కృతమున 'త్రిపురుషాః' అనియుండగా తెలుగున 'ముగ్గురు మనుజులు' అన్నట్లు వ్యస్తముగానే యుండవలయును. విశేషణవిశేష్యములు సమసింపవు.

**28.** పాదంబునం బ్రథమ ద్వితీయాక్షరములు వళి ప్రాసంబులు నాఁబడు. (బా - ౨౩)

వ్యాఖ్య - పద్యములందు పాదముయొక్క మొదటి యక్షరమునకు 'వళి' యనియు రెండవ యక్షరమునకు 'ప్రాసము' అనియు వ్యవహారమని సూత్రార్థము.

**29.** య వ ల లు లఘ్వలఘువులు మైత్రిం బొరయు; రేఫంబులు పొరయవు. (బా - ౨౪)

వ్యాఖ్య - య ర ల వ అను నాలుగు వర్ణములను లఘువులని, అలఘువులని రెండువిధములుగా (బా. సంజ్ఞ - 18) పరిగణింతురు. అందు యవల అనునవి లఘువులైనను, అలఘువులైనను యతిప్రాసలయందు మైత్రిని పొందును. రేఫములు మాత్రము మైత్రిని పొందరాదు. అనగా సాధురేఫమునకు సాధురేఫమును, శకటరేఫమునకు శకటరేఫమును మాత్రమే యతి ప్రాసములయందు వాడవలయునని తాత్పర్యము.

**30.** రేఫంబులు లఘ్వలఘువులుం దక్కంగల విశేషంబులు నార్యవ్యవహారంబులఁ దెలియుట శ్రేయంబు. (బా - ౨౫)

వ్యాఖ్య - ఎక్కడ లఘురేఫము లుండునో, ఎక్కడ అలఘురేఫము లుండునో పెద్దలవ్యవహారమునుబట్టి తెలిసికొనుట మేలు. అట్లే యిక్కడ లేని యితర విశేషములనుగూడ పెద్దల వలననే తెలిసికొనవలయునని వ్యాకర్త నిర్దేశించుచున్నాడు.

## *వాక్య ప్రకరణము

**31.** వాక్యమునా యోగ్యతాకాంక్షా సహితంబగు నర్థముఁగల యాసత్తియుక్త పద సముదాయంబు. (ప్రౌ - ౧)

యోగ్యత యనఁగాఁ బదార్థములకుఁ బరస్పర సంబంధమునందు బాధ కలుగకుండుట. ఆకాంక్ష యనఁగా నిలుపుదల లేక పయిఁబయిఁ బో యెడి పదార్థములమీఁది యాదరము. అది విను వారికిఁ దెలిసికొన వలయు ననెడి యపేక్షారూపమయినది. ఆసత్తి యనఁగాఁ బదముల చేరిక. యోగ్యతయు. ఆకాంక్షయు, ఆసత్తియు లేక 'నిప్పుచేఁ దడుపుచున్నాఁడు' 'గోవు గర్దభము' అని యిట్లు చెప్పుటచేతను, బుద్ధిమఱపు లేక నేఁడు 'దేవదత్తుఁ' డని చెప్పి మఱియొకనాఁడు 'పోవుచున్నాఁ' డని చెప్పుటచేతను బదసముదాయము వాక్యముగా నేర్పడినను నది వాక్యమని చెప్పఁదగినది కాదని తాత్పర్యము. వాక్యములందుఁ గొన్ని క్రియాన్వయము కలవి. కొన్ని తదితరాన్వయము కలవి. వాని కుదా

---

*ప్రౌఢ వ్యాకరణమునందు 'వాక్యపరిచ్ఛేదము' చివరిది. దీని నిచ్చట ప్రకీర్ణకపరిచ్ఛేదమునందే అంతర్భవింపజేయుటకై 'వాక్యప్రకరణము' అని మార్పవలసి వచ్చినది సూరి పరిచ్ఛేదమునందలి అవాంతర భాగములను ప్రకరణ శబ్దముచే పేర్కొనెను. అది యిచ్చట ననుసృతము.

హరణములు మీఁద స్పష్టము కాఁగలవు. క్రియ అనఁగా వర్తమానా ద్యర్థకములయిన సమాపక క్రియలు; క్త్వా తద్వ్యతిరేక శత్రృతుమున్ చేదానంతర్యార్థకము లసమాపక క్రియలు. ఇందు మొదటివి మూఁడు క్రియావిభిన్న కర్తృకంబులు; వెనుకటివి మూఁడు క్రియావిభిన్న కర్తృ కంబులు.

వ్యాఖ్య - వాక్యమని యనగా, యోగ్యతయు, ఆ కాంక్షయు, ఆసత్తియు నున్నట్టి ప ద ము ల సముదాయ మని యర్థము.

యోగ్యత యనగా పదమునకు నర్థమునకు పరస్పర సంబంధము నందు బాధ కలుగకుండుట. 'నిప్పుచేఁ దడుపు చున్నాఁడు' అని యన్నప్పుడు తడుపుట యను క్రియ 'నిప్పు' యొక్క ధర్మము కాదు. అందువలన అన్వయమునందు బాధ కలుగును. 'నీటిచేఁ దడుపుచున్నాఁడు' అని యన్నప్పుడు నీరు యొక్క ధర్మమునకును తడుపుట యను క్రియకును యోగ్యత కలదు.

ఆకాంక్ష యనగా అపేక్ష యని యర్థము. ఒక పదము తక్కిన పదములపట్ల ఆకాంక్షను గలిగింపవలయును. 'గోవు' అని చెప్పి 'గుఱ్ఱము' అని చెప్పినయెడల అట్టి ఆకాంక్ష కలుగదు. 'ఇది గోవు' అని చెప్పినయెడల 'ఏది' యను నాకాంక్ష కలుగుట కవకాశము కలదు.

ఆసత్తి యనగా పదములచేరిక. ఇప్పు డొకమాట చెప్పి, తరువాత నెప్పుడో యోగ్యతయు నాకాంక్షయు కలిగిన మఱొక మాటను చెప్పిన యెడల ఆసత్తి లేకపోవును. అనగా

వెంబడినే పదముల నుపయోగించుట ఆసత్తి యగును. 'దేవ దత్తుఁడు పోవుచున్నాఁడు' అను వాక్యమునందు 'దేవదత్తుఁడు' అను పదమును వేరుచేసి నేడును, 'పోవుచున్నాఁడు' అను పద మును రేపును చెప్పినయెడల అది వాక్యము కాదు.

వాక్యములు రెండువిధములుగా నుండును. కొన్ని క్రియ తోడి అన్వయమును గలిగియుండును. కొన్ని క్రియేతరములతో అన్వయమును గలిగి యుండును. 'లక్ష్మణుఁడు వచ్చెను' అన్నది క్రియాన్వయముగల వాక్యము. 'అతఁడు రాముని తమ్ముఁడు' అన్నది క్రియేతరాన్వయము గల వాక్యము.

క్రియలు సమాపకములని అసమాపకములని రెండు విధ ములు. వర్తమానకాలము, భూతకాలము, భవిష్యత్కాలము, తద్ధర్మార్థకము - అనువానిని దెల్పునవి సమాపకక్రియలు. క్త్వార్థ కము, వ్యతిరేక క్త్వార్థకము, శత్రర్థకము, తుమున్నర్థకము, చేదర్థకము, ఆనంతర్యార్థకము - అను వానిని దెల్పునవి అస మాపకక్రియలు. వీనిలో మొదటి మూడును క్రియాఽభిన్న కర్తృకములు. అనగా వాక్యమునందలి సమాపకక్రియకు కర్త యగు పదముతోనే యివియు నన్వయము కలిగి యుండునని యర్థము. క్త్వార్థకము - రాముఁడు చూచి యేగెను. ఇచ్చట 'ఏగెను' అను సమాపకక్రియకు కర్తయైన రాముడు 'చూచి' అన్న అసమాపకమునకు కూడ కర్త యగుచున్నాడు. వ్యతిరేక క్త్వార్థకము-రాముఁడు చూడక యేగెను॥ శత్రర్థకము-రాముఁడు చూచుచు నేగెను. అసమాపకములయందు చివరి మూడును క్రియావిభిన్న కర్తృకములు. అనగా సమాపకక్రియ యన్వయించు

కర్తతో కాక, భిన్నమగు కర్తతో అన్వయించునవి యని భావము.

[ తుమున్నర్థకము - రాముఁడు చదువనేగెను. ఇచ్చట 'చదువను' అన్నది తుమున్నర్థకము. ఇది భిన్నకర్తృకము కాదు. 'ఏగెను' అను సమాపక క్రియయు, 'చదువన్' అను నసమాపకము నొకే కర్తతో నన్వయించు చున్నవి. కావున, తుమున్నర్థకమును క్రియాభిన్న కర్తృకములలో పరిగణించుట సరికాదు. భావలక్షణమునందు నుణి యగును. అట్టి నుణ్యంతమును ప్రౌఢవ్యాకరణ కారుడు పొరపాటున తుమున్నర్థకమని భావించి యుండవచ్చును ]

భావలక్షణము - రాముఁడు పిలువనేగితిని. ఇచ్చట ఏగితిని అను సమాపకక్రియకు కర్త నేను. 'పిలువన్' అను నసమాపకమునకు కర్త రాముఁడు. కావున నిది క్రియాభిన్న కర్తృకము॥ చేదర్థకము - వానలు గురిసినం బంటలు పండును ॥ అనంతర్యార్థకము - జాబిలి తోఁతెంచుడుం గువలయంబులు వికసిల్లె. కావున భావలక్షణ చేదర్థకానంతర్యార్థకములను క్రియావిభిన్న కర్తృకములుగా పరిగణింపదగును.

**32.** పదమనఁగాఁ బ్రయోగార్హంబు ననన్వితంబు నేకంబు నర్థబోధకంబు నైన వర్ణము, లేక వర్ణసముదాయము. (ప్రౌ - శి)

ఖంబు - ఘటంబు ॥ మొ. ప్రయోగానర్హము: ఖ - ఘట ॥ మొ. అన్వితము: ఖంబు ఘటంబునం దోఁచెఁడి ॥ మొ. అనేకము: ఖంబును ఘటంబును॥ మొ. అనర్థబోధకము: క - చ - ట - త - ప॥ మొ.

వ్యాఖ్య - ప్రయోగించుటకు తగినదై, ఇతర పదములతో నన్వయము లేనిదై, ఒక్కటియై, అర్థమును బోధించునదై యున్న వర్ణమును గాని వర్ణసముదాయమును గాని 'పదము' అని యందురు. ఖంబు, ఘటంబు మొదలగునవి యుదాహరణములు.

కేవల ప్రాతిపదికమునుగాని, కేవల ప్రత్యయమునుగాని ప్రయోగింపరాదు. కావున ఖ, ఘట - మున్నగునవి పదములు కాజాలవు. ఖంబు ఘటంబునం దోఁచెడి - అనుచోట పరస్పరాన్వయము గల పదముల సముదాయము గలదు. కావున వానిని సంబంధసూచకము లున్నంతవరకు పదము లనరాదు. ఏకము అవి యనగా ఒక్కటి యని యర్థము. అనగా అవిభాజ్యము. 'ఖంబును ఘటంబును' అన్న యుదాహరణమునం దొక్కటికాక రెండు గలవు. ఇది అనేకము కావున పదవాచ్యము కాదు. క, చ - మున్నగువానికి అర్థబోధకత్వము లేదు. కావున, అవియు పదములు కాజాలవు.

[ పూర్వసూత్రమునందు వాక్యనిర్వచనమునందు పదప్రసంగము కలిగినది. కావున 'పదము' ను నిర్వచించుట కీసూత్ర ముపయుక్తమైనది.]

**౩౩.** పదము లవి నామములు క్రియ లవ్యయంబు లని త్రివిధంబులు.　　　(ప్రౌ - ౩)

నామములు నా వస్తువాచకశబ్దములు. సందర్భవశంబున నవి కొన్ని కర్తలనియుఁ గర్మములనియుఁ జెప్పఁబడును. ధాత్వర్థవ్యాపారాశ్రయము కర్త. ధాత్వర్థఫలాశ్రయము కర్మము. క్రియలనగా వ్యాపారావబోధకము లయినవి అవి సకర్మకములు, అకర్మకములని ద్వివిధములు. కర్మము గలది సకర్మకము; కర్మములేనిది యకర్మకము.

కర్తృకర్మక్రియలు గూడఁ బ్రయోగమనంబడును. అది కర్తరి ప్రయోగము, కర్మణి ప్రయోగము నని ద్వివిధము. క్రియచేఁ గర్త చెప్పబడు నేని కర్తరిప్రయోగము; కర్మము చెప్పఁబడునేని కర్మణి ప్రయోగము. కర్తరిప్రయోగము సకర్మకక్రియ గలచో సకర్మక కర్తరిప్రయోగ మనియు, అకర్మకక్రియ గలచో నకర్మక కర్తరి ప్రయోగమనియుఁ జెప్పఁబడును. అవ్యయములనఁగా లింగ విభక్తి వచన శూన్యములు అవి ప్రతిపదోక్తములు, లాక్షణికములని ద్వివిధములు. ప్రకృతిసిద్ధములు ప్రతిపదోక్తములు; లక్షణ సిద్ధములు లాక్షణికములు.

వ్యాఖ్య - పదములు నామములని క్రియలని అవ్యయము లని మూడు విధములుగా నుండును.

వస్తువులనుగూర్చి చెప్పునవి నామములు. ఇవి సందర్భమును బట్టి కర్తలుగను కర్మములుగను వ్యవహరించును.

వ్యాపార మనగా చేష్టయని యర్థము. వ్యాపారమును బోధించునవి క్రియలు. ఇవి సకర్మకములు, అకర్మకములు నని రెండు విధములు. కర్తృకర్మక్రియల సముదాయమునకు ప్రయోగమని పేరు. క్రియచే కర్త చెప్పబడునేని కర్తరిప్రయోగము, క్రియచే కర్మ చెప్పబడునేని కర్మణి ప్రయోగము. కర్తరి ప్రయోగమునందు సకర్మకక్రియ వాడబడినచో సకర్మక కర్తరి ప్రయోగము. అకర్మకక్రియ వాడబడినచో అకర్మక కర్తరి ప్రయోగము.

లింగ విభక్తి వచనశూన్యములు అవ్యయములు. ప్రకృతి సిద్ధముగా నున్నవానిని ప్రతిపదోక్తములు అని యందురు. అహో, అక్కటా, అయ్యో-మున్నగునవి. వ్యాకరణ లక్షణముచే

నేర్పుదువానిని లాక్షణికములనీ యందురు. చూచి, చూడక, చూచుచున్ -మున్నగునవి.

[ కర్తరి ప్రయోగము, కర్మణి ప్రయోగము అని సంస్కృత విభక్త్యంతముగా వాడుట సమంజసముకాదు. వాడుకనుబట్టి అలుకన్నమాన ములుగా గ్రహింపబడెనన్నచో ఆక్షేపము లేదు. చిన్నయసూరి కర్త్రర్థకము కర్మార్థకము - అనియే వాడెను. ]

**34.** పదములకుఁ బరస్పరము గల సంబంధ మన్వయ మనంబడు. (ప్రౌ - ౪)

వ్యాఖ్య - అన్వయము అని యనగా వాక్యమునందలి యొక పదమునకు మరొక పదముతో గల సంబంధమని యర్థము.

**35.** విషయబోధకము వాక్యము (ప్రౌ - ౫)

విషయము = తెలియఁదగిన యంశము.

వ్యాఖ్య - వాక్యము తెలియదగిన యంశమును దెలుపు నని యర్థము.

**36.** ఉద్దేశ్య విధేయభిన్నంబు విషయంబు. (ప్రౌ - ౬)

విషయ ముద్దేశ్యవిధేయములతోఁ గూడినది. అనఁగా విషయము నందుద్దేశ్యము, విధేయము నని రెండుగల వని యర్థము. ఉద్దేశించి చెప్పఁదగినది యుద్దేశ్యము; మీఁదఁ దెలియఁదగినది విధేయము. ఉద్దేశ్యము వక్తృశ్రోతల కుభయులకుఁ దెలియును; విధేయము వక్తకు మాత్రము తెలియును. విశేష్యాదిక ముద్దేశ్యము; క్రియాదికము విధేయము. విశేష్యాదికము - విశేష్యము, విశేషణము, సర్వనామము॥

క్రియాదికము - క్రియ, విశేష్యము, విశేషణము, సర్వనామము॥ ఆదిపదద్వయముచే అవ్యంతక్రియలును, వేళాద్యవ్యయములును గ్రాహ్యములు. విశేష్యాదు లుద్దేశ్య విధేయములు రెండు నగు. క్రియ లుద్దేశ్యములు కానేరవు.

ఉద్దేశ్య విధేయములకుఁ గ్రమముగా నుదాహరణములు - ఈ హాయంబులు పవనగతిం బఱచు॥ భార. అర. ౨౬॥ ఇందు హాయంబులు విశేష్యము ఉద్దేశ్యము; పఱచున్ క్రియ విధేయము. వాగ్భూషణమే సుభూషణము॥ భర్తృ.॥ ఇందు వాగ్భూషణము విశేష్యము ఉద్దేశ్యము. సుభూషణము విశేష్యము విధేయము. వీరభోజ్యము సుమ్మురాజ్యము॥ భార. అర. ౨ఆ॥ ఇందు రాజ్యము విశేష్యము ఉద్దేశ్యము; వీరభోజ్యము విశేషణము విధేయము బాహుకుండనువాఁ డెవ్వండో? ॥భార. అర. ౨ఆ॥ ఇందు బాహుకుండు విశేష్యము ఉద్దేశ్యము; ఎవ్వండో సర్వనామము విధేయము. అవివేకి చెడున్॥ స్వా. ౩ఆ॥ ఇందు అవివేకి విశేషణము ఉద్దేశ్యము; చెడున్ క్రియ విధేయము. వచ్చినవాఁడు ఫల్గునుఁడు॥ భార. ఉద్యో. ౩ఆ॥ ఇందు వచ్చినవాఁడు విశేషణము; ఫల్గునుఁడు విశేష్యము విధేయము. అక్రోధనుండు కరం బధికుండు॥ భార. ఆది. ౩ఆ॥ ఇందు అక్రోధనుఁడు విశేషణము ఉద్దేశ్యము; అధికుఁడు విశేషణము విధేయము మూఁడవవాఁ డెవ్వండు॥ భార. అర. ౨ఆ॥ ఇందు మూఁడవవాఁడు విశేషణము ఉద్దేశ్యము; ఎవ్వండు సర్వనామము విధేయము. కొందఱు పిశాచంబని పఱచిరి॥ భార. అర. ౨ఆ॥ ఇందు కొందఱు సర్వనామము ఉద్దేశ్యము; పఱచిరి క్రియ విధేయము. ఇది నలురథఘోషము॥ భార. అర ౨ ఆ॥ ఇందు ఇది సర్వనామము ఉద్దేశ్యము; ఘోషము విశేష్యము విధేయము. ఇది మర్త్యుల కవిషయము॥ భార. అర ౨ఆ॥ ఇందు ఇది సర్వనామము ఉద్దేశ్యము; అవిషయము

విశేషణము విధేయము వీరెవ్వరయ్య;॥ భార. ఆది. ౬౫॥ ఇందు వీరు సర్వనామము - ఉద్దేశ్యము; ఎవ్వరు సర్వనామము విధేయము. మృగాంకులో గ్రవనంబుల కరుగ నేల?.॥ భార. అర. ౨౫ ॥ ఏలా వాలా యముసేయ॥ స్వా. ౩౫॥. ఇందు అరుగన్, చేయన్ - ఇవి అన్నంత క్రియలు ఉద్దేశ్యములు; ఏల ఏలా - ఇవి యవ్యయములు విధేయములు. నీ వితరులఁ గొలువ నేటికి?॥ భార. ఉద్యో. ౪౫॥ ఇత్యాదు లూహ్యం బులు.

వ్యాఖ్య - విషయమునందు ఉద్దేశ్యము, విధేయము నని రెండంశము లుండునని సూత్రభావము. ఉద్దేశింపబడి చెప్పదగినది ఉద్దేశ్యము. అనగా దేని నుద్దేశించి చెప్పుదురో అది ఉద్దేశ్యము. తెలియదగినది విధేయము. ఉద్దేశ్యమును గుఱించి యేమి చెప్ప బడునో అది విధేయమని భావము.

విశేష్యము, విశేషణము, సర్వనామము - అనువానిలో నేదయినను ఉద్దేశ్యము కావచ్చును. క్రియ, విశేష్యము, విశేష ణము, సర్వనామము - అనువానిలో నేదయినను విధేయము కావచ్చును. అన్నంతక్రియలును, 'ఏల' మున్నగు నవ్యయము లును రెండింటియందును జేరవచ్చును. మొత్తనుమీద క్రియలు విధేయములుగా మాత్రమే యుండునని, ఉద్దేశ్యములు కాజాల వని తాత్పర్యము.

[ సూత్రకర్తయే ఉదాహరణప్రదర్శనముతో పాటు వాని స్వరూప నిరూపణము గావించెను. ఇంకిమరల దానిని వివరించుట యవసరము కాదు. ]

37. సంపూర్ణ మసంపూర్ణ మని వాక్యంబు ద్వివిధంబు.

(ప్రౌ ఢ)

సమాపక క్రియలు గల వాక్యము సంపూర్ణ వాక్యము; అస మాపక క్రియలు గలవాక్యము అసంపూర్ణ వాక్యము: దాని విడిచి పోవఁగా నోప కఱచుచు। నంతరిక్షమునను హంసలెల్లఁ। బిండుగట్టి తిరుగుచుండె॥ భార. అర. ౨౪॥ నలుఁడును ధరణీ రాజ్యము। దలఁగఁగ సర్వంబు నపహృతంబైనఁ గోడుం।దలరి దమయంతిఁ దోడ్కొని। వెలువడియె నశేషరాజ్య విభవచ్యుతుఁడై॥ భార. అర. ౨౪॥ నన్ను। నారాజునకు నెఱిఁగించి కరుణ నాయందుఁ గావింపు। మారంగ ననుడు నిషధ విషయమున కరిగి యాహంస। వీరసేనజునకు దాని గుణరూప విభవముల్ సెప్పె॥ భార. అర. ౨౪॥ మొ. ఇందు విడిచి, ఓపక, అఱచుచు నిత్యాది క్రియాఽభిన్న కర్తృకంబులగు నసమాపక క్రియలు గల ఉండెన్, వెలువడియెన్, చెప్పె నిత్యాది సమాపక క్రియలతోడి వాక్యము సంపూర్ణ వాక్యము; తలఁగఁగన్, వినన్, అనుడున్ - ఇత్యాది క్రియావిభిన్న కర్తృకంబులగు నసమాపక క్రియలతోడి వాక్యమసంపూర్ణ వాక్యము నని యెఱుంగవలయు

వ్యాఖ్య - వాక్యము సంపూర్ణ వాక్యమని, అసంపూర్ణ వాక్యమని రెండు విధములు. సమాపక క్రియయున్న వాక్యము సంపూర్ణవాక్యము. హంసలెల్లఁ దిరుగుచుండె - అని యన్నప్పుడు 'తిరుగుచుండె' అన్నది సమాపక క్రియ, కావున నిది సంపూర్ణ వాక్యము. నన్ను నారాజునకు నెఱిఁగించి - అని యన్నప్పుడు 'ఎఱిఁగించి' అన్నది అసమాపక క్రియ; కావున నిది అసంపూర్ణ వాక్యము.

[ "ఇందు విడిచి " అని ప్రారంభమైన వివరణమువలన "క్రియాఽభిన్న కర్తృకములైన అసమాపక క్రియలున్న వాక్యము అసంపూర్ణ వాక్యము కాదన్న భ్రమ కలుగుట కవకాశమున్నది. కాని వ్యాకర్త యభిప్రాయ

మట్టిది కాదు. ఏ యసమాపకములున్నను వాక్యము అసంపూర్ణమే. సమాపక క్రియ యున్నప్పుడే వాక్యము సంపూర్ణమగును. ఆశీరాదులందు కొన్ని యెడల నుబ్యంతముతోడనే వాక్యము ముగియును. నీయిల్లు వేయిళ్ళ పాడుగాను, నీయిల్లు బంగారముగాను - మున్నగునవి యుదాహరణములు. ఇట్టి యెడల వీనిని సంపూర్ణవాక్యములుగ్గానే గ్రహింపవలసియుండును. ఇట్టివి విశేషప్రయోగములు. ]

**38. వాక్యసముదాయము మహావాక్యము నాఁబడు; అయ్యది రామాయణాదికము. (ప్రౌ - ౮)**

వ్యాఖ్య - వాక్యములయొక్క సమూహమును మహావాక్యమని యందురు. అనగా రామాయణము మున్నగువానికి మహావాక్యమన్న వ్యవహారము కలదు. అనగా సుదీర్ఘముగా నున్నంతలో ఏవాక్యమునుగాని మహావాక్యమని యనరాదన్న నిషేధ మిచ్చుట కలదు. మహాకావ్యము అనుదానికి పర్యాయముగానే మహావాక్యమను మాటను వాడవలసియున్నదని భావము.

**39. క్రియాన్వయ వాక్యంబులు కొన్ని వ్యంగ్యార్థ ద్యోతకంబు లగు. (ప్రౌ - ౯)**

భావక్రియలు గల వాక్యము వ్యతిరేక క్రియలుగల వాక్యమునకును, వ్యతిరేకక్రియలు గల వాక్యము భావక్రియలు గల వాక్యమునకును, ఉభయము లుభయములకును వ్యంజకములగునని యర్థము. అప్పుడు భావక్రియ లేన్యంత తద్ధర్మార్థకములుగాను లేక యినన్నంతములుగాను, తద్ధర్మార్థకములుగాను - వ్యతిరేకక్రియ లేన్యంత వ్యతిరేకార్థకములుగాను, వ్యతిరేకార్థకములుగాను నుండును.

వాఁడు వచ్చునేని (లేక) వాఁడు వచ్చిన వీఁడు వచ్చును; వాఁడు వచ్చునేని (లేక) వాఁడు వచ్చిన వీఁడురాఁడు. (వీనికి వ్యంగ్యార్థములు - వాఁడు రాఁడేని వీఁడు రాఁడు; వాఁడు రాఁడేని వీఁడు వచ్చును.)॥ నీవియ్యవేని నేనియ్యను; నీవియ్యవేని నేనిత్తును. (వీనికి వ్యంగ్యార్థములు - నీవిత్తువేని నేనిత్తును; నీవిత్తువేని నేనియ్యను.)॥ ఆది పదముచే నితరంబు లూహ్యంబులు. ఇది యేతన్మార్గ సూచనామాత్రము. ఇట్లు దీనినింక ననేక ప్రకారంబులఁ జెప్పను వచ్చును.

వ్యాఖ్య - క్రియతో అన్వయించు వాక్యములు కొన్ని వ్యంగ్యార్థమును బోధించునని సూత్రార్థము. వ్యంగ్యార్థమని యనగా శబ్దములచే చెప్పబడు నర్థమునకు విరుద్ధమగు నర్థమని యభిప్రాయము.

వాఁడు వచ్చునేని (వచ్చిన) వీఁడు వచ్చును - అను చోట 'వచ్చునేని' అన్నదియు, 'వచ్చును' అన్నదియు భావము (స్వార్థము)నందే కలవు. భావక్రియ 'పని' అన్నదానిని చేర్చుకొని 'వచ్చునేని' అని యైనది కొన్నియెడల క్త్వదర్థమునందగు 'ఇనన్' అను రూపమునొంది 'వచ్చినన్' అనియు కావచ్చును. ఇచ్చట రెండును భావక్రియలు గలవు. ఇంతకును ఈవాక్యమునకు "వాఁడు రాని యెడల వీఁడును రాఁడు" అన్న వ్యతిరేకార్థ స్ఫురణము కలదు. ఇట్లు వాఁడు వచ్చునేని (వచ్చిన) వీఁడు రాఁడు - అని యన్నప్పుడు 'వాఁడు రాకున్న వీఁడు వచ్చును' అన్న స్ఫురణము కలదు.

మొదటిది భావక్రియ; రెండవది వ్యతిరేకక్రియ. అప్పుడు స్వార్థమునందు పూర్వక్రియ 'పని' యని కాని 'ఇనన్' అని

కాని యంతమగును. సమాపకక్రియ తద్ధర్మార్థకమై యుండును. వ్యతిరేకార్థమునందు పూర్వక్రియ 'పని'తో నంతమగును. సమాపకక్రియ తద్ధర్మార్థకమై యుండును. తక్కిన యుదాహరణముల నిట్లే గ్రహింపవచ్చును.. వాక్యవిన్యాసవైఖరి యింకను బహువిధములై యున్నది. ఇది కేవలము వానిని గ్రహించుటకు సూచనమాత్రమే.

**40.** ఇట్లనియె, అనిన - నని భావ్యర్థ కథన ప్రారంభపరిసమాప్తులం గ్రమంబుగ నగు.

భావ్యర్థకథన ప్రారంభంబునం బూర్వవాక్యాంతమునందు 'ఇట్లనియె' అనియును, ప్రారబ్ధ వాక్యపరిసమాప్తియందు 'అనిన' అనియును బదంబులు క్రమంబునం బ్రయుక్తంబు లగునని యర్థము ॥
"వ. అయ్యింద్రునకుం గలి యిట్లనియె. తే. గీ. అవనిలో దమయంతీ స్వయంవరంబు విస్తరిల్లుట విని కడువేడ్కతోడ నేను దమయంతిచే వరియింపంబడుదు నని తదర్థమె యరిగెద నాసం జేసి. వ. అనిన నందఱు నగి"॥ భార. ఆర. ౨౮॥ మొ.

వ్యాఖ్య - జరుగనున్న యర్థమును జెప్పునప్పుడు ప్రారంభమునందు 'ఇట్లనియె' అనియును, పరిసమాప్తియందు 'అనిన' అనియు నగునని సూత్రార్థము. 'ఇట్లనియె' అనునది భావ్యర్థప్రసంగమునకు పూర్వవాక్యమునం దుండును. 'అనిన' అనునది భావ్యర్థప్రసంగమును అనుసరించి వచ్చు వాక్యమునకు ఆరంభమున నుండును.

సూత్రమునందు 'భావ్యర్థము' అని యున్నది. భూతార్థమును, వర్తమానార్థమును చెప్పునప్పుడు కూడ నిట్లు ప్రయో

గింప వచ్చును. కావున 'భావ్యర్థము' అను దానిని దక్కినవాని కుపలక్షకముగా గ్రహింపవలయును.

**41. కొన్నియెడలం దదాదులు విశేషణంబు లధ్యాహార్యంబు లగు.** (ప్రౌ - ౧౧)

కలకంఠకంఠి కన్నీరొలికిన సిరియింట నుండ నొల్లదు సుమతీ. (ఇంటన్ = ఆయింట)॥ సుమతీశతకము॥ పురుషుండు రెండు దెఱఁగుల ధర నుత్తముఁ డనఁగఁ బరఁగుఁ దానెయ్యెడలం బరుషములు వలుకఁ డునికిన్ దురితంబులు వొరయుపనులఁ దొరఁగుటవలనన్. (రెండు తెఱఁగులన్ = ఈ రెండు తెఱఁగులచేత)॥ భార. ఉద్యో. ౨ఆ॥ మొ.

వ్యాఖ్య - కొన్ని యెడల ఆ, ఈ మున్నగు విశేషణంబులు ప్రయోగింపబడవు. అయినను వానిని తెచ్చుకొని తగినచోట నన్వయించు కొనవలయును - అని సూత్రతాత్పర్యము.

సిరి యింట నుండనొల్లదు - అని యున్నప్పుడు 'ఇంటన్' అని యనగా పూర్వప్రసక్తమయిన 'ఆయింటియందు' అని అర్థము చెప్పుకొనవలయును. అట్లే 'రెండు తెఱఁగులన్' అని యన్నప్పుడు చెప్పఁబోవునట్టి 'యీ రెండు తెఱఁగులచేతను' అని యర్థము చెప్పుకొనవలయును.

**42. కొన్నియెడల సంబంధంబునం బూర్వవాక్యంబునందలి పదం బధ్యాహార్యం బగు.** (ప్రౌ - ౧౨)

గొంతి సంకటపాటుఁ గోడలి బన్నంబు॥ భార. భీష్మ. ౨ఆ॥ పంక్తిముఖు నాతని తమ్ముని గుంభకర్ణునిం దనయుని మేఘనాదుని॥ నిర్వ. ౨ఆ॥ దానవేశ్వరునకుఁ దమ్ములకును॥ నిర్వ. ౨ఆ॥ మొ.

వ్యాఖ్య - సంబంధమునుబట్టి కొన్నియెడల పూర్వ ప్రయుక్తమయిన పదము తిరిగి గ్రహింపబడునని యర్థము.

గొంతి సంకటపాటుఁ గోడలి బన్నంబు - ఇచ్చట 'కోడలి' అని యుపయోగించినను, పూర్వప్రయుక్తమయిన గొంతి యను పదము నిక్కడ కూడ నన్వయించుకొని అర్థము చెప్పుకొన వలయును. 'గొంతికోడలి' యనియే భావము.

అట్లే తరువాతి లక్ష్యమునందు 'తనయుని' అని యన్నప్పుడు పూర్వప్రయుక్తమయిన 'ఆతని' అను సంబంధబోధకమగు షష్ఠ్యంతరూపమును అన్వయించుకొనవలయును. అట్లే 'దానవేశ్వరునకుఁ దమ్ములకును' అని యున్నపుడు 'దానవేశ్వరునకు దానవేశ్వరుని తమ్ములకును' అనియే యర్థము చెప్పుకొన వలయును.

[ సూత్రమునందు "పూర్వవాక్యంబునందలి పదంబు" అని యనుట సరికాదు. పై లక్ష్యము లన్నింటియందును ఏకవాక్యమునందలి పదమునే గ్రహించుట జరిగినది. ఒక్కొకయెడ భిన్నవాక్యమునందలి పదమును గ్రహింపరావలసివచ్చును. కావున, "పూర్వప్రయుక్తంబగు పదంబు" అని యుండిన నుభయ నిర్వాహకముగా నుండును. ]

**43. న్యూనవచో వాక్యంబునఁ దద్వచనంబు లధ్యాహార్యంబు లగు. (ప్రౌ - ౧౩)**

న్యూనవచనంబులు - ఐన, ఏని, ఏ, ఓ॥ వెం. ఎత్తెఱఁగున ధర్మక్రియఁ జిత్తంబునఁ జేర్పవలయు జీవించు తఱిన్ (ఎత్తెఱఁగునన్ = ఎత్తెఱఁగుననైనను లేక ఎత్తెఱఁగున నేని,) ॥భార. అను. ౪ఆ॥ ఇక్కడ ఐన, ఏని యవ్యయంబు లధ్యాహార్యంబులు; ఇట్లు మీఁదను నెయుంగు

నది. అక్కట మందభాగ్యునకు నట్టి తనూభవరత్న మెవ్విధిన్ దక్కునె॥ భార. ద్రోణ ౨ఆ॥ తరుణీ! యేరికిఁ జెల్లునె యరయఁగ నేమింత.వార మనుకొన॥ కళా. ౧౫॥ వీని నెమ్మెయింబట్టి వధింతు॥ విష్ణు. ౭ఆ॥ అన్నం బొండొక లేదు॥ పాం‍కు. ४ఆ॥ దైవమాటా! యిటఁదెచ్చునె యేమివచ్చెనే॥ చంద్ర॥ కర్మములు మేలు నిచ్చును (కర్మములు = కర్మములేయని. ఇక్కడ నేహార్థక మధ్యాహార్యము)॥ భాగ. ౧౦ స్కం. పూ॥ డప్పిఁజెందును (చూ. మీఁదు డప్పిఁ జెందునో యని. ఇక్కడ 'నో' యధ్యాహార్యము)॥ భార. శాంతి. ౧ఆ॥ మొ.

వ్యాఖ్య - ఐన, ఏని, ఏ, ఓ మున్నగునవి న్యూనవచనములు. వీని యర్థముతో కలిసియున్న వాక్యము న్యూనవచో వాక్యము. ఇట్టి న్యూనవచో వాక్యమునందు న్యూనవచనము లయిన ఐన ప్రభృతులు అధ్యాహార్యము లగునని సూత్రార్థము.

సందర్భమునుబట్టి 'ఐన' మున్నగువాని యావశ్యకమున్నను, వాక్యమునందు ప్రయోగింపబడకున్నచో, వానిని తెచ్చుకొని యన్వయించుకొనవలయు నని భావము. 'ఎత్తె ఱఁగునన్' అని-యన్నప్పుడు 'ఎత్తెఱఁగుననేని' అనికాని 'ఎత్తెఱఁగుననైన' అనికాని గ్రహింపవలయును. 'ఎవ్విధిన్' అని యన్నప్పుడు 'ఎవ్విధినైనను' అని - 'ఏరికిన్' అని యన్నప్పుడు 'ఏరికినైనను' అని - 'ఎమ్మెయింబట్టి' అని యన్నప్పుడు 'ఎమ్మెయినైనఁబట్టి' యని - 'అన్నం బొండొక లేదు' అని యన్నప్పుడు 'అన్నం బొండొక టైనను లేదు' అని - 'ఇట్లఁ దెచ్చునె' అని యన్నప్పుడు 'ఇటనేని తెచ్చునె' యని - 'కర్మములు మేలు' అని యన్నప్పుడు 'కర్మములే మేలు' అని - 'డప్పిఁజెందును' అని యన్నప్పుడు 'డప్పిఁజెందునో' యని యర్థము చేసికొనవలయును.

**44. కొన్నియెడలఁ గర్తృకర్మక్రియ లధ్యాహార్యంబు లగు. (ప్రౌ - ౧౪)**

కర్తకు - నన్నుఁజూచి నగరె? (జనులు-కర్త-అధ్యాహార్యము) ॥భార. అర. ౨౫ ॥ సరకుగొనరు సురవరులను। గురుశక్తిని భీష్మ బాహ్లికులఁ గైకొన రుద్ధరత జరాసంధుని వెరవరిగా మెచ్చరు మహోశ వరగర్వమునన్ (హంసడిభకులు - కర్త అధ్యాహార్యము)॥ ఉ హ ౪౫॥ మొ

కర్మమునకు - దవదహనం బుదగ్రతరుదాహము చేయుచు నున్నఁ॥ జూచి (దాహముచేయుటను - కర్మము అధ్యాహార్యము) భార. అర. ౨౫॥ మొ.

క్రియకు - ప్ర॥ అక్కడ నెవఁడున్నాఁడు? ఉ॥ రాముఁడు. (ఉన్నాఁడు - క్రియ అధ్యాహార్యము) మొ.

వ్యాఖ్య - కొన్నియెడల వాక్యమునందు కర్తగాని, కర్మగాని, క్రియగాని అధ్యాహార్య మగునని సూత్రార్థము.

'జనులు నన్నుఁజూచి నగరె?' అని యుండవలసియుండగా 'జనులు' అను కర్తృపదము లోపించినది. సందర్భమునుబట్టి, దానిని గ్రహించి యర్థము చెప్పుకొనవలయును. అట్లే తరువాతి లక్ష్యమునందు 'హంసడిభకులు' అను కర్తను అధ్యాహార్యము చేసికొనవలియును.

'దవదహనం బుదగ్రతరుదాహము చేయుచు నున్నఁజూచి' అను నప్పుడు 'దేనిని జూచి' అని ప్రశ్న వేసికొనగా 'దాహము చేయుటను జూచి' అను సమాధానము వచ్చును. కావున

'దాహము చేయుటను' అను కర్మవాచకము ప్రయుక్తము కాలేదు. కావున దాని నధ్యాహార్యము చేసికొనవలయును.

'రాముఁడున్నాఁడు' అని యనుటకు బదులుగా 'రాముఁడు' అని ప్రయోగించుచో, సందర్భమునుబట్టి 'ఉన్నాడు' అన్న విషయమును శ్రోత గ్రహించును. అనగా క్రియను అధ్యాహార్యము చేసికొనునని యర్థము.

**45. అనేక కర్తృక క్రియకు సమీపకర్తయొక్క లింగవచనంబు లగు. (ప్రౌ - ౧౫)**

ఏవాని, బంధుమిత్రులు । జీవధనంబులును దప్పిఁజెందును గృహునింగా వాని నెన్నఁగాఁ దగు॥ భార. శాంతి. ౧౪॥ సురగంధర్వ ప్రభృతులు, ధరణీశైలాపగాబ్ధి ధాత్రీజాదుల్ । నరవర నీ కేయుప కృతి నరయఁగఁ గావించె॥ రామా. అర. ౨౫॥ తమసేనలు వారును విశ్రమించిరి॥ ఉ హరి. ౪౫॥ సర్వభూతంబులు దేవాసురులు వినాశగతులు కారె॥ రా. అర ౨౫॥

వ్యాఖ్య - ఒకే క్రియతో అనేకకర్తలు కొన్నియెడల అన్వయము కలిగియుండును. అట్టియెడల ఆక్రియను అనేక కర్తృకక్రియ యని యందురు. అనేకకర్తలున్నప్పుడు, అవియు వేరువేరు లింగములను వచనములను గలిగియున్నప్పుడు క్రియ దేని కనురూపముగా నుండవలయునన్న ప్రశ్న ముదయించును. అన్నింటికి ననురూపముగా నుండుట యసంభవము; ఏదో యొక్క దానితోనే అనురూప్యము కలిగియుండును. అది యేది అన్న ప్రశ్నకు సమాధానముగా ఫెక్కుకర్తలను గలిగియున్న క్రియ

సమీపకర్తయొక్క లింగవచనములను పొందునని తెలుపు చున్నాడు.

"ఏవాని బంధుమిత్రులు జీవధనంబును డప్పిఁజెందును.." అని యున్నప్పుడు 'బంధుమిత్రులు' అన్నది ఒకకర్త. ఇది మహద్వాచకము; బహువచనము. రెండవకర్త 'జీవధనంబు ఇది అమహద్వాచకము; ఏకవచనము. మొదటి కర్తతో అన్వయించు నెడల క్రియ "డప్పిఁజెందుదురు' అని యుండవలయును. కాని అట్లు కాలేదు. ప్రస్తుతసూత్రము విధించుచున్నట్లుగా, తనకు సమీపమునందున్న 'జీవధనంబు' అన్న అమహదేకవచనకర్త కనుకూలముగా 'డప్పిఁజెందును' అనియే యయ్యెను.

అట్లే రెండవ లక్ష్యమున 'సురగంధర్వ ప్రభృతులు' అన్న మహద్వాచకమ్ము, ధరణీశైలాపగాబ్ధి ధాత్రీజాదులు' అన్న అమహద్వాచకము కర్తలుగా నుండగా తనకు సమీపముగానున్న అమహత్కర్త కనుకూలముగానే క్రియ 'కావించె' అని ప్రయోగింపబడినది. మహద్వాచకముతోనే యన్వయించునెడల 'కావించిరి' అని యుండెడిది. కాని, అట్లు కాలేదు. దూరముగా నుండుటచే, క్రియ దానితోడి ఆనురూప్యమును పొందలేదు.

'తమసేనలు వారును విశ్రమించిరి' అని యున్నప్పుడు 'విశ్రమించిరి' యన్నక్రియ మహద్బహువచన బోధకమై యున్నది. అనగా 'వారు' అన్న సమీపక్రియతో అన్వయించినదని యర్థము. 'సర్వభూతంబులు' అన్నది మహద్వాచకము. దీని లింగవచనములు కలిగినయెడల క్రియ 'వినాశగతములు కావె అని యుండెడిది. సమీపకర్త 'దేవాసురులు' అన్న మహద్వాచ

కమే యగుటచేత క్రియ దానితో సన్వయించి 'వినాశ గతులు కారె' అన్నరూపము నొందినది.

**46. భూతార్థకాసమాపకక్రియ వలయుచో వాక్యాంతరజని ష్ఠానం బగు; అగుచోఁ గర్త తత్కర్తలందలిదియ యెద్దియే నొండగు. (ప్రౌ - ౧౬)**

వలసినప్పుడు కొన్నియెడల భూతార్థకాసమాపక క్రియనుండి వాక్యాంతరము పొడమును. అప్పుడు దానికిఁ గర్త యాయసమాపక క్రియా కర్తృసముదాయమునం దుండునదియే యేదైన నొక్కటి యగునని యర్థము.

"మ. భవజాతుల్ చని కాంచిరంత నెదురన్ దత్తీరదేశంబునం। దవదాతాంబుజ ఫేనపుంజనిభు నయ్యశ్వోత్తముం దవ్వులన్॥ వ. కని కద్రువ వినతంజూచి" (ఇక్కడ కని 'కనగా నందు' నను నర్థము నిచ్చుచున్నది)॥ భా.౧ ఆది. ౨౫॥ దేవలోకంబున కరుగువా రెదుర ద్వాపరంబుతో వచ్చు కలిం గని శక్రుం డిదియేమి యెందులకుం బోయెద వని యడిగిన నయ్యింద్రునకుఁ గలి యిట్లనియె (ఇక్కడ కని 'కనిరి, అందు' నను నర్థము నిచ్చుచున్నది.)॥ భా.౩. ఆ౧. ౨౫॥ ఇట్లంతట నూహ్యాంబులు. శుంభ నిశుంభు లుగ్రకోపనులయి డాని శుంభుఁ డతి భైరవసైన్యసమేతుఁడై రయంబునఁ గవిసెన్॥ మార్కం, ౬౫॥ మొ.

ఏతల్లక్షణానుక్త విశేషప్రయోగంబులుం గలవు. నలుడు... దమయంతీ ద్వితీయుండై యుండి బుభుక్షాపీడ సహింపనోపక హిరణ్యపక్షంబులతోఁ దమముందటఁ దిరుగుచున్న పక్షులం గని యవి భక్ష్యం బగునని యప్పక్షులం బట్టుకొన సమకట్టి కట్టినపుట్టంబు వానిపై

వైచిన నవి పుట్టంబులోన గగనంబున కెగసి నవ్వుచు విగతవస్త్రిందైన నలున కిట్లనియె (ఇందు 'ఉండి' అనునంతవఱకుఁగల యసమాపక క్రియలకుఁ గర్తలు నలదమయంతులు. 'ఒపిక' అనునది మొదలు 'వైచి నన్' అనునంతవరఱకుఁగల యసమాపక క్రియలకుఁగల కర్త నలుఁడధ్యాహార్యము.)॥ భార. అర. ౨౫॥ అహావసన్నద్ధులయి భీమ కర్ణ నందన మేఘవర్ణులు ధర్మతనయు। పాదంబులకు మ్రొక్కి పంకజాతు నకు దండముపెట్టి యంతఃపురమున కరిగి। కుంతికి నెఱిఁగి వీడ్కొని వచ్చి విన్వచ్చుఁ గ్రచ్చి కౌఁగిటఁ జేర్చి గుస్తరించి। యనఘ నేఁ దురగంబు గొనివచ్చునందాఁక యంగరక్షకఁడవై యధిపుఁ గాచియుండు మని మాద్రిపుత్త్రిలను బచరించి। ద్రౌపదికిఁ జెప్పి మఱియును దాన వారి। యడుగులకు వ్రాలి యద్దేవు ననుమతమున। నరిగె నను మోదమున యౌవనాశ్వపురికి. (ఇందు 'వచ్చి' అనునంతవఱకుఁ గల యసమాపక క్రియలకుఁ గర్తలు భీమ కర్ణనందన మేఘవర్ణులు. 'క్రుచ్చి' యనునది మొదలు 'అరిగె' ననునంతవరకుఁగల యసమాపక క్రియలకుఁ గర్త భీముఁ డధ్యాహార్యము.)॥ జై. ౧౫॥ ఇట్టివి ప్రయోగంబులవలన నెఱుంగునది.

వ్యాఖ్య - భూతార్థకాసమాపకక్రియ యనగా క్త్వార్థక మని యర్థము. అనేక కర్తృకమైన క్త్వార్థకక్రియ కొన్నియెడల మరొకవాక్యము నుద్భవింప జేయును; అట్టియెడల పూర్వకర్త లలో నేదోయొకటి యిక్కడ కర్తయగు నని యర్థము.

"ధవళాతుల్ సని కాంచిరి... కని కద్రువ" అనుచోట తొలుతటి వాక్యమునందు 'కాంచిరి' అను క్రియకు 'ధవళాతుల్' అన్నది కర్తృపదము. ఇది బహుత్వ బోధకము. సందర్భమును బట్టి 'వినతా కద్రువలు' అని భావము చెప్పవచ్చును. 'కని' అని

మరల నిదే వ్యాపారమును క్త్వార్థకముచేత పునరావృత్తము చేయుటతో క్రొత్తవాక్యము పుట్టుచున్నది. ఈతరువాతనుండి వినతాకద్రువలలో నొక్కతెయైన 'కద్రువ' కర్తృపదవాచ్య మగుచున్నది.

"అరుగువారు... శక్రుండు. ." అను ప్రయోగమునందు తొలుతటి వాక్యభాగమునందు కర్త 'అరుగువారు' అన్నది; బహుత్వబోధకము. 'కని' అన్న క్త్వార్థకము తరువాత 'శక్రుండు' అన్నది కర్తయైనది పూర్వభాగమునందలి 'అరుగువారు'లో 'శక్రుడు' కూడ నున్నాడు. కావున నిట్టి ప్రయోగములు నుండవచ్చును.

పైని చెప్పినట్లుగాక, చెప్పని విశేషప్రయోగములు కూడ కలవని చెప్పుచు వ్యాకర్త రెండు లక్ష్యములను చూపుచున్నాడు. పూర్వమునందువలెనే యిచ్చటను క్త్వార్థకప్రయోగమువలన పూర్వకర్తలలో నొక్కటి కర్తగా వ్యవహరించుట జరుగును. ఇంతవరకు పై లక్షణముతో సమానమే. కాని పై యుదాహరణములందు ఏకత్వమునం దగు కర్త కూడ వాచ్యముగ ప్రయోగింపబడియున్నది. ఇకముందు చెప్పబోవు లక్ష్యములందు కర్తను అధ్యాహార్యము చేసికొనవలయును. ఈ భేదమును పురస్కరించుకొని ఆలక్ష్యములను వేరుగా చూపుట జరుగుచున్నది.

"నలుండు... దమయంతీ ద్వితీయుండై . ." అని మొదటుగానున్న యుదాహరణమునందు నలదమయంతు లిద్దఱును కర్తలని వ్యాకర్త భావము. కాని 'దమయంతీ ద్వితీయుడై' అన్నది నలునకు విశేషణము. ఇక్కడ కర్తృస్థానములో నున్నది 'నలుఁడు' మాత్రమే. కావున ఉండి, ఓపక, కని, మున్నగు నస

మాపకముల కన్నింటికిని నలునితోనే యన్వయము. భావమును బట్టి దమయంతిని కొంతవరకు కలిపి చెప్పుకొన్నను, శాబ్దికముగా నలుడు మాత్రమే కర్త. కావున, ఈలక్ష్యము సరియైనది కాదు.

"ఆహావసన్నద్ధులయి ..." అని మొదలుగానున్న లక్ష్యము విశేషప్రయోగమున కుదాహరణము కాగలదు. అందలి విశేషములను వ్యాకర్తయే వివరించి యున్నాడు

ఇట్టి ప్రయోగములు మిక్కిలి విరళములు.

**47. కొన్నియెడల నవయవకర్తృకక్రియ తదవయవి కర్తృకం బగు. (ప్రౌ - ౧౪)**

తలవడంకుచునుండు తన పితృవరుల (తలవడంకుచునుండు = తలవడఁకుట గల వారగుచునుండు నని యర్థము)॥ భార ఆది. ౨౫॥ తేకువసెడియె నీపాలుఁడు (చెడియె = చెడుట కలవాఁడాయె నని యర్థము)॥ భార. అర. ౪౫॥ ఇట్లంతట నెఱుంగుసది. చెలువేదెఁ జంధురుండు॥ భార. ఉద్యో. ౨౫॥ సుభట వర్గంబు లొక్కట సొబగు మాలె॥ రా. యు॥ అక్కట యీలతాంగి హృదయంబున నీదెసఁ గూర్చి యెంతయుఃస్నెక్కొని యున్నది॥ మార్కం. ౨౫॥ బడలికలు వాపి చనుము॥ స్వా. ౨౫॥

వ్యాఖ్య - కొన్నియెడల అవయవమును కర్తగా కలిగిన క్రియ అవయవిని కర్తగా పొందు నని సూత్రార్థము.

అవయవము, అవయవి - అని యనుటచేత వ్యాకర్త అంగాంగిభావమును ఉద్దేశించుచున్నా డనవలయును. దీనివలన ధర్మధర్మిసంబంధమును గూడ గ్రహింప వచ్చును.

తల వడంకుచునుండు తన 'పితృవరుల - అనుచోట 'పితృవరులు' అంగి; 'తల' అంగము. కావున అంగముతో నన్వయింపవలసిన 'వడంకుచునుండు' అను క్రియ అంగితో నన్వయించుచున్నది. పితృవరులకు విశేషణమైనది. కావున 'వడంకుచునుండు' అని యన్నదానికి ''వడంకుట కలవారయిన పితృవరులు' అన్న యర్థము చెప్పుకొనవలయును.

తేకువ సెడియె నీపాలుఁడు - ఇచ్చట 'చెడియె' అను క్రియ 'పాలుఁడు' అన్న ధర్మివాచకముతో నన్వయించుచున్నది. నిజమునకు 'పాలుఁడు' చెడలేదు. పాలుని ధర్మము 'తేకువ'. అది చెడెను. అయినను ధర్మమును కర్తగా గల క్రియ ధర్మిని కర్తగా నొందుచున్నది. 'చెడియె' ననుటకు 'చెడుటకల వాడాయె' నన్న యర్థము చెప్పుకొనవలయునని వ్యాకర్తయే తెలిపెను.

చందురుడు ధర్మి. చెలువు ధర్మము. ధర్మముతో నన్వయింపవలసిన క్రియ ధర్మితో నన్వయించుచున్నది. కావున 'పదైను' అని యన్నప్పుడు 'పదుటను గల వాడయ్యె' నని యర్థము చెప్పుకొనవలయును. 'సుభటవర్గంబులు' ధర్మి. 'సొబగు' ధర్మము ధర్మముతో నన్వయింపవలసిన 'మాలె' అను క్రియ ధర్మితో నన్వయించుచున్నది. 'సొబగు మాలుటను గలవయ్యె' నని యర్థము చెప్పుకొనవలయును. ఇట్లే తక్కినవియు.

48. వాక్యసంగ్రహంబునం దినన్నంత క్రియాపూర్వకంబు లగు కాక కాన్యవ్యయంబు లనుక్త వాక్యపద గ్రాహకంబు లగు. (ప్రౌ - ౧౪)

కాకకు - నీవు నలునకుఁ బేర్మితో దేవివైనఁ గాక నీసముజ్జ్వల రూపకాంతి విభవ నిత్యసౌభాగ్య భాగ్యాభిజాత్య భద్ర లక్షణావళులవి సఫలంబులగునె॥ భార. ఆర ౨౫॥ (వాక్యవ్యాసమునందు - నీవు నలునకుఁ బేర్మితో దేవివైన నీసముజ్జ్వల రూపకాంతి విభవ నిత్యసౌభాగ్య భాగ్యాభిజాత్య భద్ర లక్షణావళులవి సఫలంబులగును. కాకున్న నీసముజ్జ్వల రూపకాంతి విభవ నిత్యసౌభాగ్య భాగ్యాభిజాత్య భద్ర లక్షణావళు లవి సఫలంబులు కావు.)

కానికి - నలునకాని నళినదళ నేత్ర వరియింపదట్టె॥ భార. ఆర. ౨౫॥ (వాక్యవ్యాసమునందు - నలునే వరియించును గాని వేఱొకని నళినదళ నేత్ర వరియింపదట్టె)

వ్యాఖ్య - వాక్యసంగ్రహము అని యనగా వాక్యమును సంగ్రహించిచెప్పుట; అనగా వాక్యముయొక్క సూక్ష్మరూపమని యర్థము. దీనికి విరుద్ధమైనది వాక్యవ్యాసము; అనగా వాక్యమును విస్తరించిచెప్పుట; దీనికి వాక్యముయొక్క విస్తృత రూపమని యర్థము. విస్తృతమైన ఒకవాక్యమును సంగ్రహించి చెప్పునప్పుడు ఇనన్నంత మగు క్రియపైని కాక యనికాని, కాని యనికాని యవ్యయము కలిగి వాక్యమున చెప్పబడని వాక్యమును గాని పదమునుగాని బోధించును - ఇది సూత్రతాత్పర్యము.

'ఇనన్' అనగా క్త్వవదర్థమునందు 'న' వర్ణకమును, దానికి పూర్వమందు భూతార్థమందు ఇగాగమమును కాగా నేర్పడిన రూపము. 'ఐనన్' అన్నది ఇనన్నంత క్రియ

'నీవు నలునకు...' మొదలుగాఁగల యుదాహరణమందు 'ఐనఁగాని' అని యుపయోగింపబడినది. దీనినిబట్టియే అనుక్త

మగు వాక్యము బోధింపబడుచున్నది. వ్యాకర్తయే వాక్యవ్యాస మును కుండలీకరణముల నడుమ తెలిపియున్నాడు.

"నలున కాని..." మొదలుగా గల యుదాహరణము నందు 'కాని' అను నవ్యయము మాత్రమే ప్రయోగింపబడినది. ఇనన్నంత క్రియ యిక్కడ లేదు 'నలుని' అను ద్వితీయాంతముపై అవధారణార్థకమగు 'అ' వర్ణము చేరినది. అవధారణార్థకముమీది కాని' యిచ్చట అనుక్తవాక్యపద బోధకమగుచున్నది. నలుని, మాత్రమే వరియించునట; నళినదళనేత్ర వేరొకనిని వరియింప దట - అన్న యర్థము కలుగును.

సూత్రమునందు "ఇనన్నంత క్రియాపూర్వకంబులగు" అన్న విశేషణము చేర్చినను, తదన్యమునకును 'కాని' యను నవ్యయము కలుగుచున్నది క్రియాధాతువుపై నయినచో "ఇన న్నంత క్రియాపూర్వకంబులు" గను, నామములపై నయినచో "అవధారణార్థక పూర్వకములు" గను కాక, కాని యను నవ్యయంబులు వ్యవహరించునని యుదాహరణ సామర్థ్యముచేత గ్రహింపవలసియుండును.

**49.** కొన్నియెడలం గాని క్రియాపూర్వకంబు పూర్వ విరుద్ధోత్తరార్థకం బగు. (ప్రౌ - ౧౫)

వాక్యంబులందుఁ బూర్వార్థమునఁ గ్రియమీఁద వచ్చిన కాని యవ్యయ ముత్తరార్థవాక్యము యొక్క యర్థమునకు విరుద్ధముగా నుండుననుటను దెలుపుచున్నది యని యర్థము. వాఁడుఁ వచ్చును. గాని కార్యవ్యాసంగముచేత రాఁడాయెను - వాఁడు రాఁడు. గాని నీనిర్బంధముచేత వచ్చినాఁడు॥ మొ.

వ్యాఖ్య - క్రియను పూర్వమందు కలిగిన 'కాని' యను నవ్యయము తనకు పూర్వమందున్న వాక్యభాగముయొక్క అర్థమునకు విరుద్ధమగు నర్థము నుత్తరభాగమునం దున్నట్లు సూచించు నని సూత్రార్థము.

'వాఁడు వచ్చును' అన్నపుడు భావక్రియయగు 'వచ్చును' అన్నది కలదు. దీనికి పరమందు 'కాని' యను నవ్యయము కలుగుటతోడనే విరుద్ధార్థస్ఫురణము కలుగును. కావుననే 'కార్య వ్యాసంగముచేత రాఁడాయెను' అన్న యుత్తరభాగము సంగత మగుచున్నది. 'రాఁడాయెను' అన్నది వ్యతిరేకక్రియ.

రెండవ యుదాహరణమునందు పూర్వమున వ్యతిరేక క్రియ యున్నది. దానిపైని 'కాని' యన్న యవ్యయము వచ్చినది. ఆపిదప వ్యతిరేకక్రియకు విరుద్ధమగు భావక్రియ 'వచ్చినాఁడు' అని వచ్చినది.

మొత్తముమీద 'కాని' అను నవ్యయముయొక్క పూర్వమందున్న భాగమునకు పరమందున్న భాగము విరుద్ధముగా నుండును.

**50. కొన్నియెడల వ్యాసవాక్యమునకు ముందు సంగ్రహవాక్యంబు నొండగు. (ప్రౌ - ౨౦)**

అయ్యా! యేను నీకుం బ్రియంబు సేసెద; నీహృదయేశ్వరియైన దమయంతి పాలికింబోయి నీగుణంబులు దానికి వర్ణించి చెప్పి యక్కన్య యన్యుల నపేక్షింపక నీయంద బద్ధానురాగ యగునట్లు చేసెద॥ భార. అర. ౨॥ అదియెట్లు? ధర్మపరిపాలన పరులై వీరులై

రణనిహతులైన రాజు . లతయసుఖంబు లనుభవింపక యతిభులై యుందుఱ కెంత కాలంబయ్యె రాని కారణం బేమి?॥ భార. ఆర. ౨౪॥ శ్రక్కుం డిది యేమి? యెందులకుం బో యెద వని యడిగి॥ భార. ఆర. ౨౪॥ మొ

వ్యాఖ్య - కొన్ని యెడల ఒకే విషయమును ముందు సంగ్రహవాక్యముతో చెప్పి, వెనువెంటనే వ్యాసవాక్యముతో చెప్పవచ్చును. ఇట్టియెడల 'పునరుక్తి' యన్న దోషము కలుగ దని తాత్పర్యము.

"అయ్యా ! యేను నీకుం బ్రియంబు సేసెద" ఇది సంగ్రహ వాక్యము.చేయునటువంటి ప్రియముయొక్క స్వరూపమునువివర ముగావ్యాసవాక్యమున తెలుపుట జరుగును. మొదట సంగ్రహ వాక్యమును చెప్పుట శ్రోతను అభిముఖుని చేసికొనుటకు ఉపక రించును. అభిముఖుని చేసికొనిన పిమ్మట వివరములను చెప్పుట విస్తృతవాక్యమునందు జరుగును. ఇది చెప్పువానికిని, వినువానికిని గూడ సౌకర్యమును గలిగించును. కావుననే విషయమునుబట్టి పునరుక్తి యున్నను, రీతి భేదముచేత పునరుక్తి పరిహరింపబడు టయే కాక అపేక్షణీయము కూడ నగుచున్నది.

'ఇది యెట్లు' అను సంగ్రహవాక్యమునందలి భావము తరు వాతి వ్యాసవాక్యమునందు విస్తరింపబడినది. 'ఇదియేమి?' అను సంగ్రహవాక్యముయొక్క వివరణమే 'ఎందులకుం బోయెదవు' అన్న అనంతరవాక్యము.

**51. కొన్నియెడల.వాక్యంబు వాక్యాంతరగర్భంబు నగు.**

**(ప్రౌ - ౫౧)**

ఇందుల కెంతకాలం బయ్యో రానికారణం బేమి॥ భార. అర.
౨౧౧॥ (చూ. క్రిందు) మొ.

వ్యాఖ్య - కొన్ని యెడల ఒకవాక్యము నడుమ మఱొక చిన్నవాక్యము చేరి యుండవచ్చునని సూత్రతాత్పర్యము.

[ నిజమునకు వాక్యగర్భమున మఱొక వాక్యము చేరియున్న యెడల దాని నాలంకారికులు వాక్యగర్భ దోషముగ పరిగణించిరి. మహాకవుల ప్రయోగములయందును అట్టివి కలవు. కావున వానిని దోషములుగా పరిగణించుట యుక్తముకాదు. దేనినైనను దోషమని కాని, దోషముకాదని కాని నిర్ణయించుటకు ఫలితమునుకూడ గ్రహించుట యవసరము. ఈదృష్టితోనే ప్రౌఢవ్యాకరణకారుడు ఇట్లుండుట దోషము కాదనియు, ఇట్లుండ వచ్చుననియు తనసమ్మతిని తెలియజేయుచున్నాడు. దానికి బలముగా భారత ప్రయోగమునే చూపుచున్నాడు. ]

"ఇందుల కెంతకాలం బయ్యో రానికారణం బేమి?" అను వాక్యమునందు నిజమునకు రెండు వాక్యములు కలవు. 'ఇందులకు రాని కారణం బేమి?' అన్నది ప్రధానవాక్యము. 'ఎంత కాలంబయ్యో' అన్నది వాక్యాంతరము. ఇట్లుండుట కాక్షేపము లేదు. ఇట్లున్నప్పుడు అన్వయక్లేశముకాని, విపరీతార్థ స్ఫురణము కాని కలుగునెడల దోషశ్రేణికి చేర్పవలసి వచ్చును. అప్పుడు దానిని పరిహరించుట యావశ్యకము.

52. పొమ్ము నిశ్చయార్థంబునం దగు. (ప్రౌ - ౨౨)

అల్లునిఁ గల్యాణగుణోత్తరుం బడయ కెట్లుం బోవఁబొమ్మంచు॥
నిర్వ. ౩౭॥ మొ.

వ్యాఖ్య - 'పొమ్ము' అను సమాపక క్రియను నిశ్చయమును దెలియ జేయుటకై యితర క్రియలవెంబడి నుపయోగింప వచ్చునను సూత్రతాత్పర్యము.

'పొమ్ము' అన్న రూపము 'వెళ్ళుము' అను నర్థమున మధ్యమ పురుషైక వచనమున నగును. కాని, దానికి విశేషముగా నిశ్చయార్థము కలదు. ఇది యిప్పుడు మధ్యమపురుష క్రియగానే వ్యవహారింపవలసిన యవసరము లేదు. అవ్యయమాత్రముగానే ప్రవర్తించును.

పడయ కెల్లుం బోవను + పొమ్ము అనియుండగా 'పడయ కెల్లుంబోవఁ బొమ్ము' అని యయ్యెను. దీని "కెల్లయినను బడయుట నిశ్చయము' అన్న యర్థము కలదు. ఈయర్థమున ములోపముతోడి 'పో' అను రూపమును గూడ వాడవచ్చును.

**53.** పద్యంబులకుం గులకం బగు. (ప్రౌ - ౫౩)

కులకం బనఁ బద్యమునకుఁ బద్యాంతరముతో నన్వయము॥ ఉదా నొకపండు చెచ్చెరన్ - కొని ప్రచ్ఛన్న॥ భార. ఆది. ౨అ॥ ౧౯౮, ౧౯౯॥ మొ.

వ్యాఖ్య - పద్యము మఱొకపద్యముతో నన్వయమును గలిగి యుండును. అనగా ఒక్క పద్యమునందలి వాక్యభావము, ఆపద్యములో సమాప్తము కాక తరువాతి పద్యములో సమాప్తము కావచ్చును; కొన్ని యెడల ఒకే భావము రెండు పద్యములకంటె ఎక్కువ పద్యములలో సమాప్తము కావచ్చును. ఇట్లు ఒకపద్యము

పద్యాంతరముతో అన్వయమును కలిగియున్న 'కులకము' అని యందురు.

'తానొకపండు చెచ్చెర' అన్నది మొదటి పద్యములోని వాక్యము. ఇందు 'పండు' అను కర్మమును 'తాను' అను కర్తయు నున్నవి. క్రియ యీపద్యమునందు లేదు. తరువాతి పద్యమునందు 'కొని వచ్చుడు' అని క్రియ నిక్షేపింపబడినది. దీనికి 'కులకము' అని ప్రౌఢవ్యాకరణకారుడు పెట్టినపేరు.

సాధారణముగా రెండు పద్యముల కేకాన్వయ మున్నచో 'యుగ్మము' మూడు పద్యముల కున్నచో 'విశేషకము' నాలుగు పద్యముల కున్నచో 'కళాపకము' ఐదు పద్యములకుగాని అంత కంటె నెక్కువ పద్యములకుగాని యున్నచో 'కులకము' అని వ్యవహరింతురు. ప్రౌఢవ్యాకరణ కారుడు ఇన్ని భేదములజోలికి పోక, స్థూలముగా పద్యమునకు పద్యాంతరముతోడి యన్వయ మునకే 'కులకము' అన్న సంజ్ఞను వాడుకొనెను.



"శ్రీ స్తనాంచిత కస్తూరీ పంక సంకలితోరసే
పంకజాక్షాయ నాథాయ వేంకటేశాయ మంగళమ్."